ఓమ్

# శ్రీరామచరితమానసము

## ( శ్రీమదాంధ్ర తులసీరామాయణము )

ద్విపదకావ్యము

## బాలకాండము




మూలం :

మహాభక్త శ్రీ తులసీదాస

అనుకృతి :

శ్రీ కేశవతీర్థ స్వామి





శ్రీ రామతీర్థ సేవాశ్రమము

పిడుగురాళ్ల [పోస్టు]

గుంటూరు జిల్లా

ఆంధ్రప్రదేశ్.

గ్రంథప్రకాశకులు :

శ్రీ కర్పూరపు సూర్యనారాయణ శ్రేష్ఠి గారు,

గుంటూరు.

ప్రథమముద్రణం :

వెయ్యి ప్రతులు

1957

శ్రీ దేవనాగరి పవర్

గుంటూరు.

శ్రీరాం

జయజయ శ్రీ నరసింహా

# వినతి

శ్రీమద్రామాయణం భారతీయ సంస్కృతికి ఒక మహా దర్పణం. జగదారాధనీయ ధర్మాల కది క్షీర సాగరం. ఔపనిషద ప్రబోధమనే నిర్గుణ రూపాని కది సగుణ స్వరూపం. జీవేశ్వరుల సంబంధ బాంధవ్యాద్వైతములను చిత్రించిన విశ్వకావ్యం. విషయ దాస్యమునుండి విముక్తి కలిగించి, ధర్మైక్యానంద స్వాతంత్ర్యమును అనుభవింప జేయడమే భారతీయ పురాణేతిహాసాలన్నిటియొక్క పర మాశయం. రామాయణం అందు అగ్రగణ్యమైంది. రామాయణ గాథలు వికల రూపంలోనైనా సరే – ఎంతవర కైతే ప్రజలలో మెదలుతుంటాయో, అంతదనుక అధర్మ పిశాచికి మనపై సంపూర్ణంగా విజయం లభించబోదు. రామాయణం ఇహపర సుఖ సంధాయకమైంది. అది స్వర్గ భూతలాలకు ముడివేస్తుంది. అది విశ్వమును వైకుంఠంగా మారుస్తుంది. నరుని నారాయణునిగా చేస్తుంది. శ్రీరాముడు సర్వధర్మ స్వరూపుడు. ఆ ధర్మదేవతయొక్క ప్రభావాన్ని, ఆ ధర్మదేవతను ఆరాధించిన పుణ్య జీవులు పొందే విజయా నందాలను, ఆ ధర్మదేవతను వ్యతిరేకించిన మూర్ఖ జీవులు

పొందే ఘోరాపజయ దుఃఖాలను వ్యాఖ్యానిస్తూ సత్య జీవన సంస్కృతిని తెలుపుతూ సాగిన వేద భాష్యం శ్రీమద్రామాయణం. రామాయణ రంగస్థలిపైన, ఆ రంగనాథుడు సాక్షాత్ భగవంతుడు సర్వాదర్శమైన, సర్వకల్యాణదాయకమైన ఒక నిత్య ప్రబోధ నాటికను రమ్యా రమ్యంగా ప్రదర్శించాడు.

రామాయణం ఒక సమతా ప్రపంచం. అక్కడ దేవతలైన శంకర దేవేంద్రాదులు, బ్రాహ్మణోత్తములైన వసిష్ఠ విశ్వామిత్ర వామదేవ మహర్ష్యాదులు, క్షత్రియులైన దశరథ భరత శత్రుఘ్న లక్ష్మణ జనకాదులు, గ్రామికులైన గుహాదులు, స్త్రీలైన కౌసల్యాహల్యా శబరీ త్రిజటాదులు, పశుపక్ష్యాదులైన సుగ్రీవాంగద హనుమజ్జటాయు ముఖ్యులు, రాక్షసులైన విభీషణాదులు, చేజేతులు పట్టుకొని విహరిస్తుంటారు. ఈ అద్వైత స్వర్గమే సర్వాకాంక్ష్యం ఆ రామరాజ్యంలో, ధర్మంలో ఉన్న కోతులు కొండముచ్చులు, పశుపక్ష్యాదులుకూడా దేవతలే. అధర్మంలోవున్న దేవతలుకూడా తృణప్రాయులే. సత్యసూత్రబద్ధములైన జీవపుష్పములన్నీ భగవద్రామగళాలంకృతములై భాసిస్తాయి.

రామాయణ ప్రపంచంలోని ఆ ఆదర్శ మాతలు, ఆ ఆదర్శ పితలు, ఆ పుత్రులు, ఆ సహోదరులు, ఆ సతీమణులు, ఆ రాజులు, ఆ మంత్రులు, ఆ వీరులు, ఆ భృత్యులు, ఆ ప్రజలు, ఆ భక్తులు, ఆ మహర్షులు, ఆ

సాత్త్విక జీవులు, ఆ త్యాగమయ జీవనులు నిరంతర స్మర ణీయులు. ఈ రామ ప్రపంచం, ఈ ధార్మిక తేజోలోకం, ఈరామరాజ్యం లభించినప్పుడు ఎవడు ఇంకొక వైకుంఠాన్ని కోరుతాడు? మానవ జీవన వ్యూహమంతా పరమాత్మ రతికే. అదే జీవనం. అర్థకామములు ధర్మమోక్షముల ఎల్లలలో నియతం కావాలె. ఇదే జీవిత కళ. రామాయణ గురుకులంలో ఈ సత్య జీవన కళాభ్యసనం లభిస్తుంది. సత్యానందస్థానం రామ పరమాత్మ. కామ కాంచన దురా సక్తులను విడనాడడంచేత, వైరాగ్యంచేత రామ ప్రాప్తి కలుగుతుంది. భరతుడు కాంచన విజయమును చేసి రామా నుగ్రహపాత్రుడైనాడు. సీతామాత కామ విజయాన్ని అనుష్ఠించి శ్రీరామైక్యమును పొందింది. కాంచనాసక్తివల్ల కైకేయి, కామాసక్తివల్లరావణుడు రామునికి దూరులైనారు; జీవిత పాతిత్యాన్ని పొందారు. తులసీదాస్ చెప్పినట్లు శివ భక్తుడు కానివాడు విష్ణ్వనుగ్రహపాత్రుడు కాలేడు. శివుడు వైరాగ్య స్వరూపం. విష్ణువు సర్వవ్యాపకానందం. వైరాగ్య శివుని ఆరాధించకుండా, విశ్వవ్యాపక బ్రహ్మానందం ఎట్లు సిద్ధిస్తుంది? విభిన్న రంగాలలో వుండికూడా, తమ తమ స్వధర్మ కర్మలను రామాంకితం చేసి, ధర్మాంకితం చేసి, వానిని భగవత్కైంకర్యాలుగా చేసి, వైరాగ్య శివుని ఆరా ధించి, రామ భక్తి శ్రీని పొంది ధన్యత గన్న ఆదర్శ జీవనులను రామాయణ తిరు వీథులలో మనం సందర్శించ గలం. ఈ సత్యసాకేత లోకవాస్తులైన దివ్యజనుల సంద

ర్శన సాంగత్య సేవా భాగ్యంచేత మనం మన శవ జీవితాలను శివ జీవితాలుగా చేసికోగలం. మనం ఏ జాతికి, ఏ కులానికి, ఏ మతానికి, ఏ స్థితికి, ఏ కాలానికి చెందినా శ్రీరామాలింగనంలో సుఖించగలం. రామునికి కావలసింది ధర్మవర్తనము, దైవ మయత. సత్య రాముని ప్రేమించిన వానికి అభయ శాంతి ప్రదానము, సత్య రామునితో భేదించిన వానికి పుంఖానుపుంఖ బాధా శర పరంపలు తప్పవు! ఇదే వివిధ స్వర రాగాలతో నినదించిన రామాయణ గీతాలాపన!

కేవల సచ్చిదానంద పరబ్రహ్మము జగదుద్ధరణానికి నరరూపంలో రాముడైనట్లు శ్రీమద్వాల్మీకి మహర్షి యొక్క గభీర రామాయణ మహాకావ్యం పండిత పామర జనతోద్ధరణానికి ఒకానొక ఆవశ్యక సమయంలో శ్రీ తులసీ దాస ముఖతః రామచరిత మానస భాషా కావ్యంగా అవతరించింది. ఈ మహా కావ్యం శ్రీరామతత్త్వ మహాభాష్యం!

బాల్యమాదిగా నాకు రామాయణమందు పరమ ప్రీతి. నిజానికి రామాయణమునందు అనురక్తిలేని దురదృష్టవంతు లుండరు. తన భక్తిని ప్రసాదిస్తూ, ఆ భగవానుడు తన సంకీర్తనకు రవ్వంత కవిత్వంకూడా ప్రసాదించాడు. చాలు. ఇదే మహాభాగ్యం. బాలుడైన ధ్రువుడు హరికృపచే మహాకవియై శ్రీహరి స్తోత్రమును చేస్తాడు. ఆయన కృప చేత భగవత్పరములైన కృతులు ఎన్నో ఉదయించాయి. శ్రీమద్రామాయణం వ్రాయాలని తలంపు కలిగింది. భక్తి

శాస్త్రమైన, సర్వయోగ నిధానమైన, సర్వశ్రుతి స్మృతి సారమైన, కలిమలహరమైన శ్రీ తులసీదాస భగవానుని హిందీ "రా మ చ రి త మా న స" మనే రామాయణాన్ని, ఆంధ్రీకరిద్దామని సంకల్పం కలిగింది. స్వేచ్ఛారీతిని పద్య కావ్యంగా 2, 3 కాండలు వ్రాశాను. బహువిధ దైవకార్య కలాపాలచేత, ఎన్నో సంవత్సరాలు రచన ఆగిపోయింది. ఇతర రచనలు ఎన్నో వెలువడినవి. ఆ రామాయణ పద్యాలు కొన్ని కొన్ని ఆ యా పత్రికలలో వెలువడినవి. కొందరు మిత్రులు ఆ రామాయణాన్ని కొనసాగించండని ప్రోత్స హించారు. రామప్రేమలోన పొంగినా తగిన అవకాశం చిక్కలేదు. దైవేచ్ఛ వేరుగా వున్నది. పుణ్యపరిపక్వకాలం వచ్చింది. నిరంతర శ్రీరామ భక్తిమయ హృదయులు, నిష్కామ సేవా పరాయణులు, అద్భుత వదాన్యులూ ఐన శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారు మాకు అత్యంత సన్ని హితులు. వారు ప్రతిదినం హిందీ తులసీ రామాయణం పారాయణ చేస్తుంటారు. హిందీ బాగా తెలిసినవారు, రామా యణమందు అఖండ భక్తిగలవారు. వారు దైవికంగా ఒక నాడు నేను వ్రాస్తున్న తులసీ రామాయణమును యథా తథంగా, అందరికీ అర్థమయ్యేలాగు, ప్రమాణప్రాయంగా అనువదించవలసినదిగా కోరుతూ, ఏతద్రామాయణం సంపూ ర్ణంగా, శోభాయమానంగా ముద్రణ చేయించడానికి కేవల నిష్కామ దృష్టితో సన్నద్ధులైనారు. తమ తండ్రిగారైన శ్రీ సూర్యనారాయణ శ్రేష్ఠిగారియందు తమకు గల భక్తికి

చిహ్నంగా ఈ దివ్యకృతిని ప్రకాశింపజేయ సంకల్పించినారు. ఉదాసీనుడనై, తన మహాసేవను విస్మరిస్తానని, త్వరగా చేయనని ముందుగానే గ్రంథావతరణకారణభూతుడైన ఒక మహాత్యాగిని నిలిపి. ఈ మహాకావ్య నిర్మాణ మహాధ్వరానికి కేశవుని కేశవుడు ఉపక్రమింపజేశాడు. అనువాదమునకు హిందీ మూలమును, గోరఖ్‌పూర్ గీతా ప్రెస్ వారి ఆంగ్లానువాదమును ఆదర్శంగా తీసుకొన్నాను. మూలకృతియందలి శాబ్దిక మాధుర్యము, భావ సౌందర్యము ఉక్తివైచిత్ర్యము, స్వచ్ఛత్వము, గాంభీర్యము భక్తిరస పుష్టి మొదలైన సర్వ శోభలను శక్తికొలది సమగ్రంగా ప్రతిబింబింపజేయడం చేతనే ఈ నవ్యానువాదం జనతా జనార్దన ప్రీతికరమై భాసిస్తుందని ఈ మహా ప్రయత్నానికి పూనాను. ఇట్టి అచ్ఛ స్వచ్ఛ రమణీయానువాదానికి, సర్వ జన గ్రాహ్యతకు, మూలమును సరిగా ప్రతిబింబితం చేయడానికి మంజరీ ద్విపద అనే శుద్ధస్నిగ్ధమైన ఛందోదర్పణమును సముచితాలోచనా పూర్వకంగా స్వీకరించాను. స్తోత్రాలు, విశిష్ట సందేశాలు కీర్తనలు (గేయాలు) గా వ్రాశాను. అవతారికవరకు పద్యాలుగా వ్రాశాను. పాడగలవారికి పాడటానికి, పాడలేనివారైనా చదువుకోడానికి, పండితులూ పామరులూ పఠించడానికి మార్గదేశీ కవితల సమన్వయించే మధ్యమార్గమైన మంజరి ద్విపద ఛందస్సు, నాకు సముచితంగా తోచింది. ప్రేరకులూ ఆత్మీయులైన విబుధులూ ఇచ్చిన సలహాలు, ఉమాకాంత విద్యాశేఖరాది విద్వాంసుల హితవాక్కులూ, ఈ విధానాని

నై వేచ్ఛచేత నన్ను ప్రేరితుని చేసినవి. శ్రీమద్వ్యాస వాల్మీకి ప్రముఖ మహాకవుల దీర్ఘ దీర్ఘ కృతులన్నీ ఎంతో స్వచ్ఛంగా మార్దవంగా వెన్నెలవాగులవలె ప్రవహించినవి. కవి ఋషి. కవి జగద్గత సత్య సాక్షాత్కృతిచేత కలిగిన అనుభవతరంగాలను రమ్య వాఙ్మయ రూపంలో ప్రకటించ గలుగుతాడు. విశ్వగర్భిత సత్య సూత్రాలను, సముచిత రస మయ వాఙ్మయంతో కవి వ్యాఖ్యానించవలసి యున్నది. ఆతని సామగ్రి అంతా సార్వకాలిక సత్యసందేశ నిరూపణకే. ఆతనిభాష అంతర్గత భావమును సమర్యాదగా సేవిస్తుంటుంది. ఆతని భాష భావ సౌందర్యమును కప్పివుచ్చక ప్రజ్వలితం చేస్తుంటుంది. ఇదే ఈశ్వర ప్రేరితుడైన కవిలోని విలక్ష ణత. ఉప్పు కారాలు తగిలే నూనె మిఠాయీల చవిమరగిన నాలుకకు సహజ మధుర ఫలాలు గిట్టని మాదిరి, జారునికి నిజ సతీ సాత్విక సౌందర్యం నచ్చనట్లు, పరంపరగా నరాలలో జీర్ణించిన అలవాట్లచేత, విచిత్రములైన అందాభి ప్రాయముల దాస్యంచేత క్షుద్ర రసికులకు ఉత్తమ కావ్యాలు రుచించకపోయినా హృదయ సంస్కృతి గల రసజ్ఞులకు ఎంతో ఆనందమును కూరుస్తాయి. సూర్యకాంతిచేత మంచు గడ్డలు ద్రవించి నీరుగా స్రవించినట్లు, రస హృదయుడైన వానిలోని సత్యానుభూతి మనోజ్ఞ వాఙ్మయ రూపంలో వ్యక్త మవుతుంది. ఇట్టి సత్య కవిత్వాలే ఏ రూపంలో వున్నా, ఏ భాషలో ఉన్నా లోక కల్యాణాన్ని చేకూరుస్తాయి. ఆత్మ శుద్ధి, శీలశుద్ధి గల పుణ్యపురుషుని వలె ఉత్తమ కవిత్వాలు

శాశ్వతంగా వెలుగొందగలవు. కవిని ఉద్ధరింపగల కావ్యమే తోటి ప్రజలనుకూడ ఉద్ధరింపగలుగుతుంది. ఇవన్నీ మీకు విదితం.

మూల గ్రంథమును యథారీతి ప్రతిబింబితం చేయడానికి ఎక్కువ అనుకూలం ఉంటుందనీ, రెండవది మూల కృతిని లాగా భక్తజనులు గానం చేసుకోవడానికి వీలుంటుందనీ, మూడవది పండితపామర రంజనానికి ఏకైక సాధనంగా ఉంటుందనీ, నాలుగవది ముఖ్యంగా సామాన్యజనులు ఈ యుద్గ్రంథముతో స్వతంత్రంగా మైత్రిపొంది ఉపకృతి పొందుతారనీ, అందరూవచ్చి యథేచ్ఛగా, రామాయణ సరస్సులలో గ్రుంకులాడి బ్రహ్మశాంతిని పొందుతారనీ, భగవదనుగ్రహం చేత మనస్సులో తట్టినందున ఈ మంజులమైన ద్విపద చ్ఛందస్సులో ఈ విధానంగా ఈ రామచరిత మానసానువాద మహాకృతిగంగ ప్రవహించింది.

కొందరు మిత్రులకు ఇది వినిపింపబడింది. సామాన్యో జనులుకూడా విన్నారు. బ్రహ్మానందరసమయత వారిలో గోచరించింది. ధన్యోస్మి అనిపించింది. రామకృపా సంజనితమైన ఈకృతి రమణీయంగా ఉండకపోదని ధైర్యం చిక్కింది. శ్రీరాముని అభయవాక్కులవలె, పండితోత్తముల వాక్కులు ఈ ఉద్యమమును ఉత్తేజ పరచినవి. ఈ కృతినిగూర్చివ్రాసిన కొందరు సత్పండితుల పీఠికాదులను అమూల్యాభిప్రాయములను ముందు పఠించగలరు. ఈ రామకావ్య పరిచయము

తులసీదాసు ఈ జగమంతా రామ మయంగా దర్శించిన మహాచక్షువు. ఈకావ్యంలో విరివిగా కనబడే బ్రాహ్మణశబ్దం గభీరమైంది. నేటి కాలంలో అపార్థదశనుపొంది, దుర్వినియోగమైయున్న పదముతోగల పరిచయముతో ఆ పురాతన విశాల శబ్దమును మనం అర్థం చేసికోకూడదు. ప్రతి పదాన్ని ఆనాటి విలువతో మనం తీసికోవలసి యున్నది. ఈయన పూజ్యులుగాచెప్పే బ్రాహ్మణులు మానవ జాతిలో ఉత్తమతమ సంస్కృతి పొందినవారు మాత్రమే. ఈయన క్రమశిక్షణార్హులుగా చెప్పిన స్త్రీశూద్రులు అన్ని కులాలలోఉన్న సర్వసామాన్య జనులై, జ్ఞానవికాస పరిశ్రమచేసినవారు మాత్రమే. ఈయన కావ్యంలోని వర్ణాశ్రమ విభజనము మానవ వికాస ప్రగతిలో న్యూనాధిక పరిణామ దశలయందున్న ఆ యా మానవులు వారివారి సహజశక్తులకు తగిన విధానంలో పరిణతినిపొందే స్వాతంత్ర్య ప్రదానము మాత్రమే. కాల ప్రవాహంలో వికలత పొంది క్రుళ్ళిన శవాన్ని చూచి, మొదట సజీవంగా ఉన్నప్పుడుగూడ యిట్లే వుందని తలంచకూడదు. అల్పజీవికికూడా ఉత్తమ స్థానము నివ్వడం, అల్ప క్రియకు కూడా ఉత్తమ రూపము నివ్వడం భారతీయదర్శన విశిష్టత. కొంచెం ఇట్టి విశాల దృష్టిని మనస్సులో ముందుంచుకొని, ఇప్పటి అపార్థ పదాలను ముందుకుతెచ్చుకోకుండా ఈ తులసీ కావ్యమును అధ్యయనం చేయవలసియున్నది. కొన్నిచోట్ల కొందరికి దురదృష్టవశాత్తు సోదిగా కనబడవచ్చు. ప్రీతి

చిన్న విషయాన్ని రసమయంగా, అర్థమయంగా చెప్పే ఈ మహాకవిప్రజ్ఞను గ్రహించి ఆనందించడానికి ఒక్కొక్కప్పుడు ఉన్నతశక్తి కావలసివస్తుంది. ఈ బాలకాండలో ఉదాహరణకు—సీతారామ కల్యాణ ఘట్టములో కవి విసుగులేకుండా ఎన్నిసార్లు వాద్యవిశేషాలు ప్రయోగించాడో, పుష్ప వర్షాలు కురిపించాడో, మహా సంరంభములు చేశాడో చెప్పలేము. ఒకటే తరంగోప తరంగతాండవ సముద్రఘోష! ఇది అంతా దేనికి? ఒకసారి చెప్పితే చాలదా యని ఎవరైనా అనవచ్చు. తులసీదాసు మైమరచి రామభక్తిలో కావ్యమర్యాదను అతిక్రమించాడనేది మామూలుగా తట్టే భావం. సరే అది ఒక విషయం. కానీ ఆమహా సరంభపునః పునర్వర్ణనలో అద్భుత సత్యవిశేషం వున్నది. జరుగుతున్నది సీతారామ కల్యాణం. జీవేశ్వరుల ఐక్యము. అంటే మానవ జీవిత చరమ శిఖరం అందుకోబడుతున్నది. అదే పరమ నిర్వాణం! వాక్కులు అందుకోలేని దుర్దర్శము, అతి గంభీరమునైన మహాస్థితి. అక్కడ సూర్యచంద్ర నక్షత్రాదులు ప్రకాశింపజాలవు; ఇంక అగ్నిమాట చెప్పడం దేనికి? అని ఉపనిషద్గళాలు అభివర్ణించినవి. జీవిత కర్మ ప్రవాహ పరిశ్రమమంతా ఉపశమించిన మహా ప్రశాంతస్థితి. అదే సీతారామవివాహం. అట్టి అప్రాప్యవిషయం జరిగింది. ఆ బ్రహ్మైక్యసంజనితానందాట్టహాసమును ప్రదర్శించడానికి

తులసీదాసమహాకవికి లోకంలో వున్న వాద్యాలూ చాలవు, పుష్పాలూ చాలవు. విసుగూ వుండదు. ఆయన కా అను భూతి తెలుసు. సోదరప్రజలకు ఆ ఆనందకిరణ భిక్షపెట్టడా నికి ఆయనచేసిన మహాట్టహాసం సముచితమైంది! ఇక గభీరార్థముల విషయంలో ఈ కావ్యంపుట్ట. అగహనార్థాలు మనస్సు పరిణతిపొంది, తులసీతుల్యపావిత్ర్యం పొందినకొద్ది ద్యోతకమయి ఆశ్చర్యసాగరంలో ముంచివేయగలవు. ఉదా హరణకు చూడండి: శ్రీరాముడు కల్యాణానికి వెళ్ళు తున్నాడు. ఒక రమ్యమైన జవనాశ్వాన్ని ఎక్కి వెళ్ళు తున్నాడట. ఆ గుఱ్ఱాన్ని ఎంతో వర్ణించాడు. మన్మథుడే ఆ అశ్వాకారం ధరించాడా అన్నట్లుంటుంది. ప్రభుచిత్తాను సారం అది నడుస్తున్నది. దానిని ఎక్కి రాముడు సీతా వివాహానికి వెళ్ళుతాడు. ఇది కవి అంతగా చెప్పవలసిన విషయమా? ఇందు మహా సందేశమేమున్నది? ఒక వివాహ బాహ్యప్రదర్శనంద్వారా ఒక గహనసందేశం కవి ధ్వనింపచేస్తున్నాడు — చూడండి: ఇంద్రియసముదాయమే జవనాశ్వం. వివాహం కామతృప్తికికాదు; కామసంస్కార ణానికి. అసలు గార్హస్థ్య జీవనసిద్ధుడు కామవిజేత. అతడే వివాహమంత్రాలలోని "సావధాన సావధాన" అన్న వైదిక మైన హెచ్చరికను గ్రహించగలడు. గార్హస్థ్య గౌరవాన్ని

నిలుపగలడు. శ్రీరాముడు ఆదర్శవరుడు. ఆయన-సుందర జవనాశ్వం మన్మథుడు. అది మునుల మనస్సులను కూడా మోహింపజేసేదట. అయితే ప్రభుచిత్తానుసారం పోతున్నది. శ్రీరాముడు కామముచేతస్వారీచేయబడక కామమనేజవనాశ్వమునే స్వారీచేస్తున్నాడు. ఇంద్రియాశ్వం ఆయన అదుపులో నడుస్తున్నది. ఆ విధంగా అదుపులో ఉంచుకోగలవాడే భారతీయదాంపత్య జీవనమును తేజోమయం చేయగలుగుతాడు. ప్రబుద్ధహృదయులను చకితచకితంచేసే అద్భుత ధ్వనులు ఇలాగే తులసీకావ్యంలో అడుగడుగునా వినబడగలవు. సామాజిక సంస్కృతికె ప్రతి చిన్నవిషయాన్ని మహాకవి తులసి సాధనంగా చేస్తాడు. వివాహానంతరం అయోధ్యాపుర ప్రవేశంచేసినపిదప కౌసల్యా మొదలైన అత్తలు, తమ కోడండ్రను ఫణులు మణులను భద్రంగా లోనపెట్టుకొని చుట్టుకొని పండుకున్నవిధంగా కడుపులకు హత్తించుకొని శయనించారట. ఈ వర్ణన దేనికని పైకి అనిపించవచ్చు. సమాజంలో పెద్దపులులుగా మారిన అత్తల పోరుపడలేక బావులలోపడిన కోట్లకొలది కోడళ్ళ విచారకథనాలు మరువలేము. అట్టి హింసానివృత్తికే తులసీకావ్యవీణ యీ చిరు రాగాలాపనకూడ వినిపించింది. ముందే విన్నవించానుకదా శ్రీ తులసీ "రామచరితమానసం" భూమిని వైకుంఠం

చేయడానికై అవతరించిందని. శ్రీరాముడు ఉదయించి నప్పుడు, సీతారామ కల్యాణమప్పుడు మహోత్సాహంలో వారివారి శక్తులకుమించి పరస్పరం ప్రజలు దానాలువర్షించు కుంటారు. అయితే ఆ దానాలు ఎవరూ ఉంచుకోరు. ఇతరుల పైన బలవంతాన విసరిపారవేయడమే. ఇది ఉన్నతసందేశ గర్భితం. సచ్చిదానంద స్వరూపమైన రామభక్తి- సంపద గలిగిన భాగ్యశాలురే సర్వాన్ని త్యాగంచేయగలుగుతారు. ఆ ఆనందంముందు అన్నీ తుచ్ఛం. అదే—ఆ సత్యానుభూతే— మానవసమాజమును భయంకరంగా పీడిస్తున్న తృష్ణాగ్ని కరాళవక్త్రమునుండి విముక్తి కలిగిస్తుంది. ఈ దైవిక సంస్కృతి గలిగిన మానవుడు కడుపే కైలాసమనుకొని, విస్తరే వైకుంఠమనుకొని కబంధుడై పరసుఖాలను కబళింప లేడు. ఇప్పటికే యీ వినతి దీర్ఘమైంది. ఇంకా ముందు మీరు దాటిపోవలసిన ముఖద్వారములు చాలా వున్నవి. వానినిగూడా సందర్శించి, యీ పరమపావనమైన శ్రీరామ చరితమానస సరస్సులోని ప్రథమ సోపానముసుచేరి రామా మృత పానం చేసి సుఖించండి.

ఈ బాలకాండము సీతారామ కల్యాణంతో సమాప్తి నొందినది. తన మనస్సనే సీతాదేవిని రామాంకితం చేయ గలవాడు ధన్యుడు. అప్పుడే సుఖం. అదే జీవితపరమార్థం!

మహా కర్మయోగి జనకరాజర్షి చేసిన ఘనకార్య మిదే! సత్కర్మానుష్ఠానమనే యజ్ఞక్షేత్రంలో శుద్ధబుద్ధి అనే సీతా దేవి ఆ రాజయోగికి లభించినది. సంసారబంధమనే శివ శరాసనమును ఖండించిన ఆ రామపరమాత్మకు సీత నిచ్చి కన్యాదానయజ్ఞం చేసి, తాను తరించి, లోకమును తరింప జేశాడు. ఇట్టి జీవేశ్వరైక్యమే— ఇట్టి సీతారామ కల్యాణమే— మన జీవిత పరిష్కృతి ; నిత్యసుఖదాయకం. ఈ బాలకాండ పఠనం ఈ అక్షయపదమును మన కందరికీ ప్రసాదిస్తుంది గాక !

ఓం! సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్పరివార
సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.
ఓం! ఓం!! ఓం!!!

ఓంతత్సత్

కేశవతీర్థస్వామి,
శ్రీరామతీర్థ సేవాశ్రమాధ్యక్షుడు,
"రామదర్శన" సంపాదకుడు.

శ్రీరామతీర్థ సేవాశ్రమం,
31-1-1957.

శ్రీరామ జయరామ జయజయరామ

# తొలిపలుకులు

శ్రీ మహామండలేశ్వర్, శ్రీరామశరణ్

కుందుర్తి వేంకట నరసయ్య గారు,

సంపాదకుడు : " మోక్షసాధని "

అధ్యక్షుడు : "శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘము",
సాధనశాఖ, గుంటూరు.

సంస్థాపకుడు : "నామప్రయాగ" బుద్ధాం.

శ్రీరామచంద్రుని లీల లనంతములు. శ్రీ తులసీ గోస్వామియు నిట్లే చెప్పెను : "హరి అనంత హరి కథా అనంత" హరియనంతుఁడు, హరికథలు ననంతములు. ఆ యనంత లీలలు విలక్షణములును, అప్రాకృతములునయ్యు బ్రాకృతములవలె గోచరించును. ఆ లీలారహస్యము లా సీతాపతికే తెలియును. కొంతవఱకాతని భక్తులకుఁ దెలియును. లీలలు తెలిసినంతనే లాభము లేదు. వానినిఁ గీర్తించుట మహద్భాగ్యము. కేవలము వాగ్రూపమునఁ గీర్తించుటయును జాలదు. తాననుభవించుటయే కాక యితరులకుఁ గూడ శ్రీరామచంద్రుని దివ్యలీలానుభవము కావింపవలయునను సదుద్దేశ్యము కలుగుటయు

నొక యదృష్టము. అట్టి యుద్దేశ్యముండి ఏమి లాభము? దానినిఁ బామరజనమును జదివి, విని యానందించు లాగున రసవత్తరమగు రచన చేయఁగలిగియుండవల యును. ఇవన్నియును శ్రీమత్పరమహంస పరివ్రాజకా చార్య కేశవతీర్థస్వామి వారికి దక్కినవి. అది వారి అదృష్టము.

శ్రీరామచంద్రుని కథాగానము చేయని కవి లేఁడని చెప్పవచ్చును. భవభూతి చెప్పినట్లు అది ఆయన గుణ దోషమే. ఆ కల్యాణగుణుని జింతింపని జన్మమది యొక జన్మమా? ఆదికవి వాల్మీకి మహర్షి మొట్టమొదటగా శ్రీమద్రామాయణమును రచించెను. దానిలో రామ చంద్రుని కల్యాణగుణములనన్నిటిని రసవత్తరముగఁ జిత్రించెను. మానవుఁడు తన కల్యాణగుణములచే భగ వంతుఁడెట్లు కావచ్చునో నిరూపింపఁబడినది. "రామో విగ్రహవాన్ ధర్మః" అని చెప్పఁబడుటచే శ్రీరా ముఁడు మూర్తీభవించిన ధర్మస్వరూపుఁడు.

## తులసీరామాయణము

శ్రీమద్వాల్మీకి రామాయణముండగాఁ దులసీ రామాయణమేల కావలసివచ్చినది? తులసీదాస గోస్వామి యెవరు? ఈ ప్రశ్నలకు సమాధానము సంహి

తలలోఁ గలదు. శివుఁడు పార్వతికి శ్రీ తులసీ గోస్వామిని గూర్చి యిట్లు చెప్పెను :-

శ్లో॥ వాల్మీకిస్తులసీదాసః కలౌ దేవి ! భవిష్యతి ।
రామచంద్ర కథాందివ్యాం భాషారూపాం కరిష్యతి ॥

ఓ దేవీ ! కలియుగములో వాల్మీకియే తులసీదాసై పుట్టి దివ్యమగు శ్రీరామచంద్రుని కథను ప్రాకృతభాషలో వ్రాయఁగలఁడు.

వాల్మీకి లక్ష్మణుని శాపముచేఁ దులసీదాసుగ జన్మించెను. శ్రీరాముని ఆజ్ఞచే లక్ష్మణుఁడు గర్భవతియగు సీతను వాల్మీకాశ్రమప్రాంతారణ్యమున నొంటిగ దిగ విడచివచ్చెను. ఆమె వాల్మీకిచే గొనిపోఁబడి, పోషింపఁ బడుచుండెను. ఆమెకు లవ, కుశులను నిద్దఱు పుత్రులుద యించిరి. రమారమి పది సంవత్సరములైన మీఁదట శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో నిట్లనెను:-"లక్ష్మణా! మీ వదినెను నాఁడడవిలో దిగవిడచి వచ్చితివి కదా ! ఆమె వాల్మీకాశ్రమమునఁగాని, మఱెచ్చటనైనఁగాని బ్రదికియున్నదో లేక చచ్చినదో, సంతానమును గన్నదో లేదో తెలియకున్నది. కావున నీ వొక్కసారి ఆశ్రమ ప్రాంతమునకుఁబోయి సర్వవిషయములను గనుగొని రావలయును." అనఁగా లక్ష్మణుఁడు శ్రీరామాజ్ఞను శిరసావహించి వాల్మీకి ఆశ్రమమునకుఁ బోయెను. లక్ష్మ

ణునకు సీతయనిన భయము. సీత తన మనసునకువచ్చిన విషయమును నిర్మొగమాటముగ ననును. మారీచ సంహారసమయమున లక్ష్మణుని నానావిధముల దూషించినది కదా! ఇప్పుడును, ఆడుదానిని, నిండుచూలాలిని, ఒంటరిగా క్రూరమృగములుండు ఘోరారణ్యమున ప్రొద్దుక్రుంకు వేళ విడిచి వెళ్ళితివే, ఇంత కఠినాత్ముఁడ వేమి లక్ష్మణా!" యని దూషించునని యాతనికి భయము. అందువలన నొక వెన్నెలరాత్రిని ప్రొద్దుక్రుంకినమీఁదట వాల్మీకాశ్రమమునకుఁ బోయెను.

రాఁగానే వాల్మీకిమహర్షి అతిథిసత్కారములు కావించినమీఁదట లక్ష్మణునితో— "లక్ష్మణా! నేను శ్రీమద్రామాయణమును రచించితిని వినెదవా?" యనఁగా లక్ష్మణుఁడంగీకరించెను. అంతఁ గుశలవులచే వీణెల మీఁద రామాయణగాన మొనరింపఁజేసెను. లక్ష్మణుఁడు రాముని వదలి యెన్నడు నుండినవాఁడు కాదుకావున రామచరిత్రమంతయును దెలియును. కాని తెలియని ఘట్టములు రెండు కలవు. వాటిని దెలుపవలయుననుకొనెను. అందొకటి సీతాపహరణకాలమున సీతావిలాపమును, రెండవది అశోకవనమున సీతావిలాపమును. ఆ రెండు ఘట్టములను లవకుశులచేఁ బాడించెను. లక్ష్మణునకుఁజాల జాలియు, సిగ్గును వేసెను.

లక్ష్మణుఁడు వాల్మీకితో నిట్లనెను :- "మహామునీ! మీరు రామాయణమును రసవత్తరముగనే చిత్రించితిరి. మంచిదే కాని శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్తుగ సచ్చిదానందపరబ్రహ్మ. రామనామము పతిత పావన నామము. మీ రామాయణములో శ్రీరామపరత్వ మును గూర్చిన ఘట్టమును, శ్రీరామనామ మహిమను గూర్చి వర్ణించిన ఘట్టమును జదివింపుఁడు" అనఁగా వాల్మీకి నిరుత్తరుఁడయ్యెను. వాల్మీకి రామాయణములో శ్రీరామపరత్వమును గూర్చియు, శ్రీరామనామ మహి మను గూర్చియుఁ జెప్పినట్టి ఘట్టములు లేవు. కొన్నిచోట్ల మాత్ర మతిగూఢముగ మాత్రము కలవు. అందులకు లక్ష్మణుఁడు కోపించి వాల్మీకి నిట్లు శపించెను :- "మునీ! నీ వింతటి గ్రంథము వ్రాసియు శ్రీరామపరత్వమును బ్రత్యక్షముగ వర్ణింపఁజాలకపోతివి. ఏ నామము తారక నామమో, ప్రణవసదృశమో, అంతేకాదు ప్రణవము కంటె నధికమైనదో అట్టి రామనామమును గూర్చి నీ రామాయణములో నొకముక్కైనఁ జెప్పజాలక పోతివి. రాఁబోవునది కలియుగము. అందలి మానవులు రాముని దేవుఁడు కాఁడు, రాజమాత్రుఁడందురు. అట్టి వారికి సమాధానముగ మరలఁ గలియుగమునఁ బుట్టి, అందఱ కర్థమగు భాషలో శ్రీరాముని పరత్వమును గూర్చియు, శ్రీరామనామ మహిమను గూర్చియు,

రామాయణచరిత్రలోని సందేహములకు సమాధానము చెప్పుచు, భక్తి చిప్పిలునట్లు రామాయణమును రచింపవలయును.” ఈ శాపమును వాల్మీకి సహర్షముగ స్వీకరించి, కలియుగమున పదునైదవ శతాబ్దమున నవతరించి యాజ్ఞవల్క్యరామాయణముననుసరించి మానసరామాయణమును రచించి ధన్యుఁడయ్యెను. బాగుగాఁ బరామర్శించి చదువుచోఁ దులసీరామాయణమునకు మించిన రామాయణము లేదనవచ్చును. అందువలననే అది ఉత్తరదేశమున పేదవారి కుటీరముల నుండి రాజసౌధముల వఱకు సమాన గౌరవముతో నాదరింపబడుచున్నది.

తులసీరామాయణము నలంకారములకును, ధ్వనులకును, శబ్దప్రయోగములకును, ఉపమానములకును బెట్టినది పేరు. “ఉపమా కాళిదాసస్య” అనుచుందురు గాని, తులసీదాసు ఉపమానములను బ్రయోగించుటలోఁ గాళిదాసును మించగలఁడు. కథను జెప్పునపుడు తన్మయుఁడై రసస్ఫూర్తితోఁ జెప్పును. రామాయణములలో దీనికున్న వ్యాప్తి యింక దేనికిని లేదు. ప్రపంచములోని భాషలన్నిటిలోనికి నిది యనువదింపఁబడినది. చివరకు నాస్తికులని చెప్పఁబడు రష్యావారు కూడ దీనిని వారి భాషలోని కనువదించుకొని యానందించుచున్నారు.

అట్టియెడ మన యాంధ్రభాషలోని కనువదించుకొను టయుఁ జాలయవసరమే.

ఈ తులసీరామాయణమును గూర్చి ఆ కాలమున కాశియంతటను విశేషముగఁ జెప్పుకొనసాగిరి. ఆతని సమకాలికులగు పండితులు కొందఱోర్పులేక ఆకాలమున నటు ప్రేమభక్తి సిద్ధాంతమును, నిటు అద్వైతసిద్ధియను గ్రంథమును వ్రాసి అద్వైతసిద్ధాంతమును సమన్వయ మొనర్చిన అఖండపండితులగు మధుసూదన సరస్వతీ స్వాములవారియొద్దకు వెళ్ళి తులసీదాసుని గ్రంథముపై వారి యభిప్రాయము నడిగిరి. వారు వీరి కవిత్వమును నాక్షేపించెదరని భావించిరి. కాని వారిట్లనిరి:-

శ్లో॥ ఆనందకాననే హ్యస్మిన్, జంగమస్తులసీతరుః ।
కవితా మంజరీ భాతి రామ భ్రమరశోభితమ్ ॥

ఈ యానంద వనము (కాశికి ఆనందవన మను పేరు కలదు) లో స్థావరమగు తులసిచెట్టుకాక జంగమమగు తులసీవృక్షము కలదు. ఈ తులసి కవితామంజరులతో భాసించుచు రాముఁడను తుమ్మెదతో శోభిల్లుచున్నది. దీనికి పండితులందఱును సిగ్గుపడి తులసీదాసుని యందు భక్తి కలిగియుండిరి. శ్రీ మధుసూదన సరస్వతులచేతను బ్రశంశింపఁబడిన గ్రంథమిది.

## శ్రీ తులసీదాసుని సిద్ధాంతము.

గోస్వామి వారి రామాయణములో శ్రీరామపరత్వమును, శ్రీరామనామతత్త్వమును, సగుణనిర్గుణ సమన్వయమును జక్కఁగఁ గావించెను. ఇందు భక్తికి ప్రాధాన్యము కలదు. తర్వాత జ్ఞానమునకు ప్రాధాన్యమొసంగినారు. ఉత్తరకాండమందు భక్తిని స్త్రీకిపోల్చి, జ్ఞానమును బురుషునకుఁ బోల్చెను. మాయాదేవి స్త్రీ కావున స్త్రీ వేఱొక స్త్రీ నెట్లు మోహింపఁజేయఁ జాలదో, అట్లే భక్తిని మాయ మోహింపఁజేయఁజాలదనియు, జ్ఞానము పురుషుఁడు కావున స్త్రీకి పురుషుఁడెట్లు వశమగునో అట్లే జ్ఞాని మాయావశుఁడు కావచ్చుననియు నిరూపించెను. శీలమునకును, ధర్మమునకును జక్కని పోషణ నిచ్చి, రసములో మునిఁగియు, నితరులను ముంచియుఁ దన్మయముగ వ్రాసెను. వినయము, త్యాగము, భక్తి, శీలము మొదలగు వానినిఁ బోషించుటకు భరతుని పాత్రను గ్రహించెను. ఈ రామాయణమునకుఁ బ్రాణము అయోధ్యాకాండము.

శ్రీమద్రామాయణములో ననేక సందేహములు కలుగుచుండు స్థలములలో నీతఁడు చక్కఁగ సమాధానములను కథలోనే జోడించి చెప్పెను.

## అనువాదములు

శ్రీ తులసీరామాయణము ప్రపంచములోని అన్ని భాషలలోనికి ననువదింపఁబడినది. మన యాంధ్రభాష లోనికి శ్రీ భాగవతుల నృసింహ శర్మగారిచేఁ బద్య రూపముగ ననువదింపఁబడి వేఁగుచుక్క గ్రంథమాలలో ప్రకటింపఁబడినది. వివిధ వృత్తములలోఁ జక్కని ధారా శుద్ధి గలిగిన కవిత్వముతోఁ బోతనను దలపించుచు రచింపఁబడినది. కాని వారు కొన్ని యెడల స్వతంత్రించిరి. అదియు సామాన్య విద్యావంతుల కందుబాటులో లేదు. వావిళ్ల వారిచే వచనమునఁ బ్రచురింపఁబడినది. శ్రీ నోముల అప్పారావుగారిచే ననువదింపఁబడి బాల కాండము వఱకు ప్రచురింపఁబడినది. ఇంతలో వారు పరమపదించిరి. వారు వ్యాఖ్యానరూపముగ రచించిరి. తులసీదాసెట్లు పామరుల కందుబాటగు భాషలో రచించెనో, అట్లే గానము చేసికొనుటకుఁగూడ వీలుగనుండునట్లు ఆ దోహా, చౌపాయి వృత్తములలోనే రచింపవలయునను ఆశ నాకు మిక్కిలిగనుండెడిది. కాని శ్రీ ప్రభుదత్తజీ బ్రహ్మచారి గారు భాగవతకథానువాద కార్యమును నా కొసంగుటచే నేను దానిని నెఱవేర్పలేకపోతిని. కాని నాకు పూర్వాశ్రమమున కడుంగడు ఆప్తులును, సౌజన్యనిధులును, ఇప్పుడు నాకు పరమ

పూజ్యులును, గురుతుల్యులు నగు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య కేశవతీర్థ స్వామి వారు దీనిని దెనిం గింపఁబూనుట సంతోషకరమగు విషయము. వారు కైకొనిన వృత్తము చక్కఁగనున్నది.

ద్విపద తేలికఁగ సామాన్యవిద్యావంతులును జదివి అర్థము చేసికొనుటకును, పాడుకొనుటకును వీలుగ నుండును. నేనాలోచించినదానిలోఁ దెలుఁగుందనము పోయినది. దోహా, చౌపాయిలు తెలుఁగు వృత్తములు కావు. హిందీ వృత్తములు. వీరు తెలుఁగుదనమును బోనీయకుండుటకు చక్కని ద్విపదా వృత్తమును గడించినారు. వీరికి నా ధన్యవాదములు.

స్వామివారి అనువాదము

ద్విపదలోనైనను బాండిత్యప్రకర్ష చేయనెంచిన కవి నలుగని రాళ్ళవంటి పదములను వైచును వాఁడే. కాని శ్రీ స్వామి వారది గ్రహించి అతి తేలికపదములలో నను వాదమందు రసమేమియు చెడకుండునట్లు చక్కఁగ ననువదించినారు. గ్రంథవిస్తరము కాకుండునట్లు వారి కవితాశైలిని క్లప్తముగ చూపెదను.

తులసీదాసుని కవిత అతిగూఢముగ నుండును. అనే కార్థములు ఒక్కదానిలోనే యిమిడియుండును. వారి

వాడెడు ప్రతిపదమందును ఎంతో అర్థముండును. మచ్చున కొక్కటి చూపి, దానిని శ్రీ స్వాములవా రెట్లు నిర్వహించిరో చూతము. శ్రీ తులసీదాస గోస్వామి నామ వందనములో రామనామమున కిట్లు నమస్కరించిరి.

వందఉఁ నామ రామ రఘువరకో
హేతు కృశాను భాను హిమకరకో ।
విధి హరి హర మయ వేదప్రాణసో
అగుణ అనూపమ గుణనిధాన సో ॥

స్వామివారి అనువాదము

గీ॥ ఎది కృశాను భానులకును హిమకరునకు
గారణంబగు నా రఘుకాంతు 'రామ
నామ' మున కెప్పుడును వందనం బొనర్తు
బరమభక్తిసంపూరిత భావముననుు ॥

క॥ శ్రీరామ నామ మహాహా !
నీరజ భవ విష్ణురుద్రనిలయము, వేదా
ధారము, నిర్గుణ, మసమము
చారు సుగుణరత్నములకు సాగరమెన్నఁగ॥

పై వానిలో హేతు కృశాను, భాను, హిమకర అను శబ్దములోనే చాల అర్థము కలదు. స్వాములవారు క్రింద వివరణములోఁ గొంత వివరించిరి. ఇంకను జాల అర్థము కలదు. ముఖ్యముగా రామనామము ఈ శబ్దములలోనే

ృ = క + ఋ — భాను అనుదానిలో భ + ఆ

హామకర అను దాని లో హి + మ. ఇట్లు ఋ + ఆ + మ
రామ, అయినది. సరిగా నా శబ్దములనే శ్రీ స్వామి
వారు వేయుట గమనింపదగినది. అట్టి రహస్యములను
వారు గ్రహించియే అట్లు చేసిరనుట విస్పష్టము.

## శ్రీ స్వామివారి ధారాశుద్ధి అనుపమానము.

చౌ॥ సతీఁ సముఝి రఘువీర ప్రభాఊ
భయజస సివ సన కీన్హ దురాఊ॥
కఛు న పరీచ్ఛా లీన్హి గోసాఈఁ
కీన్హ ప్రనాము తుమ్హారిహి నాఈఁ॥

చౌ॥ జో తుమ కహా సో మృషా న హోఈ
మోరేఁ మన ప్రతీతి అతి సోఈ॥
తబ సంకర దేఖేఉ ధరి ధ్యానా
సతీఁ జో కీన్హ చరిత సబు జానా॥

ఆ రఘునాథు మహామహిమంబు
తెలియుటచేత సతీదేవి, హృదిని
భయవశయౌచును భవునిచెంగటను
సత్యంబు దాచి యీ చందంబు బలికె:
"శ్రీరాము నేను పరీక్షింపలేదు;
నీ వలె మ్రొక్కియు నే వచ్చియుంటి
ఓ ప్రభూ! నీ మాట లుత్తవి యౌనె?
ఏను పూర్ణంబుగా హృదయంబులోన
[illegible] ! నాథ !

అని పల్కి శంకరు డాలకించియున్న
సతియొనరించిన సర్వకార్యమును
దివ్యదృష్టినిలోన దిలకించి,........

పై చౌపాయిలలోని భావము చెడకుండ చక్కని శైలిలోఁ జెప్పెను. యతులకై బాధపడలేదు. ఈ క్రింది పంక్తులెంత చక్కనివో చూడుఁడు—

"శ్రీరామచంద్రుని హృదయంబులోన
సదమలానుగ్రహచంద్రుండు వెలుగు
నా రాఘవుడు మనోహరహాసములను
విశ్వతాపముదీర్చు వెన్నెలలొలుకు;
వొడిలోన గానేపు, నూయలలోన
గానేపు బాలరాఘవుని గౌసల్య
"నా కన్నతండ్రి! ఓ నా ముద్దుతనయ!"
అనుచు లాలించు నత్యంతానురక్తి.
ఆ జగద్వ్యాపకుండా నిరంజనుడు
నా నిర్గుణుడు మఱి యా నిష్క్రియుండు
నగు పరబ్రహ్మ యహో! చిత్రరీతి
గౌసల్యపాణి పంకజయుగ్మమందు
నాటలాడుచు నుండె నర్భకుండగుచు ||"

జనకుఁడు శ్రీరామలక్ష్మణులను గాంచి యిట్లనుకొనును. ఇందాశ్చర్యమును బ్రకటించుచు కవిత్వము నెంతో బాగుగా నడిపినారు—

"మునిపాదపంకజములకంత మ్రొక్కి
గద్గదకంఠుడై గంభీర ఫణితి

హామకర అను దా చియించె మునీంద్ర !”
రామ, అయినది. ాహారబాలు రెవరు ? మునీంద్ర !
తిలకులా ? భూపాల సుతులా ?
ారు వేయుట
తి’ యటంచు నిగమంబులాడు
ారు గ్రహిం
ర బ్రహ్మ మీ యాకృతుల్ గనెన ? ”

ఈ రామాయణమును వాడవాడల, పల్లెపల్లెల, పట్టణపట్టణములందును, బురాణరూపమునను, గానరూపమునను బాడుకొని ధన్యులయ్యెదరు గాక ! ఈ ద్విపద బుఱ్ఱకథలోఁగొన్ని యెడల వినియోగింపగలదు. ఈ కలికాలములో మరల నా తులసీ గోస్వామియే శ్రీ కేశవ గోస్వామియై ఆంధ్రిని బవిత్రమొనర్ప యవతరించి యీ కృతిని వెలియించె ననిపించుచున్నది.

ఆంధ్రులారా! మీరు ధన్యులు. ఇఁక మీ యిష్టము వచ్చినట్లు శ్రీరామభక్తిచే రామనామమును గాన మొనర్చుకొని ధన్యులు గండు. శ్రీ స్వామివారి మాటల లోనే శ్రీరామచంద్రుని హృదయమున నిల్పుకొని ధన్యులుకండు—

"మరణింపనున్నట్టి మానవుం డెట్లొ
యమృతంబుపొందినయట్టుల, మఱియు
నా జన్మమాకట నల్లాడువాఁడు
కల్పవృక్షంబును గాంచినరీతి
నల నరకంబున కరిగెడివాడు
హరిపదంబును గాంచినట్టుల మనము
పొందినారము వీరి పుణ్యదర్శనము.
శ్రీరాముశోభ వీక్షించి యద్దాని
జేర్చుఁడీ హృదిలోన జెరుగకుండగను
ఫణిమణిదాల్చినపగిది జిత్తమున
శ్రీరామమూర్తి ధరించుఁడీ ప్రీతి."

ఇదియే మా యాశయము.

ఈ మహాగ్రంథ ప్రకాశకులైన శ్రీ కర్పూరపు సూర్యనారాయణ శ్రేష్ఠి గారి వదాన్యత, శ్రీరామ

సేవాదీక్ష సర్వాంధ్రజనాభివందనీయమైనది. మిగతా కాండలన్నియు నిదే విధముగ వీరిచే శ్రీరామభగవానుఁడు ప్రకాశింపఁజేసి లోకకల్యాణముఁజేయించు గాక!

— శ్రీరామశరణ్

కుందుర్తి వేంకట నరసయ్య.

నామప్రయాగ,
బుద్దాం.
22—1—57

# పీఠిక

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్.,
సాహితీ సమితి, రేపల్లె.

తులసీదాస గోస్వామి రామాయణమును రామచరిత మానసము అను పేర ఏడు కాండములుగా ' భాషా ' కావ్యముగా రచించెను. ఉత్తర హిందూస్థానములో దీనిని వాల్మీకి రామాయణమువలెనే పూజ్యభావముతో నారాధించుచు ఋష్యాది న్యాసములతోడను అంగ న్యాసకరన్యాసములతోడను ధ్యానపూజా పురస్సరము గను పారాయణ మొనర్చుచున్నారు. నేడు హిందీభాష యని ప్రసిద్ధికెక్కిన భాషలో అంతర్గతమగు 'అవధి' అను ఉపభాషలో ఈ గ్రంథము రచింపబడినది. తులసీదాసు దానిని 'భాష' యను నామముతోడనే వ్యవహరించెను.

ఇందులో కాండము లనునవి పెద్ద విభాగములు. వాల్మీకమునందువలెనే యిందును ఉత్తరకాండముతో కలసి ఏడు కాండములున్నవి. యుద్ధకాండకు లంకాకాండమను పేరుమార్పే కాని తక్కిన కాండనామములు అన్నియు సమానమే. ఈ కాండములనే ప్రథమ సోపానము, ద్వితీయ సోపానము ఇత్యాదిగా సప్తసోపానములుగాకూడ

కవి నిర్దేశించెను. ఈ కావ్యము మానససరోవరముగా భావించినందున కవి యీ కాండములనే సోపానములుగా పేర్కొనెను. ఈ విభాగములేకాక పారాయణమున కనుకూలముగా కాండము మధ్య విశ్రామములను ఉపవిభాగములును కలవు.

ఔత్తరాహులలో ఇంత విశేషప్రచార మున్న గ్రంథ మింకొకటి లేదు. ఇది విద్వాంసులనేకాక విద్యాగంధము లేని పామరులనుగూడ ఆకర్షించినది. నిరక్షరాస్యులుగూడ రామచరితమానస భాగములను కంఠస్థము చేయుచుందురు.

దీనిలో అడుగడుగునను కవి – రామభక్తిద్యోతమాన మగుచుండును. కాని అది యితర దైవములను ద్వేషించు రామభక్తి కాదు. శివుని భజించువారేకాని శ్రీరాముని స్వరూపము తెలిసికొనలేరని మాటిమాటికి నొక్కి చెప్పబడుచుండును. అందుచే హరిభక్తులకేకాక, హరభక్తులకును ఈ గ్రంథము ఆదరపాత్ర మగుచున్నది. ఇందులో శ్రీరామ కథ శివుడు పార్వతి కుపదేశించినట్లే ఉన్నది.

సంస్కృతములో విశ్వామిత్రప్రణీత మను ప్రతీతిగల అధ్యాత్మరామాయణము ననుసరించి దీనిని వ్రాసెనని కొందరందురు. అధ్యాత్మరామాయణము మిక్కిలి

చిన్న గ్రంథము. ఇది అంతకంటె ఎన్నోరెట్లు పెద్దది. అధ్యాత్మరామాయణము నందలి 'శ్రీరామ హృదయము' దానికి ప్రాణతుల్యమైనది. దాని కందులో నెంతయో ప్రాధాన్య మున్నది. అందలి 'శ్రీరామ హృదయము' తులసీదాసుకు హృదయస్థమై యుండె ననుట కెట్టి సందేహమును లేదు. కాని దాని కథ ననుసరించి యిది వ్రాసెననుటకు వీలులేదు. అవతారికా భాగములోని –

'సీతారామగుణగ్రామ పుణ్యారణ్యవిహారిణౌ ।
వందే విశుద్ధవిజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ' ॥

అను ప్రసిద్ధశ్లోకములోని కవీశ్వరుడు వాల్మీకియే యనుటకు సందేహములేదు. అందుచే వాల్మీకినే కవి యనుసరింప నుద్దేశించెననుట నిశ్చయము. కాని యీ కథ ఎన్నియో భాగములతో వాల్మీకి కథతోగూడ కలియక భేదించుచున్నది. వర్ణనాదులలో నైనను ఇతడు వాల్మీకి ననుసరింపలేదు. అందుచే నిది సంపూర్ణముగా స్వతంత్ర గ్రంథము!

## 2

తులసీదాసు జీవితము సరిగా ఎట్టిదో తెలియరాదు. ఈ కాలపు జనులు నమ్ముటకు సమ్మతింపని అద్భుత సన్నివేశములతో ఆతని జీవితగాథ చెప్పుచున్నారు.

ఆతడు సరయూ నదీతీరమున అయోధ్యకు సమీపమున ఒక చిన్నగ్రామములో జన్మించెను. తండ్రి పేరు ఆత్మారామ దూబే. దూబే అనగా ద్వివేది. కావున నాతనిది వేదవిప్రకుటుంబము. అతడు జన్మించినది అభుక్త మూలమని ప్రసిద్ధిగల మూలానక్షత్ర ప్రథమపాదమట. అందుకుతోడు ఆతనికి పుట్టినప్పుడే రెండు దంతము లుండెనట. తల్లి యాతడు పుట్టినప్పుడే మరణించెనట. అట్టి దుష్టనక్షత్రమున జన్మించినందున తండ్రి యా పసిబిడ్డను దూరమున వదలిపెట్టెను. ఎవరో దాది ఆ పిల్లవానిని తెచ్చి సాకుచుండగా కొన్నాళ్ళకు అదియు కాలధర్మము నొందెను. ఆ పిమ్మట నరహరిదాసు అను గోస్వామి ఆతని తనకడనుంచుకొని పెంచి విద్యాబుద్ధులు గరపెను.

కొంతకాలమునకు తులసీదాసుకు తన జన్మస్థానమునకు పోవలెనని వ్యామోహము కలిగి, వెళ్ళి సరయూనదీతీరమున కుటీరమొకటి నిర్మించుకొని అందు నివసించుచుండెను. అప్పుడాతని కొక గృహస్థు తన కుమార్తె నిచ్చి వివాహము చేసెను. ఆ పిల్లపేరు 'రత్నావళి' యనియు 'తులసి' యనియు రెండువిధముల జెప్పెదరు. వివాహమైనదాది ఆతడామెను మోహాంధుడై ప్రేమించుచు యితర ప్రపంచము సమస్తము మరచి

యుండెను. భార్య నెన్నడు పుట్టినింటికైన పోనిచ్చెడు వాడు కాడు.

ఆతడు భార్యనువదలి క్షణమైన నుండనోర్వకుండెడు వాడు. ఐనను ఒక నా డాతడు తప్పనిసరియై పాదుషా సన్నిధికి వెళ్ళవలసివచ్చినది. అక్కడినుండి యాతడు తిరిగి యింటికి వచ్చునప్పటికి భార్య నామె బంధువులు పుట్టింటికి తీసికొనిపోయి యుండిరి.

భార్యనుచూడక క్షణము నిలువలేక తులసీదాసు అప్పటికే పొద్దుపోయినను లక్ష్యముచేయక వెంటనే మామగారి గ్రామమునకు బయలుదేరెను. చీకటిరాత్రి. దారిలో పెద్ద ఏరు పారుచున్నది. నీటిలో తేలిపోవుచున్న శవము నాధారముచేసికొని అతడా ప్రవాహము దాటెను. మామగారి యింటికి పోగా తలుపులు వేసి యుండెను. త్రాడువలె వ్రేలాడుచున్న నాగుబామును పట్టుకొని ఆతడు గోడదాటి భార్యను చేరికొనెను. భార్య యాతని నక్కడ నట్టి నిశీథవేళ నాస్థితిలో చూచి ఆశ్చర్యపడి, 'నామీద మీకున్న మమకారములో అల్పాంశమైనను శ్రీరామచంద్రునిపై నున్నచో భవతారకమై యుండునుగదా!' అని పలికినదట.

'కామిగాక మోక్షకామిగాడు' అను కవివాక్యము తులసీదాసు విషయమున సార్థకమైనది. ఆ మాటలు

విన్నంతనే తులసీదాసు హృదయములో ఆకస్మికముగా పరివర్తనము కలిగెను. భార్యవాక్యములే ఆతడుపదేశముగా గ్రహించి సంసారమువదలి కాశిలో మణికర్ణికాఘట్టముః చేరి రామనామజప మారంభించెను.

ఆతడు నిత్యము తానుచేయు జపము అక్కడగల ఒక వేపచెట్టు మూలమున నర్పించెడువాడట. కొంత కాలమునకు ఆ చెట్టు నాశ్రయించియుండిన బ్రహ్మరక్షస్సు ఆ జపార్పణఫలముచే తన రక్షోరూపమువదలి తులసీదాసును వర మేమైన కోరుకొమ్మనెను. తులసీదాసు తనకు శ్రీరామచంద్రదర్శనము కలుగునట్లు ప్రసాదింపుమని వేడెను. అది తనశక్తికిమించినదనియు అందుకు దారి చూపగల వ్యక్తిని చూపింపగలనని యిట్లనెను :

"వరాహఘట్టములో నిత్యము శ్రీమద్రామాయణ కాలక్షేపము జరుగుచుండును. వృద్ధబ్రాహ్మణు డొకడు ఆ కాలక్షేపమునకు ముందేవచ్చి దూరముగా కూర్చుండి కాలక్షేపము పూర్తియైనపిమ్మటగాని విడిచివెళ్ళడు. ఆ రూపముతో వచ్చు వ్యక్తి హనుమంతుడు. నీ వాతనికి వందనమొనర్చి ఆశ్రయింపుము. ఆతడు తాను హనుమంతుడను కాననును. అయిన వదలక సేవించినచో ఆతడు నీకు శ్రీరామదర్శనము అనుగ్రహింపగలడు."

బ్రహ్మరక్షస్సు చెప్పినవిధముగా తులసీదాసు వృద్ధ బ్రాహ్మణరూపమున నున్న హనుమంతుని దర్శించి ఆశ్రయించి ఆతని యుపదేశమున చిత్రకూటమున కొంతకాలము తపస్సుచేసెను. అక్కడ నాతనియొద్ద కొకనాడు రామలక్ష్మణులు రాజకుమారుల రూపము లతో వచ్చి దర్శనమిచ్చిరి. కాని యాతడు వారల గుర్తింపలేదు.

తులసీదాసు తుదకు సరయూ నదీతీరమునే చేరి తపస్సుచేసికొనుచు పరమపదించెను.

## 3

తులసీదాసు చరిత్రము మొత్తముమీద పై విధ ముగా, కొన్ని కొన్ని మార్పులతో ప్రసిద్ధిచెందినది. అందలి ఘట్టముల బాహ్యాచారిత్రక సత్యముతో మనకంత నిమిత్తములేదు. కేవల మట్టి చారిత్రక సత్యము తరు చుగా, పేలవమై నిర్జీవముగా నుండును. ఈ చరిత్రలో మహాభక్తుని చరిత్ర చిత్రింపబడినది. అందులో సామాన్యచారిత్రక సత్యము కంటె ఉదాత్తతరమగు సత్యము నిక్షేపింపబడినది. అది తెలిసిననే గాని రామ భక్తాగ్రణులలో తులసీదాసుకు ఎట్టి ఉన్నత స్థానము న్నదో మనము గ్రహింపలేము. వాల్మీకిమహర్షియే ఈ కలికాలములో లోకోద్ధరణమునకు తులసీదాసుగా అవ

చినవాడు. స్వయముగా రామభక్తుడు. ఆయన మూల గ్రంథమువలె నది నిర్వచనముగా రచించెను. కాని ప్రాచీనాంధ్రకవుల మార్గమున శార్దూలాది సమవృత్తములు నాలుగు, కందము, సీసము, గీతములు ప్రధానముగా నుండునట్లు రచించిరి. అందుచేత మూలము వలెనే ఛందస్సుల మార్పువల్ల అదియు విసుగు కలిగింపదు. ఐనను మూలము మాత్రాచ్ఛందస్సులలో నుండు పదకవిత్వము గనుక పాడుట కనువుగా నుండును. ఆ ఫణితి దానిలో లేదు. అందుచేత ఆ గ్రంథము మార్గకవిత్వముదారిన నడచిన దనవచ్చును.

## 6

శ్రీ కేశవతీర్థస్వామి వారు ఈ గ్రంథమును 'శ్రీరామచరితమానసము' అను పేరుతోడనే రచించినారు. ఇందులో అవతారికాభాగముకాక కథాభాగమునుండి అంతయు ఎక్కువభాగము మంజరీద్విపదలో చెప్పిరి. ద్విపదయు గణబద్ధమగుటచే మాత్రాచ్ఛందస్సు కాదు. ఐనను పూర్వకాలము నుండియు స్త్రీలపాటలలో ఆంధ్రదేశమున విశేషప్రచారము కన్నందున, ద్విపదయు గేయమై పదకవిత్వమునకు సన్నిహితముగా నుండును. ఛందోభేదములతో చేసిన రచనలో కన్పింపని విసుగు ద్విపదరచనలో ఉండక తప్పదు. అది తగ్గించుటకే

పల్నాటి వీరచరిత్రములో మంజరీద్విపద గ్రహింపబడి నది. ఇంతేకాక భావము పాదాంతములో తెగనీయక పాదమధ్యమునకు సాగనిచ్చుట మొదలగు కూర్పు నేర్పులవల్ల మన ప్రాచీన కవులు ఆ విసుగు రానీయకుండ చాలవరకు వారింపగలిగిరి. అదేమార్గము యీ గ్రంథ ములోగూడ అవలంబింపబడినది. అదియునుగాక అక్క డక్కడ సకృత్తుగానైనను, ముఖ్యముగా స్తోత్రములు చేయు సందర్భములలో, యిందులో మాత్రాచ్ఛందస్సు లున్న గేయములు కూర్పబడినవి. అందుచే ద్విపద కావ్యములలో ప్రకృతి సిద్ధముగానున్న విసుగు ఇందులో లేదు. మూలగ్రంథములో, కాండాదులలో, సంస్కృత శ్లోకము లున్నట్లే శ్రీ స్వామివారు యిందులో ప్రతి విశ్రామాదియందును కృతిభర్తయగు మట్టపల్లి నృసింహ సంబోధనము కందపద్యములలో కూర్చినారు.

శ్రీ స్వాములవారు ఈ గ్రంథరచన యందు సమస్త విషయములలో దేశిపద్ధతులే అవలంబించిరి. యతిమైత్రి విషయములో పూర్వకవులు అక్కడక్కడను, నేటి కవులు విరివిగాను అవలంబించిన స్వాతంత్ర్య మంతయు చూపినారు. యతినియమము శబ్దాలంకారము వంటిదను మా మిత్రుల నిశ్చయము, వీరును పాటించినట్లే. సకృ త్తుగా ప్రాసయతియు వీ రంగీకరించిరి.

భాషావిషయములో గూడ దేశికవుల పద్ధతులే అవలంబింపబడి ప్రసన్నతకు భావగాంభీర్యమునకు ఇందులో ప్రాధాన్యమీయబడినది. ఇదియే మూలగ్రంథపద్ధతియు నగుటచే సముచితమైనది. భాషాంతరీకరణము చేయువారు మూలగ్రంథము ప్రదర్శించుచే ప్రధానాశయముగా పెట్టుకొనవలె గదా! ఆ విషయములో యీ గ్రంథము కృతార్థమైనది.

తులసీదాసు తన గ్రంథారంభమునకు కారణము ఈ విధముగా నిర్దేశించెను :

> ' నానాపురాణ నిగమాగమ సమ్మతం యత్
> రామాయణే నిగదితం క్వచి దన్యతోऽపి
> స్వాంతః సుఖాయ తులసీ రఘునాథగాథా
> భాషానిబంధ మతిమంజుల మాతనోతి. '

ఇందులో స్వాంతఃసుఖము కొరకు అనునది ముఖ్యముగా మనము గమనింపదగినది. పాశ్చాత్యకవులు కొందరు అనునట్లును, నేటివారు కొందరు వారి ననుకరించి అనుచున్నట్లును, ' నా కొరకే నేను కావ్యము చెప్పుచున్నాను. ఇతరుల కొరకు కాదు! ' అను నభిప్రాయముతో కాదు, తులసీదాసు పలికినది. ఈ అంతస్సుఖము సర్వజనసామాన్యమైనది. అందుచే, నది తులసీదాసు ఉపాధికి పరిమితమైనదికాక, మానవకోటియందును విశ్వ

మంతటను అంతర్యామిరూపమున ఏకముగానున్న పర మాత్మసుఖము నుద్దేశించియే తులసి ఈ కావ్య మారంభించెను. అందువలననే అది మంజులము!

ప్రతి కాండము చివరను గద్య మిట్లుండును :

" ఇతి శ్రీమద్రామచరితమానసే సకల కలి కలుష విధ్వంసనే (ప్రథమః) సోపానః సమాప్తః. "

ఈ గద్యములవలన గ్రంథరచనము కలికలుష విధ్వంసనమునకు ఉద్దేశింపబడి నట్లును విస్పష్టమగు చున్నది.

శ్రీ కేశవతీర్థస్వాములవారు బహుకాలముగా సంసార బంధములు వదలి అధ్యాత్మజీవితమునకు ఆత్మాంకిత మొనర్చుకొని పిడుగురాళ్ళలో రామతీర్థాశ్రమములో పవిత్రజీవన మొనర్చుచున్నారు. ఈ గ్రంథమును వారి యిష్టదైవమగు మట్టపల్లి నరసింహస్వామికి అంకిత మొనర్చినారు. అట్టివారు యీ గ్రంథము రచించుటచే తులసీదాసగోస్వామి ఆశించిన స్వాంతస్సుఖము కలికలుషవిధ్వంసనము సఫలమగుననుట నిశ్చయము.

కంకంటి పాపరాజు అన్నట్లుగా,

"శ్రీ రాఘవేశ్వరు చారిత్రము లెంద రెన్ని
గతులన్ వర్ణించినం గ్రాలదే ! "

రేపల్లె,
19—1—57.

నోరి నరసింహ శాస్త్రి.

# మున్నుడి

శ్రీ కోన వేంకటరాయశర్మ గారు,
ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రధాన కార్యదర్శి.

హృదయంగమమైన కావ్యపరిశీలనము, మధురమైన సంగీత శ్రవణము, సజీవ శిల్పసౌందర్యము,—హృదయమునకు హత్తుకొనును. కావ్య కళాదుల నాస్వాదించుటకు హృదయ మవసరము. సహృదయునకే రసాస్వాదనము సమర్థమై యున్నది. రసానుభూతికి హృదయ మవసరము. మానవ హృదయము సుస్నిగ్ధము, అతి కోమలము, నగుటఁ బ్రతివాని హృదయమునఁ గొలఁదిగనో గొప్పగనో భావము లుప్పతిల్లుటయు, ఆ భావములు మనోహర కావ్య శ్రవణమునను, మధురమైన సంగీత శ్రవణమునను, సజీవ శిల్పసౌందర్య సందర్శనమునను,— అభివ్యక్తములై సంస్కృతికిఁ బ్రాతిపదిక వైచుచుండుననియుఁ,—దెలియందగి యున్నది.

సహృదయరంజక మైన రసోత్పత్తి కావ్యమున కవసర మనియు, స్థాయి భావ మందికొన్న యా రసోత్పత్తి

యొక్క స్థితి యుపస్థితమై యుండుననియుఁ, గావ్య పఠనమునఁ దత్స్థాయి ప్రస్ఫుట మగు ననియు,—నభినవ గుప్తాది యాలంకారికుల యభిప్రాయము. కావుననే కాళిదాస మహాకవి—

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్,
పర్యుత్సుకీ భవతి య త్సుఖితోఽపి జంతుః
త చ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం,
భావస్థిరాణి జననాంతర సౌహృదాని."—

అని వ్రాకుచ్చి మన హృదయములలో రసమున కాధారమైన స్థాయి భావము వాసనారూపమున నుండుటవలన దేశ-కాల పరిమాణములను, బరిమాణములను,—దూరీకరించు నని విస్పష్ట మొనర్చినాఁడు.

ఆస్వాదన శక్తి యెల్లరకు సమముగ నుండఁజాలదు సౌహార్ద్రిత రాసిక్యతఁ జెంది రసము ప్రతీయమానమగును. సంస్కారము ననుసరించి రసజ్ఞత కలుగును. అట్టి వాఁడే రసాస్వాదనకు నర్హుఁడును, రసాస్వాదన తత్పరుఁడును. విద్వత్తుకలవాఁడు కవిత యందలి తీరు తియ్యముల, మెళుకువలఁ, బోకడల, నందచందముల, గ్రహింపఁగలఁడు. ఆనందింపఁగలఁడు. జన్మించిన ప్రతి వానియందును ప్రాతిభాసికమైన జ్ఞాన లేశ (Intention)

ముండుచుండును. కాని యీ జ్ఞాన లేశము అల్పసంఖ్యా కుల యందె విజృంభించి వారిని విజ్ఞాన ఖనులుగను, కళోపాసకులుగను, నొనర్చుటను గనుచున్నారము. అట్టి వారిలో మన శ్రీ కేశవ తీర్థ లొకరు.

మోక్షకాములు ప్రత్యహము నృత్య నాటకాదుల వీక్షించుచుండినఁ జాలునను "సంగీత రత్నాకర" కారు నభిప్రాయము ననుసరించి పరమాత్మునందు మనస్సుంచిన సాధకుఁడు మోక్షప్రాప్తికయి యవిరళ కృషి సాఁగించు ననియు, నీ సాధనలో నృత్య నాటకములవలనఁ గలుగు రసోత్పత్తి తోడ్పడుననియుఁ, బెక్కురు లలితకళల ( Fine Arts ) ద్వారమునఁ బరబ్రహ్మ ప్రాప్తికిఁ గృషి యొనర్చి రనియు, నందు సూరదాసు - తులసీదాసు - త్యాగరాజాదులు సచ్చిదానంద సిద్ధియె తగు ధ్యేయ ముగఁ బాటించి రనియు, నందువలన సర్వకళలకు - సర్వశాస్త్రములకుఁ — ప్రాణపదమైనది రస మనియు, రసమె సర్వశాస్త్రముల సారమనియుఁ, — దెలియు చున్నది.

కావుననే "రసోవై సః" అను శ్రుతియు రమణీయత కంతకును రసమే ప్రాణమని యవగత మొనర్చుచున్నది. ఈ పరమరహస్యమును హృద్గత మొనర్చికొని తత్సాధ

నకుఁ బూన్కి వహించుట సంస్కృతివిశేష మనక తప్పదు. అట్టి సంస్కృతి - పరిభావముగల తులసీదాసు గానముఁ జేసిన రామాయణ గాథను మన శ్రీ కేశవ తీర్థులు గేయరూపమునఁ దెలిఁగించి మన యెల్లరకుఁ సాహితీ భిక్ష నిడుటయేగాక, సంస్కృతి భిక్షను గూడ నొసంగినందుల కెంతయు నభివంద్యులు.

రామాయణ గాథ "పాఠ్యే గేయే చ మధుర" మ్మనియు, "అహో గీతస్య మాధుర్యం శ్లోకానాం చ విశేషతః" అనియుఁ, గొనియాడఁ బడినది. మాధుర్యము కావ్యమున నగపించవలసిన ముఖ్యగుణమనియు, "చిర నిర్వృత్త మప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శిత" మ్మను నట్లు కావ్యగుణమును మహర్షులు ప్రస్తుతించి రనియుఁ, —దెలియఁ గలము.

"ఉదార వృత్తార్థ పదైః మనోరమైః
తతస్స రామస్య చకార కీర్తిమాన్,
సమాక్షరైః శ్లోకశతై ర్యశస్వినో
యశస్కరం కావ్య ముదారధీ ర్మునిః."

అని బాలకాండమున నుదారవృత్తము, నుదార పదము, నుదారార్థము, సమాక్షరములు వినుతింపఁబడినవి. ఇట నౌదార్య గుణముఁ జెప్పఁబడినది. తర్వాతి శ్లోకమున

సమాన సంధియోగము, సమమధురోపనతార్థ వాక్య బద్ధము, నని పల్కుచు మాధుర్య సమతలఁ జెప్పినాఁడు వాల్మీకి. విచిత్రపదముల తోడను విచిత్రార్థములతోడను రామాయణము రచింపఁబడినదఁట! శ్రావ్యత — సుభగత — మధురత — ప్రశంసింపఁ బడినవి.

సర్వ దేవతా స్వరూపుఁడు రాముఁడు. ఆ మహాత్ముని ఇచ్ఛాశక్తియె సీత. వీ రిర్వుర కవినాభావ సంబంధము. ఈ విషయ మెఱింగించు నదియె వారి చరిత్ర. వా రిర్వురు లోకమున ధర్మము నిలుపఁదలఁచి యనుభవించిన యనుభవముల నగపఱచునదియె రామాయణ గాథ. ప్రకృతి పురుషులగు సీతారాములు ధర్మ సంస్థాపనమునకయి యేరీతిఁ బ్రవర్తించిరో కనుగొని యనుసరించి తరించుట విధి యగాటను "తపసా లబ్ధ చక్షుషమ్" అను వాక్యముం బట్టి జ్ఞానదృష్టితోఁ బ్రవర్తించి తులసీ దాసాదులు భక్తిపుంభావగరిమతో జ్ఞాననిధి సేకరించి ధన్యులయిరి.

మూలప్రకృతి యగు సీతతోఁగూడి నిర్లిప్తుఁడు భగవంతుఁడు నగు శ్రీరాముఁడు ఏ కార్యమైనను జేయఁగలఁడని "శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం" అన్న శ్రీ శంకర భగవత్పూజ్యపాదుల వచనము తెలుపుచున్నది. సర్వ ధర్మములకు మనోదార్ఢ్యము

ముఖ్యముగదా! ఆ మనోదార్ఢ్యము యోగాభ్యాస కతంబున లభింపఁగలదు. యోగాభ్యాసఫలమే ధ్యానము. "నహి ధ్యానేన సదృశం పవిత్ర మిహా విద్యతే" అని యాత్రేయ స్మృతి. (౨వ అధ్యాయము) అతీతానాగత జ్ఞానము, పరుల హృత్పద్మముల నిక్షిప్తమైయున్న భావము,—ఇవి యోగము నభ్యసించినఁ గలుగునని —

"శబ్దార్థ ప్రత్యయానా మితరేతరాధ్యాసా త్సంకరస్త
త్ప్రవిభాగ సంయమా త్సర్వభూత బుత జ్ఞానమ్"— ॥
"సంస్కార సాక్షాత్కరణా త్పూర్వజాతి జ్ఞానమ్ ।
ప్రత్యయస్య పరచిత్త జ్ఞానమ్"— ॥

అను పాతంజల యోగశాస్త్ర మందలి వాక్యము లెఱుంగఁ జేయుచున్నవి. ఈ దృష్టి యోగాభ్యాసము లేకుండ లభింపఁజాలదు. కావుననే యీ పరమగోప్యము నవగాహ మొనర్చికొని మన శ్రీ కేశవతీర్థులు మట్టపల్లి శ్రీ నృసింహదేవు కుఱంగట ధ్యానయోగము నవలంబించి యతీతశక్తులఁ బడసి తులసీదాస విరచిత రామ చరిత మానసమును దెలుఁగున గేయరూపమున ననువదించి యుభయతారకు లయిరని తెలుపుటకు సంతోష మగుచున్నది.

ఈ యవకాశమును దెలుఁగువాండ్రు వినియోగించి
కొని తరింత్రుగావుత మని కోరు -

భగవద్భక్త పాదరేణువు

నాగేశ్వరపురము,
బాపట్ల.
6-1-'1957
[దుర్ముఖి పౌషమాసము -
శు ౫ లు ఆదివారము.]

కోన వేంకటరాయ శర్మ,
(ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రధాన కార్యదర్శి.)

# పండితాభిప్రాయములు :

## అవధానిశిరోమణి, విద్యావారిధి, మహామహోపాధ్యాయ

## మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

★

శ్రీ గోస్వామి తులసీదాస విరచిత రామాయణము హిందీ వాఙ్మయమణిమాలకు నాయకమణి యగుట భారతదేశ భాషా తత్త్వజ్ఞులకు సువిదితచరమె. ఔత్తరాహు లాబాలగోపాల మందలి యభంగాదులఁ గర్ణరసాయనముగ యథాశక్తి గానముసేయుచుఁ, దా మానందించుటెగాక విదేశీయశ్రోతలగూడ నానంద పఱచుచుందురు. కవితా చమత్కృతిగాని, భావగాంభీర్యాదులు గాని, కథావాక్యార్థ వివృతి గాని యంతగ బోధపడని స్త్రీ పురుషులకుఁగూడ వాల్మీకీయ శ్రీమద్రామాయణ మెట్లో యట్లు తులసీదాస రామాయణముగూడ శ్రోతల కాప్యాయన మొనఁగూర్చు ననునది స్వానుభవ వినిశ్చిత సిద్ధాంతమగుటఁ దద్రచనా వైశిష్ట్య మనన్యాదృశ మన్నునం దతిశయోక్తి, సుంతయు లేదు. హిందీ భాషాప్రవేశ మంతగ లేకపోవుటచే మూలగ్రంథ నైజరసాస్వాదము గావించుభాగ్యము నాకు లేకపోయెఁగదా యని విచారపడుచు, నే పుణ్యాత్ముఁడేని దాని నాంధ్రమున సరస పరివర్తనము గావించినఁ బఠించి యానందింతునుగదా యని తలపోయుచుందును. గద్యమయముగనో, పద్యమయముగనో యెవరో వ్రాసిన ట్లిటీవల వింటినేగాని దాని నిప్పటికిని గనకుంటిని.

కాని, యాంధ్రదేశమున నందును గుంటూరు మండలముననే పుట్టిపెరిగి బాల్యముననే లౌకిక విద్యనేగాక పారలౌకిక విద్యనుగూడఁ జక్కఁగ నభ్యసించి, వైరాగ్యభక్తి విజ్ఞానముల నలవఱచుకొనిన శ్రీ

శ్రీశైవతీర్థస్వామి కొలఁది దినములక్రిందఁ దా మాంధ్రమున ద్విపద చ్ఛందస్సున విరచించిన "శ్రీరామ చరితమానసము"న (తులసీదాస రామాయణమున) బాలకాండమును నా కందఁజేసి నా స్వప్నమును యథార్థపఱచి మహానందమును గూర్చిరి.

శ్రీ స్వామివారు తమ గ్రంథ పీఠిక యందలి ప్రథమసోపాన పూర్వభాగమున సముచితముగ 353 పద్యములలోఁ బ్రపంచించిన యనేకాంశములు తమ లోకానుభవ శాస్త్రానుభవములనేగాక తమ దేవగురు బ్రాహ్మణభక్తి ప్రపత్తి విశేషములనుగూడ నాదర్శీకరించు చున్నవి. ఇకఁ బ్రథమ సోపానా పరభాగమునఁ బరివర్తన మారంభించి తమ కవితాస్రవంతిని నిరాఘాటధారతోఁ బ్రవహింపజేసిరి. సరళాంధ్ర భాషలో వెలయించుటచే నిదిహృద్యమై బాలురకును బఠనక్షమమై యున్నది. ఇది పరివర్తన మయ్యును స్వతంత్రరచనను మించియుండుట వీరి సాహిత్యాతిశయమును దెలుపును. వీరిట్లె తక్కు కాండములనెల్లఁ ద్వరలో నాంధ్రీకరించి, శ్రీ తులసీదాస రామాయణమును సాంతముగ నాంధ్ర మహాజనుల కందించి, తదభినందన పాత్రమగునట్లు తదిష్ట దైవమగు శ్రీ మట్టపల్లి నరసింహస్వామినే నేనుగూడా బహుధా ప్రార్థించుచున్నాఁడ.

అగ్రహారము,
గుంటూరు.
24–2–'57.

విబుధ విధేయుఁడు,
కాశీ కృష్ణాచార్య.

దర్శనాచార్య, మహోపాధ్యాయ, సాహిత్యాచార్య,
శాస్త్రవిశారద, లాక్షణికశిరోమణి, విద్యా, భాషాప్రవీణ

## శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు,

ఆంధ్రవిశ్వవిద్యాలయము అకడమిక్ కౌన్సిలు సభ్యుడు.

శ్రీ గోస్వామి తులసీదాసు ఉత్తరప్రదేశమున విశిష్ట గోస్వామి. శ్రీ తులసీస్వామి పలుకు పలువురిలో పలుకుదనము సంపాదించినది. సంస్కృతము పట్టని హిందిముఖు లందరు మానసమున రామచరితమానసము పట్టిరి. సంస్కృతముఖు లయిన వారు కూడ మానసము విడిచి "మానసము" పట్టిరి. ఆబాల మాస్త్రైణ మా గోస్వామి తులసీ గోరసము స్వరసముగా నచట ప్రసరించినది. తెలుగు నాట "హింది"మాటలు వినబడక పూర్వము నుండియు "వ్రజ"రీతి కల యది భావవ్రజమున కందినది. గేయమధురమై తులసీమానసము ఆంధ్ర సహృదయ హృదయములం దాధ్యాత్మికముద్ర చూపినది. ఆంధ్రు లధ్యాత్మరామాయణ గవీ రస సరసులు. గేయకీర్తనధర్మమున అధ్యాత్మరామాయణ కీర్తన సాహితీ మధుర మధు రసధారల నందరి కంఠమున పోత పోసి, శ్రుతుల బట్టించి, మానసము పూరించి, హృదయసాగరము చేర్చినారు. పోతరాజులు త్యాగరాజులు రామ చరితము తమ చరితము కాగా లోకకంఠముతో పాఠ్యగేయమధుర ముగా గోక్షీరములు పోసినారు. ఆంధ్రహృదయ మట్లు అధ్యాత్మ సంభృతము. కాని సర్వముఖముగా నొకటి గేయము కాలేదు. కర్మ వశలోక మంతగా భక్తిపరవశము కాదు. అది నిమిత్తముగా ఆపద మాశిర మాంధ్రుల కొక్కటి లేదు. ఉత్తరప్రదేశుల కది యున్నది.

అది తులసీ శ్రీ గీతము. ఊగిన తల పట్టక తలగల వారి తలలూపి తులసి వాఙ్మయమానసతీర్థ మయినది. అతిమంజుల భాషానిబంధము తులసి.

శ్రీ కేశవతీర్థులు మానస తులసీ తీర్థమును గేయపార్య మధురముగా కవితాశంఖమున సమాకర్షించినారు. అసమస్తమంజుల మయిన తులసి మానసము కేశవతీర్థ తీర్థమున నవ్యస్తమధుర మయినది. ఇది యాంధ్రీరీతి ప్రాభవ పరిపాక శయ్యా పద్య. తులసీకవి తులసి నిత్యపారాయణ మొనర్తురు. ఈ తీర్థమానస తీర్థము నిత్య మవతరణము పొందవలెను. అప్పు డందరు "స్వాంతస్సుఖ"మున కని సంభావింప గలరు. ఉత్తరప్రదేశ సాహితీప్రియులు మానసము దర్శనీకరించి విశ్వ కోశముగా భావించిరి. దర్శనదర్శనులు శ్రీ కేశవతీర్థులు ఈ శ్రీ రామచరితమానస మాధారముగా నట్టి భావ సంభావన మునకై శ్రీ కారము చుట్టినారు. ఆత్మయాగములో జీవులు హవీ రూపులై శివేతరము క్షయింప జేసికొని స్వాత్మరససంవేదనము పొందుట కిది సమయము. ఇది సమయావతారము. అస్తు.

గుంటూరు,
31-1-'57.

జమ్ములమడక మాధవరామ శర్మ.

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు,

### శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము, తిరుపతి.

"..........తమ రచన శ్రద్ధావ్యుత్పత్తుల బలమును ప్రతి పంక్తియందును ప్రకటించుచున్నది. ధార స్వతంత్రమై గంభీరముగా సాగినది.........ఈ మహాగ్రంథమును తెలుగువారి కందించి తాము చేసిన లోక కల్యాణ కైంకర్యము గొప్పదనుటకు సంశయములేదు.

తిరుపతి,
10–1–'57.

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ.

---

## శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు,

### ఆల్ ఇండియా రేడియో, విజయవాడ.

"..........గంగవలె ప్రసన్నమైన స్వచ్ఛమైన శైలి. గ్రంథము చదువుటకు చేత బట్టినదిమొదలు మనస్సు కథా సుధా సాగరమున ఓలలాడు చున్నట్లు లుండును. మరి, అనువాద గుణమునకు ఒకటే ప్రమాణము—మూలమును అపేక్షింపకుండ అర్థము సుబోధమగుట. ఆ గుణవిశేషము మీ అనువాదములో నిండుకొని యున్నది. ఇట్టి మీ రచనకు ఒరుల యభిప్రాయములేల ?

విజయవాడ
8–1–'57.

—— పింగళి లక్ష్మీ కాంతం.

---

# శ్రీ మంచికంటి వేంకటేశ్వరరావుగారు.

**జాతీయ మహాకవి, సంతగుడిపాడు.**

శ్రీ కేశవ తీర్థాహ్వయ !
మీ కవితం గన్న 'తులసి' మీకై ఆంధ్ర
శ్రీ కాంతి వృద్ధిజేయుట
కై కూర్మి జనించెనని మదాత్మదలంతున్ ౧

లలిత మృదుమధుర సత్పద
ములు సముచిత నవ్య భావములును మనోజ్ఞం
బులునగు శయ్యారీతులు
కలిగియు మీ రచన నెగడుగద యతివర్యా ! ౨

క్రొత్తకథఁ గ్రొత్తభావాలు గూర్చి కావ్య
మల్లుటే కష్టమైయుండు నంతకన్న
నితర భాషానువాద మెంతేనికష్ట
మైననేమి—కృతార్థుండ వైతి వనఘ ! 3

ద్విపదకావ్య ప్రపంచాన స్థిరయశస్సు
నందుకొనె రంగనాథ రామాయణంబు
దాని తరువాత పేర్కొనం దగిన కావ్య
మాంధ్రలోన మీ గ్రంథమే యగును స్వామి ! ౪

శ్రీరామతీర్థ శిష్యుడ
వై, రాముని భక్త వరుడవై, యతిమణివై
శ్రీ రామాయణ రచనా
వారిధి దరియించి కీర్తిబడసితి వార్యా ! ౫

శ్రీ మట్టపల్లి నృసింహమంత్రోపాస
నా బలోన్నతి ననంతముగ బొంది
ఆంధ్రాంగిలేయ భాషాబ్ధులఁ గావించి
కమనీయ సుగుణరత్నముల నంది
ఐహిక భోగంబులన్నిటి ద్యజియించి
అతి పవిత్రంపు సంన్యాస మొంది
అల రామతీర్థ సేవాశ్రమంబును పిడ్గు
రాలలో స్థాపించి ప్రతిభగాంచి
రామదర్శనమను పత్రికాముఖమున
భక్తివైరాగ్య విజ్ఞాన భావములను
బాగ వెదజల్లి మరియు సంపాదకుడవు
అనఘ ! కేశవతీర్థ ! జోహారు లివిగో ! ౬

ఇట్లు విధేయుడు,
మంచికంటి వేంకటేశ్వరరావు.
3–12–'57.

ఓం

# పరిచయ వాక్యములు

పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ నిర్వికల్పానందస్వామివారు,
అధ్యక్షులు : శ్రీరామకృష్ణ మఠము — రాజమండ్రి.

వాల్మీకి కలము పట్టిననాటినుండి తులసీదాసు "రామచరిత్ర మానసము" వ్రాయువరకు శ్రీరామగుణ వర్ణనము దేశభాషలలోనే జరుగుచుండెను. దేశభాషలలో పండితులు అర్థమును వివరించుచు, జన సామాన్యమునకు బోధపరచుచుండిరి. "ఈ ద్రావిడ ప్రాణాయామ" మేల?—ఎవరికివారే సూటిగ ఆ శ్రీరామచరిత్రమును చదువుకొని ఆనందింపరాదా? అను ఊహ తులసీదాసుకు తట్టెను. తట్టుటేమి, కార్య రూపముదాల్చుటేమి, అపరవాల్మీకియని ప్రశంసల నందుకొనుటేమి— వెనువెంటనే జరిగెను. శ్రీరామకృప. నాటినుండి నేటివరకు హిందీభాష యును, తదనుబంధ భాషలును వాడుకలోనున్న ప్రాంతమంతయు కోట్లకొలదిగ తులసీరామాయణ ప్రతులతో నిండిపోయినది. ఆ దేశ ప్రజలలో ముఖ్యముగ సాయంవేళల తులసీరామాయణ శ్రవణ పఠన ముల నొనర్పని వ్యక్తులరుదనియే చెప్పనగును. ఒకరు పఠించుచుండ పదుగురుప్రోగై వినుచుందురు. అట్లు జరుగుటకు వీలులేని ప్రాంతమున నున్న సాధారణ వ్యక్తులుగూడ, తులసిచెట్టుకు తీర్థముపోసి, శ్రావ్య స్వరముననో, లేక అశ్రావ్య స్వరముననో రామాయణ గానమొనర్చి, మరియొకపని చూచుకొందురు.

ఎవరు ఈ తులసీదాసు ? అక్బరుచక్రవర్తికి సమకాలికుడగు ఒక వ్యక్తి. తాక్త్రీయపురుషార్థసేవలో భార్యయగు మమతా దేవిమీద మమత్వము తప్ప, మరియొక మమతలేని కాముకుడు. అతని లౌల్యమును దూషించి వైరాగ్యభావమును కలుగజేసిన ప్రథమగురువు ఈ మమతా దేవియే. మహాత్ములు తాత్కాలికముగ అసత్పథ ప్రవృత్తులైనను, ఒకింత ప్రరోచనయున్నయెడల, దివ్యదీప్తుల ప్రజ్వరిల్లుదురు.

తులసీదాసుని రామభక్తి ఒకఎత్తు, అతని గురుభక్తి ఒకఎత్తు. ఆచార్యభక్తి లేనివానికి దైవభక్తి అబ్బదని నిరూపించెడి జీవితము.

మమతాదేవిని త్యజించినపిదప తాను గురుకరణ మొనర్చుకొనిన శ్రీ మదాంజనేయులప్రతి అతడు చూపిన దాసభావము విస్మయావహము. భక్తసులభుడగు శ్రీరాముడుకూడ ఎన్నియో పర్యాయములు తులసీదాసుని వంచించి, తద్ద్వారా దర్శనాకాంక్షను ప్రగాఢమొనర్చి తుదకు సాక్షాద్దర్శన మొసంగెను.

ఆ యీ కథ లన్నియును నేటికిని లోకుల నోళ్లలో నలుగుచునే యున్నవి. వీటిలోని ఒక వృత్తాంతము :

రామదర్శన మెట్లు లభించునని ఊదరగొట్టగా, గురువు చిత్రకూట పర్వతమున లభింపగలదు, అటకు బొమ్మని తులసీదాసునకు ఆజ్ఞయొసగెను. అట్లేయని తులసీదాసు ఆ ప్రాంతమునకు బోయి తపమాచరించుచుండెను. ఒకరోజున మధ్యరాత్రి మేల్కొనిచూడగా, సమీపారణ్య పర్వతములు వెలుగుతోడను జనుల కోలాహలముతోడను నిండియున్నట్లు తోచెను. అదేమో చూతమని ఏగగా : అక్కడ రామ లీలాభినయము — నాటకము — జరుగుచుండెను. తనివార దానినిచూచి తెల్లవారుజామున మరలవచ్చి శయనించెను. ఒకింత వేళయగుసరికి లేచి, తనుచూచివచ్చిన వృత్తాంతమును ఊరివారికి చెప్పగా : కీకారణ్యమున

నాధి నాటకమేమి ? మీరు చూచుటయేమి ? తమకు ఒకింత భ్రాంతి కలిగి యుండవచ్చును — అని వారనిరి. దానితో తులసీదాసునకు సర్వము విదితమయ్యెను. అయ్యో ! సాక్షాత్తు భగవద్దర్శనము లభించినను, నాటకమను భ్రాంతికిలోనై, భగవత్సేవా సపర్యాదుల నొనర్పనైతినే యని వాపోవ నొడంగెను.

*                    *                    *

నాకు తెలిసినంతవరకు నేటికి తులసీదాస రామాయణమునకు నాల్గు అనువాదములు తెలుగున వెలసినవి. మూడు పద్యానువాదములు, ఒక వచనానువాదము. లోగడ వేగుజుక్క గ్రంథ మాలాధారమున భాగవతుల లక్ష్మీనృసింహ శర్మగారును (ఇరంపురం), ఇటీవల మైలవరపు సూర్యనారాయణమూర్తి (కృష్ణపాలెం, ఎర్నగూడెం. పో. పశ్చిమగోదావరి) గారును, పద్యానువాదములను, వావిళ్లవారు వచనానువాదమును వెలువరించియుండిరి. పైన చెప్పిన పద్యానువాదములు బాలకాండతోనే నిలచిపోయినవో లేక, సంపూర్ణముగ ముద్రింపబడినవో తెలియుటలేదు.

శ్రీ నోముల అప్పారావుగారును వారి శిష్యగణమును ఇటీవల ఈ తులసీదాస రామాయణమును ఆంధ్రదేశమునందలి వివిధ పట్టణములలో గాన వ్యాఖ్యానముల సల్పుచు, ప్రసిద్ధిని తెచ్చిపెట్టుచున్నారు. ఈ ఉద్యమము అట్లే నడుచుచుండును గాక !

ఇది అట్లుండ : శ్రీ కేశవతీర్థస్వామివారు ప్రస్తుతము మూడవ పద్యానువాదమును ఆంధ్రావళికి అర్పించుచున్నారు.

ఇందులోని విశేషమేమన, గ్రంథమంతయును మంజరీద్విపదలో [illegible] రచింపబడినది. వృత్తకావ్యములకు వచ్చినంత

ప్రసిద్ధి, తెలుగున ద్విపద కావ్యములకు రాలేదు. కనుక, ఎంతమటుకు జనరంజకమగునో కాలమే తెల్పవలసియున్నది.

అయినను: భక్తులకు నిత్యపారాయణా యోగ్యమగుచు "కొంగునగట్టిన బంగారు మూటవలె" వారికి ఆనందకరమగుచు, విలసిల్లగలదు.

పరాభక్తిని, అద్వైతజ్ఞానమును ఒకేపుడిసిటపట్టిన మహానీయుడు తులసీదాసు గోస్వామి. ఆవేశపూరితమైన భక్తి తాత్కాలికోద్రేకానందములను కలుగజేసినను, వెనువెంటనే మనస్సును శూన్యమొనర్చి, శుష్కమొనర్చును. అట్లే అద్వైతజ్ఞాన మనబడు దానినొంటిగ అభ్యసింపబూనిన, మనస్సును శుష్కతమ మొనర్చును.

కనుక ఈరెంటిని ఒకేవ్యక్తి ఏకకాలమున సాధనగ అవలంబించి, ఒకదానిలోటును మరొకదాని శక్తితో పూరింపవలసియున్నది.

ఈభావన కనుకూలముగనే ఆమూలచూడముగ తులసీదాసు జ్ఞానభక్తి రసభావ పర్యాయముగ తన రామాయణమును నడిపించినాడు. భక్తులకు దశరథరాజకుమారుడుగ తోచు పుంసాంమోహనుడే, మరల అపారగంభీర పరబ్రహ్మము.

ఉద్రేక పూరితమగు భజనలతో ఆంధ్రదేశ వాతావరణము నిండిపోవుచున్నది. వీనిని కొంచెము అదుపులో పెట్టవలసిన అగత్యము కలదు. ఈ ఆశయమును ఈ నవానుకృతి సాధించినచో, నాకంటె సంతోషించువారు మరియొక రుండరు.

అనువాదకులగు శ్రీ కేశవతీర్థులుకూడ జ్ఞాన - భక్తి తీర్థులగుట వలన, ఈ అనువాదము సుందరతరమైనదని వేరుగ చెప్పనక్కరలేదు.

సర్వులు — సర్వులనుటకు జంకు కలుగుచున్నది — ఈ పీయూష మును కాంక్షించెడి అధికారికపుణ్యపురుషులు గళగ్రాహిగ దీనిని గ్రోలి తృప్తినందెదరు గాక!

రాజమండ్రి,
10—1—'57.

ఇట్లు,
స్వామి నిర్వికల్పానంద.

---

## శ్రీ శ్రీ దాసశేషస్వామివారు,

సంపాదకులు: "శ్రీ భక్తి సంజీవని"
దాసకుటీ, అంగలకుదురు.

"..........పరమ పవిత్రమగు రామకథ. అందును శ్రీ రామానుగ్రహమున వ్రాయఁబడినది. వ్రాసిన వారా పరమ యోగి వర్యులు. 'రాఘవేశ్వరు చారిత్రము నెవ్వ రేవిధమునన్ వర్ణించినం గాలదే' యను పూర్వకవి సూక్తి ననుసంధించి 'రామ చరితమానసము' నెల్లవా రాదరమునఁబఠించి కృతార్థు లయ్యెదరు.

అంగలకుదురు,
18—1—1957.

దా స శే షుఁ డు.

# ఉన్న మాట

పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ

## రామకృష్ణానందస్వామి వారు, "గీతావాణి"

సంపాదకులు : శ్రీ భూమానందాశ్రమం – గండిక్షేత్రం.

మర్యాదా పురుషోత్తముడు శ్రీరాముడని, లీలా పురుషోత్తముడు శ్రీకృష్ణుడని, ప్రాజ్ఞపురుషుల నిరూఢవాణి. ఈ పేర్లకు సరిసాటిగా పలుకుబడి సంపాదించిన పేర్లు మరి ప్రపంచంలో లేవు. ఇవి మర్త్య మానవుల పేర్లు కావు. అచ్యుత పరమాత్ముని దివ్యనామాలు.

ఒకేమాట ఒకేబాణం ఒకేభార్య ఒకేసంతానం – ఇది శ్రీరాముని జీవితంలోని ఉజ్జ్వలఆదర్శం. "ద్విశ్శరం నాభిసంధత్తే – రామోద్విర్నాభిభాషతే" – అంటూ వాల్మీకి కోకిల రామగుణ మధుర గానం చేసింది. ఒకజన్మలో తృప్తిలేక మరీ తానే తులసీదాసై వాల్మీకి మహర్షి శ్రీరామ కథాగానం చేశాడని విజ్ఞజనోక్తి. ఒక తులసీదాసేమిటి – రామకథాగానం చేసిన చేస్తున్న చేయబోయే మహాకవులందరు వాల్మీక్యంశ సంభూతులేనని నా అవధారణ.

రామాయణాలు శతకోటి అంటారు. శతకోటి కావచ్చు – అనంతకోటి కావచ్చు. ఎందరెన్నివిధాల రచించినా వచించినా అది యెప్పటికప్పుడు సరిక్రొత్తది. రామాయణం నిత్య జీవితగ్రంథం; నిత్య నూతనగ్రంథం. స్వతంత్ర భారతదేశానికి భారత రామాయణాలు రాష్ట్రీయ గ్రంథాలు; జాతీయ గ్రంథాలు. మహాభారతము మేఘ గంభీరమని అనిపించుకొంటే శ్రీ మద్రామాయణము వీణా మధురమని పేరుకువచ్చింది. అందులోను – పోతనభాగవతం వ్యాసభాగవతాన్ని

మరిపించినట్లు, తులసీ రామాయణం వాల్మీకి రామాయణాన్ని మించి పోయింది. ఉత్తర హిందూస్తానంలో తులసీ రామాయణానికి వున్న ప్రశస్తి వాల్మీకి రామాయణానికి లేదు.

భక్త విజయంలో శ్రీ తులసీదాసుకొక ఉన్నతస్థానం వుంది. ఆ భక్తమహాకవి వ్రాసిన రామాయణం పేరు శ్రీరామచరిత మానసం. అది తనభక్తిలో తాను విశిష్టమైన గ్రంథం. ఇది ఎవరి మెప్పుకొరకో వ్రాసిన రచనకాదు. "స్వాంతస్సుఖాయ" ఆత్మ సంతృప్తికొరకు ఆత్మానందంకొరకు వ్రాయబడింది. ఇది భక్తిరసానికి తఱుగనిపూట. దట్టదరిద్రుడు మొదలు ఆగర్భ శ్రీమంతునివరకు, నిరక్షర కుక్షి మొదలుకొని ప్రకాండ విద్వాంసునివరకు శ్రీమానసరామాయణం యొక్క కీర్తి రాజ్యం వ్యాపించింది. అది లోకుల నాలుకనే ఆకులుగా వ్రాయబడిన వరకవిత్వం. కొద్ది మాటలలో గొప్పభావాలను స్ఫురింప జేసే నేర్పు, ఉపమారూపకాలంకారాలపై ఆయనకుండే అధికారం అపారం. నేడు భారతావనికి హిందీ రాష్ట్రభాష. ఉత్తమ సాహిత్యమైన ఆ హిందీ గ్రంథాన్ని తెలుగులో ఆవిష్కరించి పూజ్యపాద శ్రీ కేశవతీర్థస్వామివారు అద్భుతమైన కృషిచేశారు. సంస్కృత భాగవతచ్ఛాయలు తులసీ రామాయణంపై పడినవని విబుధులకు తెలుసు. ఆ మర్యాద ననుసరించి శ్రీ స్వామివారు పోతనామాత్యుని జాడలలో తన కమ్మని కవిత్వం నడిపారు. మచ్చుకు, ఆంధ్ర భాగవతాదిలో శ్రీ పోతన్న 'శ్రీ కైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్' అని ప్రారంభిస్తే, అక్షరశః అట్లే శ్రీ స్వామివారు 'శ్రీ కైవల్యపదంబు జేరుటకునై సేవించెదన్' అని ప్రారంభించారు. "దీనిం దెనింగించి నాజననంబున్ సఫలంబుజేసెద పునర్జన్మంబు లేకుండగన్" — అని కృష్ణకథను వర్ణించి పోతనకవి జన్మరాహిత్య పదవిని సంపాదిస్తే, మన స్వామివారు "రామస్వామిం కథన్ వచింతును పునర్జన్మంబు లేకుండగన్" — అని రఘురామ చరితమును వచించి పునర్జన్మభీతి నెడబాసి

సారు. శ్రీ స్వామివారు యిష్టదైవాన్ని స్మరిస్తూ వ్రాసిన పద్యాలు పోతనగారిని తలపించి మరిపిస్తున్నవి.

శా॥ శ్రీకైవల్యపదంబు జేరుటకునై సేవించెదన్ భక్తహృ
చ్ఛోకధ్వాంత విభంగమంగళమహాశుంభన్నఖద్యోతులన్ ।
శ్రీకాంతామర మానిచిత్తనళినీ శృంగారభృంగంబులన్
శ్రీకృష్ణాతట మట్టపల్లి వనలక్ష్మీ నారసింహాంఘ్రులన్ ॥

మ॥ తతగర్వాంధనిశాచరాధిపసభాస్తంభాంతరాళోద్భవున్
ధృతినిర్భిన్నసురారిగర్భ రుధిరోద్దీప్తాంత్రమాలాగళున్ ।
నతవాణీశ్వరదేవతానికరనానాస్తోత్రకోలాహలున్
శ్రితరక్షాచణు మట్టపల్లి నృహరిన్ సేవింతు నశ్రాంతమున్ ॥

ఉ॥ శాంతము దివ్యసుందరము శంఖసుదర్శన పద్మ సద్గదా
క్రాంత పరాక్రమక్రమవిరాజితరమ్యచతుర్భుజంబు శ్రీ ।
మంతము శేషభోగఫణిమండితమా నరసింహరూపమున్
స్వాంతములో భజించెదను శాశ్వతనిర్మలభక్తిసిద్ధికై ॥

ఉ॥ ఆ కవితాగసాలశిఖరాసనమందున రామరామవాక్
శ్రీ కమనీయమాధురులు చిందగ 'గుహూకుహూ' యంచుబాడి తృ ।
ష్ణాకుల జీవకోటికి మహామృతదానము చేసినట్టి వా
ల్మీకి పికంబు నెంచెద సమృద్ధకవిత్వపటుత్వసిద్ధికై ॥

మధురమైన శైలితో — మనోజ్ఞమైన శయ్యతో అనువాదము పోతనధోరవలె విపులీకృతమై నడిచింది. మచ్చుకు —

మూలం — నీలసరోరుహశ్యామ — తరుణఅరుణ వారిజనయన ।
కరధృతసోమమ ఉరధామ — సదాక్షీర సాగరశయన ॥

అనువాదం —

ఉ॥ నీలసరోరుహోపమవినీలతనుండు నవారుణాబ్జ శో
భాలయసత్కృపారసనుగామల లోచుల సుందరాస్య డా।
పాలసముద్రమందు మణిభాసితపన్నగతల్పశాయియై
క్రాలు రమాధినాథుడు స్థిరంబుగ నాహృదిలోన నిల్చుతన్ ॥

మూలం — బందఉ సంతసమానచిత — హిత అనహిత నహి కోఇ।
అంజలిగత సుభసుమన — జిమి సమసుగంధ కరదోఇ॥

అనువాదం —

ఉ॥ కోసినచేతికిన్ దనను గోయని చేతికి నొక్కరీతిగా
దోసిలిలోని పుష్ప మతితుష్టి వెలుంగ సుగంధమీయదే,
ఆసరణిన్ హితాహితుల నందఱ నొక్కటిగాగ జూచుచున్
భాసిలు సజ్జనావళికి భక్తిని వందన మాచరించెదన్ ॥

తెనిగింపు మూలానుసారిగాను "నామూలం లిఖ్యతే" అనిన మల్లినాథీ ప్రతిజ్ఞకు అనుకూలంగా వుంది.

మూలం — ఆకరచారి లాఖచౌరాసీ — జాతిజీవ జలథల నభవాసీ,
సీయరామమయ సబజగజానీ — కరఉ ప్రనాము జోరి జుగపానీ ॥

అనువాదం :—

కం॥ జలమున స్థలమున నభమున
జెలగు జతుర్విధములైన జీవంబులకున్
సలిపెద జోహారులు నే
నల సీతారామరూపు లను భావమునన్ ॥

శ్రీ కేశవతీర్థ స్వాములవారు యిదివరకొక రామకథను వ్రాసి తృప్తిలేక మరో రామకథను వ్రాస్తూన్నారు. వారి యిష్టదైవమగు శ్రీ శ్రీ మట్టపల్లి నృసింహస్వామివారు వారిచే మరెన్ని రామకథలను వ్రాయింపగల్గుదురో యెవరి కెఱుక ?

వచనరచనల నొకసారి చదివితే మరీ మరీ చదవాలనే యిష్టం పొడమదు. పద్యరచనలలా కాదు. పదేపదేచదివినా రసం ఉప్పతిల్లు తూనే వుంటుంది. ఆ దృష్టితో పద్యరచనలకు ప్రతిష్ఠ యెక్కువ. వాటికి సార్వకాలీన గౌరవం వుంటుంది. పద్యాలు కొరకరాని కొయ్యలైవుంటే నేటి సమయానికి పనికిరావు. ఈనాటి మానవుడు ఆయాస రహితమైన ఆనందాన్ని కోర్తూన్నాడు. ఆ దృష్ట్యా ఆబాల గోపాలం సులువుగా చదివి ఆనందించే తీరున మీదటి గ్రంథమంతా మంజరీ ద్విపదలో వ్రాశారు. ద్విపదను హాయిగా చదువుకోవచ్చు; ఉల్లాసంగా పాడుకోవచ్చుకూడ. క్లిష్టంగాక మరీ పేలవమూ గాక వ్యర్థపూరణల పొంతపోక మూలానుసారిదై అనువాదం సాగింది. కవి ధన్యుడు; ప్రకాశకులు ధన్యులు; పాఠకులు ధన్యులు. అచిర కాలంలో గ్రంథం ఆ సాంతం ముగిసి ఆంధ్ర భక్తలోక సమాదరణ పాత్రం కాగలదని ఆశిస్తూన్నాను.

గండిక్షేత్రం,
1-2-1957.

శ్రీ రామ కృష్ణానంద.

ఓమ్

శ్రీరామ శ్శరణం మమ.

శబ్దార్థకల్పతర్వాది గ్రంథపరిష్కర్తలు, బహుగ్రంథరచయితలు
పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ

# శుద్ధ చైతన్యస్వాములవారు

సుహృద్వర్యుడు శ్రీ కేశవతీర్థస్వామి స (సు) హృదయుడు, తపస్వి, నృసింహబ్రహ్మోపాసకుడు, అతివర్ణాశ్రమి; ఏకాకిగా నుండియు పెక్కు మహాకార్యముల సాధించిన సాధించుచున్న సాధింపనున్న దిట్ట; ఆదర్శపరివ్రాట్టు.

తులసీదాసు ధర్మక్షేత్రములైన అయోధ్యయందు సరయూ తీరమునను, కాశియందు గంగాతీరమునను శ్రీరామచరితమానస-రచన గావించెను. వీరును శ్రీ రామతీర్థ సేవాశ్రమమునను, శ్రీ మట్టపల్లి-నృసింహక్షేత్రమున కృష్ణానదీతీరమునను ఈ శ్రీమదాంధ్ర తులసీరామాయణ (బాలకాండ) రచన గావించినారు. (శేషించినది రచించుచున్నారు.) గ్రంథము - చాలభాగము పఠించుట తటస్థించినది. సహజపాండిత్యాని పోతనామాత్యుని కవితవలె ఏతత్కవితయు స్వాభావికి, రసమయి.

స్వయము రామాయణము - ఏకైకమక్షరము మహాపాతకనాశనము; అదియుగాక దివ్యక్షేత్రములలో తపోజీవితము గడపుచు వ్రాయబడినందున ఈ రామాయణము - ప్రత్యక్షరము తపోనిక్షిప్తమై అతిశయపావనముగా ఉన్నది. అచ్చు-అక్షరములు ముత్తెములు గూర్చినట్లు రామణీయకముతో గనవచ్చుచున్నవి. అన్నివిధముల గ్రంథము చదువ నుత్సుకతను గలిగించుచున్నది.

పెద్దల రూపమున పిన్నలుందురు. పిన్నల రూపమున పెద్ద లుందురు. పెద్దతనము (గొప్ప) బుద్ధికి సంబంధించినదే కాని వయస్సునకు సంబంధించినది గాదు. వజ్రమణి చిన్నదైనను మహార్ఘము గదా! శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారు పిన్నలలో పెద్ద. "శ్రద్ధా-భక్తి-ధ్యానయోగాదవేహి" "త్యాగేనైకే అమృతత్వ మానశుః" అను శ్రుత్యుక్తలక్షణములు వీరియందు సువ్యక్తము లగుచున్నవి. వీరి (గుంటూరున గల కర్పూరపువారి) జీవితము ఎంత మంచిది! సుజనులారా! వీరి జీవితము నాదర్శప్రాయముగా దీసికొని ధన్యజీవనుల రగుడు. వీ రీ గ్రంథమును పరమౌదార్యముతో ఇటుల ప్రకాశింపజేసి మహాసుకృతము నార్జించినారు.

తులసీదాసు-జన్మ (జీవితము) రామనామోచ్చారణతో ఉపక్రమింపబడి రామనామోచ్చారణతోనే ఉపసంహారము గావింపబడినది. మధ్యజీవితమునైతము, రామబ్రహ్మధ్యానముతో — రామభక్తితో — తపస్సుతో — రామాయణరచనతో — విరాజిల్లినది. తులసీదాసు తన రామాయణమున ముముక్షురహస్యముల నన్నింటిని బోధించెను. వీరు మనకు ముఖ్యముగా నేర్పినది పర - "నామప్రేమ — రామప్రేమ" రామనామము ఎంత పావనము! రామతత్త్వము ఎంత గంభీరము!

శ్రీరామ జయరామ జయజయ రామ

మకాము శ్రీ ఉప్పుటూరి
వెంకట పున్నారావు గారి
తోట, గుంటూరు — 2.

శుద్ధ చైతన్యస్వామి.
దుర్ముఖ సం॥ మహాశివరాత్రి.

# పరమోత్తమ భక్తిశాస్త్రము

తులసీదాస్ అద్భుత విశ్వాసవంతుడు. ఆయన విశ్వాసం హిందువులకు రామాయణము వంటి అమూల్య గ్రంథమును శాశ్వతముగ ప్రసాదించింది. ఈ రామాయణం సాహిత్య శిరోమణి; కాని దీని సాహిత్య ప్రతిభ దీని భక్తితేజముయొక్క సౌందర్యం ముందు వెలవెల పోతుంది. విశ్వాసబుద్ధిరంగములు వేరైనవి. విశ్వాసము(భక్తి) ఆత్మికమైన అంతర్దృష్టికి దారితీస్తుంది. అందుచేత అది ఆత్మ పావిత్ర్యానికి సైజంగా కారణమై యున్నది. బుద్ధి ప్రపంచజ్ఞాన వికాసానికి సహాయపడుతుంది. కాని ఈ ప్రపంచజ్ఞానమునకు, ఆత్మ పావిత్ర్యానికి కార్యకారణసంబంధం లేదు. మహామేధాశాలురు నైతిక హీనులుగా ఉండుట కూడా మనం చూడగలం. కాని విశ్వాసము (భక్తి) అవినీతి రెండూ ఒకేచోట ఉండలేవు. పై విషయాలను బట్టి ఒక శిశువు మహోన్నత విశ్వాసమును అభివృద్ధిపరచుకోగలిగినా, బుద్ధి బలంలో అల్పుడుగా నుండవచ్చునని పాఠకుడు గ్రహించగలడు. ఈ దైవవిశ్వాసాన్ని మానవుడు ఎట్లు పొందగలడు? దీనికి సమాధానం గీతలో, 'రామచరితమానసం' లో కనబడుతుంది...... నేను తులసీదాసు - రామాయణమును భక్తిసిద్ధాంతమునందు అత్యుత్తమ గ్రంథంగా యెంచుతున్నాను.

— M. K. గాంధీ.

# శాశ్వతానంద శాంతి మూలము

గోస్వామితులసీదాసకృతమైన మానసరామాయణము ప్రపంచ సాహిత్యమునందు ఆ జాతిగ్రంథములలో అద్వితీయమైనది. అది బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రులనే చతుర్వర్ణములకు, బ్రహ్మచర్య-గృహస్థ-వానప్రస్థ - సంన్యాసములనే నాలుగాశ్రమాలకు చెందినవారందరికి శ్రుతి - స్మృతి - ప్రబోధసారములు తెలిపే శాస్త్రము. ప్రయాగలో పావనమైన త్రివేణి వలె అందు జ్ఞాన భక్తి వైరాగ్య సమన్వయ వాహిని నిరంతరం ప్రవహిస్తుంటుంది. అది అగణిత మానవకోట్ల జీవితముయొక్క ఇహాపర పరమార్థ సర్వస్వమైయున్నది. కోటానుకోట్ల భక్తులు జ్ఞాన భక్తి వైరాగ్యామృతమును దాని నుండి హృదయతృప్తిగా పానముచేశారు. ఈ సృష్టియొక్క అంత్యము వరకు ఇంకా కోటానుకోట్లమంది ఈ గ్రంథము నుండి అధ్యాయానందశాంతులను పొందుచుండగలరు.

ప్రపంచం ఈ అసమాన గ్రంథ ప్రతిభలను ఇంకా పూర్ణముగా గ్రహించి యుండలేదు. అయితే నా అభిప్రాయం ఏమిటనగా భవిష్యత్కాలంలో ఈ గ్రంథముయొక్క ఘనత అధికాధికంగా గ్రాహ్యమైనకొద్దీ దీని అనువాదాలు ప్రపంచముయొక్క అనేక భాషల్లో అవతరించగలవు. ఈ కృతి సర్వమానవజాతికి శాశ్వతానందశాంతిమూలమైయున్నది. గోస్వామితులసీదాసుల మానస - రామాయణమునుగానీ, వినయ - పత్రికనుగానీ పఠించేవారైనా, వినేవారైనా ధన్యులు. ఈ గ్రంథమును చౌకైన, అందమైన విధానంలో ప్రచురించి నిరుపేదకు కూడా అందుబాట్లోకి తెచ్చి ప్రజలకు అమూల్యమైన సేవచేసేవారు ఇంకాధన్యులు. చౌకైన, మిక్కిలి అందముగా ముద్రింపబడిన మానస

రామాయణ ప్రచురణలు బహుజనులకు అందవలెనని, దాని పవిత్ర బోధలచేత అసంఖ్యాకజనులు ఉపకృతిని పొందవలెనని నా ప్రార్థన. రామాయణ ప్రవచనములు కొన్ని పట్టణాలలో, గ్రామాలలో ఇప్ప టికీ జరుగుతున్నవి. అట్టి ప్రవచనములు లేనిచోట వానిని తప్పక ఏర్పాటుచేయాలె. దానిపావన ప్రబోధములు రోజురోజుకూ అధికాధి కంగా వ్యాప్తంచెయ్యాలె.

— మదనమోహనమాలవ్య.



# సమస్త తాత్త్విక గ్రంథముల సారము

రామచరిత మానసమును రచించి తులసీదాసు ప్రపంచమునకు పరమోన్నతమైన సేవచేశాడు. సంస్కృతంలో రచింపబడిన శాస్త్ర ములు, తాత్త్విక గ్రంథములు జనసామాన్యమునకు తెరువరాని పేటిక లైనవి. కారణం, ఎక్కువమందికి ఆ భాషాపరిచయం లేకపోవడమే. వానిని పఠించే అవకాశం కొలదిమంది పండితులకు మాత్రమే ఉండేది. ప్రజలు అక్కడక్కడ పురాణగోష్ఠులలో వానిని వినేవారు. అలాంటి వినికిడి విజ్ఞానమే సామాన్యజనతకు లభిస్తుండేది. ఇట్టి అవసర సమ యంలో తులసీదాస్ ఆగమించి సమస్త ఆధ్యాత్మిక వైదాంతిక వాఙ్మయమును తరచి దివ్యనవనీతమును హిందీ భాషలో ప్రజలముం దుంచాడు. మానసరచన ఉదయించిన నాటినుండి ఎంతమంది అసం ఖ్యాకులైన స్త్రీ పురుషాదులు దానినుండి ఆధ్యాత్మిక ప్రయోజనమును పొందినారో, ఇంకనూ పొందుతున్నారో నిర్వచింపలేము. అందుచేత

గడచిన మూడు శతాబ్దములనుంచి ఉత్తరభారత ప్రజలకు సమస్త శాస్త్ర తాత్త్విక గ్రంథముల అవసరమును ఈ మానస గ్రంథమే తీర్చింది అనడంలో అతిశయోక్తి లేదు. ఉత్తర భారతంలో రామాయణ పారాయణం అలవాటు. ఉదయం నిత్యకాల కృత్యములు తీర్చిన తరువాత, రాత్రివేళ ప్రజలు ఒంటిగాగాని, సామూహికంగా గాని దానిని పఠిస్తారు. వందలాది వేలాది గ్రామీణులు నిరక్షరాస్యులైకూడా సామూహికంగా, వినడంచేత, ఉచ్చరించడంచేత రామాయణ గీతాలు అనేకం కంఠపాఠంగా నేర్చుకున్నారు. వాండ్లు ఆయా సమయాలలో వానిని పురశ్చరణం చేస్తుంటారు. తులసీదాసు వాక్యాలలో భక్తుని వాక్యాలకు మాత్రం ఉండే ఒక విలక్షణ మాధుర్యం ఉన్నది. ఈ నాటికీ ప్రేమభక్తి గౌరవాలతో ఈ రామాయణం పఠింపబడుటకు కారణమిదే. ఇందుచేతనే అసంఖ్యాకులైన స్త్రీ పురుషాదులు సంసారసాగరతరణంలో ఈ కృతినుండి సహాయాన్ని పొందుతూ ఉండడం. కేవలభక్తి రసోద్వేగ హృదయంతో తులసీదాసు మానసం రచించాడు. ఈ కృతిలోని ఈగుణంచేతనే దానిలోని పదములు అలాంటి అద్వితీయశక్తిని కలిగిఉన్నవి. భక్తులు కానివారికి కూడా ఈగ్రంథం ప్రపంచములోని ఉత్తమతమ మహాకావ్యములతో సరితూగగలిగిన కవితాసౌందర్యము, మాధుర్యము గంభీర మనఃప్రకృతులసమ్మేళనము, మహోన్నత కళాకౌశలము, కలిగినదై కనబడుతుంది. కవితా సౌందర్యమును మాత్రమే ఆనందించేవారు దానిని పఠించి ఆనందించగలరు. ఈ మహాకృతిని కేవల కావ్యదృష్టితో పఠించేవారు సైతము కాలగమనంలో కొంతవరకైనా భక్తిభావంలో మునుగకుండా ఉండలేరనికూడా నేను విశ్వసిస్తాను. అలాంటప్పుడు భక్తిభావంతో గౌరవంతో దానిని గురించి పఠించేవారి సంగతి వేరే చెప్పనవసరం లేదు. ఒక ఇంగ్లీషు రచయిత (ఎడిసన్) ఒక వ్యాసంలో, తాత్త్విక గ్రంథాలయాలనుండి పరమోత్తమ తాత్త్విక సత్యాలను ఏరికూర్చి సర్వజనులకు వీథులలో వెదజల్లివేయుట తన ఆశయమని ప్రక

టించాడు. అతని వ్యాసాలద్వారా ఈ ఆకాంక్ష ఫలించిందో లేదో తెలియదు. కానీ, తులసీదాసు మత తాత్త్విక పరమోన్నతవిషయాలను మధురమైన, గంభీరమైన, స్వచ్ఛమైన భాషలో వీనులయందేగాక ప్రతి గ్రామంలో ప్రతి గృహంలో ఏమీ తెలియని మూఢుడుకూడా తరించేలాగు వెదజల్లిన విషయం నిర్వివాద సత్యం.

— రాజేంద్ర ప్రసాద్

# సమకాలిక - మధ్యకాలిక - కవుల అభినుతులు

## హిందూ ముస్లిములకు ఏకైక పూజ్యగ్రంథము

పావనమైన రామచరితమానసము భక్తులకు కేవలప్రాణమైయున్నది ఇది హిందువులకు వేదము, ముస్లిములకు పావనమైన ఖూరాను వంటిది

— అబ్దుర్ రహీమ్‌ఖాన్ -ఇ- ఖానా

# అసమాన మహానందస్థానము

తులసీదాసరచితమైన రామచరితము కామధేనువులాగా సమస్తవాంఛాసిద్ధి కలిగిస్తుంది. అది చతుర్విధ పురుషార్థములకు ఖని. అసమాన మహానందస్థానము. దాని సాన్నిధ్యమాత్రంచేతనే హృదయం హర్షిస్తుంది. ఇది పుణ్యపురుష హృదయభృంగాలకు మనోజ్ఞమైన తులసీదళమాలగా ప్రకాశిస్తున్నది. సంసారసాగరమును తరించగోరే మానవులకు వారిధిగా ఉపకరిస్తున్నదని 'తో. సా.' నిర్వచిస్తున్నాడు.

— తో. సా.

# తులసీదాసు రామాయణ గానం చేయకపోతే? ....

వేదసిద్ధాంతాలను పరిశీలించి, పురాణాలను గాలించి, జ్ఞానికీ, అజ్ఞానికీ ఉండే భేదం ఎవరు చూపగలరు? కలికాలంలో పుట్టిన, విభ్రాంతజీవులందరూ కపటులు, వక్రవర్తనులు, క్రూరులు అయి ఉన్నందున పావన రామనామమును పలికేవాడే లేడు. తులసీదాసు రామాయణ గానం చేయకపోయినట్లైతే మన శిలాహృదయంలో ప్రేమబీజమును ఎవరూ నాటజాలరని, ఎవరూ మనలను ఈ అపార శాస్త్రసముద్రమును తరింపచేయలేరని నమ్మవలసినదిగా బెనీ కవి చెప్పుతున్నాడు.

— బెనీ.

# అమృతంకంటె మధురం

గోస్వామి తులసీదాసకావ్యం కల్పవృక్షంపైన పండిన చతుర్విధ పురుషార్థ ఫలంవలె యున్నది. అంతేకాదు. కామధేనువు యొక్క పొదుగు నుండి ప్రవహించే దుగ్ధసరిత్ వంతి వలె ప్రియమై యున్నది. ఇంకొకవిధంగా చెప్పాలంటే ఈ కవి తన విశాల వక్షముపైన తన కంఠం చుట్టూ ఉజ్జ్వల చింతామణుల మాలను ధరించి నట్లున్నది. అదికాక, భగవత్కథా ప్రసంగము చేత ఈ కవీశ్వరుని మధురకృతి ముక్తాత్మలను కూడా ప్రహ్లాదపరుస్తున్నది; రసఖాన్ కవిని సంతోష పరుస్తున్నది. ఇది చక్కెరను హాసిస్తున్నది. కలకండను గేలిచేస్తున్నది. ఇక్షుఖండమును న్యూనపరుస్తున్నది. అమృతమును సైతము లజ్జితం చేస్తున్నట్లు కనపడుతున్నది.

రసఖాన్.

# మహాభక్త తులసీదాసు

రచన : శ్రీ కేశవ తీర్థ స్వామి

భారతదేశ చరిత్రలో ఒకానొక ఆపత్సమయంలో ప్రపంచకల్యాణమూర్తియైన, భాగవతశిఖామణియైన తులసీదాసు ఉదయించాడు. అధర్మసంకులమైన భరతధాత్రికి ఆ మహాపురుషుడు సత్కర్మానుష్ఠాన భక్తిజ్ఞాన మహోపదేశాలతో సముత్తేజమును కలిగించాడు. తన రామాయణ కావ్యగానంతో ప్రజాహృదయాలను రామ మందిరాలుగా మార్చి ధర్మస్థాపనం చేశాడు.

శ్రీ తులసీదాసగోస్వామి భారతవర్షమునందు ప్రయాగకు సమీపమందుగల 'బాందా' మండలంలోని 'రాజపూర్' అనే గ్రామంలో విక్రమశక 1554 (క్రీ. శ. 1497) సంవత్సరం శ్రావణశుద్ధ (౭) సప్తమినాడు ఒక సద్బ్రాహ్మణకుటుంబమున జన్మించాడు. ఆయన పరాశరగోత్రములో — తండ్రి పేరు ఆత్మారామ శుక్లదుబే. తల్లిపేరు హులసీబాయి. తులసీదాసు యొక్క బాల్యనామం, 'తులారాముడు' లేక 'రాం బోలా.'

తులసీదాసు మాతృగర్భంలో పండ్రెండు నెలలు ఉండిన పిదప జన్మించాడు. జన్మకాలమందే ఆతనికి ముప్పదిరెండు

దంతచిహ్నాలు కూడా ఉన్నవి. అయిదేండ్ల బాలుడుగా ఆతడు కనబడినాడని, ఏడుపు లేదని, ఆ శిశుధ్వనిలో రామ నామం వినబడిందని ప్రతీతి. ఈ విపరీతములచేత, అభుక్త మూలా నక్షత్రమందు జన్మించడంచేత, తల్లి దండ్రులకూ ఆ జన్మించిన శిశువుకూ అది మరణయోగమని తండ్రి భయపడ్డాడు. ఆత్మా రాముడు ఈ బాలుని గూర్చి తెలిపిన దుర్యోగాదులు ఆతని భార్యయైన హులసీబాయికి అపార దుఃఖమును కలిగించాయి. ఆశిశువుకు అరిష్టం కలుగుతుందనే భయంతో విధిలేక తలిదండ్రులు దశమినాడు రాత్రి, ఆ బాలుని 'చునియా' అనే దాసికిచ్చి మేనమామగారింటికి పంపివేశారు. మరునాడే తులసీ తల్లిదండ్రులు ఈ అసారప్రపంచమును పరిత్యజించారు. ఒక అయిదున్నర సంవత్సరాల అనంతరం తులసీ మేనమామా, పెంపుడు తల్లియైన " చునియా " దైవ వశాత్తు మరణించారు. ఆ పిదప తులసి అనాథుడై దిక్కులేని వాడైనాడు. ఒక బ్రాహ్మణసాధ్వి అనుదినం ఆతనికి ఆహార పానీయములిచ్చి రక్షింపసాగింది. జగజ్జననిదుర్గే ఈ విధంగా ఆ బాలుని రక్షింపసాగింది.

కొన్నాళ్ళకు శ్రీ శివప్రేరణచేత రామశైల మందున్న అనంతానందుల ప్రియశిష్యుడైన శ్రీ నరహరిదాసస్వామి యీ బాలుని కటాక్షించి తన ఆశ్రమానికి తీసుకవెళ్ళారు.

ఆతనికి 'రాంబోలా' అని పేరుపెట్టబడింది. స్వామివా రతణ్ణి అయోధ్యకు తీసుకపోయి వి. శ. 1561 ( క్రీ. శ. 1504 ) సంవత్సరం మాఘ శుద్ధ పంచమి శుక్రవారంనాడు యజ్ఞోప వీత సంస్కారం చేశారు. ఆ పిమ్మట నరహరిస్వాములవారు రాంబోలాకు రామమంత్రోపదేశం చేశారు. అయోధ్యలోనే ఉండి అతనికి విద్యాబుద్ధులు గరప నారంభించారు. రాంబోలా బహు సూక్ష్మబుద్ధిగావడంచేత, గురుముఖనిర్గత విషయాల నతడు వినీవినకముందే గ్రహింపసాగాడు. అక్కడనుండి కొంతకాలానికి గురు శిష్యు లిద్దరూ సూకరక్షేత్రమును (Modern Soron) చేరుకొన్నారు. అక్కడ గురువుగారు తులసీదాసుకు రామచరితమును వినిపించారు. ఆ పిదప కొన్నాళ్ళకు తులసీదాసు గుర్వాజ్ఞానుసారం కాశికి వెళ్ళి వచ్చాడు. అక్కడాయన కాశీలో పండితశేషసనాతనుడనే మహా విద్వాంసునివద్ద పదిహేను సంవత్సరాలు వేదవేదాంగా లను అభ్యసించాడు. ఆ పిదప గురువులవద్ద అనుజ్ఞపొంది తులసి స్వగ్రామానికి నిర్గమించాడు. అక్కడాయనకు తన బంధువులందరూ గతించినారన్న విషయం విదితమైంది. తలి దండ్రులకు భక్తితో శ్రాద్ధాదికృత్యములుచేసి తులసీ అక్కడే నివాస మేర్పరచుకొని, భగవత్కథాప్రవచనాదులతో ప్రజ లను సేవింపసాగాడు.

తులసీ యొక్క రూపగుణశీలాదులను చూచి సంతోష పడి భారద్వాజసగోత్రుడైన దీనబంధు పాఠకుడనే బ్రాహ్మణోత్తముడు సుందరీమణియైన తన కుమార్తె నిచ్చి విక్రమ శకం 1583 (క్రీ. శ. 1526) సం., జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి గురువారంనాడు వివాహం చేశాడు. తులసి నూతన వధువుతో సుఖంగా ఉన్నాడు. ఆతనికి భార్య అంటే అపారానురాగం. ఆమె లేనిది ఒక్క క్షణమైనా గడుపలేడు. ఒకనాడాతడు ఏదో పనిమీద వెళ్ళి యింట్లోలేని సమయంలో, తన పుట్టింటి నుంచి వచ్చిన ఒక విషాదవార్తచేత, తన భర్త యింటికి రాకముందే సోదరునితోకలసి పుట్టింటికి వెళ్ళింది. తులసీదాసు గృహానికి వచ్చి, భార్యా వియోగ భారాన్ని భరింపలేక ఆ రాత్రే, కటికిచీకటిలో భయంకరారణ్యంలో బడి, నడిచి నడిచి దారిలోని ఒక నదిని శవాన్నే తెప్పగా చేసికొని అతిక్రమించి అత్తగారిల్లు చేరాడు. ఆ అర్ధరాత్రి గోడనుండి వ్రేలాడుతున్న ఒక సర్పమును ఆధారంగా పట్టుకొని గృహకుడ్యాన్ని దాటి, భార్యా మందిరంలో ఆతడు చేరుకున్నాడు. తనపైన గల ప్రణయాతిశయంచేత ఘోర సాహసాన్ని చేసివచ్చిన భర్తను ఆ సాధ్వీమణి చూచింది. ఆతని అమాయకత్వానికి జాలి పొందింది. "ఓ ప్రియా! మీ రింతగా ఈ దేహాన్ని గదా ప్రేమించింది. ఇది నీచమైన చర్మం, ఎముకలు, మాంసము! నిన్న రాజపూర్‌లో

ఈ శరీరం ఉన్నది; నే డీ గృహంలో ఉన్నది. అదేమాదిరి ఇవ్వాళ్టిది ఒకింటిలో, రేపు మంటిలో. దీనికి స్థిరత్వ మున్నదా ? ఇది మరణశీలమైంది, అశాశ్వతం. ఇది రేపు పిడికెడు బూదిగా మారుతుంది. ఎంతమంది మహాసుంద రులు శ్మశానగర్భంలో అదృశ్యులైనారో ఆలోచించండి. ఈ దేహంలోన ఆ పరంజ్యోతి, ఆ రామచంద్రుడు, ఆ పర మాత్మ ప్రకాశిస్తుండ బట్టే ఈ అసారశరీరానికి ఇంత శోభ. ఆ సౌందర్యమూలమే నిజంగా సర్వాకర్షణలకు మూలం. ఆ రాముని ప్రేమించాలె. ఈ నిస్సారదేహంపైన ఉంచే ప్రేమ ఆ రామునిపైన ఉంచుకున్నట్లయితే జీవితం చరితార్థ మవుతుంది. తుచ్ఛవిషయసుఖాలలో దుఃఖమే మిగులుతుంది. ఆ ఆనందస్వరూపుడైన శ్రీరామునిపైన భక్తే జీవితశాంతికి మూలం." అని ఆమె అన్నది. ఆమె బోధ ఆయన హృద యంలో వెలుగులుఁజిమ్మింది. పూర్వము తన గురువు నరహరి స్వామి చేసిన రామకథాప్రవచనం, రా మ నా మ మహిమ, జీవితపరమార్థ సందేశం తెరలు చీల్చుకొని హృదయాకాశంలో మెరశాయి. ఆతడు భార్యకు నమస్క రించి వివాలున వెనుకకు దిరిగి ఆ అంధకారంలో నిర్గమిం చాడు. ఆ అంధకారారణ్యం ఆతనికి శ్రీరాముని శ్యామ సుందరస్వరూపంగా తోచింది. సాధ్వీమణియైన భార్య పిలి చిన కొద్దీ, వెన్నాడినకొద్దీ, తులసీ చిక్కకుండా పరమవిరా గియై అధిగమించాడు. తులసీ పూర్వసుకృతం పరిపక్వ

మైంది. భార్య పిలుపు ఆయనకు వినబడలేదు. సత్యము యొక్క - రామునియొక్క - ఆహ్వానం ఆయన చెవులలో గింగురు మన్నది.

తులసీదాస్ పోయి పోయి, ప్రయాగ చేరుకున్నాడు. అక్కడ గృహస్థవేషమును పరిత్యజించి సాధు వేషమును పరిగ్రహించాడు. తులసీదాస్ అనే నామమును ధరించాడు. ఆయనలో విరక్తి దీపింప సాగింది. జగన్నాథము, రామేశ్వరము, ద్వారక, బదరికాశ్రమము మొదలైన భారత పుణ్యక్షేత్రాలను సందర్శించుకుంటూ యాత్రలలో, తపస్సులో తులసి పదునాల్గు సంవత్సరాలు గడిపాడు. మానస సరోవర తీరంలో ఆ మహాత్మునకు "కాకభుశుండి" యొక్క సందర్శనమైనది.

ఆయన కాశీ సమీపారణ్యంలో కుటీరమును కల్పించుకొని రామమంత్రపురశ్చరణం చేసుకుంటూ తదేక రామ దర్శనలాలసుడై యున్నాడు. ప్రతిదినం అనుష్ఠానానంతరం జపతీర్థమును సమీపంలోని ఒక చెట్టు మొదటిలో ఆయన పోస్తుండేవాడు. ఒకనాడొక బ్రహ్మరాక్షసుడు ఆ చెట్టు మొదటిలో తులసీదాసుకు గోచరించి, "ఓ మహాత్మా! నా పూర్వపాపంచేత నా కీ దుష్టరూపం వచ్చింది. నీ రామ మంత్రపూతజలంచేత నా కీనాడు ఈ పైశాచికభావ

విముక్తి కలిగింది. నీ మహోపకృతికిగాను ఏదైనా నానుండి సహాయమును కోరుకో" అని అర్థించాడు. ఆయన "నాకు శ్రీరామసాక్షాత్కారం కావాలె" అన్నాడు. ఆ బ్రహ్మరాక్షసుడు "అయ్యా! కాశీకి వెళ్ళు. అక్కడ ఫలానా దేవాలయంలో నిత్యమూ శ్రీ మద్రామాయణ శ్రవణం జరుగుతుంటుంది. అక్కడ అందరికంటే ముందుగావచ్చి ఒక శతవృద్ధుడు శ్రవణానంతరం అందరికంటే వెనుక వెళ్ళుతుంటాడు. పురాణశ్రవణంలో ఒక మూల చీకటిలో కూర్చుండి పరవశుడై ఆనందబాష్పాలు కారుస్తుంటాడు. ఆయన హనుమంతుడే. ఆ మహాత్ముని ఆశ్రయించు. నీ వాంఛాసిద్ధి అవుతుంది" అన్నాడు.

తులసీదాసు ఆ విధంగానే వెళ్ళి, ఆ వృద్ధుని సందర్శించాడు. తులసీదాసుయొక్క వినమ్రతకూ, రామభక్తికి ప్రసన్నుడై హనుమానుడు దర్శనమిచ్చి "వత్సా! నీవు చిత్రకూట పర్వతానికి వెళ్ళి రామనామజపంచేసుకో. తపస్సు చేసికో. అక్కడ నీకు రామదర్శనం అవుతుంది."—అని అభయదానం చేశాడు. అట్లే తులసీదాసు చిత్రకూటారణ్యములో "రామఘాట్" వద్ద పర్ణశాలను ఏర్పచుకొని, రామదర్శనాపేక్షతో జపతపధ్యానాదులు చేసికొంటూ ఉన్నాడు. ఒకనాడు ఆయనకు ఆ అడవిలో రామదర్శనం కలిగింది.

కానీ ఆయన గుర్తించ లేదు. ఇద్దరు పరమసుందరాకారు లైన రాజపుత్రులు అశ్వారూఢులై ఆయనకు గోచరించారు. వారి దివ్యాకృతులకు ప్రముగ్ధుడైనా రాజకుమారులనుకొని విరక్తుడైన ఆయన వారిని పలుకరించ లేదు. తరువాత హనుమంతుని వలన ఈ రహస్యం తెలిసినపిదప పశ్చాత్తపించాడు. మరియొకనాడు ఆ అడవిలో ఒకచోట ఒక నాటక ప్రదర్శనదృశ్యం కనబడింది. జనులుచూస్తూ ఉన్నారు. రామాయణనాటకప్రదర్శనమది. ఆ నాటకమంతా తులసీదాసు చూచి ఆశ్రమానికి వచ్చాడు. మరునాడా నాటకాన్ని గూర్చి ఆ ప్రాంతీయులకు చెప్పినప్పుడు, అట్టి నాటకం ఏమీ జరిగి యుండనందున, అది సాక్షాత్ శ్రీరామలీలాసందర్శన మని ఎఱిగిన పిదప ఆయన ఆశ్చర్యవిచారములను పొందాడు. మరియొకనాడు, తులసీదాస్ అనుష్ఠానంలోఉన్నసమయంలో ఇరువురు ఆటవికులు తులసీ కుటీరంలోనికి అడుగకుండా పోయి, మడి తీర్థమును త్రాగిపోవడం చూచి, తులసి వారిని నిందించాడు. మౌనంగా వా రిద్దరూ వెళ్లారు. ఎన్నాళ్లకు శ్రీరామదర్శనం కాలేదని పరితాపపడుతున్న తులసి ముందు హనుమంతుడు ప్రత్యక్షమై, "ఇటీవల ఇరువురు నీ ఆశ్రమం లోనికి వచ్చి నీ తీర్థోదకం స్వీకరించి పోలేదా ?" అని అడిగాడు. "స్వామీ ! వచ్చారు. ఇద్దరు శూద్రులు, మడితీర్థమును అడగకుండా తాకి త్రాగినందుకు వారిని దూషించాను. వారు మౌనంగా వెళ్ళినపిదప లోన ఏదో విచారంకలిగింది"

అని తులసీ నివేదించాడు. " ఓయీ ! వారు శ్రీరామలక్ష్మ ణులే. రామదర్శనానికి భేదదృష్టి పోవాలె సర్వం రామ మయమనే విశ్వప్రేమ కలుగాలె" — అని హనుమానుడు ప్రబోధించాడు. తులసీదాసు తన అజ్ఞానానికి ఎంతో దుఃఖ పడసాగాడు. "సరే, రేపు నీకు శ్రీరామసాక్షాత్కృతి లభి స్తుంది. విచారపడకు" మని హనుమంతు డదృశ్యుడైనాడు.

వి. శ. 1607 (క్రీ. శ. 1550) సంవత్సరం మౌనీ అమా వాస్య బుధవారం నాడు, తులసీదాసు నిత్యార్చనకు మంచి గంధమును సానపై తీస్తున్నాడు. "మాకు కొంచెం గంధం యిస్తావా ?" అని వెనుకనుండి శబ్దం వినబడినది. వెను కకు దిరిగేసరికి ఇద్దరు తేజోమయులైన సుందరులైన బాలురు తులసీదాసుకు గోచరించారు. తులసీదాసు ఈతడవ కూడా విభ్రాంతుడు కాకుండా, హనుమానుడు సమీపతరు శాఖపై ఒక చిలుకరూపంలో కూర్చుండి తులసీదాసుకు అర్థమయ్యేలాగు, "చిత్రకూటము యొక్క రామఘాట్ వద్ద సజ్జన సమూహమున్నది. ఓ తులసీదాస్ ! చందనము నూరి శ్రీరాముని తిలకముతో అలంకరించు" మని గానంచేశాడని ప్రతీతి. తులసీదాసు శ్రీరామలక్ష్మణు లని గ్రహించి ఆనంద పరవశుడైనాడు. శ్రీరామలక్ష్మణులు ఆ మహాభక్తుని ముందు దివ్యమంగళ స్వరూపములతో సాక్షాత్కరించారు. భక్తితన్మయుడై పాదములందు వ్రాలిన తులసీదాసుని చూచి శిరస్సుపై నిమురుచూ శ్రీరామభగవానుడు, చంద

నము స్వయముగా తాను పూసికొని, తులసీదాసు శిరస్సున కూడా పూసి, మందహాసరోచిస్సులతో అదృశ్యుడైనాడు. ఆనాటినుంచి ఆయనకు సమస్తవిశ్వంలో రామపరబ్రహ్మమే కనబడింది. జీవన్ముక్తుడైనాడు. జగత్కల్యాణ గంగ ఆయనలో నుంచి ప్రవహింపసాగింది.

ఆయనకు సమస్తం రామమయమే. ఒకనా డాయన అరణ్యంలో వున్నాడు. ఒక వేటకాడు ఒకలేడిని విల్లు ఎక్కుపెట్టి చంపనున్నాడు. తులసి చూచాడు. పరుగిడిపోయి వేటగానిముందు నిలచి, "రామా ! ఈ సీతాదేవిని అనుగ్రహించు. అమ్మను శంకించవద్దు" అని ప్రార్థించాడు. ఆయనకు ప్రకృతంతా సీతారామమయమే. ఆ కిరాతుడు ఆ ఋషి ప్రేమకు స్తబ్ధుడై, పశ్చాత్తాపపడి లేడిని వదలివేశాడు. ఒకనాడు ఒకడు, అడవిలో ఒకచెట్టును నరకబోతున్నాడు. తులసిచూచి పరుగిడి, "ఆ గొడ్డలి దెబ్బలు నా హృదయం మీద పడుతున్నవి. అది రామాపచారం "అని పరితపించాడు. ఆతని విశాలప్రేమ రామప్రేమ నిర్దోషం, నిరుపమానం, నిత్యమైంది.

ఆ పిదప వి. శ. 1628 ( క్రీ. శ. 1571 ) సం॥లో తులసీదాసు అయోధ్యకు నిర్గమించాడు. అక్కడే వి. శ. 1631 సం॥లో ( క్రీ. శ. 1574 ) శ్రీ శంకర హనుమదాదేశాను

సారం, శ్రీరామనవమినాడు శ్రీరామచరితమానస మనే హిందీ రామాయణ కావ్యాన్ని, స్వ-పరతారకంగా రచింప ప్రారంభించాడు. ఆయన వయస్సు అప్పుడు 42 సంవత్సరాలు. అరణ్యకాండవరకు అక్కడ రచించి, పిమ్మట తులసీదాసు కాశీక్షేత్రమును చేరుకొని అక్కడ తన రామాయణ రచనమును ఏడు కాండలూ వి. శ. 1633 మార్గశీర్ష శుక్లపక్షమున రామకల్యాణంనాటికి పూర్తిచేశాడు. ఏతద్రామాయణ సంపూర్తికి 2 సం॥ల 7 మాసముల 26 దినాలు పట్టినది. రామాయణం పూర్తి అయినపిదప, శ్రీ శివహనుమానులు దర్శనమిచ్చి, ఆద్యంతం ఆకర్ణించి, పరమానందభరితులై "ఈః రామాయణం జగత్ప్రసిద్ధి వహిస్తుంది. నీ జన్మచరితార్థమైంది" అని దీవించారు. కాశీక్షేత్రంలో తులసీదాసు రామాయణ గంగను సర్వులకు అందింపసాగాడు. శ్రీ గోస్వామి తులసీదాస్ లోలార్కఖండ సమీపంలో అసీఘట్టంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. దీనికి సమీపమందలి గంగాఘట్టమును ఇప్పటికీ "తులసీఘాట్" అని పిలుస్తుంటారు. దగ్గరలో ఒక హనుమదాలయ మున్నది. అది తులసీదాస నిర్మితం.

తులసీదాసు కాశీక్షేత్రంలో ప్రజలకు తన రామాయణమును వినిపిస్తూ, రామార్చనలో తన జీవితాన్ని గడుపసాగాడు. అతని కీర్తి దశదిశాక్రాంతమైంది. అక్బర్ మంత్రి సత్తముడైన తోడర్‌మల్లు, అంబర్‌ప్రభువైన ( A. D.

1618 ) రాజా మానసింహుడు, ఆయన సోదరుడు జగ త్సింహుడు మొదలైన మహారాజులు సైతం తులసీదాసు దర్శనానికి వస్తుండేవాండ్లు. ఆయన రామచరితమానస మధురగానం భారతవర్షానికి నవవసంతమును సృజించింది. ఆయన భక్తి, జ్ఞానవైరాగ్యములు విశ్వప్రేమ, ధర్మనిష్ఠ ప్రజాదరపాత్రమైనవి. ఆయన జీవితమహోన్నతిని తెలిపే గాథలు అనేకం ప్రజల్లో సంవ్యాప్తమై ఉన్నవి.

ఒకనాడు తులసీదాసమఠంలో ఒక అర్ధరాత్రి ఆయన కడకు అనేక మంది శ్రీమంతులు వస్తూవుండడంచేత ధనాశ కల్గి కొందరు దొంగలుపడ్డారు. ఆ దొంగలు కొన్నివస్తువు లను అపహరించి వెలువడుతున్న సమయంలో, వారికి ఏ వైపు చూచినా, ద్వార ద్వారంలో శ్యామలకాంచనవర్ణ సుందరులైన, అధిజ్య శరచాపధరులైన రాజకుమారు లిద్దరు గోచరించారు. వారి బాణపరంపరలకు అలసి, వారు కేకలు వేస్తూవచ్చి తులసీదాస్ కాళ్ళపైబడ్డారు. వారు శ్రీరామలక్ష్మణులే అని తెలుసుకొని తులసి ఆ చోరుల అదృష్టానికి పరవశుడై వారిని నుతించాడు. ఆ చోరులు తులసి శిష్యులైనారు. తనపైగల రాముని వాత్సల్యానికి ప్రముగ్ధుడై, తులసి రామునికి పరిశ్రమ కల్గించిన సంపద ఎందుకని బీదలకు పంచిపెట్టాడు.

ఆయన విశ్వప్రేమ, నామవిశ్వాసం అమోఘమైంది. ఒక నాడొక హంతకుడు పరుగిడుకుంటూవచ్చి, మఠంముందు నిలిచి, పశ్చాత్తాపభారంతో, "నాకు శ్రీరామభక్తిభిక్ష పెట్టు. నేను భిక్షుకుణ్ణి." అని ఆక్రందింపసాగాడు. తులసీదాసు అతనిని లోపలికి ఆహ్వానించి, రామనివేదితమైన అన్నమును భుజింపజేసి ఆతడు పాపవిముక్తుడైనాడని తెలిపి శ్రీరామనామప్రభావమును కీర్తింపసాగాడు. ఆ హంతకుడు ఆత్మశాంతి వహించాడు. ఈ వార్త కాశిలో వ్యాపించింది. పండితు లిది గర్హించారు. తులసీ నామ ప్రభావమును నిర్వచించాడు. పండితులు సంశయించి, నిరూపణమును కోరారు. విశ్వనాథాలయమందలినంది తులసీకృత శ్రీరామ ప్రార్థనపై, ఆ హంతకుని చేతినుండి ఆహారమును స్వీకరించినదని ప్రసిద్ధి. పండితులు తులసియొక్క మహిమకు ఆశ్చర్యపడినారు. సంస్కృత పండితుడైకూడా తులసీదాసు ప్రాకృత భాషలో రామాయణమును రచించుటను పండితులు అధిక్షేపించారు. "మట్టి కుండలో అమృతాన్ని పోస్తే, ఛీ! మట్టి కుండని త్రాగక మానుతారా? బంగారు కుండలో విషమును పోస్తే, ఆహా! బంగారు కుండని ఎవరైనా త్రాగుతారా?" అని తులసి ప్రత్యుత్తరమిచ్చి "రామచరిత్ర" ఏభాషలోనున్నా ఫరవాలేదు. కావలసినది నిర్మలభక్తి" అని పండితులను సంతోషపరచాడు. బహుజనులను, సముద్ధరించడానికై ఆయన ప్రాకృతభాషను స్వీకరించాడు. ఆయన

కోరింది స్వపాండిత్య ప్రకటన గాదు! శ్రీరామ మహిమా ప్రకటన!

శ్రీరామనామమును మూడహోరాత్రాలు జపించి తులసీ దాస్ ఒక మృతుని పునర్జీవితుని జేశాడని కూడా ప్రతీతి. ఏ దెట్లున్నా ఆ మహాపురుషుడు అంతకంటే గొప్పపనే చేశాడు. సంసారగ్రసితులైన శవప్రాయులను, శివప్రాయులుగా చేశాడు! జనులు చెప్పుకొనే తులసీదాసు యొక్క మహిమాభివర్ణనలను విని ఢిల్లీపాలకుడైన జహంగీరు పాదుషా తులసి నొకనాడు రప్పించి ఏదైనా మహిమ చూపించమని కోరాడట. నిరాడంబరుడు, భక్తశిఖామణియైన తులసి "రామనామ స్మరణతప్ప నా కే మహిమాలేదు" అని చెప్పినప్పుడు పాదుషా కుపితుడై ఆతనిని చెరసాలలో ఉంచినాడు. ఇంకేమున్నది! ఆ సాయంత్రమునకల్లా నేల యీనినట్లు ఢిల్లీనగర మంతా, ముఖ్యంగా రాజప్రాసాద మంతా కోటానుకోట్ల వానర బలగంతో నిండి పోయింది. ఆ కల్లోలానికి సర్వులూ తత్తరపడి, తులసీదాసు గారికి పాదుషాచేసిన అపచారమునకు ఫలితమేనని ఉద్ఘోషించారు. పాదుషా పశ్చాత్తాపపడి, తులసీదాసుని విడిపించి, శరణాగతి పొంది తులసీప్రేమకు పాత్రుడైనాడు. ఇట్లనేకం తులసీ దాసుని అమోఘ ప్రభావాన్ని తెలిపే గాథలు ప్రజానీకంలో వ్యవహరింపబడుతున్నవి.

శ్రీరామచరితమానసము, వినయపత్రిక, గీతావళి, దోహా వళి, కవితావళి, రామాజ్ఞ, పార్వతీమంగళ్, రామలాలన హాఛూ, జానకీమంగళ్, బరవై య్యారామాయణ్, వైరాగ్య సందీపని, కృష్ణగీతావళి మొదలైనవి తులసీదాస కృతులు.

తులసీదాసునకు శ్రీరామ స్వరూపం, శ్రీరామనామం పరమ ప్రీతికరమైంది. ఆయన రామరూపంలో సర్వరూప ములు విలీనమైపోగలవు. ఆయన రామనామం సర్వ భగవ న్నామములకు మూల శబ్దం. ఆయనకు గల ఇష్టదేవతాప్రీతి ఎంతగాఢమైందో చూడండి.

తులసీదాస్ ఒకసారి బృందావనయాత్ర చేసి అందు మదనగోపాలదేవుని దర్శించి యిట్లు ప్రార్థించాడు. "ఓ ప్రభూ! ఈనాడు నీవుపూనిన రమణీయరూపమును నే నే విధంగా వర్ణించగలను? అది వర్ణనాతీతం. కానీ, నీవు ఆ పిల్లనగ్రోవిని వదలి, బాణకోదండములను ధరించినప్పుడే తులసి నీకు నమస్కరిస్తాడు." భగవానుడు తులసీదాసు యొక్క రామరూపాసక్తికి ప్రముగ్ధుడై, ఆయనకు రామ రూపంలో సాక్షాత్కరించాడు.

భక్త తులసీదాసు తన జీవితంచేత, సర్వాదర్శలక్షణ లక్షితమైన తన మహారామాయణకృతి చేత భారత ప్రపంచ మును ప్రబుద్ధపరచి, వి. శ. 1680 సం॥ లో (1623 A.D.) శ్రావణ బ॥ తదియ శనివారం నాడు కాశీలో అశీఘట్టము

నందు నూట ఇరవై ఆరో యేట, దేహమును పరిత్యజించి శ్రీరామబ్రహ్మైక్యమును పొందాడు.

నామసంకీర్తనచేస్తున్న మహాజనులమధ్య అపరవాల్మీకియైన మహాసంత తులసీదాసు "నేను శ్రీరామ ప్రభావమును గానంచేశాను. నే నిప్పుడు మౌనం వహింపబోతున్నాను. ఇప్పుడు మీరు తులసీదళమును తులసి యొక్క నోటిలో ఉంచండి." అని ఆఖరి పలుకుపలికి రామస్మరణతో విదేహముక్తి పొందాడు.

ఓం! ఓం!! ఓం!!!

ఓమ్

శ్రీరామ జయరామ జయజయరామ

# శ్రీరామానుగ్రహ సంసిద్ధిరస్తు !

" శ్రీరామ - చరణరాజీవ - సద్భక్త !
పరమపావనధర్మభావసంయుక్త !
వృథుయజ్ఞశీల పవిత్రచరిత్ర !
కర్పూరసద్వంశ - కంధి - శశాంక !
సుగుణ - సీతాంబికా - సూర్యనారాయ -
ణశ్రేష్ఠి - తనయ ! పుణ్యాస్పదనిలయ !
శ్రీ వేంకటప్పయ్యశ్రేష్ఠివతంస -
వేంకటనారాయణాంకితనామ -
సజ్జన - సోదరా ! సౌజన్యమూర్తి !
శ్రీరామకృష్ణమూర్తీ ! ఘనకీర్తి !
జనతాజనార్దన - సంప్రీతికొఱకు
భవదీయపితృభక్తి ప్రకటించుకొఱకు
సద్భక్తితో నీవు సల్పుచున్నట్టి

కేశవకవి - యతికృత - భవ్యభవ్య -
ఘన - రామచరితప్రకాశ - యజ్ఞంబు
సంపూర్ణ మగుగాక సన్మంగళముగ !
సకుటుంబముగ రామచంద్రుని కృపకు
పాత్రుడవై, సర్వభద్రంబులొంది,
సచ్చిదానందంబు సర్వదా కలిగి,
వర్ధిల్లెదవు గాక ! పరమపుణ్యాత్మ ! "

ఓం ! ఓం !! ఓం !!!

దుర్ముఖ మాఘ శు ౧౧
సోమవారం
శ్రీరామతీర్థ సేవాశ్రమం

—శ్రీ కేశవతీర్థస్వామి.



ఓం

# విషయ సూచిక

## శ్రీ రామ చరిత మానసము

## బాలకాండము

పేజీ



### ప్రథమ సోపానము

## ద్వితీయ విశ్రామము 1



## తృతీయ విశ్రామము 98

## సప్తమ విశ్రామము 265



## అష్టమ విశ్రామము 306



శ్రీ శ్రీ శ్రీ

మట్టపల్లి లక్ష్మీనృసింహ స్వామివారు.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### ప్రార్థన

శ్రీకైవల్యపదంబు జేరుటకునై సేవించెదన్ భక్తహృ
చ్ఛోకధ్వాంతవిభంగమంగళమహశ్శుంభన్నఖద్యోతులన్
శ్రీకాంతామరమానిచిత్తనళినీశృంగారభృంగంబులన్,
శ్రీకృష్ణాతట మట్టపల్లి వనలక్ష్మీనారసింహాంఘ్రులన్.

శా. శ్రీదైత్యేంద్రకుమారరక్షణకళాశ్రీభాసమానంబు, ని
ష్ఖేదబ్రహ్మపదాభిమానమునిసంసేవ్యంబు, సర్వస్థమున్
వేదారణ్యవిహారమున్, బరమగంభీరంబు, దివ్యంబు, ప్ర
హ్లాదస్వాంతగుహానివాసము, నృసింహబ్రహ్మ మున్గొల్చెదన్.

మ. తతగర్వాంధనిశాచరాధిపసభాస్తంభాంతరాళోద్భవున్
ధృతినిర్భిన్నసురారిగర్భరుధిరోద్దీప్తాంత్రమాలాగళున్
నతమానీశ్వరదేవతానికరనానాస్తోత్రకోలాహలున్
శ్రితరక్షాచణు, మట్టపల్లినృహరిన్ సేవింతు నశ్రాంతమున్.

శా. శ్రీవైకుంఠు, ననంతు, నచ్యుతు, జగచ్ఛ్రేయోవతారున్, బరున్
దేవాధీశుని, నద్వితీయమహిమున్, దీనార్తిసంహారకున్
భావాతీతుని, దైత్యనందనమహాభక్తిప్రముగ్ధాత్ము, వి
శ్వావాసున్, హరి, మట్టపల్లినరసింహస్వామి నర్చించెదన్.

ఉ. శాంతము, దివ్యసుందరము, శంఖసుదర్శనపద్మ సద్గదా
క్రాంతపరాక్రమక్రమవిరాజితరమ్యచతుర్భుజంబు, శ్రీ
మంతము, శేషభోగమణిమండితమౌ నరసింహరూపమున్
స్వాంతములో భజించెదను శాశ్వతనిర్మలభక్తిసిద్ధికై.

చ. మనుజసమూహజీవితము మాఱ నధర్మకలిప్రభావము
గ్దనుజనిరంకుశప్రళయతాండవవిప్లవదగ్ధదండకా
వనముగ, జ్ఞానవాక్యశరవర్షముచే ధర గాచినట్టి య
మ్మునివరరామతీర్థగురుపుంగవు శ్రీ చరణంబు లెంచెదన్.

కం. నారాయణమంత్రంబును
కారుణ్యముతోడ నాకు గడుబాల్యమునం
గోరగ నిచ్చిన దివ్యుని,
ధీరుని శ్రీరామచంద్రదేశికు దలతున్.

కం. నరునకు నారాయణువలె
గురువును, హితుడౌచు మాకు గూర్చుచు మేలున్
వఱలెడు చైతన్యయతుల
చరణములకు సల్పుచుంటి సాష్టాంగనతుల్.

కం. గంగాభంగతరంగిత
పింగళపృథుజటిలు జంద్రవిలసితఫాలుం
మంగళకరు, స్మరగర్వవి
భంగుని శ్రీకాళహస్తివాసుని దలతున్.

చ. హృదయపు బానవట్టమున నీశ్వరలింగము నిల్పి, చేసెదన్
సదమలభక్తిబాష్పకణజాలముతో నభిషేక కార్యమున్,
ముదమున దేహచిత్తధనపుంజదళత్రయబిల్వపత్రితో
బ్రదుకను దివ్యమైన శివరాత్రిశివార్చన నేనొనర్చెదన్.

ఉ. వేదము లుద్భవించిన పవిత్రముఖుండు, చరాచరప్రపం
చోదయకార్యనిర్వహణ మూనిన, జ్ఞానమహాంబురాశి, దా
మోదరనాభినీరజసముద్గతభాగ్యవిరాజమాను డ
త్యాదరదృష్టి నా కిడుత మద్భుతవేదచయప్రబోధమున్.

ఉ. శ్రీ గిరిజాకుమారుని, నశేషమునీంద్రమనఃప్రభాసునిన్
రాగవిదూరునిన్, స్వజనరంజను, విఘ్నసమూహభంజనున్
నాగవిభూషణున్, గలుషనాశను, శ్రీప్రణవైకరూపు న
య్యాగమవర్ణితాధిపు గణాధిపు నెంతు నభీష్టసిద్ధికై.

ఉ. ఆ కవితారసాలశిఖరాసనమందున రామరామవాక్
శ్రీ కమనీయమాధురులు చింద ‘గుహూకుహు’ మంచు బాడి, తృ
ష్ణాకులజీవకోటికి మహామృతదానము చేసినట్టి, వా
ల్మీకిపికంబు నెంచెద సమృద్ధకవిత్వపటుత్వసిద్ధికై.

ఉ. అంబుదనీలదేహుని, శరాసనబాణకృపాణధారు, ఫు
ల్లాంబుజనేత్రునిన్, ధృతజటాంచితు, లక్ష్మణజానకీసమే
తంబుగ దండకాటవిపథంబుల నేగెడు రామచంద్రు స్వాం
తంబున సంస్మరించెద సతంబును నిశ్చలభక్తినిష్ఠతో.

చ. అతులవిరాగపర్వతమునందలి, జ్ఞానమహావనంబులో
సతతము రామనామమధుసారము ద్రావియు దాండవించు మా
రుతికి, బృహత్ప్రభావునకు, రూక్షపరాక్రమమూర్తికే నమ
స్కృతులను జేసెదన్ నను దరింపగజేయ భవోగ్రవారిధిన్.

ఉ. నాదుమనంబులోన స్మరణంబొనరింతును భక్తిపొంగ ప్ర
హ్లాదుని నారదున్ ధ్రువుని, వ్యాసుని శౌనకు శ్రీశుకున్ నరున్
స్వాదుగుణాబ్ధులున్ మహితసంయములౌ సనకాది మౌనులన్
భేదవిహీనమై వెలుగు విష్ణురతి న్గన గాంక్ష సేయుచున్.

చ. ఘనరచనాసరస్సుల ముఖంబున నీశ్వరభక్తివాహినుల్
పనిచి తెనుంగుగడ్డపయి బాఱగజేసియు జ్ఞానసంపదల్
మన కిడినట్టి పోతనను, మానితుడౌ మన త్యాగయన్, మహా
త్ముని మన గోపనన్, మఱియు ధూర్జటిముఖ్యుల సంస్మరించెదన్

కం. తమతమ యుదాత్తరచనల
నమితంబగు మేలుగూర్చి యఖిలప్రజకున్
ప్రముద మొసంగిన సత్కవి
సముదాయమునకు నొనర్తు సాష్టాంగనతుల్.

కం. పంచమవేదం బనుచు ప్ర
పంచంబున యశము గన్న భారతకావ్యం
బంచితముగ దెనుగున రచి
యించిన కవిమణుల నాత్మ నెంతును భక్తిన్.

మ. కలయందైన నొనర్ప నేరని మహాకార్యంబు నైకొంటి, శ్రీ
తులసీదాసులు వ్రాసినట్టి భువనస్తుత్యప్రశస్తప్రభో
జ్జ్వలరామాయణ మాంధ్రభాషను రచింపన్యాని తిన్నేడు, నే
నల లక్ష్మీనరసింహపాదయుగళధ్యానైక ధైర్యుండనై.

శా. సుగ్రీవాంగదజాంబవంతులు మహాశూరుల్ దయావార్ధు ల
త్యుగ్రాఖండపరాక్రమక్షుభితదైత్యుల్, రామసేవాక్రియా
వ్యగ్రుల్ తోడ్పడరా? యిదేరిపని? ఆహా! వారిదే నాదు జి
హ్వాగ్రంబందున నిల్చినారు భయమేలా? రామకార్యంబులో.

గీ. అమ్మ! ఓంకారమయి! జగదంబ! వాణి!
పార్వతీరమారూపిణీ! పరమశక్తి!
రమ్మ రావమ్మ భారతీ! రయముగాను
కేశవుని హృద్విపంచిక గేల గొనుమ!
రామగాథాసుధాధుని కేమి కొదువ!

కం. పలికిన రామాయణమే
పలుకగ వలె నన్యమేను పలుకగ నేలా
పలుకుల నమృతము చిలుకగ
బలికెద శ్రీరామచరిత వరశుభభరితన్.

శా. శ్రీ మంతంబగు మట్టపల్లివనిలో శ్రీ కృష్ణవేణీతటిన్
నీమంబొప్పగ నారసింహుని హృదిన్ నిత్యంబు ధ్యానించుచున్
భూమానందములోన దేలుచు జగత్పూజ్యంబునై వెల్గు శ్రీ
రామస్వామికథన్ రచింతును పునర్జన్మంబు లేకుండగన్.

కం. కొలిచెద శంకరు పదముల
గలిమలసముదాయమడచి కాచుటకొఱకై
తలతును మధ్వాచార్యుల
బలికెద యతిరాజపరమభవ్యయశంబున్.

కం. రామమోహనరాయల రామకృష్ణు
నసమయశు వివేకానందయతివరేణ్యు
నా దయానందు, గాంధీమహాత్ము నెంతు
నంజలి ఘటించియు ననుగ్రహార్థినగుచు.

కం. భరతవసుంధరయందును
బరదేశములందు జనుల బాగొనరింపన్
గరుణ జనించిన ఋషిగణ
చరణములకు శిరము వంచి సలిపెద నతులన్.

కం. తనదగు రామాయణమును
తెనుగున రచియింపజేసి తేట పడంగా
నను ధర గృతార్థు జేసిన
ఘనుతులసీదాసు పాదకంజము లెంతున్.

# కృతిసమర్పణము

కం. శ్రీ దైత్యార్భకచుంబన
మోదాసురరక్తదీప్తముఖజిహ్వునకున్
వేదావన రంహునకున్
నాదైవము మట్టపల్లినరసింహునకున్.

కం. అభిషేచితకృష్ణాజల
శుభశీర్షున కఖిలదేవచూడామణికా
యభయప్రదునకు, స్తంభ
ప్రభవుండగు మట్టపల్లివరనరహరికిన్.

కం. రాక్షసవక్షోభేదన
రూక్షోజ్జ్వలరక్తసిక్తరూఢనఖున క
య్యక్షీణదయానిధికిని,
పక్షిధ్వజుడైన మట్టపలినరహరికిన్.

కం. అనుపమనిజగర్జాహత
దనుజాధిపఘోరఘోరదౌర్జన్యునకున్
మునిసురనరగణలోకా
వనునకు శ్రీ మట్టపల్లివరనరహరికిన్.

కం. స్థిరముగ బద్ధాసనమున
గరముల శ్రీ శంఖచక్రగదలుం వెలుంగన్
శిరమున శేషుడు గొడుగై
వఱలగనున్నట్టి మట్టపలినరహరికిన్.

కం. ఎవనిని స్వాత్మగ నెఱిఁగియు
భవవార్ధిని దాటుచుండు బరమర్షిగణం
బెవఁడగు గర్తయు, భోక్తయు,
భవహరుఁడగు నట్టినుట్టపలినరహరికిన్.

కం|| అంకిత మొనర్చినాఁడను
శంకను విడి దీని రామచంద్రుచరిత్రన్,
సంకటముల విడిచి, నృసిం
హాంకముపైఁ గూరుచుండి యానందింపన్.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### ప్రథమ సోపానము

మంగళాచరణము

గీ. వర్ణసముదాయమున కర్థవర్గమునకు
రసములకు, ఛందములకు, భద్రంబులకును
కర్తలైన సరస్వతీగణపతులకు
వందనము సేతు భక్తి బ్రప్రథమమందు. 1

గీ. స్వాంతమున నీశ్వరుని సిద్ధజనములైన
నెవరు లేక కనంజాల రించుకేని
నట్టి శ్రద్ధాస్వరూపిణి యైన యుమకు
భూరివిశ్వాసరూపశంభునకు నతులు. 2

గీ. ఎవని యాశ్రయమొంది వక్రేందుడైన
సర్వవంద్యత గనె, నట్టి జ్ఞానమయుడు,
నిత్యుడును శివరూపుడై నెగడు గురుని
పాదముల కొనరించెద వందనముల. 3

గీ. భూమిజారామగుణసంఘ పుణ్యవనుల
నెపుడు దిరుగు కవీశకపీశ్వరులకు
బరమవిజ్ఞానులకు జేతు వందనముల
నమితభక్తిసమేతుడ నగుచు నేను. 4

కం. సృష్టిస్థితి లయకారిణి !
కష్టాంతకి ! అఖిలదివ్యకల్యాణకరీ !
సాష్టాంగనతులు చేసెద
శిష్టావని ! రామపత్ని ! సీతామాతా ! 5

ఉ. ఎవ్వని మాయకు న్వశము లీ త్రిజగంబులు దేవతాచయం
బెవ్వనియందు ద్రాటిని నహి భ్రమగా జగమెల్ల దృశ్యమో
ఎవ్వని పాదనావ యొకటే శరణంబో భవాబ్ధి దాటగా
న వ్వరమూలకారణుని నా హరి నీశుని రాము గొల్చెదన్. 6

గీ. సకలనిగమాగమపురాణసమ్మతమును
రామకథ నితరవిశేషరంజితముగ
స్వాత్మతృప్తికై దేశీయభాషలోన
తులసి రచియించుచున్నాడు లలితరీతి. 7

చ. ఎవని స్మరింప గార్యతతి యెల్లను తప్పక సిద్ధిగాంచునో
ఎవడు గణాధినాయకుడో, యెవ్వడు సుందరసింధురాననుం
డెవడురుబుద్ధిరాశియగు, నెవ్వడు మంగళసద్గుణాబ్ధి యా
శివసుతుడా వినాయకుని శ్రీకృప నాకు లభించుగావుతన్. 8

చ. పలుకులు రాని మూగ ఘనవక్తగ మాఱును, కుంటివాడు తా
జలమున దుర్గమోగ్రగిరిసంఘము దాటు నెవానిసత్కృపా
బలమున నాజనార్దనుడపారకృపారససాగరుండు, దు
ష్కలిమలహారియౌ హరి, ప్రసన్నత జూపును గాక నాయెడన్. 9

ఉ. నీలసరోరుహోపమవినీలతనుండు, నవారుణాబ్జశో
భాలయసత్కృపారసమయామలకోమలసుందరాక్షుం డా
పాలసముద్రమందు మణిభాసితపన్నగతల్పశాయియై
క్రాలు రమాధినాథుడు, స్థిరంబుగ నా హృదిలోన నిల్చుతన్. 10

శా. కుందేందూపమదివ్యదేహుఁడు, నిజక్రోధాగ్నికీలాహుత
సందగ్ధాత్మభవుండు, దీనజనరక్షాదక్షు డత్యద్భుతా
నందావేశమహానటుండు గిరిజానాథుండు శంభుండు నా
యందు న్గూర్చును గాక సంతతము దివ్యానుగ్రహశ్రీతతుల్. 11



## శ్రీ గురువందనము

కం. కరుణావరుణాలయుఁడును
నరరూపమునందు వెల్గు నారాయణుఁడున్
వరవాగ్ఘృతమోహుండగు
గురుశుభపాదాంబుజముల గొల్తును భక్తిన్. 12

గీ. సురుచిరంబు, సుగంధము, సుందరమ్ము
ప్రేమరసరంజితంబయి వెలుగుచున్న
శ్రీగురూత్తమపాదపరాగమునకు
వందనము సల్పుచున్నాఁడ భక్తితోడ. 13

గీ. శ్రీగురూత్తమపాదపరాగమమృత
మూలికాచారుచూర్ణము, పుణ్యతమము
అది సమస్తసంసారరోగాళి బాపి
యమరసుఖము ప్రసాదించు నద్భుతముగ. 14

గీ. పుణ్యకృత్యమనియెడి శంభుని శరీర
మందు విలసిల్లు నిర్మల మగు విభూతి,
మంజులసుమంగళానందమాత గాదె
శ్రీగురూత్తమపాదపరాగకణము ! 15

గీ. మనుజమానసచారుదర్పణమలంబు
హరణ మొనరించు సద్గురుచరణధూళి
తద్ఘనపరాగతిలకసంధారణంబు
సకలసద్గుణమణుల వశ్యంబొనర్చు. 16

కం. గురుపదనఖమణికాంతుల
స్మరియించు నెవండు వాని మానససీమం
బరమాత్మదృష్టి కలుగును
తరమా గురుమహిమ నెన్న ధాతకునైనన్. 17

కం. గురుపదనఖమణిసుప్రభ
తఱుగని యజ్ఞానతమము ధ్వంసము సేయున్
గురుపదనఖసందీపిత
వరహృదయుడె భాగ్యశాలి ప్రజలందెల్లన్. 18

కం. శ్రీగురుపదనఖమణిరుచి
బాగుగ వికసింపజేయు బ్రజ్ఞాదృష్టిన్
బోగొట్టును భవగాఢని
శాగతదోషముల దారుణాకులసమితిన్. 19

గీ. మహితరామకథామణుల్ మౌక్తికములు
వ్యక్తముగగొన్ని, కొన్ని యవ్యక్తముగను
వెలుగుచున్నవి, అవి యున్న స్థలము దెలియు
భవ్యగురుపాదనఖమణిప్రభల వలన. 20

గీ. అరయ సాధకులును సిద్ధు లక్షులందు
నలది సిద్ధాంజనము పర్వతాటవులను
క్ష్మాతలంబున బెన్నిధుల్ గాంచినట్లు
హరికథాతతి గురుకృప నరయగలము. 21

కం. గురుపదరజమనుమంజుల
కరఘనసిద్ధాంజనంబు కన్నుల సోఁకన్
బఱుగిడు దృగ్దోషంబులు
నిరుపమమగు జ్ఞానదృష్టి నెగడు సతంబున్ 22

ఉ. అట్టి గురూత్తమాంఘ్రియుగళాబ్జపరాగమహాంజనంబు చే
పట్టి, వివేకనేత్రమును బాగొనరించి వినిర్మలంబుగా
బుట్టుకచావులు న్గలుగు భూరిభవాంబుధి దాటఁజేసియున్
గట్టును జేర్చు రామకథ గానమొనర్తు మనోహరంబుగాన్. 23



## సజ్జనవందనము

కం. మొదటనె నమస్కరించెద
సదమలభూసురుల పాదసారసములకున్
విదళితమోహగుణోదిత
హృదయాంతస్సంశయముల కేఁగడుభక్తిన్. 24

గీ. సకలగుణఖనిరైన సజ్జనసమాజ
మునకు నేను సాష్టాంగవందనము సేతు
మనసులో భక్తి పొంగగా మధురనమ్ర
మంజులాలాపములతోడ మహితరీతి. 25

కం. ధర గార్హ్యసచరిత్రము
తెలుగున శ్రీసాధుచరిత ధృతశుభగుణమా.
విరసము, విశదము, గుణమగు
వరఫల మహా! రెంటియందు బ్రభవించుగదా! 26

కం. ధృతి మెయి గష్టములోరిచి
యితరుల ఛిద్రముల గప్పి యిల గార్పాసం
బతులితకీర్తిని గాంచెను.
సతతంబును విబుధులల్లై సన్నుతపాత్రుల్

చ. ఘనతరరామభక్తియను గంగయు, బ్రహ్మవిచారబోధనం
బనెడి సరస్వతీనదియు, న వ్విధివర్గములున్ నిషేధముల్
తనరెడి కర్మయోగనుకథాతతియన్ కలిదోషబృందభం
జనరవిపుత్రియున్ వెలుగు సజ్జనసంఘమహాప్రయాగలో.

గీ. అబ్బుధసమాజమనెడి ప్రయాగయందు
విమలహరిహరకథనత్రివేణి తనరు
శ్రవణమాత్రంబుచే నది జనులకిచ్చు
సకలమోదశుభంబుల సంతతంబు

గీ. ఆ బుధజనసమాజప్రయాగలోన
నిశ్చలాఖండనిజధర్మనిష్ఠ యనెడి
యక్షయవటంబు వెలుగొందు ననవరతము
దాని పరివారమెల్ల సత్కర్మవితతి

గీ. సజ్జనసమాజతీర్థరాజంబు తెలియ
నన్ని దేశంబులందున, నన్ని కాల
ములను, నందఱకు లభించు సులభముగను
ఆదరమున సేవింప క్లేశాళి బాపు.

గీ. అకథనీయ మలౌకిక మా ప్రయాగ
వెంటనే ఫలమొసగుచు వెలుగుచుండు
సాధుసత్సంగతీర్థరాజప్రభావ
మఖిలలోకప్రసిద్ధమై యతిశయిల్లు.

చ. అహహా ! ప్రసన్నచిత్తుడయి, ఆ బుధబృందమహాప్రయాగలో
మహిమ నెవండు తా వినియు, మానసమందు గ్రహించి, దానిలో
మహితమహానురాగమున మానక్రుంకునొ వానికింక నీ
యిహమున నే నిజంబు లభియించు*జతుష్పురుషార్థసౌఖ్యముల్. 33

గీ. సాధుబృందప్రయాగమజ్జనము సేయ
ఫలము తత్క్షణమే పొందగలము మనము
కాకి కోకిలయౌను బకంబుగూడ
రాజహంసగమౌను విరాజితముగ. 34

కం. ఇది విని వింతను గనకుడు
విదితము సత్సంగమహిమ విశ్వములో, నా
రదవాల్మీకిఘటోద్భవు-
లిది స్వయముగ జెప్పినార లెల్లరు దెలియన్. 35

గీ. జలచరావనీచర నభశ్చరములనగ
జడములన జేతనములన జగతిలోన
గలవనేకంబులౌ జీవగణములౌర !
వానిలో నెయ్యదైన నేపగిదినైన
నెప్పుడేనియు, నెక్కడనేని, సుమతి,
కీర్తి, సుగతి, విభూతి, సద్వర్తనంబు
తాల్చియుండిన నదియు సత్సంగమహిమ !
అట్టి సుగుణముల్ పొంద మార్గాంతరములు
లోకమున లేవు, వేదాలలోన లేవు. 36

కం. కలుగదు వివేకమెప్పుడు
సలుపక సత్సంగమట్టి సత్సంగంబో
సులభముగా లభియించునె ?
అల రాముని కరుణలేక యవనీస్థలిలోన్ 37

---

*చతుర్విధపురుషార్థములు = ధర్మార్థకామమోక్షములు.

గీ. ఘనతరానందశుభవృక్షమునకు మూల
మరయ సజ్జనసాంగత్యమగును, మఱియు
దానిపుష్పముల్ ధర్మసాధనములెల్ల
ఫలము సుజ్ఞానసిద్ధియై పరిఢవిల్లు. 38

కం. పరుసము సోకిన నినుమును
వఱలెడు బంగారమైన పగిదిగ శఠుడున్
ధరణిని సత్సంగముచే
నిరుపమపుణ్యాత్ముడగుచు నెగడును గాదే! 39

గీ. విధివశంబున బుధు డొకవేళ దాను
దుష్టసాంగత్యమందున దూరియున్న
సర్పఫణమందుగల మణిచందముగను
నిజగుణానుసారంబుగానే చరించు. 49

చ. హరివిధిరుద్రులున్, గవిజనావళి, పండితులైన వారలే
వరసుజనప్రభావమును బల్కగ సంశయ మొందుచుండగా
నరుడను నేను పల్కగలనా? పురవీధుల, నాకుకూరలన్
దిరుగుచు నమ్మువా డెటుల దెల్పు మణిప్రతిభావిశేషముల్. 41

ఉ. కోసిన చేతికిన్ దనను గోయని చేతికి నొక్కరీతిగా
దోసిలిలోని పుష్పమతితుష్టి వెలుంగ సుగంధమీయదే!
ఆ సరణిన్ హితాహితుల నందఱ నొక్కటిగాగ జూచు మఱ
భాసిలు సజ్జనావళికి భక్తిని వందనమాచరించెదన్. 42

మ. సరళాత్ముల్ సకలోపకారులగు శ్రీసాధుస్వభావంబులన్
బరమస్నేహ మెఱింగి మ్రొక్కితిని భాస్వద్భక్తితో వారు స
త్వరమే యీ పసిబాలు విన్నపము వాత్సల్యంబుతోనంది సుం
దరరామాంఘ్రిసరోజభక్తినిడి నన్ ధన్యాత్మునిం జేయగన్. 43

## దుర్జనవందనము

గీ. వందనము జేసెదను సుహృద్భావమొప్ప
దుష్టజనబృందమునకు, దద్దూర్తజనము
లే ప్రయోజనమును లేకయే యొనర్చు
గుడి నెడమగను, మంచిని చెడుగ నౌర! 44

గీ. పరుల హితమును చెఱచుటే వారి లాభ
మన్యనాశమే వారల కఖిలసుఖము,
పరులు బ్రదుకుటే వారికి వగను గూర్చు,
శఠుల తత్త్వంబు నరయ నాశ్చర్య మొదవు. 45

గీ. హరిహరక ఘేందు రాహుగ్రహంబులగుచు
నన్యజనదుఃఖకార్యసహస్రబాహు
లన్యదోషదర్శనసహస్రాక్షులగుచు
మహిని జరియించుచుంద్రు దుర్మార్గజనులు. 46

కం. ఘృతమున నీగలు పడియును
ఘృతమెల్లం జెఱచి, యసువులే విడిచెడు న
ట్లితరుల హితమును జెఱచి తమ
మతులునువడి దాముగూడ మరణింత్రుగదా! 47

గీ. పరుల దపియింప జేయగా వహ్నిసములు
దండధరతుల్యు లెపుడు క్రోధంబునందు,
బహుళపాపావగుణసంఘభాగ్యగరిమ
నల కుబేరులు దుర్జనుల్ తలచునెడల. 48

కం. కుజనులు కేతువులట్టుల
ప్రజలహితము బాడుసేయ బ్రభవింతురిలన్,
నిజము నెఱుంగరు వార
క్కజముగ నిద్రనుమునింగి ఘటకర్ణువలెన్. 49

చ. పడి వడగండ్లు సస్యమును బాడొనరించియు దాము నాపయిన్
మడిసినరీతి దుర్జనలు మానక యన్యుల కార్యసంతతిం
జెడునటు జేయుచున్ భువి ద్యజింతురు స్వీయశరీరముల్ గడుం
గడు ధృతిబూని, యా కుజనకాండము నెంచి, నమస్కరించెదన్. 50

గీ. పరులదోషంబులను క్రోధభావ మొప్ప
వేయి ముఖములతోడను విసుగు వీడి
వర్ణనముసేయు దుర్జనవ్రాతమునను
శేషసమముగ భావించి చేతు నతులు. 51

చ. పృథువు సహస్రకర్ణముల విష్ణుకథావళి నాలకించె నా
పథమున దుష్టులింక బదివందలవేల చెవుల్ ధరించియుం
బ్రథితమహానురాగమున బాయక విందురు పరాఘగాథలన్
బృథుసములంచు వారలను నే నొనరించెద వందనంబులన్. 52

గీ. అనవరతసురాసక్తి వజ్రాయుధంబు
వేయికన్నులు దేవతావిభునకుండు.
అనవరతసురాసక్తి వజ్రాతికఠిన
భాషణంబులు, పరజనదోషలేశ
దర్శనచణసహస్రనేత్రములుగల్గి
సంచరించెడి యట్టి దుర్జనులనెల్ల
నింద్రతుల్యులంగా మది నెంచుకొనియు
మఱల మఱల నేనిపుడు నమస్కరింతు 53

గీ. అల యుదాసీనశత్రుమిత్రాదులందు
నెవరికైనను గానిండు, హితము కలుగ
ననుచు వినినంత దహితహ్లాదుచుంద్రు
ఖలులు; వారల సహజమార్గంబు లెఱిగి
చేతులను రెండు జోడించి చేతు నతులు. 54

గీ. ఏను సాధర్మ్యముగ నమస్కృతుల జేతు
వారు విడువరు వారి స్వభావములను
ప్రేమతో గాకి నెన్నాళ్లు పెంచుకొనిన
మాంసభక్షణ సేయుట మానగలదె? 55



## సజ్జనదుర్జనవందనము

ఉ. మ్రొక్కెద సజ్జనంబులకు మ్రొక్కెద దుష్టుల కొక్కరీతిగా
నిక్కము నెంచిచూడ వగనే కలిగించెద రిర్వు, రందులో
నొక్కటి భేదమున్నయది యొక్కని బాసిన ప్రాణహానియౌ
నొక్కని డాసినన్గలుగు నుగ్రతరవ్యథ భేదమింతియే! 56

గీ. అరయ సజ్జనదుర్జను లందఱొక్క
జగతిలోననే పుట్టుట; సారసంబు
జలగ పుట్టును రెండు కాసారమందె
కాని గుణముల భేదము గాంచగలము. 57

కం. సాధులు సుధతోతుల్యు, ల
సాధులు సురతోడ సములు, శశ్వద్విశ్వా
గాధాంబుధిలో నుభయుల
వేధసుడు జనింపజేసె బృధుచిత్రముగన్ 58

కం. తమతమ సత్కార్యంబుల
సుమతులు సత్కీర్తి జగతి శోభిలజేయం
దమతమ దుష్కార్యంబుల
గుమతులు దుష్కీర్తి నింపుకొందురు ధాత్రిన్. 59

చ. అరయసుధాసుధాకరసురాపగలున్ బుధులున్న రీతి గా
గరళశరసాగ్ని పుణ్యశుభ *కర్మ వినాశనదీకిరాతకుల్
ధరగల, రిందు వీరిగుణధర్మములెల్ల రెఱింగియుందు, రె
వ్వరికెది నచ్చునో యదియె వారికి మంచిదియౌచు దోచెడిన్. 60

చ. విమలుడు మంచినే కొనును, వీడక నీచుడు చెడ్డదానినే
ప్రముదముతోడ గైకొనును, వారల కియ్యది నైజమైన నా
యమృతము మృత్యువారణగుణాఢ్యమై కీర్తిని గాంచుచుండ బ్రా
ణముల హరించుటందె గణనంబున కెక్కు విషంబు చూడుడీ! 61

కం. ఖలజనపాపపు గాథల
నల సజ్జనసుగుణకథల నరయ నపారం
బులును నగాధంబులునౌ
జలధులవలె నున్న వౌర జగతీస్థలిలో. 62

గీ. వేని గ్రహియించి వేనిని విడువవలెనొ
కనుగొనంగను శక్యము గాదటంచు
గుణములును దోషములు కొన్ని కొన్ని మాత్ర
మిచట వర్ణింపబడినవి యెల్లరెఱుగ. 63

---

* కర్మనాశానది = బీహారులోని ఒకనది: అందుస్నానముచేసిన సమస్త పుణ్యకర్మలు నశించుననిప్రతీతి.

గీ. మంచిచెడ్డలనెల్ల బ్రహ్మయె సృజించె
గాని వాని గుణాగుణగణము తెలిచి
మంచిచెడ్డల విభజించి మనకు దెలిపె
విశ్వవిజ్ఞానఖనియగు వేదచయము. 64

గీ. బ్రహ్మదేవసంసృష్టప్రపంచమెల్ల
మంచిచెడ్డలతో మేళవించి యున్న
దనుచు, ఘోషింపుచుండె నీ యవనిలోన
నఖిలవేదపురాణేతిహాససమితి. 65

గీ. ఎంచ సుఖమును దుఃఖము, మంచి చెడుగు,
భవ్యుడును పాపజనుడును, పగలు రాత్రి,
మఱి, సుజాతి కుజాతియు, సురలు దైత్యు,
లున్నతియు బతనము, సుధయును విషంబు,
జీవనము మృత్యు, వీశుడు జీవుడనియు,
బ్రహ్మమును మాయ, సిరి లేమి, రాజు పేద,
కాశి మగధయు, గంగయు కర్మనాశ,
మఱియు మరుభూమి మాళవధరణితలము,
బ్రాహ్మణుండు కసాయి, స్వర్గము నరకము,
ఘనవిరాగము రాగము, లనుచు గనగ
నిట్లు గలవెన్నియో బ్రహ్మసృష్టియందు;
వీనిగుణదోషములనెల్ల విభజనంబు
సలిపె బరిశుద్ధముగ వేదశాస్త్రసమితి. 66

ఉ. ఈ సచరాచరంబయిన సృష్టి నహో! గుణదోషయుక్తమై
భాసిలగా రచించె విధి; పాలను నీళ్లను హంస తా విడ
నీసినరీతి, సజ్జనులు ధీరత సద్గుణముల్ గ్రహించియుం,
ద్రోసెదరావలన్ సకలదోషము లాత్మవివేకశక్తితో. 67

గీ. అహహా! హంసను గలిగిన ఆ వివేక
మెపుడు కలిగించునో విధి యపుడె మనసు
దోషములనెల్ల నావల ద్రోసివైచి
గుణములందున లగ్నమై గణనకెక్కు. 68

గీ. కాలకర్మస్వభావప్రగాఢబలము
వలన బుధుడును ప్రకృతికి వశ్యుడగుచు
మంచితనమును తాను త్యజించివైచు
బ్రకృతిశక్తిని వర్ణింప వశముగాదు. 69

ఉ. ఐనను కేశవాంఘ్రిరతులైన బుధుల్ చెడిపోరు వార లా
మానసమందు గల్గిన భ్రమన్ సవరించి ప్రబుద్ధులౌచు స్వ
జ్ఞానమహాప్రభోదితయశఃస్ఫుటపాండురదిక్కటాహులై
మానితరీతి వెల్గుదురు మాధవసత్కరుణాబలంబుచే. 70

కం. ఖలుడును సత్సంగముచే
సలిపిన నేదేని మంచి శాశ్వతరీతిన్
నిలువదు సద్బుద్ధి, యతని
మలినగుణము పోక మాటిమాటికి బొడుచున్. 71

ఉ. వంచకులైనవారు గుణవంతుల వేషములూని, అట్టి వే
షాంచితశక్తిచే జగతి నర్చితులైనను దాగజాలదా
వంచన; కాలనేమియును, పంక్తిశిరుండును, రాహుముఖ్యుల
ట్లెంచగ నెన్ని నాళ్లు నటియింపగ గల్గిరి? దంభరూపులై. 72

చ. ధరణిని నీచవేషములదాల్చి చరించియు సాధుపూరుషుల్
నిరుపమపూజనీయులయి నిల్తురు మానవహృత్స్థలంబులం
దరయగ జాంబవద్ధనుమదాదులం వానరరూపులయ్యు, బం
ధురజగదేకపూజ్యచరితుల్ మహితాత్ములుగా వెలుంగరే? 73

కం. కుజనులసంగతి హానియు
సుజనుల సంగంబు సకలశుభముల గూర్చున్
నిజమిది వేదోక్తంబయి
త్రిజగముల ప్రసిద్ధి గన్నదే తలపోయన్ 74

కం. కనుడాధూళిని నయ్యది
యనిలములో గలసి లేచు నాకసమునకున్
గనుడది జలమున గలసిన
జని చని పెనురొంపి జేరు క్ష్మాస్థలి నారా! 75

గీ. సాధుసదనంబులను శుకశారికములు
'రామ' యనిపల్కుచుండును రమ్యరీతి;
నీచగృహములలో నవే నిలిచి సతము
పోయివచ్చువారల దిట్టిపోయుచుండు. 76

గీ. అరయ బొగ, కుసంగతి మసి యనగదనరు
నదియె సత్సంగమహిమచే నందమగు సి
రాగ దోడ్పడును పురాణరచనమునకు,
నదియె యుదకాగ్నివాయువులందు గలసి
వారిదంబయి భువికి జీవన మొసంగు. 77

చ. గ్రహతతి, యౌషధాళి, యుదకంబులు, వాయువు, శస్త్రముల్ శుభా
వహములుగా జెలంగు ధరపైన సుసంగతిచే, నవే వ్యథా
వహములునౌచుమాఱును విపత్కరఘోరకుసంగశక్తిచే
మహితవివేకమానసులుమాత్ర మెఱుంగుదు రీరహస్యమున్. 78

గీ. కృష్ణశుక్లపక్షంబు లీ క్షితిని రెండు
సరిసమానంబు లౌచును జరగుచున్న
గృష్ణపక్షము తమముచే గీర్తిబాయ
శుక్లపక్షము శశిచేత శోభజెందె 29

## నైచ్యానుసంధానము

ఉ. ఈ సచరాచరోరుజగ మెల్లను రామమయంబుగాన సం
భాసురసర్వభూతచయపాదసరోరుహకోటి కెప్పుడుఙ్
జేసెద వందనంబులను చేతులు రెంటిని మోడ్చి వర్షధా
రాసమపారవశ్యసుఖరంజనబాష్పము లొప్ప గన్నులన్. 80

మ. హరిరూపాళిగ నెంచి భక్తిమయదివ్యచ్చిత్త మొప్పారగా
వరదేవాసురయక్షపక్షిగణసర్పప్రేతగంధర్వకి
న్నరకింపూరుషమర్త్యముఖ్యమగు నానాజీవసంఘాళికిం
గరుణాదృష్టుల నన్ను జూడ నతుల గావింతు నేనియ్యెదే. 81

కం. జలమున స్థలమున నభమున
జెలగు జతుర్విధములైన *జీవంబులకుఙ్
సలిపెద జోహారులు నే
నల సీతారామరూపులను భావమునన్. 82

కం. సీతారామమయంబగు
భూతావళి యెల్లనన్ను బ్రోవ్గప్రేమన్
నా తప్పుల గనకుండగ
నాతతకరుణార్ద్రదృష్టి నరయుగ వలయున్. 83

చ. నాదగు బుద్ధిశక్తిపయి నా కవలంబన లేదు; కావునన్
మీ దయజూప నే నిపుడు మిక్కిలి వేడుచునుంటి నల్పమీ
నాదగు బుద్ధిశక్తి రఘునాథుచరిత్ర మగాధ మెట్లు సీ
తాదయితప్రపూతచరితంబును వర్ణన సేయగల్గెదన్. 84

---

* అండజములు, స్వేదజములు, జరాయుజములు, ఉద్భిజ్జములు.

చ. కనబడ దెంతమాత్రము జగంబున నొక్క యుపాయమేని నా
మనసాక పేదవాడు, మఱి మామకవాంఛయొ రాజు బోలెడిం
దనియగ వాంఛ యేమొ యమృతంబును పొందగనుండ చల్లనై
నను లభియింపదయ్యెగద ! నామతి కొద్దిది కోర్కె పెద్దదే ! 85

కం. నాదగు ననుచితకార్యము
సాదులు క్షమియింపగలరు సంతస మొప్పన్,
నాదగు శిశుభాషణముల
నాదరమున వినగ వారి కంజలి సేతున్. 86

కం. వచ్చియు రానియు బలుకుల
మచ్చికతో బాలుడాడ మాతాపితరుల్
ముచ్చటపడి మానసమున
నచ్చపు ప్రేమంబు పొంగ నాలింత్రు గదా ! 87

కం. క్రూరులు కుటిలులు దుష్టవి
చారులు పరదోషకార్యసంతతనిందా
పారగు లగు దుర్జనులో
యూరయకే పరిహాసింతు రా శిశువాక్కుల్. 88

చ. కన రసవంతమైన నటు గాక రసప్రభ లేక యుండినన్
దనదు కవిత్వ మెవ్వడు ముదంబున మంచిగ నెంచుకో దహో !
విని పరకావ్యముల్ హృదయవీథిని సంతస మందగల్గు స
జ్జనవరు లెందఱుందురు విశాలజగంబున గోటి కొక్కడే ! 89

చ. ధరణిని స్వప్రవాహముల దామె ముదంబునబొంగు నా సరో
వరములు వాహినీచయమువంటి నరుల్లల రెందఱెందఱో
అరసియు బూర్ణచంద్రుని మహాద్భుతిమోదముతోడ పొంగు సా
గరమును బోలు భవ్యుల జగంబున లెక్కిడవచ్చు వ్రేళ్లపై. 90

చ. నను బరిహాసమాడ గుజనంబులు నాకు హితంబె కల్గెడిన్
ఘనమధువొల్కఁగూయు గలకంఠము కాకికి గిట్టబోదు హం
సను గని కొంగ నవ్వుకొను, జాతకము న్గని కప్ప వెక్కిరిం
చును, వగవాక్షుల న్వెఱలు సూరుల గేలియొనర్తు మూఢులున్. 91

గీ. రామపాదాబ్జసద్భక్తిరహితకవుల
కెల్ల నాదు కవిత్వ మొకింతకంత
గలుగజేయు వినోదసుఖంబు నెడద
నిద్ది దేశభాషాకృతి; యిదియుగాక
నాదు బుద్ధియు సాధారణంబు గాన
బరిహసించుట న్యాయమే పరులు నన్ను. 92

చ. ఎవనికి రామపాదజలజేచ్ఛ, సుబుద్ధియు గల్గలేదొ ఆ
యవగుణు డీ చరిత్రమున నాదరదృష్టి దృణీకరించు దా
నెవ డిల విష్ణుశంకరుల నెప్పుడు గొల్చు గుతర్కిగాక యా
ప్రవిమలభావుడే కనును రామకథామధురానుభూతులన్. 93

చ. కాను కవీశుడన్ మఱియు గాను మహావచనప్రవీణుడన్
నే నెటువంటి సత్కళల నేరను, నేర ననేకవిద్యల
టైనను రామభక్తిమయమై వెలుగొందుట నీ చరిత్రమున్
మానక సజ్జనుల్ వినియు మంజులరీతి నొనర్తురి సన్నుతుల్. 94

ఉ. ఏ కవితానులక్షణము లించుక నేర నటంచు రూఢిగా
మీకు లిఖించి కాగితముమీద నొసంగెద, నే గుణంబులున్
నా కృతియందుగల్గ వయినన్ గనియొక్కజగత్ప్రసిద్ధశో
భాకరసద్గుణంబు మహితాత్ములు శ్రద్ధగ విందు రీకథన్. 95

ఉ. నాదు కృతి న్వెలుంగు రఘునాథుని మంజుల దివ్యనామ మా
వేదపురాణసారము, పవిత్రతమంబు, శుభాలయంబు, ని
క్షేదము పార్వతీవృషభకేతనహృజ్జపమంత్రరాజ మీ
మేదిని నందుచే నిది యమేయజనాదరపాత్ర మయ్యెడిన్. 96

ఉ. పున్నమచంద్రుబోలు ముఖమున్, బహు భూషలు గల్గి, చీర తే
కున్నను కాంత శోభిలుచునుండదు; సత్కవు తే రచింపనీ
ఎన్ని యలంకృతుల్ రసము లెంతటి పాండితి భావజాల మం
దున్నను రామనామసుధ యుండని కావ్యము హేయహేయమే!

చ. ఇల సుకవుల్ రచించిన, మఱెట్టి కవిత్వపటుత్వమాధురుల్
గలుగకయున్న, సజ్జనులు గాంత్రు మహాదరదీప్తభావులై
సలలితరామనామవిలసత్కృతినిన్; సదసద్వివేకసం
కలితబుధుల్ మధువ్రతనికాయమువోలె గ్రహింత్రు సారమే! 98

ఉ. చేకొని మంచివస్తువును చేరగ జెడ్డయు బూజ్యమౌగదా!
ఏ కవితాగుణంబులు నొకింతయు గల్గకయున్న గాని యీ
నా కృతియందు రామనరనాథుప్రతాపము వ్యక్తమౌటచే
నాకొక గట్టి ధైర్యము మనంబున నున్నది పర్వతంబటుల్. 99

ఉ. ధూమముగూడ దా నగరుతోడను గూడి సుగంధపూర్ణమౌ
మామక కావ్య మాపగిది మానితరూపము లేనిదైన నా
రాముని విశ్వమంగళకరంబగు సత్కథగల్గియుంటచే
నీ మహి వన్నెకెక్కునని యెంచుచునుంటిని నేను రూఢిగా. 100

కం. మలయసుసంగతి దారువు
నిలలో గడు ప్రీతి జూచు నెల్ల జనంబా
యలఘురఘూత్తమకీర్తిని
గలసిన యీ కృతికి జగతి గడు ముదమొందున్. 101

ఉ. వంకరగా గమించు నది భవ్యజలంబుల సాధుసేవ్యమౌ,
శంకరు మేననంటిన శ్మశానపుబూది బుధుల్ నుతింత్రు ని
శ్శంకగ నా కవిత్వ మిల సారవిహీనము, వక్రమైన, రా
మాంకిత మాటచేత సుజనాదరపాత్రమునై వెలింగెడిన్. 102

ఉ. నల్లనిదైన ధేనువు గుణప్రదశక్తిని గూడి యెంతయో
తెల్లగనుండు క్షీరముల దీసియు ద్రాగుదు రెల్ల మర్త్యు ల
ట్లెట్లెడ గ్రామ్యవాక్యముల కీ కృతి తావలమైన, రామభూ
వల్లభుదివ్యకీర్తి విని పాడియు సజ్జను లుల్లసిల్లరే! 103

మ. మణిమాణిక్యసుమౌక్తికంబులు స్వజన్మస్థానరంగంబులౌ
ఫణిధాత్రీధరకుంభికుంభములపై భాసిల్లబోవంతగా,
గణుతి న్గాంచు నృపాలశీర్షరమణీకాయంబులం దా విధిన్
బ్రణుతి న్గాంచును సత్కవీశకృతి శుంభద్రీతి వేఱొక్కచో. 104

చ. హృదిని కవీశ్వరుండు స్మరియింపగ భక్తిని బ్రహ్మదేవుశ్రీ
సదనమునుండి పర్విడుచు శారద వచ్చును తచ్ఛ్రమంబటా
ముదితకు వేఱుమార్గముల బోవునె రామకథామనస్సర
స్సదమలదివ్యతీర్థమున స్నానమొనర్చినగాక తృప్తియై. 105

చ. వరకవిపండితోత్తములు బాగుగ దీని నెఱింగియే భయం
కరకలిదోషహారిహరిగాన మొనర్తురు భక్తితోడ దు
ర్నరగుణవర్ణనల్ సలిపినం దన నెత్తిని బాదుకొంచు, దు
ర్భరపరితాపసంకలితభావ యగు న్గద వాణి యక్కటా! 106

గీ. హృదయమే సముద్రము, బుద్ధియే రహించు
ముత్తెపుఁజిప్ప, శారద పుణ్యచరిత
స్వాతికార్తె యటంచును పలుకుచుంద్రు
బుధజనావళు లెల్ల నీ పుడమియందు. 107

గీ. అందు శ్రేష్ఠవిచారణ మనెడి జలము
బాగుగా గురియంగను బ్రభవమొందు
ఘనకవిత్వముక్తామణి యనుపమాన
కాంతిపటలమ్ములను వెలిగ్రక్కుకొనుచు. 108

ఉ. ఆ కవితాసుమౌక్తికమునందున యుక్త్యభిధానసూచికన్
బ్రాకటరీతి రంధ్రమిడి రామకథాతిమనోజ్ఞసూత్రమున్
శ్రీకరలీల గూర్చియును స్వీయవినిర్మలహృత్స్థలుల్ బుధా
నీక మలంకరించి పురణించు శుభంబగు ప్రేమశోభతో. 109

ఉ. భీకరమౌ కలిన్బడియు వేసియు హంసలవంటి వేషముల్
కాకులకార్యముల్ సలుపు కల్మషచిత్తుల సంఘమందునన్
బ్రాకటవేదమార్గమును బాసియు దుష్పథగాములైన పా
పాకరమర్త్యులందు నిజమాడగ నేనె ప్రధానగణ్యుడన్. 110

చ. కలిమలవారిధుల్ కపటకాయులు వంచకులౌచు రామదా
సులమని పైకి జెప్పుచును చూడగ దుర్గుణకామకాంచనం
బులకును దాసులౌ నరులు భూరివిపచ్ఛయకారులైన దు
ష్టులగణమందిల న్మొదటిచోటున నేనె గణింపజెల్లెదన్. 111

గీ. ఏను నా దుర్గుణములన్ని యెంచి చెప్ప
నదియె బ్రహ్మాండమంతగా నగును వాని
నెల్ల బూర్ణముగా వచియింపజాల
గొంచెమాడితి మీరె యూహించుకొనుడు 112

ఉ. ఏను బహుప్రకారముల నింతగ జేసిన విన్నపంబుచే
నే నరులైన నీ కృతిని నెంచరు దోషములంచు నెంత్రు గా
కే నరులైన నా వినతి నెంచక నా కృతి సేవగించుచో
ఈ నను మించు మూర్ఖులనియే తలపోసెద వారినందఱిన్. 113

మ. కవినా కా నిక వాక్చమత్కృతి గనంగా రాదు నాలోన నే
లవమున్ నాకును తోచురీతి మతి నుల్లాసంబు రేకెత్త నే
నెవియో రామగుణాభివర్ణనల నొక్కింతేని గావింతు దు
ర్భవసమ్మగ్నమనస్కుఁడేడనొ? బృహద్రామాయణం బేడనో ? 114

ఉ. ప్రాకటరీతి మేరుగిరిరాజము నే యెగురంగగొట్టు శా
ర్యాకరమారుతంబు కడ నా నిలుచుండుట దూదిపింజ? వా
ల్మీకిమునీంద్రముఖ్యులకె మించిన రామచరిత్రరాజమా !
యీ కడు స్వల్పబుద్ధికి గ్రహింపగ శక్యము? పూర్ణరీతిగన్. 115

కం. రాము మహోన్నతఘనతను
నా మనమున దలచినంత నాకు భయం బా
రామకథారచనం బే
నే మాదిరి జేయగలనొ? యెఱుగను బుద్ధిన్. 116

ఉ. శారద, శేషుడున్, శివుఁడు, సారససంభవముఖ్యులైన బృం
దారకకోటులున్, మఱియు, వన్నిగమాగమసత్పురాణముల్
శ్రీ రఘురాముతత్త్వముగుఱించి సమగ్రతగా నెఱుంగకే
వారక "నేతి నేతి" యని పల్కుచు గానము సేయుచుండవే. 117

ఉ. రాము గభీరసచ్చరిత వ్రాయగ, బల్క నశక్యమంచు నీ
భూమి నెవం డెఱుంగడు? ప్రభుప్రణయంబు నణంపలేక శ్రీ
రామగుణాభివర్ణనము రవ్వయు జేయక యెవ్వరాగి రా
ర్రామకథాత్యగాధజలరాశిని దాకి తరింతునేని దే 118

కం. భగవన్మహిమం బెవరును
జగమున దుదిముట్ట బలుకజాలరు; కానన్
దగదమ మార్గంబులతో
భగవత్కీర్తనము సేయ బలికెను శ్రుతులున్ 119

గీ. అద్వితీయు డ నీహుడై యభవు డగుచు
నామరూపరహితపరంధాము డగుచు
సచ్చిదానందరూపుడు, సర్వమయుడు,
విశ్వరూపుడై వెలుగొందు విభుడె ధరణి
నవతరించి యనేక కార్యముల సలిపె. 120

కం. కేవలభక్తహితార్థము
శ్రీవిభు డీ ధరణియందు జేసెను లీలల్
సేవకబృందంబులపై
నా విభునకు గలుగు కరుణ యసదృశ మహాహా! 121

హరికి నిజాశ్రితుం డనిన నత్యధికంబగుప్రీతి, వానిపై
గరుణకు మేర లేదు, కనగా నతడెవ్వనిపైన సత్కృపన్
బఱపునొ యట్టి భక్తుని కృపారసమంజులదృష్టితో సతం
బరయును గాని కోపమున కగ్గమొనర్ప డదెంత చిత్రమో! 122

కం. ఇట్టివి హరిగుణతతులని
గుట్టెఱిగిన పండితాళి గోవిందకథా
ఘట్టంబుల గీర్తించును
పుట్టుక సఫలంబు గాగ బుణ్యోక్తులచేన్. 123

పారముముట్ట నీశ్వరుప్రభావము వర్ణన సేయలేము త
ద్వారిధిలోని యే కణము పానము సేసిన గాని దుర్లభా
పారఫలంబు గల్గునని పాయని ధైర్యమెద న్వహించి, నే
నా రఘునాథపాదశరణాగతి బొంది రచింతు నీకృతిన్. 124

మొదటి మునీశ్వరుల్ పరమపుణ్యనిధానహరిస్తవంబు స
మ్మదమున బాడి రా తెఱగు బోవుటయే సుగమంబు నాకగున్
నదిపయి ధర్మదృష్టి నరనాగుడు వంతెనగట్టజేయ జి
న్నదియగు చీమగూడను ఘనశ్రమ లేకయె యొడ్డు జేరదే! 125

కం. తలచియు నే నీరీతిగ
బలమును చేకూర్చికొనియు భావములోనఁ
దలపడినాఁడ రచింపఁగ
సలలితమగు రామచంద్రచరితామృతముఁ. 126

---

## కవివందనము

ఉ. ఆదరబుద్ధితో హరిగుణాద్భుతకీర్తన చేసి నిత్యస
మ్మోదితఘోరసంసరణమోహభయాకులజీవులైన వ్యా
సాదికవీంద్రులన్దలతు నంజలిబద్ధుఁడనౌచు భక్తితో
నాదు మనోరథంబు గరుణన్ సఫలంబొనరింప గోరుచున్. 127

కం. కలిలోఁ బుట్టియు రాముని
సలలితగుణవర్ణనముల సంస్కృతమందున్
సలిపిన కవివర్యులకే
సలిపెద నతిభక్తితోడ సాష్టాంగనతుల్. 128

చ. హరిచరితామృతంబును మహాత్ములు ప్రాకృతసత్కవీశ్వరుల్
వఱల రచించి రెందఱో శుభంకరలీలను దేశభాషలం;
దరిగిన కాలమందుగల యట్టికవీంద్రుల, నిప్పుడున్న యీ
ధర నిక బుట్టనున్న కవితల్లజుల న్వినుతించి మ్రొక్కెదన్. 129

ఉ. మీరు ప్రసన్నులై ధరణిమీఁదను నా కృతి సాధులోకస
త్కారము పొందునట్లు వరదాన మొసంగుఁడు, బుద్ధిశాలురౌ
వారు సమాదరింపని ప్రబంధము వ్రాయుట జూడఁగా నెదో
యూరక బాలకుల్ సలుపుచుండు నిరర్థకకేళియే కదా! 130

కం. కీరితి కవితయు సంపద
నారక యెల్లరకు గంగవలె హితమైనన్
ధారుణి నుత్తమము లనుచు
సూరిజనులు జేయుచుంద్రు స్తుతిజాలములన్. 131

గీ. రామచంద్రుయశ స్సతిరమ్య మకట !
నా కవితయో కురూపిణి; నాదు చిత్త
మిట్టి యసమంజసత్వంబు నెంచి భయము
చెందుచున్నది కృతిని రచింతమనిన. 132

గీ. భవ్యకవులార ! మీ దయవలన నాకు
నలఘుకార్యము సైతము సులభమగును
నారచీర పైనను పట్టుదారములను
కుట్టుచో నది శోభతో గూడుకొనదె ? 133

కం. సరళము, విమలము, హరిగుణ
భరితం బే కవిత, దాని బాగుగ విని లో
నరిజనులైనను మెత్తురో,
అరసెద రా కవిత జతురు లాదరమతులన్. 134

ఉ. అట్టి కవిత్వమున్న విమలాత్ములబుద్ధికె చిక్కు, లేదు నా
కట్టి మనోబలంబు మఱి యందులకే కవివర్యులార ! నే
బెట్టి నమస్కృతుల్ తిరిగి వేడుచునుంటిని మిమ్ము, నేను చే
పట్టిన రామకావ్యమును పల్కెడి శక్తి ననుగ్రహింపరే. 135

ఉ. ఓ యమలాత్ములైన విబుధోత్తములార ! కవీంద్రులార ! రా
మాయణ మానసాంతరవిహారమనోహరహంసలార ! రా
మాయణమందు నాకుగల యాశను నాదగు బాలనప్రభా
వాయతచిత్తము న్గని దయార్ద్రమనస్కులు గాగ వేడెదన్. 136

కం. తలచియు నే నీరీతిగ
బలమును చేకూర్చికొనియు భావములోనఁ
దలపడినాఁడ రచింపగ
సలలితమగు రామచంద్రచరితామృతముఁ. 126

## కవివందనము

ఉ. ఆదరబుద్ధితో హరిగుణాద్భుతకీర్తన చేసి నిత్యస
మ్మోదితఘోరసంసరణమోహభయాకులజీవులైన వ్యా
సాదికవీంద్రులన్దలతు నంజలిబద్ధుడనౌచు భక్తితో
నాదు మనోరథంబు గరుణన్ సఫలంబొనరింప గోరుచున్. 127

కం. కలిలో బుట్టియు రాముని
సలలితగుణవర్ణనముల సంస్కృతమందున్
సలిపిన కవివర్యులకే
సలిపెద నతిభక్తితోడ సాష్టాంగనతుల్. 128

చ. హరిచరితామృతంబును మహాత్ములు ప్రాకృతసత్కవీశ్వరుల్
వఱల రచించి రెందఱో శుభంకరలీలను దేశభాషలం;
దరిగిన కాలమందుగల యట్టికవీంద్రుల, నిప్పుడున్న యీ
ధర నిక బుట్టనున్న కవితల్లజుల న్వినుతించి మ్రొక్కెదన్. 129

ఉ. మీరు ప్రసన్నులై ధరణిమీదను నా కృతి సాధులోకస
త్కారము పొందునట్లు వరదాన మొసంగుడు, బుద్ధిశాలురౌ
వారు సమాదరింపని ప్రబంధము వ్రాయుట జూడగా నెదో
యూరక బాలకుల్ సలుపుచుండు నిరర్థకకేళియే కదా! 130

కం. కీరితి కవితయు సంపద
నారక యెల్లరకు గంగవలె హితమైనన్
ధారుణి నుత్తమము లనుచు
సూరిజనులు జేయుచుండ్రు స్తుతిజాలములన్. 131

గీ. రామచంద్రుయశ స్సతిరమ్య మకట!
నా కవితయో కురూపిణి; నాదు చిత్త
మిట్టి యసమంజసత్వంబు నెంచి భయము
చెందుచున్నది కృతిని రచింతమనిన. 132

గీ. భవ్యకవులార! మీ దయవలన నాకు
నలఘుకార్యము సైతము సులభమగును
నారచీరపైనను పట్టుదారములను
కుట్టుచో నది శోభతో గూడుకొనదె? 133

కం. సరళము, విమలము, హరిగుణ
భరితంబే కవిత, దేని బాగుగ విని లో
నరిజనులైనను మెత్తురొ,
అరసెద రా కవిత జతురు లాదరమతులన్. 134

ఉ. అట్టి కవిత్వమున్న విమలాత్ములబుద్ధికె చిక్కు, లేదు నా
కట్టి మనోబలంబు మఱి యందులకే కవివర్యులార! నే
బెట్టి నమస్కృతుల్ తిరిగి వేడుచునుంటిని మిమ్ము, నేను చే
పట్టిన రామకావ్యమును పల్కెడి శక్తి ననుగ్రహింపరే. 135

ఉ. ఓ యమలాత్ములైన విబుధోత్తములార! కవీంద్రులార! రా
మాయణ మానసాంతరవిహారమనోహరహంసలార! రా
మాయణమందు నాకుగల యాశను నాదగు బాలసత్రమభా
వాయతచిత్తము న్గని దయార్ద్రమనస్కులు గాగ వేడెదన్. 136

ఉ. ఈ కలుషోగ్రలోకమున నెల్లెడలన్ ఘనదుఃఖవహ్నికీ-
లావలమాలికాశతమునార్పగ రామకథామృతంబు నా
హా ! వరిపించినట్టి కరుణాంబుధి, యాదికవీంద్రుడైన వా
ల్మీకిమునీంద్రు పాదముల మించిన భక్తిని నే భజించెదన్. 137

గీ. సఖరమైన సుకోమలచారుగుణము
దూషణసమేతమైన నిర్దోష మహాహా !
ప్రథితముని రాజవాల్మీకిరచితమైన
అఖిలసంపూజనీయ రామాయణంబు ! 138

గీ. జననమరణాతిఘోరసంసారజలధి
దాట జేసెడి నావలై దాశరథుల
నిర్మలయశంబు సతము వర్ణించునట్టి
నాల్గు వేదంబులను నేను నతులొనర్తు. 139

కం. బుధులను గోశశి సుధలా
యధము లన న్బరగు మద్యహాలాహలముల్
విధిగభవాబ్ధి సృజించిన
విధిని యథావిధిగ నేను ప్రీతి భజింతున్. 140

కం. సురభూసురవిబుధులకును
వఱలెడు గ్రహరాశిపాదపద్మంబులకుం
గరములు జోడించెద నే
గరుణను మత్కార్యసిద్ధి గలిగించుటకై. 141

ఉ. వాణికి గంగకు న్సలుపువాడ నమస్కృతు లేకభక్తి న
మ్మానిను లిద్దఱున్ మహితమంజులభవ్యచరిత్ర లెంచు; గం
గానది స్నానపానముల గల్మషరాశి నణంచు; వాణి మా
ఘాానల మెల్ల నార్పు; వినినంతనె యూరక పల్కినంతనే ! 142

కం. నిరతశుభప్రదు లుజ్జ్వల
పరమకృపానిధులు దీనబాంధవు లస్మ
ద్గురువులు మాతాపితలగు
గిరితనయాశంకరులకు గేలు మొగుడ్తున్. 143

కం. రాముని భక్తులు, ప్రభువులు,
ప్రేముడి సఖులైన శాంకరీపరమేశుల్
స్వాములు నాకు నిజంబుగ
ప్రేమను సల్పెదరు హితము వీడక సతమున్. 144

మ. ధర దుర్గాశివదేవదివ్యకృపనుద్యచ్ఛక్తి భాసించె శా
బరమంత్రంబు లహో! నిరర్థపదముల్ భ్రష్టప్రలాపంబు; లా
గిరిజాశంకరు లందనిల్చియును నా ఖేదమ్ము బోనాడి ని
ర్భరమోదాఖిలభద్రమూల మొనరింపన్ లేరె మత్కావ్యమున్. 145

ఉ. ఈ విధి పార్వతీశివుల నెంచియు, వారి యనుగ్రహంబుచే
భావము ధైర్యపూర్ణమయి భాసిల రామకథన్ రచింతు; మ
త్పావన కావ్య మా శివకృపామహిమంబున శోభ జెందు దా
రావృతచంద్రదీప్తనిశ యట్లు మహాజనతాభిరామమై. 146

చ. ఎవ రిల సావధానముగ నీ రఘురామకథ న్గ్రహించియున్
శ్రవణము చేతురో, చదువజాలెదరో, యనురాగ మొప్ప వా
రవని గలిప్రచండకలుషావళిబాసి శుభంబు లొందియున్
భవహర రామచంద్రపదభాగ్యము గాంతురు శాశ్వతంబుగన్. 147

గీ. పార్వతీమహాదేవుల పరమకరుణ
స్వప్నమందైన నాయందు వఱలునేని
నాదు దేశీయకృతిలో గుణంబు లెల్ల
సత్యమగుగాక! సతతంబు క్ష్మాతలమున. 148

## అయోధ్యాది వందనము

గీ. అమితపావన మగు నయోధ్యాపురికిని
సకల కలికాలపాపముల్ సమయజేయు
భవ్యసరయూనదికి జేతు వందనములు
భక్తిభావాశ్రువులు జాలువాఱుచుండ. 149

గీ. శ్రీరఘూత్తము ఘనమగు కారణభాగ్య
మునకు నోచిన సాకేతపురములోని
సకలనారీనరావళిచరణములకు
భక్తిగదుర బునః పునః ప్రణతులిడెద. 150

కం. సీతను నిందించిన నరు
పాతకములనెల్ల బాపి వాత్సల్యముతో
బాతని శోక మణంచియు
నాతతనిజలోక మొసగె నా రాము డహో ! 151

ఉ. చేసెద వందనంబులను చేతులు రెంటిని పైకియెత్తి నే
నా సకలప్రపంచహితు డా ఖలపద్మతుషారు డా జగ
ద్భాసురరామచంద్రభగవానుడు, తా నుదయించినట్టి శ్రీ
కోసలజానుపూర్వదిశకున్ భువనైక యశఃప్రభావకున్. 152

గీ. పుణ్యములప్రోవు మంగళములకురాశి
యనుచు రాజ్ఞీసమేతుడై యతిశయిల్లు
దశరథేంద్రున కేను వందనము జేతు
దన తనూజు కింకరుడని దయదలంప. 153

కం. మహిమను నవధులనందగు
మహితాత్ములు రామచంద్రు మాతాపితరుల్
మహి వారి సృజించి పితా
మహుఁడును ఘనుఁడయ్యె దేవమధ్యమునందున్. 154

ఉ. శ్రీరఘురామపాదరతచిత్తుఁడు నిక్కపుభక్తుఁ డాతఁ డా
హా! రఘువీరఘోరవిరహానలభారతృణీకృతాత్మశా
రీరకమోహుఁడై పరిహరించెను ప్రాణచయంబు; నమ్మహో
దారగుణాబ్ధియౌ దశరథప్రభు నెంచి సభక్తి మ్రొక్కెదన్. 155

చ. అనుపమయోగభోగములయందున దాఁచి నిగూఢపద్ధతిం
దనదగు రామచంద్రపదతత్త్వగభక్తిని; రామచంద్ర ద
ర్శనమయినంత బెల్లుబుక సల్పిన యట్టి గభీరభక్తుఁడై
ఘనపరివారయుక్తుఁడయి క్రాలు విదేహున కేను మ్రొక్కెదన్. 156

చ. నిరుపమసత్తపోవ్రత వినిర్మలధర్మపథాతి నిష్ఠుఁడున్
వరరఘురామచంద్రపదపంకజలుబ్ధసుధ్రువతాత్ముఁడౌ
భరతుని మంగళాంఘ్రులను భావమున న్మనుముందు గొల్చెదం
దరుగని భక్తి నిచ్చి తన దాసునిగా నను స్వీకరింపఁగన్. 157

ఉ. రామవిశుద్ధభద్రకరిరమ్యయశోధ్వజదండ మాచు నీ
భూమి జరించినట్టి బహుపుణ్యసులక్షణుఁడైన లక్ష్మణ
స్వామివరేణ్యుశీతలసుభక్తసుఖప్రదసుందరాంఘ్రులన్
నా మదిలోన నిల్పి భజనంబొనరింతు నితాంతభక్తితో. 158

చ. తనదు సహస్రశీర్షముల ధాత్రి భరించెడు శేషమూర్తి ల
క్ష్మణుఁడయి భూభయంబణఁచి కాచెను సంతులసాధులోక; మా
గుణనిధి, సత్కృపాజలధి, కోమలభావుఁడు, రామసోదరుం
డనవరతంబు నాయెడ దయామతితోడ ప్రసన్నుఁడయ్యెడున్. 159

గీ. చండశౌర్యుఁడు, సచ్ఛీలసాగరుండు,
సతతభరతాంఘ్రియుగ్మానుసారియైన
పూజ్యశత్రుఘ్ను నడుగుదమ్ములకు నేను
వందనముసేయుచున్నాఁడ భక్తితోడ. 160

ఉ. కేవలరామచంద్రముఖకీర్తితకీర్తి, ఖలాటవీదహ
నావకమూర్తి, జ్ఞానఘనవారిధి, మారుతి, చాపయుక్తసీ
తావరదీప్తహృత్స్థలుఁడు, దారుణసంగరరంగపండితుం
డై వెలుఁగొందు శ్రీహనుమ నంజలిబద్ధుఁడనై నుతించెదన్. 161

ఉ. న్యూనశరీరము ల్గలిగియున్నను, శ్రీరఘురామసన్నిధి-
శ్రీని గడించుకొన్న కపిశేఖరజాంబవదంగదాదిస-
ద్వానరవీరసైన్యముల భవ్యమనోజ్ఞపదాబ్జకోటికిన్,
దానవరాడ్విభీషణు పదంబుల కే నొనరింతుఁ బూజలన్. 162

కం. జగమున నిష్కామముగా
జగదీశ్వరుఁడైన రామచంద్రునిసేవం
దగ నొనరించిన భక్తుల
ఖగ మృగ సుర మర్త్య దైత్యగణముల గొలుతున్. 163

కం. మునివరు, లఖండభక్తులు
ననుపమవిజ్ఞానరాశు, లద్భుతకరుణా
ధనులగు, శుకసనకసనం-
దననారదమునుల యడుగుదమ్ముల గొలుతున్. 164

చ. అమిథిలేంద్రు కూర్మితనయామణి, యీపదునాల్గు భూరిలో
కమ్ముల గన్నతల్లి, రఘుకాంతుని పట్టపురాణి, యైన సీ-
తమ్మ యడుంగుదమ్ములకు దద్దయు భక్తిని మ్రొక్కుచుంటి, మా
యమ్మ-కృపామహత్త్వము మదాత్మను శుద్ధమొనర్పకుండునే! 165

ఉ. విచ్చిన తమ్మిఱేకులటు వెల్గెడి కన్నులవాఁడు, దుష్టులన్
ద్రచ్చు ధనుశ్శరంబుల గరంబులఁదాల్చినవాఁడు, కూర్చి యా
పచ్చయముల్, సుఖంబొసగు వాఁడగు రాముని సర్వశక్తిభా-
స్వచ్చరణారవిందముల భక్తి భజించెద నే ద్రిశుద్ధిగన్. 166

గీ. పైకి జూడగ భిన్నులవలెనె తోఁచి
కాంచ వాగర్థజలవీచికలుగ నుండి
వాస్తవంబున నేకమై వఱలు నట్టి
యార్తజనబాంధవులు, గరుణాబ్ధులైన
జానకీరాములకు నమస్కార మిడెద. 167

---

## శ్రీరామనామప్రభావము

గీ. *ఎది కృశానుభానులకును హిమకరునకు
గారణంబగు నా రఘుకాంతు 'రామ
నామ' మున కెప్పుడును వందనంబొనర్తు
బరమభక్తిసంపూరితభావమునను. 168

---

* అకారము మొదలు ఏబది వర్ణములకు అధిష్ఠాన దేవతలు కలరనియు, 'ర' కారము అగ్నిబీజమనియు, 'అ' కారము సూర్య బీజమనియు, 'మ' కారము చంద్ర బీజమనియు మంత్ర శాస్త్రము నిర్వచించును. అజ్ఞానమను అంధకారమును పాఱద్రోలునది జ్ఞాన ప్రకాశము. ఆ ప్రకాశమునకు అధిష్ఠాన దేవతలు సూర్య చంద్రాగ్నులు. వారికి బీజములు 'ర' కార 'అ' కార 'మ' కారములు. అందుచే ఆ మూడు వర్ణములతోగూడిన రామనామము అగ్ని సూర్యచంద్రులకు హేతువని వచింపబడినది.

కం.† శ్రీరామనామ మహహా!
నీరజభవవిష్ణురుద్రనిలయము, వేదా
ధారము, నిర్గుణ, మసమము,
చారుసుగుణరత్నములకుసాగర మెన్నన్. 169

కం. శ్రీరామమహామంత్రము
గౌరీపతి జపముసేయు గాశికయం; దా
తారకమంత్రమె మృతులకు
గారణమై మోక్షమీయ ఘనత వహించెన్. 170

కం. వరరామమంత్రమహిమం
బెఱుగును గణనాథు డాత డెల్లక్రియలన్
స్థిరముగ దొలిపూజలు గొను
టరయమె శ్రీరామమంత్ర మందలి మహిమన్. 171

కం. తెలియును ప్రథమకవీంద్రుం
డలఘుశ్రీరామనామమందలి మహిమం
దలక్రిందుగ నా మంత్రము
బలికియు వాల్మీకి లోకపావను డయ్యెన్. 172

---

† అగ్ని శివరూపము; సూర్యుడు విష్ణురూపము, చంద్రుడు బ్రహ్మ స్వరూపమని పురాణ ప్రసిద్ధి; అందుచేత రామనామము త్రిమూర్త్యాత్మకము; అది రకార అకార మకారాత్మకమైన ప్రణవమునకు మఱియొక రూపమని తత్త్వవేత్తలనుడి; అందుచే తారకము ప్రణవ సహితముగ లేదు. ప్రణవము వేదములకు ఆదివర్ణమైనందున ప్రణవ స్వరూపమైన రామనామము వేదములకు ఆధారమైనది; త్రిగుణాతీత జ్ఞానమే రామ స్వరూపము గావున నిర్గుణము; అది అజ్ఞానహరణము, ఆనంద సంధాయకత్వాది గుణములు కలది గాన రామనామము సర్వసుగుణ సాగరము.

గీ. 'రామ' యను నామము సహస్రనామతుల్య
మని యెఱింగి యుమాదేవి హరునివలన
భక్తితో నిత్యమును తనభర్తతోడ
భవ్యమగు రామనామజపంబు సేయు. 173

గీ. పార్వతీహృదయంబున భాసురిల్లు
రామనామానురక్తి హర్షమును బెంచ
శంకరుడు తనమేని భూషణ మొనర్చె
స్త్రీవిభూషణ మగు నుమాదేవి నహహ! 174

కం. శ్రీరామమంత్రమహిమను
గౌరీపతి యెఱుగు బాగుగా; గావుననే
ఘోరవిషానల మౌరా!
మారెను దివ్యామృతముగ మంగళకరమై. 175

గీ. రామపదపద్మభక్తి వర్షర్తు; వమల
భక్తులో వరిమొక్కల వంటివారు;
'రామ' యనునట్టి రెండు వర్ణంబు లెన్న
దగును శ్రావణ భాద్రపదంబులుగను. 176

గీ. 'రామ' యనునట్టి రెండక్షరంబు లహహ!
మధుర మంజులములు; వర్ణమాల కవ్వి
నేత్రములు రెండు నౌచును నెగడుచుండు;
పరమభక్తుల కవియె జీవనము లగును! 177

కం. సులభము, సుఖదము, స్మరణన్
సలుపగ నెల్లరకు రామ సన్మంత్ర మహో!
కలిగెడునిహపరసుఖములు
సలలిత మగు రామనామసంస్మరణమునన్. 178

కం. పలుకగ, వినగ, స్మరింపగ
సలలితమధురములు 'రా' 'మ' సద్వర్ణంబుల్
తులసికి రాఘవసౌమి
త్రులవలె బ్రియమైన విప్వి స్తోత్రము సేయన్. 179

గీ. 'రామ' యను వర్ణములను వేర్పఱచి వర్ణ
నమ్ము సేయ వేర్వేఱు సుఖమ్ము లొదవు;
కాని యీ వర్ణములు రెండుగాక యొకటె;
జీవుడును బ్రహ్మ మేకమై చెలగురీతి
నవ్వి యేకమై యద్వయహర్ష మొసగు !. 180

కం. నరనారాయణులట్టుల
వఱలెడు నా 'రామ' నామవర్ణద్వయమే
పరిపాలించుచు జగముల
గరుణను నిజభక్తకోటి గాచు సతంబున్. 181

కం. భగవద్భక్తిసతీమణి
కగు కర్ణవిభూషణంబు; లాదిత్యేందుల్
తగ మేలొనగూర్చుటలోఁ
జగముల; కా 'రామ' యనెడి సద్వర్ణంబుల్ 182

గీ. మోక్షసుధకు మాధుర్యసమ్మోదములుగ
వసుధ కాదికచ్ఛపభోగిపతులనంగ
నతిశయిల్లుచున్నది; 'రామ' యను ప్రసిద్ధ
పతితపావనమై యున్న వర్ణయుగము. 183

గీ. భక్తమానససుందరపద్మములకు
భ్రమరరాజ మీ రామమంత్రంబు సతము;
జిహ్వయను యశోదను సంతసింపజేయు
రామకృష్ణు లీ 'రా' 'మ' వర్ణములు రెండు. 184

గీ. సర్వవర్ణంబులకును 'రా' ఛత్రముగను
మకుటమణిగా 'మ' కారము మఱి వెలుంగ
రామచంద్రుని పావననామ మఖిల
దివ్యమంత్రరాజంబయి తేజరిల్లు. 185

కం. ఎఱిగిన నామము నామియు
నిరువురు సమమైనవారలే; ప్రభుభటుల
ట్లిరువురు పరస్పరప్రియు;
లరయుడు నామ ప్రభావ మద్భుత మహహా! 186

ఉ. శ్రీధరునామరూపములు రెండును చింతనసేయ నీశ్వరో
పాధులు; రెండునున్ విజితవాఙ్మ, లనాదులు, శుద్ధబుద్ధిసం
సాధనయోగ్యమైన; వపచారము సేయుట యగును రెంట భే
దాధమదృష్టి గొప్పదొకటొ మఱియొక్కటి న్యూనమన్నచో. 187

గీ. రెంటిలోఁగల గుణమ్ములరీతి విన్న
ధీరులగు సజ్జనులె మది దెలియగలరు;
అరయ రూపము నామవశ్యముగ దోచు
నెఱుగకయె పేరు రూపము నెఱుగలేము. 188

కం. కరమున రత్నం బుండియు
నెఱుగక యద్దాని నామ మెఱుగంగలమా?
గురుతర వస్తువిశేషము;
నరయుడు నామంబులోని యద్భుతమహిమన్. 189

ఉ. రూపము నెంచకుండగనె రూఢిగ నామముసంస్మరింప, నా
రూపము కానవచ్చు నెద రూఢిగ దివ్యసుఖంబుగల్గు; నా
శ్రీపతినామరూపగతి జెప్ప నశక్యము; వాని తత్త్వమున్
లోపల సంగ్రహించిన నలుత్తమహాసుఖ మబ్బితీరెడిన్. 190

గీ. సగుణనిర్గుణములమధ్యసాక్షి యగుచు
నరయ నుభయప్రబోధక మగు ద్విభాషి
యగుచు నామము వెలుగొందు ననవరతము;
దాని మహిమము వర్ణింప దరము గాదు ! 191

కం. తులసి వచించెడి దేమన
వెలుపల లోపలను నీకు వెలు గవసరమా ?
నిలుపుము జిహ్వాగేహాళి
మలహార మగు రామనామమణిదీపంబున్. 192

చ. పరమవిరాగదృష్టిని బ్రపంచము నెల్ల బరిత్యజించియున్
నిరతనివృత్తులైన మహనీయులు యోగులు రామనామసం
స్మరణము సేయుచున్ సతతజాగృతిగల్గియు గాంతు రాత్మలో
నిరుపమనిర్గుణాకథననిత్యమునై మను బ్రహ్మసౌఖ్యమున్. 193

గీ. పరమగూఢమౌ పరతత్త్వ మెఱుగ గోరు
వార లీ రామనామజపంబు జేసి
యమ్మహాదనన్యదుర్లభమైన యట్టి
బ్రహ్మతత్త్వానుభూతిని బడయగలరు. 194

కం. సిద్ధుల గోరెడి వారలు
శ్రద్ధగ శ్రీరామనామజప మొనరింపన్
సిద్ధులు నణిమాది నిఖిల
సిద్ధులు; సకలార్థసమితి చేకురు నెపుడున్. 195

కం. పడియును దుఃఖాగ్నులలో
నిడుమల బడుచున్న మర్త్యు లేర్పడ జేయన్
విడువక నామజపంబును
గడచియు గష్టాంబురాశి గాంతురు సుఖముల్. 196

వ. అరయ *జతుర్విధప్రభుపదాంబుజభక్తులు పూజ్యు, లాప్తని
ర్ధరితు, లుదారులీ నలుగురున్ హరినామసమాశ్రితాత్ము లై
వఱలెదరందు, జ్ఞాని యగు భక్తునిమీఁదనె ప్రీతి యెక్కుడా
హరికి; ననన్యభావసహజాద్భుతభక్తియె శ్రేష్ఠ మన్నిటన్. 197

గీ. నాల్గుయుగములలోనను నాల్గుశ్రుతుల
నామమహిమంబు గాంచె ఘనప్రసిద్ధి;
కాని కలిలో విశేషము; కలియుగమున
నామజపమే శరణ్య మన్యంబు గాదు. 198

కం. కామవిహీనులు, నాత్మా
రామామలపరమభక్తిరసలీనులు, ని
ష్కాములు నైతము గారే
నామసుధాహ్రదసుమీన నమ్యమనస్కుల్. 199

గీ. నిర్గుణసగుణములు రెండు, నిరుపమంబు
లకథనము, లగాధమ్ము, లనాదులైన
యా పరబ్రహ్మరూపంబు లవును; నాకు
నామ మీ రెంటికంటె ఘనముగఁ దోచు. 200

ఉ. ఎందులకన్నచో సగుణమేనియు నిర్గుణమేని రెండు గో
విందుని నామవశ్యములు; విజ్ఞులు నా నుడి ప్రౌఢవాక్కుగా
డెందమున న్దలంపఁదగుఁడీ! యనుభూతిని బ్రీతినిన్ రుచిం
బొంది వచించుచుంటిని ప్రపూజ్యము, శ్రేష్ఠము నామమే
[సుమా! 201

*చతుర్విధభక్తులు : 1 ఆర్తులు 2 అర్థార్థులు 3 జిజ్ఞాసువులు 4 జ్ఞానులు

కం. అగుణము దారుగతాగ్నిగ,
సగుణము బహిరంగవహ్నిచందము వెలుగుం
దగ నీ రెండును దుర్లభ
మగునవియే గాని సులభ మైనవిగావే! 202

ఉ. కాని, ముకుందనామజపకార్యముచే, గుణయుక్తనిర్గుణ
జ్ఞానయుగంబులభ్యమగు; సత్యమెఱింగియె మీఁద నిర్గుణం
బైనటువంటి బ్రహ్మమును, నా సగుణుండగు రాము మీఱి మే
లైనది రామనామమసుమా! యని నేను వచింతు రూఢిగా. 203

గీ. అఖిలవస్తుసంవ్యాపక మద్వయంబు,
సత్య, మవినాశకంబు, విజ్ఞానఘనము,
మఱియు నానందరాశి బ్రహ్మంబు గనగ
నద్ది సర్వజీవాత్మల యందు గలదు. 204

గీ. అట్టి యవికార మగు బ్రహ్మ మాత్మలోన
గలిగియును జీవకోటి దుఃఖమును విడదు;
కాని నామనిరూపణ కార్యమునను,
జపముచేతను బ్రహ్మదర్శనము గలుగు
సులభముగ; బ్రీలి నశియించు శోకతమము. 205

గీ. నిర్గుణబ్రహ్మమును మించి నెగడుచున్న
నామమహిమ వచించితి; నామ మింక
సగుణ మగు బ్రహ్మమునకంటె జాల యధిక
మని వచింతును; నేను గాంచినవిధాన. 206

ఉ. రాముడు భక్తసంఘముల రక్షణసేయ మనుష్యమాత్రుడై
బాములకోర్చి సాధుజనబాధలబాపెను; కాని నామమో!
యీమహిలో జపింప శ్రమియింపకయే సులభంబుగా మహో
ద్దామ ముదంబు, మంగళకదంబము, భక్తుల కిచ్చి కాచెడిన్. 207

కం. రాముం డొక్క యహల్యను
ప్రేమను తా నుద్ధరించె బృథ్విని; కానీ
నామమె ! కోట్లకొలందిగ
బామరజనసమతులెల్ల బాగొనరించెన్. 208

కం. మునిహితమునకై రాముడు
తునిమెను తాటకను సేనతోడ సుబాహున్;
గనగా నామమె ! యగణిత
జనదుఃఖము లుగ్రపాపచయములు దునిమెన్. 209

కం. రాముడు స్వయముగ విఱిచెను
భీమంబగు శివధనుస్సు; విజయంబొప్పన్
నామప్రతాపమాత్రము-
చే మడియును భవభయంబు చిత్రముగాగన్. 210

కం. రాముడు దండకవన మభి
రామముగా జేసె బాదరాజీవములన్
నామమె ! కోట్లకొలందిగ
బామరజన మానసముల భవ్యమొనర్చెన్. 211

కం. రాముడు దైత్యగణంబుల
భూమిని దా సంహరించె; భుజబలదీప్తిన్
నామమె ! స్మరణముచేత నె
భీమంబగు సకలకలుషబృందము గూల్చెన్. 212

కం. రాముడు జటాయు శబరీ
నామకసద్భక్తవరుల, నమ్మినవారిం
బ్రేమను సద్గతి కంపెను;
నామమె ! యమితోగ్రదుర్మనస్కుల గాచెన్. 213

కం. కపిపతిరాక్షసపతులకు
గృపతో నిర్వ్యరకు శరణ మిచ్చెను రాముం;
డుపమింపంగను నామమె !
కృపతో నిర్ధనుల నెందఱినొ రక్షించెన్. 214

కం. సేతువు గట్టగ రాముడు
కోతుల భల్లూకములను గూర్చి శ్రమించెం
బ్రీతిని నామము దలచిన
బాతకభవవార్ధి యింకు బహుచిత్రముగా 215

ఉ. రాముడు.రావణాదుల దురంబున గూల్చి యయోధ్య కేగియుం
బ్రేమదలిర్ప నేలి జనబృందముల న్సుఖపెట్టె; రాముశ్రీ
నామము మోహశత్రువుల నాశ మొనర్చి రణంబులేకయే
క్షేమము గూర్చి భక్తులకు జింతలణంచును శాశ్వతంబుగా. 216

చ. కన సగుణంబు నిర్గుణముగా మను బ్రహ్మముకంటె నామమే
తనరును శ్రేష్ఠమౌచు; వరదాతల కయ్యది దాత; గాన గై
కొనెను శివుండు దివ్యశతకోటిసువిస్తరరామగాథలో
ఘనమగు రామనామము నఖండమహాద్భుతశక్తిదీప్తమున్. 217

కం. నామప్రసాదముననే
ఆ మహితుండైన శంభు డమృతుం డయ్యెన్
నామమహత్త్వమె కాదా
కామారి శివత్వ మొంద గారణ మయ్యెన్. 218

కం. శ్రీశుకసనకప్రముఖ ము
నీశులు సుజ్ఞానసిద్ధ పృథుతరయోగుల్
శ్రీశునినామముచే నవి
నాశం బగు బ్రహ్మపదమునన్ మనలేదా ? 219

కం. భగవన్నామమహత్త్వము
భగవంతుడు నారదుండు బాగుగ నెఱుగున్;
జగతీప్రియహరిహరులకు
దగ నాతం డిష్టుడయ్యె దన్నామముచే. 220

కం. మేదిని భగవన్నామము
నాదరమున నాత్మలోన ననయం బా ప్ర
హ్లాదుడు స్మరియించుటచే
గాదా? సద్భక్తగణశిఖామణి యయ్యెన్. 221

కం. తన పినతల్లి దురుక్తుల
మనమున ఖేదంబు జెంది మహిలో ధ్రువుడున్
వని హరినామ జపంబున
గనడే? సుస్థిరసుపూజ్యఘనతరపదమున్. 222

కం. శ్రీరాము భవ్యనామము
మారుతి జపియించుచుంట మదిలో, బడసెన్
శ్రీరాముని తనవశమున
నేరుపుతో నుంచగలుగు నిరుపమశక్తిన్. 223

ఉ. ఎంచ నజామిళుండును, గజేంద్రుడు, వేశ్యయు హీనులైన, వా
రెంచి ముకుందనామము తరించిరి; ఎంతని నామశక్తి వ
ర్ణించెద! నే; నపారమగురీతిగ వెల్గెడి రామనామది
వ్యాంచితసద్గుణంబుల నహో! వచియింపగలేడు రాముడున్. 224

కం. తలచియు నామము మాఱెను
తులసిగ భంగామవంటి తులసీదా; సీ
కలిలో భగవన్నామం
బల కల్పక మఖిలమంగళాలయ మహోహో ! 225

గీ. నాలుగుయుగంబులను మూడుకాలములను
మూడులోకంబులను నామమును జపించి
భూతకోటులు దుఃఖవిముక్తి గాంచు;
నామమాహాత్మ్య మేరి కెన్నంగ దరము ! 226

గీ. సర్వవేదపురాణసజ్జనమతంబు
"అఖిలపుణ్యఫలంబుగా నమల మైన
రామపాదసరోరుహప్రేమ కలుగు"-
ననెడి విషయమే బాగుగా నరయు నెడల! 227

కం. అల కృతయుగమున ధ్యానము
సలిపియు, త్రేతాయుగాన సలిపి మఖంబుల్,
వెలయగ ద్వాపరమున బూ
జలు సల్పి, ముకుందు గనిరి సజ్జను లెల్లన్. 228

కం. కలుషావాలము, కేవల
మలినాకర మైన కలిని మానవచిత్తం
బులు, పాపసముద్రములో
మెలగెడి మత్స్యంబు లౌర ! మేదినిలోనన్. 229

కం. అలఘుభయంకర మగు నీ
కలిలో నామంబె కల్పకద్రుమ మాహా!
తలచినమాత్రముచే నది
తొలగించు సమస్తలోకదుఃఖాకులతన్. 230

కం. కలిలోఁ గోర్కుల దీర్పఁగ,
నెలమిని పరమందు శాంతి, హిత మొనరింపం,
దలిదం(డులవలె గావగ
నిలలోఁ, శ్రీరామనామమే శరణంబా! 231

కం. నిలువదు కర్మయు, భక్తియు,
నిలువదు జ్ఞానంబు; కలుషనికరంబా నీ
కలియుగమందు శరణ్యము
సలలిత మగు రామనామసంస్మరణంబే! 232

కం. ఖలగుణకపటాంబుధియగు
కలియుగ మను కాలనేమి గడతేర్పఁ, మహా
బలుఁడును, బుద్ధివిశాలుం -
డలఘుండగు హనుమ యగును హరినామ మిలన్. 233

కం. కలియుగహిరణ్యకశిపుని
ఖలునిం జెండాడి జాపకజన(ప్రహ్లా
దుల గాచు నృసింహుం డీ
యిలలోఁ శ్రీరామనామ మెన్నఁగ నహహా! 234

కం. కుమతినొ, సుమతినొ, మఱియున్
(బమదముననొ, (క్రోధపూర్ణభావముతోనో
అమలము నామము దలచిన
నమితములగు శుభము లొదవు నఖిలస్థలులన్. 235

## శ్రీరాముని ఔదార్యము

ఉ. అట్టి శుభంకరం బయిన యా రఘురాముని నామమేను చే
పట్టి, స్మరించి, రామపదపద్మముల న్దల వాల్చి, మ్రొక్కియుఁ
గట్టులు లేని రామగుణకంధిని వర్ణనసేతు రామసా
మ్రాట్టె మదీయదోషముల మంజులదృష్టిని సంస్కరించెడిన్. 236

కం. తనయుడు ధూళిని బ్రుంగగ
గని కైకొను మాత వాని గరుణామతితోఁ
దనదగు భక్తుల కెపుడును
ఘనమగు హరికరుణ హానిగలిగింపదహో ! 237

ఉ. రాముడు సత్ప్రభుండగుచు రాజిలు; నేనొక సేవకుండ; గా
నీ మదిలోన నా యమితనీచగుణంబుల జూడబోక, నా
స్వామి స్వకీయమౌ ఘనకృపానిధియ న్బిరుదంబు జూచియే
క్షేమముగూర్చె నాకు; హరి కేవల మా కరుణాబ్ధియేసుమా ! 238

కం. ఘనుడగు సత్తమనరపతి
వినినంతనె విన్నపంబు వినతజనప్రే
మను గుర్తించునటంచును
వినవచ్చును లోకమందు, వేదములందున్. 239

గీ. వివిధజనములు తమతమ వివిధగతుల
బ్రస్తుతింపగా వినియు సద్వర్తనుండు,
విష్ణు, డీశ్వరాంశజుడైన విభుడు వారి
వారికి న్దగురీతి సత్కార మొసగు. 240

మ. ఇది సామాన్యనృపాలపద్ధతి; యయోధ్యేంద్రుండు చాతుర్యధీ
సదనుండించుక, ప్రేమమాత్రమున నే, సంతృప్తుడై కాచెడిన్;
వెదకన్ ధాత్రిని నన్ను బోలు శఠుడున్, భీష్మాఘచిత్తుండు, దు
ర్మదు డెందు న్గనవచ్చు? రాముని కృపామాహాత్మ్యము
[గాంచుడీ! 241

చ. పరమదయాళువౌట రఘువల్లభు డౌర మహానురాగమున్
బఱపును దుష్టసేవకులపైనను సైతము; నీటియందునం
బరువగురాళ్ళ దేల్చె; గపిభల్లుకకోట్లను స్వీయమంత్రులై
వఱలగజేసె; రాముని కృపాగుణ మెంత విశాలమైనదో! 242

గీ. రామచంద్రునివంటి సత్ప్రభున కిలను
తులసిబోలిన భృత్యుండు కలడనియెడి
సామెత జనులలోన బ్రచారమగుత
మిట్టి నింద రాఘవుడు సహింపగలడు. 243

గీ. నాదు ఘనసాహసంబును, నాదు ఘోర
దోషమును, నాదు భీకరదురితములను
వినియు నరకంబుసైతము వినుగుజెంది
ముఖము ముకుళించుకొని ముక్కుమూసికొనును. 244

గీ. నాదు చరితంబు దలపగా నాకు భయము
కలుగుచున్న; దియ్యది స్వయంకల్పితంబె;
స్వప్నమందైన శ్రీరామచంద్రమూర్తి
నిలుపలేదు స్వదృష్టి నా కలుషములను. 245

గీ. నాదు ప్రభువైన రాముడు నన్నుగూర్చి
వినియు, జూచి, విచారించి విమలదృష్టి
నాదు భక్తిబుద్ధుల దెగ నాడడయ్యె
సరిగదా! ప్రేమతోడ బ్రశంసచేసె. 246

గీ. పలుకులను జెడుగున్నను భావమందు
మంచి యుండగావలయును మహితరీతి;
భక్తహృదయాలలో గల భావమెఱిగి
సంతసించును శ్రీరామచంద్రమూర్తి. 247

చ. తన పదకింకరుల్ పలుకు తప్పులు నిల్వగలేవు సత్కృపా
ధునియగు రాముచిత్తమున; దోషముల న్గనకుండ రాఘవుల్
తన పదభక్తులందు గల తల్లవలేశపు మంచినే అహా!
మనమున సంస్మరింత్రు పలుమాఱు లఖండకృపాప్రపూర్ణులై. 248

ఉ. ఏ విధమైన దోషము సహింపక తానొక వ్యాధునట్లు సీ
తావిభు డుగ్రమూర్తి యయి ధాత్రిని గూల్చెనొ వాలి గోలతో
నా విధమైన దోషమునె యా కపిసంఘవరేణ్యుడైన సు
గ్రీవుడు సేయ నోర్చెనహా! కేవలకింకర పక్షపాతియై. 249

ఉ. ఆ పని నే విభీషణుడు నాచరణంబొనరించె; గాని సీ
తాపతి స్వప్నమందయిన దాని దలంపక సత్కరించె నెం
తో పరమానురక్తి భరతున్ మహితాత్ముని గూడు వేళ; నా
హా! పలికె న్సభాస్థలిని నాతని శీలము నే కృపామతిన్. 250

కం. రాముడు వృక్షముదిగువను,
నా మర్కటకోటి కొమ్మలందున దిరుగున్
రాముడు తనతో సమముగ
ప్రేమను కపికోటి జేసె వీక్షించు డహో! 251

కం. తులసీదాసుడు జగతికి
దెలుపున దేమనగ, రామదేవునితోడన్
దులదూగు శీలజలనిధి
కలుగడు ముల్లోకములను గలచియు గన్నన్. 252

కం. రామా! నీ సౌశీల్యము
ప్రేమను సర్వులకు శుభముశ్రీల నొసగు సు
మ్మీ మాటయె నిజమైనను
క్షేమమె యీ తులసికొదవు స్థిరతరరీతిన్. 253

కం. నా గుణదోషము లీ విధి
బాగుగ వివరించి, యెల్లవారికి భక్తిన్
సాగిలి, రచియించెద నను
రాగముతో గలివిభంగ రామాయణమున్. 254

## శ్రీరామచరితమానస మాహాత్మ్యము

ఉ. ఈ యతి రమ్యమౌ రఘుకులేశ్వర దివ్యచరిత్రమాదిలో
శ్రేయసిమైన పార్వతికి బ్రీతివచించి శివుండు నంతనా
ప్యాయముగా వచించె హరిభక్తవరుం డధికారి యౌటచే
వాయసరూపమూని యగు పావనకాకభుశుండి కాపయిన్. 255

గీ. ఈ మహోన్నతమైన శ్రీరామచరిత
భక్త కాకభుశుండిచే భవ్యలీల
యాజ్ఞవల్క్యమహాముని యాలకించి
దాని వినిపించె దా భరద్వాజమునికి. 256

మ. అరయన్ వక్తయు, శ్రోత యిర్వురును దివ్యత్తుల్యసంశీలు; రా
మహరిలీలావిదు; లాత్మనిష్ఠులును; సమ్యగ్దర్శనుల్; పావనుల్;
కరపద్మామలకంబు వారి కెపుడుం గాలత్రయాఖ్యానముల్
ధర నీ సంఘటనంబు కేవలము సీతానాథుకారుణ్యమే! 257

చ. మఱియు మహానుభావులు, రమాధవు లీలల డెందమందు దా
మెఱిగిన భక్తు లెందఱో యనేకవిధంబుల రాము గాథలం
దఱుగక చెప్పుచుందురు; సదా వినుచుందురు; శ్రద్ధగల్గియుం
గొఱవడకుండగా దెలుసికొంచు సుఖించుచునుందు రాత్మలన్ 258

గీ. మఱల నా కథ నేను నా గురువరేణ్యు
చేత వింటిని సూకరక్షేత్రమందు
గాని బాలుండనౌట నజ్ఞానవశత
దెలియనైతిని నాకథ తెల్లముగను. 259

ఉ. రామ కథాప్రవక్తలును, రామకథాశ్రవణైకశీలు రు
ద్దామవివేకవార్ధులయి దాము వెలుంగుచునుందు రే నహో
పామరుడన్; మహోగ్రకలిపాపముఖగ్రసితుండ; మూఢుడన్
ఛీ! మతిలేని యట్టి జడజీవుడ రామకథ న్గ్రహింతు నే? 260

ఉ. ఐనను నా గురూత్తము డనంతదయామతి యా చరిత్రమున్
మానక బోధసేయగను మాటికిమాటికి దత్కథార్థవి
జ్ఞానము కొంచెమబ్బినది; స్వాత్మముదం బొనగూర్చురీతిగా
దాని రచించెద న్గురుపదంబుల నెంచియు దేశభాషలో. 261

ఉ. పాయక నాకు గల్గిన లవంబు వివేకబలంబుతోడుగా
నాయెదలోన నిల్చి రఘునాథుడు ప్రేరణసేయురీతిగా
నా యవివేకసంశయమణంపగగల్గిన భవ్యమైన రా
మాయణమున్ భయంకరభవార్ణవతారకమున్ రచించెదన్. 262

గీ. పండితశ్రమాపహము, సర్వప్రపంచ
రంజనము, కలికలుషవిభంజనంబు,
దురితకలిసర్పఘనవిషహరణభరణి,
జ్ఞానపావకారణి రామచంద్రు చరిత. 263

గీ. కలియుగాఖిల కామద కామధేను,
వఖిలసజ్జనసంజీవనౌషధంబు,
భూతలసుధాతరంగిణి, భూతసంఘ
భయవిభంజని, భ్రమభేక పన్నగంబు
నఖిల పావనమైన రామాయణంబు! 264

గీ. నరకరాక్షసలోకవినాశకరము,
సాధుసురహితపార్వతి; సకలలోక
బుధపయోనిధిరమ; సర్వభూతభార
భరణభూదేవి శ్రీరామచరిత మహహా! 265

ఉ. ఆ యమకింకరాళిముఖమందున వే మసిపూత బూయుగా
శ్రీయమునానదీసమము; జీవుల ముక్తులజేయు గాశి; నా
రాయణు ప్రీతికిన్ దులసియా; నిల నీ తులసీహితంబు దా
జేయుటలోన మాత*'హులసీ'యగు రామకథామృతంబహో! 266

చ. హరునకు బ్రీతిగూర్చుపనియందున నర్మద; సర్వసిద్ధులున్
సిరులును సౌఖ్యముల్ పడయు జెన్నగు బెన్నిధి; సద్గుణంబులన్
సురలకు మాతయౌ నదితి; సుందరమౌ రఘురామభక్తి సా
గరమున కెల్లవంటిది జగంబున రామకథామృతంబహో! 267

ఉ. శ్రీకరమైన రామనృపశేఖరదివ్యకథామృతంబె మం
దాకిని; దానిచెంత స్తిమితంబుగ నిల్చెడి చారుచిత్తమే
పావికటచిత్రకూటగిరి; భక్తియె సుందరమౌ నరణ్య; మిం
దే కడు బ్రీతితోడ జరియింతురు భూతనయారఘూద్వహుల్. 268

---

* 'హులసి' శ్రీతులసీదాసుని తల్లి.

ఉ. రామచరిత్రరాజ మతిరమ్యతమంబయి వెల్గుచుండు చిం
తామణి; సాధుబుద్ధివనితామణికిన్ శుభపూర్ణశోభ; శ్రీ
రాముని సద్గుణంబులు నిరంతరవిశ్వహితంకరంబులై
ధామముల, న్విముక్తిధనధర్మముల న్దయచేసి కాచెడిన్. 269

ఉ. జ్ఞానవిరాగయోగముల సత్కృప నిచ్చెడు సద్గురుండు; న-
జ్ఞానభవోగ్రరోగహరణం బొనరించెడి దేవవైద్యు; డ-
మ్మానితరామభక్తి నిడ మాతయు దండ్రి; సమస్తసద్వ్రతా
న్యూనసుధర్మనిష్ఠల కహో! ఘనబీజము రామగాథయా! 270

ఉ. పాపము లుగ్రతాపముల బాపును; భూపరలోకసౌఖ్యముల్
ప్రాపిలజేయు నెల్లరకు; భవ్యవిచారనృపాత్మమంత్రియై
ప్రాపునొసంగు; లోభగుణవార్ధికి గుంభజుడై వెలుంగు; సీ
తాపతిదివ్యసద్గుణకదంబచరిత్ర మహాద్భుతంబుగన్. 271

చ. హరిభటచిత్తకాననములందలి కామము క్రోధము న్భయం
కరకలికాలదోషగజకాండము నొంచెడి మేటిసింగమై
హరునకు బూజ్యుడౌ నతిథియై ప్రళయోగ్రదరిద్రవహ్నిసం
హరణముసేయు మేఘమయి యద్భుతరామచరిత్ర వెల్గెడిన్! 272

గీ. విషయసర్పవిషంబుల విఱుగజేయు
గరుడమంత్రము; శ్రీరామచరిత మహాహా!
ఫాలమందున గల చెడువ్రాత దుడిచి
వేయు; నవలీల భవ్యరామాయణంబు. 273

గీ. ఘోరమోహాంధకారవిదూరకారి
సూర్యకిరణంబు; శ్రీరఘువర్యచరిత
భక్తులను వరిమొక్కల బ్రదుకజేయు
వార్షమేఘము; శ్రీరామభద్రుచరిత. 274

గీ. అభిమతార్థంబు లిచ్చు కల్పాగమంబు
హరిహరులసేవకు సులభమైన దగుచు
బరమసుఖదాయకంబయి పరిఢవిల్లు
నఖిలపావనమైన రామాయణంబు. 275

గీ. సత్క్రవీశ్వరశరదృతుసమయమందు
మానసంబను నాకాశమండలమున
వెలుగు తారకాగణమన జెలగు; భక్త
జీవనాధారమగు రామదేవుచరిత. 276

గీ. పుణ్యసర్వస్వఫలమహాభోగసమము;
విశ్వకల్యాణఘనకార్యవిబుధసమము;
భక్తమానసమానసపరమహంస
రమ్యపావనగంగాతరంగమాల;
అఖిలపూజితమైన రామాయణంబు! 277

గీ. ధర గుమార్గకుశీలకుతర్కకపట
దంభకలహపాషండమతంబు లనెడి
కఠినకలిదోషకాష్ఠముల్ గాల్చివేయు
జండదావాగ్ని; శ్రీరామచంద్రుచరిత. 278

గీ. రామచంద్రుని కథయను రమ్యమైన
పండువెన్నెల యెల్లరిభావములకు
సంతసంబును గూర్చు; సజ్జనచకోర
కుముదములమాట జెప్పగా గోరుటేల? 279

## శ్రీమానససరోవరస్వరూపము.

కం. పూర్వము పార్వతి యేవిధి
సర్వేశుని బ్రశ్న చేసెనొ? సత్కృపతో నా
శర్వుం డేమని నుడివెనొ?
సర్వము కథనంబు సేతు సజ్జనులారా! 280

గీ. ఈ కథను మున్ను మీ రెన్నఁ డేని వినని
వార లాశ్చర్యపడవచ్చు; ధీరమతులు
వింతపడ రీ యలౌకికవిమలకథను
జగతిలో నపారము రామచంద్రుచరిత
మనెడి విశ్వాస మతిగాఢ మగుచు వెలుఁగ. 281

ఉ. ఈ యవనిన్ రఘూత్తము డనేకవిధంబులుగా జనించె, రా
మాయణ మెంచిచూడ నహహా! శతకోటిసువిస్తరంబు; నా
రాయణురమ్యలీలల మహామునివర్యు లనేకరీతులన్
వ్రాయుట కల్పభేదములబట్టియె; సంశయ మొందబోకుడీ! 282

ఉ. రాము డనంతుఁ డా విమలరామగుణంబు లనంతమట్టులే
స్వామికథావిశేషములు సైత మనంతము; గావునన్ బుధ
స్తోమము, సద్విచారపరసూరినికాయము వింత జెంద దీ
రామకథార్థజాలబహురమ్యవిశేషము లాలకించియున్. 283

గీ. ఈ విధము సంశయంబుల నెల్ల ద్రోలి
గురుపదరజంబు దాల్చియు శిరమునందు
గథ రచించుటలో జెడుల్ గలుగకుండ
మఱల జోహారుసేతు నందఱకు నేను 284

గీ. పరమభక్తితో శివదేవు చరణములకు
శిరమువంచి నమస్కృతుల్ చేసి నేను
రామచంద్ర మహాగుణరమ్యచరిత
వర్ణనము సేయుచున్నాడ భక్తితోడ. 285

గీ. హరిపదాంబుజములపైన శిరమునుంచి
*విక్రమార్కశకంబున వెలయుచుండ
భువినిబదునాఱువందల ముప్పదొకట
వ-శుభవత్సరం బియ్యది వ్రాయుచుంటి. 286

ఉ. మించినచైత్రమందు, నవమీతిథిమంగళవార మేను లో
నెంచు నయోధ్యలోన నుదయించెను మత్కృతి; రామమూర్తి జ
న్మించిన యా దినాన ధరణిన్గల తీర్థములెల్లగూడి యే
తెంచు నయోధ్యకంచు వినుతించును వేదము లద్భుతంబుగన్. 287

చ. నరసురదైత్యపక్షిగణనాగమునీశ్వరు లయ్యయోధ్యకుం
బఱుగునవచ్చి నాడు రఘువల్లభుసేనల జేసికొంద్రు; సం
బరమున సజ్జనుల్ కలసి పాడుచు రామునిదివ్యకీర్తనల్
పరగ నొనర్చుచుందు రతిపావనజన్మదినోత్సవంబులన్. 288

ఉ. మానక నాడు సజ్జనులు మంగళమౌ సరయూనదీజల
స్నానము చేసి తీరగతసైకతశయ్యల శ్యామసుందర
ధ్యానము, రామమంత్రజపమద్భుతభక్తిని సేయుచుందు ర
మ్మానితశుభ్రహృజ్జలజమధ్యమునందు మనోహరంబుగన్. 289

* క్రీ. పూ॥ 1574 సం.

ఉ. శ్రీసరయూనదిన్ననిన, బ్రీతి, స్పృశించిన, దత్పవిత్రసం
భాసురవారి గ్రుంకినను, పానము జేసిన, బాపసంఘముల్
బాసియు ధన్యులౌదు రని పల్కు సతంబును వేదశాస్త్రముల్
శ్రీ సరయూనదీమహిమ జెప్పగ నేర్చునె వాణిసైతమున్ ! 290

ఉ. తాపవిదూరమై, పరమధామదమై, త్రిజగత్ప్రసిద్ధమై,
పాపవిభంగమై, పరమపావనమై వెలుగొందు, నీయయో
ధ్యాపురి బ్రాణముల్ విడుచు నల్పపు జీవియు నిక్క మెంచ నా
హా ! పడిపోదు సంసరణమం దికపైన, విముక్తినే గనున్. 291

ఉ. ఆశ్రితరక్షకంబు, సకలాద్భుతసిద్ధిదమున్, సమస్తశో
భాశ్రయమున్, నిరంతరశుభాలయ మైన యయోధ్యలోన నా
హా ! శ్రవణైకమాత్రనిహతాఖిలకామమదోగ్రదంభమై
విశ్రుతిగాంచినట్టి రఘువీరుచరిత్రము వ్రాయబూనితిన్. 292

గీ. రామచరితమానస మను నామధేయ
మున విరాజిల్లు నీకథ; పుడమి దీని
పేరు వినినంత శాంతి లభించు నెదకు,
శోకసంతప్తమానవలోకమునకు. 293

ఉ. భీమకఠోరదుర్విషయబృందవికీర్ణవనంబులోని యు
ద్దామదురంతదుఃఖగణదావశిఖాకులచిత్తకుంభికిన్
రామచరిత్రమానససరస్సు సుఖం బొనగూర్చు, సత్వరం
బా మధురాతిశీతలగుణాంబువుల న్బడి క్రుంకులాడినన్. 294

ఉ. శ్రీమునిలోకరంజనము శ్రీరఘురామచరిత్ర మా శివ
స్వామి రచించె; నీ పరమపావనశోభనమై వెలుంగు శ్రీ
రామచరిత్రమానససర స్సిల గూల్చు దరిద్రదోషదుఃఖదు
ర్దామదరిద్రతాకలివిధానభయంకరపాపరాశులన్. 295

గీ. శంభు డీ రామకథ సల్పి సరసరీతి
మానసంబున నిడుకొని మంచిసమయ
మొదవినంతనె వినిపించె నుమకు; గాన
రామచరితమానస మని రమ్యమైన
పేరిడెను దీని కీశుడు ప్రీతితోడ. 296

గీ. పరమసుఖదంబు మహితశోభాయమాన
మైన శ్రీరామచరితము నందముగను
పలుకుచున్నాడ సజ్జనవర్యులార!
చేరి వినరయ్య యేకాగ్రచిత్తులగుచు. 297

గీ. ఎట్టి దీ రామచారిత్ర మే విధముగ
నిద్ది రచియింపబడియెనో, ఎందుచేత
బ్రచలితంబయ్యె నిద్ది ప్రపంచమందు
సర్వము వచింతు గౌరీశు సంస్మరించి. 298

ఉ. ఆ మదనోగ్రగర్వహరుడౌ శివదేవుకృపన్ మనస్సు కా
గా మలదూర మీ తులసి క్ష్మాస్థలి దా కవియయ్యె భవ్యమౌ
రామచరిత్రమానసవిరాజితసత్కృతి; కేను శక్తినై
ప్రేమరచింతు దీని గృపవెల్గ బుధుల్ నెరసుల్ క్షమించుడీ. 299

## శ్రీరామచరితమానసస్వరూపము

చ. సుమతియె భూమియౌను; హృది చూడగ లోతగు మూలమట్టు; మా
గమచయసత్పురాణములు కంధులు; సత్కవికోటి మేఘముల్;
విమలగభీరతజ్జలదబృందకముల్ కురియున్ మనోజ్ఞముల్
సుమధురమంగళంబులగు సుందరరామయశోజలంబులన్. 300

గీ. సాధుసత్కవి మేఘరాజములనుండి
బహుసమృద్ధిగ వర్షింపబడిన యట్టి
సగుణలీలాళి యీ మహోజలములోని
సకలమలహారమైన స్వచ్ఛత్వగుణము. 301

గీ. హరిపదాంబుజయుగ్మమ్మునందు గలుగు
వర్ణనాతీత మగు ప్రేమభక్తిరసమె
అలఘురామయశోరూపజలములోని
స్వాదుగుణమును మిక్కిలి చల్లదనము. 302

గీ. అట్టి రామయశోరూపమైన జలము
పుణ్యకర్మలనెడి వరిమొక్కలకును
తతహితంకరమై రామదాసులకును
జీవనాధారమై విలసిల్లుచుండు. 303

ఉ. ఆ యతిపావనంబును, శుభాలయమున్, మహనీయమైన రా
మాయణవర్షవారి శ్రవణాంచితమార్గమునుండి మెల్లగా
బోయి, సుబుద్ధినాబడెడి భూమిపయి న్బడి జాలువాఱి, యా
హా ! యమలాత్మలో నిలుచు నచ్చము తేనియలూరజేయుచున్. 304

గీ. ఈ మహాకథయందున నెసగు నట్టి
నాల్గు దివ్యసంవాదముల్ నాల్గుదిశల
రామచరితమానస మను రమ్యతరము
పరమపావన మగు సరోవరములోని
బహుమనోజ్ఞ ఘట్టంబులై భాసురిల్లు. 305

గీ. సప్తకాండము లీ మహాసరసిలోని
చారుసోపానపంక్తులు; జ్ఞానదృష్టి
గనినచో వీని బుద్ధి వికాస మొందు;
నిర్గుణము దుఃఖదూరమై నెగడుచున్న
రామమహిమాభివర్ణన, మీ మనోజ్ఞ
మానససరోవరజలములోని లోతు! 306

గీ. జానకీరామచంద్రభాస్వద్యశంబె
ఆ మహాసరస్సునగల యమృతజలము,
కనగ, నుపమానములు, నలంకారసమితి,
ఆ సరోవరవీచీవిలాస మగును. 307

గీ. ఇందలి మనోజ్ఞపద్యంబు లందమైన
తామరాకులౌ నీ కవిత్వంబులోని
యుక్తులే మనోహరమైన మౌక్తికముల
గన్న ముత్తెపుజిప్పలై క్రాలుచుండు. 308

గీ. ఇందుగలుగు ఛందస్సులే యందమైన
వివిధవర్ణోత్పలంబులై వెలుగుచుండు
భాసురార్థసమున్నతభావజాల
మధురభాష లా విమలపద్మముల జెలగు
ఘనపరాగమరందసుగంధము లగు. 309

ఉ. ఇమ్మహనీయమౌ సరసి నెల్లపుడు న్విహరించు పుణ్యభృం
గమ్ములు, సుందరంబులయి క్రాలెడి జ్ఞానవిరాగసద్విచా
రమ్ములనంగ నొప్పెడి మరాళగణంబులు, వ్యంగ్యముల్ ధ్వనుల్
కమ్మని పాకభేదములుగా మను సుందరమీనసంఘముల్. 310

గీ. అమలధర్మార్థకామమోక్షములు నాల్గు
జ్ఞానవిజ్ఞానఘనసద్విచారములును
జపతపోఽరాగయోగప్రసంగకోటి
నవరసంబు లీ రామమానససరస్సు
నందు గల చారుజలచరబృంద మగును. 311

గీ. సతతసత్కార్యనిష్ఠులౌ సాధుజనుల,
రామనామమును, గీర్తించుటే మనోజ్ఞ
మైన యీ సరోవరసీమయందు వెలయు
వింతవింతల జలపక్షిబృంద మగును. 312

గీ. సాధుసజ్జనబృందముల్ సలుపు సభలె
యీ సరస్సునకుఁ జుట్టు నెసగుచున్న
మంచిమామిడితోపులు; మహితమైన
శ్రద్ధయే యతిరమ్యవసంతఋతువు. 313

చ. అమలినభక్తిమార్గవివిధార్తనిరూపణముల్, * దయాక్షమా
దమములు కుంజపుంజములు; దద్దయు భాసిలుచుండునట్టి సం
యమనియమంబు లందు గుసుమావళి; జ్ఞానము సత్ఫలంబు; నా
యమృతముకుందపాదరతి యందలి స్వాదురసంబు
కాంచగన్. 314

---

* దయ = భూతప్రేమ. క్షమ = ఓర్పు
దమము = ఇంద్రియనిగ్రహము.
సంయమము = అహింస, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహములు.
నియమము = శౌచ, సంతోష, తపస్స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధానములు.

ఉ. రామచరిత్రమానససర స్తటసజ్జనబృందసత్సభా
రామములోన హాయిగ నిరంతరము న్విహరింపుచుండు నా
నామహనీయసత్కథలన జ్జెలువొందెడి చిత్రచిత్రవ
ర్ణామలపక్షిసంఘములు, రమ్యములౌ శుకముల్ పికంబులున్. 315

చ. పులకలు చుట్టుప్రక్కల బ్రమోదవనోపవనంబు; లాత్మలో
గలిగినపారవశ్యపుసుఖంబు విహంగవిహారమౌను; ని
ర్మలమగు చిత్తమందు వనమాలి; యతండు సతంబు శ్రద్ధతో
జిలుకును నేత్రపాత్రములచేతను ప్రేమరసాంబుధారలన్. 316

ఉ. ఏనరు లీ రఘూత్తముని యుద్ధచరిత్రము సావధానులై
పూనికతో బఠించెదరొ, పొల్పుగ వారు సమర్థులైన యీ
మానసరక్షకుల్; వినెడిమానవులందఱు నీ సరోవర
స్థానమహాధికారసురసంఘము లౌదురు చింతసేయగా. 317

ఉ. రామచరిత్రమానససరంబును జేర వభాగ్యదుర్జన
స్తోమ బకాళి; దుర్విషయ జుష్టనరాధమవాయసాళి; యం
దా మలపూర్ణలౌకికకథార్థవిషక్రిమిభేకమండలం
బేమియు గానరాదుగద, యేపని వానికి తత్సరస్సుతో? 318

ఉ. కాముకకాకఘూకబకకాండము లెప్పుడు, దివ్యమైన యీ
రామచరిత్రమానససరంబును జేరగ నిచ్చగింప, వె
న్నో మదినొంచుకష్టతతు లుండును మార్గములోన, జానకీ
రామకటాక్షవీక్షణలు రానిదె యియ్యది దుర్గమం బహా! 319

ఉ. దారుణదుష్టసంగములె తప్పడు త్రోవలు; తత్ఖలోక్తులే
క్రూరములైన వ్యాఘ్రహరికోటు లుదగ్రభుజంగసంఘముల్;
భారగృహాక్రియాకులవిపచ్చయలౌకికబంధనంబులే
వారక యడ్డమైనిలుచుబర్వతపంక్తిసుమా తలంపగన్. 320

చ. ఖలజనసంఘమార్గమున గాఁపువిమోహమదాభిమాన సం
కులవిషమాటవుల్ గలవు; ఘోరకుతర్కనదీనదంబులుం
గలవు భయానకంబులు నగాధములౌచు; మఱిట్టి మార్గముల్
తలఁచిన గుండియల్ పగులు; దాశరథీకృపలేక పోదుమా? 321

చ. వఱలెడిశ్రద్ధనాఁబరఁగు భత్యము లెవ్వరివద్ద లేవొ, స
త్పురుషసహాయ మే జనులు పొందరొ గర్వము నూతఁగొందు, రే
నరులకు దూరమౌను రఘునాథుకటాక్షము, వారి, కా సరో
వరము సతం బగమ్య మగు; భవ్యులకే యది ప్రాప్తమౌనుమా! 322

ఉ. ఎట్టులొ యెవ్వఁడేని శ్రమియించియు వెళ్లునొ వెళ్ళినంతనే
గట్టిగ వాని బట్టికొను గాఢపునిద్దురయన్ చలిజ్వరం;
బట్టె జనించు మాంద్య మను నద్భుతమౌ చలి వానిలోఁ; నిశం
డట్టుకొనంగలేక తన దారిని బట్టు సతం డభాగ్యుఁడై. 323

ఉ. వాఁడటు మానసాంబువుల పానము స్నానము చేయకుండ, లో
గూడిన స్వాభిమానమున గొంపకు జేరియు, వారివీరితోఁ,
"పాడుసరస్సు, ఏ సుఖము వచ్చు"నటంచు, నెవేవొ నిందలే
యాడును గాని, చెప్పఁడు రవంతయు దా దన మందభాగ్యమున్. 324

ఉ. ఏ నరు సత్కటాక్షమున నీక్షణ సేయునొ రామచంద్రుఁ డ
వ్వానికి విఘ్నసంఘములు వ్యాప్తముగా పతడే ధరిత్రి నీ
మానసదివ్యతోయముల మజ్జన భాగ్యము బొందియున్ * త్రితా
పానలఘోరకీలికల కాహుతిగాక ప్రశాంతి గాంచెడిన్. 325

ఉ. రామునడుంగుదమ్ముల దిరంబగుభక్తి వెలుంగు వార, లీ
రామచరిత్రమానససరస్సును వీడగఁజాల; రన్నలా
రా! మతిలోన నీ సరసియందున స్నానము సేయ గోరుచోఁ,
బ్రేమను సాధుసంగ మొనరింపుఁడు; ముందిది ముఖ్య మన్నిటన్. 326

---

* త్రితాపములు = ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములు.

ఉ. ఈ విధమైన మానసము నీక్షణ జేసియు మానసాక్షితో
నా విమలాంబుమజ్జనము నందుటచే గవిచిత్తమంతయుం
బావనతన్ గనెన్ హృదయభాండము మోదముతోడ నిండె; స
ద్భావమహానురాగసుఖవార్ధులు పొంగులువాఱసాగెడిన్. 327

గీ. అచటనుండియు సుందరమైన కవిత
అను మహానది ప్రవహించు; నందులోన
స్వచ్ఛమగు రామచంద్రయశఃప్రభావ
జలము నిండియు శుభముల నొలుకుచుండు. 328



## సరయూనదీ స్వరూపము.

చ. ఇదె సరయూనదీప్రవర మియ్యదె సర్వశుభాస్పదంబు; ఈ
నది కిని లౌకిక వేద మతనామముల న్దనరుఁ దరిద్వయం;
బిది కలిదోషవృక్షతృణబృందముల న్మొదలంట గూల్చు; నీ
సదమలమానసాత్మభవ సర్వజగజ్జనపూతమై మనున్. 329

ఉ. * మూడురకాల శ్రోతలసమూహము లీ నదియొడ్డులందె ఆ
డాడను గల్గు గ్రామనగరాళిపురంబులవున్; బుధోత్తముల్
కూడు సభాస్థలంబె వెలుగొందు నయోధ్య; తదీయశోభ నె
వ్వాడు నుతింపగల్గును శుభంబులమూల మసామ్యమానహా! 330

---

* మూడురకముల శ్రోతలు: ముక్తులు, ముముక్షువులు, విషయాసక్తులు.

గీ. చారు రఘురామచంద్రయశః ప్రభావ
మనెడి సరయూనదీమణి, సానుజోగ్ర
రామ రణరంగ కేళీవిరాజితయశ
మనెడి శోణమహానది యరుగుదెంచి
కలియు శ్రీరామభక్తిగంగాస్రవంతి. 331

గీ. విమలవైరాగ్యశోణ, వివేకసరయు
వనెడి యీ రెండు నదుల మధ్యమున వెలుగు
భక్తిమందాకినీనది; పరగనివ్వి
త్రివిధతాపములను సంహరించి రాము
స్వస్వరూపమహాంబుధి సంగమించు. 332

గీ. రామచరితమానసమున ప్రభవమైన
రామచంద్రగుణాభివర్ణన మనంగ
వెలుగు సరయూనదీమణి కలిసె రామ
భక్తియను గంగలో; అది రక్తితోడ
వినెడి సుజనుల బుద్ధి బవిత్రపఱచు;
దీనగల చిత్రమౌ యుపాఖ్యానసమితి
తన్నదీతటవనమహోద్యానవనులు;
మఱియు నీసరయూనదీమహిమ వినుడు ! 333

గీ. పార్వతీపరమేశవివాహసమయ
పరిజనంబు లిందలి జలచరగణంబు
రామజనోత్సవమున సంరంభతతులు
సుడులు, వీచికామాలలసోయగములు 334

గీ. బాలలీలావిలాసముల్ భాసమాన
బహుళవర్ణవిస్ఫారితపద్మచయము;
దశరథేంద్రరాజ్ఞీజనధర్మకృతులు
భృంగసంఘములం జలవిహంగతతులు! 335

గీ. చారుసీతాస్వయంవర చరిత మెల్ల
నీ నదీమణీశోభలై యొసగుచుండు
బహుపటుప్రశ్న లిందు నావలుగ జెలగు;
బృథువివేకోత్తరములం నావికజనంబు. 336

చ. శ్రవణ మొనర్చి, చేసెడి పరస్పరరామకథాప్రసంగముల్
ప్రవిమల మా నదీతటముపై జను పాంథులపంక్తులౌను; భా
ర్గవుకృధ ఘోరధార; రఘురాముని శ్రేష్ఠమనోజ్ఞవాణి, యం
దవును సుబద్ధఘట్టము; నిజాత్మవిచారణసల్పి చూచినన్. 337

ఉ. సానుజుడైన రామనృపచంద్రు వివాహమహోత్సవంబహో!
యీ నదిలోని సౌఖ్యదసమృద్ధశుభప్రదమైన వెల్లువౌ;
వీనుల నాలకించి రఘువీరుకథల్, పులకీకృతాంగులౌ
మానవు, లీ నదీమణిని మానక క్రుంకెడి పుణ్యపూరుషుల్. 338

గీ. భూరి రామాభిషేకసంభారసమితి
పర్వకాలసమాగతభాసమాన
తన్నదీతటస్థైర్థికతండ; మచట
గైకదుర్బుద్ధియే భయంకరవిపత్తు
బొందజేసిన ఘోరుడుంభురద యగును. 339

గీ. భరితచారిత్ర మగణితోత్పాతహరణ
తన్న దీక్షాలంకృతతపోధ్వరజపాళి
కలిమలఖిలావగుణబృందకథనశతము,
జలకలుష కాకబకగణంబులుగ దోచు. 340

గీ. ఈ మహారామకీర్తినదీమతల్లి
ఆఱుఋతువుల యందును, నతులరీతి
శోభిలుచునుండు నత్యంత సుందరముగ;
బరమపావన మగుచును భాసురిల్లు. 341

గీ. అద్రినందినీశివుల కల్యాణచరిత
మంజులాహ్లాదరూప హేమంతఋతువు;
రామజన్మోత్సవానందరమ్యచరిత
చిత్తసంప్రీతికర మైన శిశిరఋతువు. 342

గీ. రామచంద్రవైవాహికరమ్యచరిత
సర్వశుభదసమ్మోదవసంతఋతువు;
రామచంద్రునిదండకారణ్యయాత్ర
భీష్మదుస్సహోదగ్రమా గ్రీష్మఋతువు;
వనపథకథల్ ఖరాతపవాయుచయము. 343

గీ. భయదదైత్యసంహారము వర్షఋతువు;
అది నిలింపసస్యముల కాహ్లాద మొసగు;
విమలరామరాజ్యానందవినయమహిమ
ధవళమంజులసుఖశరత్కాల మగును. 344

గీ. వరపతివ్రతామణిగను పరిఢవిల్లు
జానకీదేవిచరిత మీ జలములోని
పరమశుద్ధతానుపమపావనగుణమ్ము;
భరతుశీల మిందున్న యవర్ణనీయ
సార్వకాలికశీతలచారుగుణము. 345

గీ. రామచంద్రసోదరుల పరస్పరాప
లోకనాలాపనాలింగనాకలాప
భాస్వదనురాగహాసస్రోత్రభాత్రములను
స్వాదురససుగంధంబు లీ వారి నెసగు. 346

గీ. అస్మదార్తియు, వినయదైన్యంబు, లీ ప్ర
సన్నమంజులనిర్మలజలములోని
చులకదనమయి నిరతంబు వెలుగుచుండు;
ఈ మహోదకమహిమము నెన్నతరమె? 347

ఉ. ఈ యమలాంబుపూరముల నెన్న మహాద్భుతముల్ వినంగనే
పాయక మేలుసేయు నెడబాపు భయంకరతృష్ణ; నావలం
ద్రోయు మనోమలంబు కలిదోషవిపచ్చయసంకులంబులన్;
మాయగఁజేయు దుర్భరసమస్తపురాకృతపాపతాపముల్. 348

ఉ. కూలును పాపతాపభయఘోరదరిద్రసమస్తదోషముల్;
వ్రీలును చండసంసరణభీషణదుఃఖపరంపరావళుల్;
తూలును కామరోషమదదుష్టవిమోహముఖారిసంచయం;
బీ లలితోదకంబులను నేర్పడ జేసిన స్నానపానముల్. 349

చ. కలుగును జ్ఞానతేజ మెద గల్గును దివ్యవిరాగభావముల్
గలుగును సద్గుణవ్రజము, గల్గును సర్వసుఖప్రసంఘముల్
గలుగును రామచంద్రపదకంజసమాహితశుద్ధభక్తి, యీ
సలిలములందు భక్తిమెయి సల్పినచో నిల స్నానపానముల్. 350

గీ. ఈ మహాతీర్థమహిమంబు నెన్న దరమె!
సంతసంబున కిది సంతసంబుగూర్చు,
వీనిలో గ్రుంకజాలని భీరజనులె
కఠినకలికరాళాంతరగ్రసితు లకట! 351

ఉ. ఏలకొ మానవుల్ రఘుకులేంద్రుయశస్సరయూశుభాంబువుల్
గ్రోలి సుఖింపకే భయదఘోరకలిభ్రమితాత్ములై మహా
భీలదురంతదుర్విషయబృందమరుస్థలి గూలఁబట్టిడా
నేల, మరీచికల్ గనియు నీరని యీల్గు కురంగముల్ వలెన్. 352

గీ. శక్తికొలఁదిగ నీ మహాజలగుణంబు
దలచి తనబుద్ధి యందు స్నాతక మొనర్చి
శాంకరీశంకరులను సంస్మరణ జేసి
పలుకుచున్నాడు కవి రమ్యభవ్యకథను. 353

ఓమ్

శ్రీరామ జయరామ జయజయరామ

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### ప్రథమ సోపానము

ద్వితీయవిశ్రామము

శ్రీనారదమానీశ్వర-
గానామృతపారవశ్యకలితహృదబ్జా!
దీనజనావనరంహా!
శ్రీనాయక! మట్టపల్లి శ్రీనరసింహా!

ప్రయాగక్షేత్రము

యాజ్ఞవల్క్య భరద్వాజమహర్షుల సంవాదము.

ఛందస్సు : మంజరీద్విపద

శ్రీరామపాదరాజీవంబు లెప్పు
డాత్మ భజించు భక్తాగ్రగణ్యుండు,
శమదమకారుణ్యసద్గుణాకరుడు,
నిరుపమఘనతపోనిష్ఠాపరుండు,

పారమార్థికమార్గపరమసమర్థు
డగు భరద్వాజమహర్షి వసించు
శ్రీప్రయాగక్షేత్రశేఖరమందు.
మాఘమాసమునందు మకరసంక్రమణ
పర్వకాలంబున బహుజనుల్ వచ్చి
సేవింత్రు భక్తి నా క్షేత్రరాజమును.
నరసురాసురులు గిన్నరముఖ్యులెల్ల
రా త్రివేణీప్రసన్నాంబువు లందు
నాదరంబున స్నాన మాచరించెదరు.
పావనమాధవపాదపద్మముల
బూజించి భక్తిసంపూరితు లగుచు
నక్షయవటవృక్ష మంత స్పృశించి
యతి పులకితగాత్రు లౌచుందు రచట.
తత్క్షేత్రమున భరద్వాజాశ్రమంబు
పరమపావనమయి భాసిల్లుచుండు;
దాని మహారమ్యతకు మౌనివరులె
సమ్మోహపడుచుంద్రు స్వాంతంబులందు.
ఆ తీర్థరాజము నందు గ్రుంకుటకు
వచ్చు మునీశ్వర పరమర్షు లెల్ల
రట గూడుచుండెద రానందముగను.
ప్రత్యూషముననెల్లవారలులేచి
స్నానాదికృత్యముల్ సలిపియు భక్తి,

నా యాశ్రమమున సమావిష్టులగుచు
హరిదివ్యసుగుణమహాప్రసంగముల
సలుపుచుందురు పరస్పరము సంప్రీతి.
భాషింతు రచ్చట బ్రహ్మతత్త్వమును,
తద్ధర్మవిధులను, తత్త్వభాగముల,
భక్తిని, జ్ఞానంబు, వైరాగ్యనియతి
నీవిధంబుగను మునీశ్వరులెల్ల
రా మాఘమాసపర్యంత మచ్చోట
స్నానాదు లొనరించి సద్భక్తితోడ
నాపయి దమతమ యాశ్రమంబులకు
బోలేక పోలేక పోవుచుండెదరు.
ఏటేట నుత్సవం బిట్టులఁ జరుగు.
మఱి యొకానొక మాఘమాసమం దిట్లు
సకలమునీంద్రులు స్నానముల్ సలిపి
యెవరిచోట్లకు వార లేగి; రా తఱిని
తన యాశ్రమమునకు దరలుచున్నట్టి
పరమవిజ్ఞానసంభరితుడై వెలుగు
యాజ్ఞవల్క్యమునీంద్రు నంఘ్రులబట్టి
పయన మాపియు భరద్వాజమహర్షి
భక్తితో నామునిపాదపద్మముల
బ్రక్షాళనముచేసి, పరమపునీత
మగు నాసనంబున నాసీను జేసి,

బహుపూజ గావించి, ప్రస్తుతించియును
మృదుమధురంబుగా నీ రీతి బలికె :
"నాథ ! ఓ మునినాథ ! నామతిలోన
నొక పెద్దసంశయం బున్నది దేవ !
సకలవేదరహస్యజాలము నీకు
హస్తములో నున్న యామలకంబు;
నా సంశయమును విన్నప మొనరింప
భయమును లజ్జయు బడుచుంటి లోన;
గాని, యీ యోగ్యావకాశంబు పోవ
దిరిగి లభించునే ? దేవ ! మహాత్మ !
స్వాంతంబులో గల సందియంబులను
తనగురుసన్నిధి దాచిన యాత
డమలవివేకంబు నందలే డనెడి
వేదశాస్త్రపురాణవిబుధవాక్యముల
నాత్మ విచారించి యార్యవరేణ్య !
నా సందియంబు విన్నప మొనరింతు :
నీ సేవకునిపైన గృపజూపి స్వామి !
యస్మదజ్ఞానంబు హరియింపు మార్య !
యుపనిషత్తులు, *జయ, ముత్తమజనులు
ప్రభు ! రామనామప్రభావంబు తలప
బారశూన్యం బని పలుకుట వింటి

---

*జయము = పురాణేతిహాసములు.

నవినాశి, గుణరాశి, యానందవనధీ,
జ్ఞానమూ_ర్తి, శివుండు, శంభు, డెల్లపుడు
శ్రీరామనామంబు జింతించునాత్మ.
జగతిలో గల నాల్గుజాతులజీవు
లం దేదియైన నహా! కాశి యందు
ప్రాణముల్ బాసిన బరగతి గాంచు
నా రామనామ మాహాత్మ్యంబుచేత.
ఘనరామనామమే కద? మునిరాయ!
కాశికాపురియందు గాయముల్ విడుచు
జీవుల కెల్లను శ్రీసాంబశివుడు
దివ్యమౌ కృప నుపదేశించుచుండు
నెవ్వ డీ శ్రీరాము డెఱిగింపుమయ్య!
ఓ దయావనధి! ఋష్యు_త్తమా! నాకు;
నొక్క శ్రీరాము డయోధ్యేంద్రుతనయు
డాతని చారిత్ర మఖిలప్రసిద్ధ-
మాత్మప్రియావిరహాకులభార
సంజాతచండరోషంబుచే నతడు
రావణు బడగూల్చె రణరంగ మందు.
ఈ రామునామమా? యింకొక్క రాము
నామమా? త్రిపురారి నాగభూషణుడు
సతతంబు స్వాత్మలో జపమొనరించు?
సర్వజ్ఞుడవు! నీవు సత్యధాముడవు!

బాగుగా యోజించి భాషింపు మయ్య!
నాదు విభ్రాంతి వినాశంబు నొంద
విస్తరింపుము సర్వవృత్తాంతమనగ
యాజ్ఞవల్క్యమునీంద్రు డనియె నీరీతి
ముఖమున జిరునవ్వు మొలకలెత్తంగ
నారఘునాథు మహాప్రభావంబు
నీ వెఱుంగుదువు మునీశ్వరా! లోన;
కన మనోవాక్కాయకర్మల నీవు
శ్రీరామపాదరాజీవభక్తుడవు
తెలిసె నీ చతురత ధీర! మునీంద్ర!
రామచంద్రనిగూఢరమ్యగుణాళి
జెవులార వినగ గాంక్షించి నీ విట్టు
లజ్ఞుడౌ మానవు డడుగుచందమున
బ్రశ్నించితివి భరద్వాజమునీంద్ర!
రమణీయమైన శ్రీరామాయణంబు
నాదరంబున వినుమయ్య వచింతు;
నజ్ఞానమను మహిషాసురు జెండు
చండకాళిక రామచంద్రుచరిత్ర;
సుజనచకోరపక్షులు గ్రోలుచుండు
సాంద్రచంద్రిక రామచంద్రుచరిత్ర.
ఈ వన్న సంశయమే యొకసారి
మును భవానీదేవి పురహరు నడుగ

ఆ మహాదేవు డత్యాదరం బొప్ప
విస్తరించెను రామవృత్తంబునెల్ల.
పార్వతీశంభు సంవాదంబు నీకు
నే నెఱింగినరీతి నిపుడు వచింతు
నీ మహాసంవాద మేకాలమందు
ఎందుకు జరిగెనో ఏ వివరింతు.
వినుము నీ యీ శంక విడిపోవ గలదు.

## శ్రీసతీదేవి మోహ వృత్తాంతము

'మున్ను త్రేతాయుగంబున నొకసారి
శంభు డేగెను కుంభసంభవు జూడ
త్రిభువనమాత సతీదేవి తోడ'
ఆ వచ్చియుండిన హరుగాంచి ఋషియు
అఖిలేశ్వరుం డని యాత్మలో నెఱిగి
భక్తితో నర్చించి ప్రస్తుతించియును
రమణీయపావనరామాయణమును
కడు మధురంబుగా గానంబుచేసె.

ఆ మహేశుడు పరమానందమొంది
ఆకర్ణనము చేసె నా రామకథను,
అంత నా మునిపతి హరిభక్తిగూర్చి
విశదీకరింపగా వేడుకొనంగ
కని యగస్త్యుం డధికారిగా నెంచి

భక్తియోగరహస్యబహువిశేషముల
ప్రవచించె శంకరస్వామి తెల్లముగ.

కూర్మి నావిధి రామగుణగాథ లెల్ల
పలుకుచు వినుచు నా పరమశివుండు,
కైలాసపతి, కొంతకాలంబు గడపె.

ఆపయి శివు డగస్త్యర్షివరేణ్యు
వీడ్కొని, దక్షజాన్వితు డౌచు వెడలె
మహనీయకైలాసమందిరంబునకు;
ఆ సమయంబునం దవనీస్థలాన
భూభారభంజనంబును జేయ శౌరి
అమలమౌ రఘువంశ మం దుద్భవించె.
నిజపితృవచనంబు నిర్వహించుటకు
రాజ్యంబు వదలి విరక్తిభావమున
దండకనామకోద్దండవనాన
ఆ యవినాశి శ్రీహరి, జనార్దనుడు
తాపసవేషంబు ధరియించుకొనియు
సంచరించుచునుండె సంయమివర్య!
చనుచు శంకరు డంత స్వాంతంబులోన
ఇటుల జింతించె మునీ! భరద్వాజ!
"శ్రీహరి నెటుల దర్శింతు నీ తఱిని?
అతిగోప్యముగ హరి యవతారమొందె
ఇపుడు నే నేగి లక్ష్మీశు దర్శింప

హరి యతం డని జగమంతట నైలియు''
ఈ రీతి శర్వుడు హృదయాంతరమున
అమితసంక్షోభంబు నందగాసాగె.

ఈ యాకులత సతి యెఱుగ దేమియును
హరిని దర్శించిన యతిరహస్యంబు
బయలొ నటంచును భయపడె శివుడు;
శ్రీరామదర్శన ప్రేమాతిశయత
నిటలాక్షు పావననేత్రాంచలముల
ఉజ్వలాశ్రువులు పెల్లుబుకగా దొడగె.

రాక్షసాధిపుడగు రావణుం డవని
మనుజుని చేతిలో మరణించు ననుచు
తీర్చి యా బ్రహ్మ విధించుట జేసి
ఆ వాక్యముల సత్య మౌ నటు జేయ
నారాయణుడు పుట్టినాడు ధరిత్రి;
శ్రీహరి నిపుడు దర్శింపనియెడల
సతతము నాకు విచారంబు కలుగు
నని శంకరుడు చింత నందగాదొడగె.
కాని చింతనణంపగల యుపాయంబు
కానరాదాయె నే కరణి జూచినను;
ఈవిధి చింతలో నీశుండు మునిగె.

ఆ సమయాననే యా రావణుండు
దశకంఠు డనెడి యుద్దండదానవుడు

తన హృదయంబులో దన్మయుం బొందె.
ఆ ప్రేమపారవశ్యానంద జలధి
భూతేశు నెడద నుప్పొంగగా దొడగె
నిప్పటికెని భరియింపరానిదిగ !
ఆ పరబ్రహ్మ మీ యఖిలమయంబు,
అజ, మఖండం, బనీహం, బభేదంబు,
అఖిలవేదాఽగ్రాహ్య మై భాసురిల్లు
అది మానవాకార మందగాగలద ?
సురహితార్థంబు వసుంధరయందు
నరరూపమును దాల్చు నారాయణుండు,
సర్వజ్ఞుడైనట్టి శంకరువోలె.
ఆ జ్ఞానధాము డా హరి, శ్రీవిభుండు,
ఆ దైత్యసంహారి, యసురారి, విష్ణు,
పజ్ఞునిరీతిగా నడవిలో నెటుల
ఆత్మకాంతాన్వేషణార్థమై తిరుగు ?
శంభువాక్యములు మృషల్గావు చూడ
హరుడు సర్వజ్ఞ డన్నట్టి యా సత్య
మెల్లవా రెఱిగినదే విశ్వమందు.''
అటుల విచారించు నా సతీదేవి
భావపంకేజ మపారసందేహ
సంఘాతములచేత సంపూర్ణమయ్యె.
ఏవిధంబున నామె హృదయాంతరంబు

స్వస్థతబొందియు శాంతింపదయ్యె.
ఆ భవానీదేవి స్వాత్మసంశయము
ప్రకటింపకున్నను పలువిప్పి పైకి
సర్వాంతరాత్మ యా శంభుండు, హరుడు,
సర్వవృత్తాంతంబు స్వాత్మలో నెఱిగి
సతితోడ బలికె నీ సరణి మునీంద్ర !

“ స్త్రీస్వభావం బిది ! చెలి ! యిటు గనుము !
సంశయింపకు మిట్లు స్వాత్మలో నెప్పు
డా రఘువీరుడే ఆరామవిభుడె
నాయిష్టదైవము నారాయణుండు !
ఆతనిగూర్చియే యా యగస్త్యర్షి
గానంబు గావించె గడుభక్తితోడ;
ఆ నాడు ఋషితోడ నానందమొప్ప
ఆ రామభక్తినే యతివ ! చెప్పితిని.

ఎప్పుడు ధీరమునీశ్వరు లెల్ల
సేవించుచుండు రా శ్రీరామదేవు.
రఘువంశరత్నమై రాజితరీతి
భక్తహితార్థమై ప్రభవించినట్టి
ఆ రామభగవాను డన్యుడా ? కాంచ
ఆ పరబ్రహ్మ, మా యఖిలమయుండు,
నిజతంత్ర నిరతుండు, నిఖిలేశ్వరుండు,
మాయాధిపతి; ధీరమౌనియోగీంద్ర

సిద్ధజనంబు లా శ్రీవిభు, రాము,
విమల చిత్తంబుల విడువక యెపుడు
ధ్యానం బొనర్చుచు సలుపుచుండెదరు.
వేదశాస్త్రపురాణబృందంబు లెల్ల
"నేఽతినేఽతి" యటంచు నిరత మా
కీర్తించుచుండును కేవలభక్తి!"
ఈరీతి శంకరు డెన్నియో సారు
లుపదేశమొనరించె సుమతి సత్కృపను;
కాని యా సతికి హృత్కంజమం దవ్వి
సంతృప్తి గూర్పగా జాలక పోయె.
అపుడు మహేశు డయ్యది రామచంద్రు
మాయాబలంబని మతిలోన నెఱిగి
చిరునవ్వు లొలయగా జెప్పె నీరీతి:
"అంత సందియము నీ కాత్మలో నున్న
ఏల నీ వేగి పరీక్షించుకొనవు?
అరిగియు దిరిగి నీ వరుదెంచుననుక
ఈ వటచ్ఛాయలో నేను వసింతు.
నీ వివేకవిచారనిరతిని జూపి
త్వన్మోహజనితవిభ్రాంతి తొలంగు
నట్లు వర్తింపుమా" యన సతీదేవి
భవునాజ్ఞ బొందియు బయనమైపోయె.

శ్రీరాముమహిమ పరీక్షించువిధము
జింతించె నెల్లుగా శ్రీసతీదేవి.
శ్రీశంకరుం డంత జిత్తంబులోన
అక్కటా! ఏకుజ కశుభంబె కల్గు
నని నిశ్చయించి యి ట్లనుకొనసాగె;
ఏను బోధించితి నెంతయో కాని
ఆమె సందేహంబు ద్యజియింపదయ్యె.
విధి మహావిపరీతవిధముగా నుండె;
ఆమెకు బ్రాప్తించు నశుభంబె దాన;
ఇంతకు కనగ రామేచ్ఛయే జరుగు!
ఏల వృథాతర్క మింతగా ననుచు
హరినామజపమును హరు డాత్మలోన
నొనరింపసాగె మహోజ్వలభక్తి;
ఆనందధాముడౌ నా రామచంద్రు
చేరుప కరిగె నా శ్రీసతీదేవి.
మఱిమఱి యా సతీమాత చింతించి
తాల్చియు దుదకు సీతాస్వరూపంబు
నా రామనరపాలు డరుదెంచుచున్న
దారిలో నిలుచుండె దాపసాధీశ!

## శ్రీరామప్రభావ ప్రకటనము: సతీదేవి పశ్చాత్తాపము.

ఆ యుమాకృతవేష మరసి లక్ష్మణుడు
ఘనవిభ్రమాశ్చర్య కలితాత్ముడయ్యె.
ఐన శ్రీరాము మహాప్రభావమును
తెలియజాలిన యట్టి ధీరాత్ము డగుట
కనుచుండె మౌనియై గంభీరముగను.

ఆ సర్వసాక్షి, యా యఖిలాంతరాత్మ.
ఆ దేవతాపతి, ఆ రామవిభుడు,
తక్షణంబే సతి తాల్చియున్నట్టి
కపటవేషం బెల్ల గ్రహియించినాడు!

స్మరణమాత్రమున సజ్ఞానంబు బాపు
సాక్షాత్తు పరమాత్మ, సర్వజ్ఞుడైన
ఆ రాముపై సనే ఆ సతీదేవి
తన మోసమును జూపె దాపసచంద్ర!

భామాస్వభావ ప్రభావంబు గనుము!
స్వఘనమాయాప్రభావంబును గాంచి
ముఖమండలంబున ముసరి వెలుంగు
చిరునవ్వువెన్నెలల్ చిందులు దొరిక్క
తనతండ్రిపేరును దా వచియించి
చేతులు జోడించి చేసి వందనము
మృదుమధురంబుగా నీరీతి బలికె:

" ఓసతీ ! ఓయుమా ! ఓజగన్మాత !
వృషభధ్వజుం డెట ? ఏకాకినివిగ
ఈ యరణ్యంబులో నీ వేల తిరుగ ? "
అని పల్కు శ్రీరాము నతిమృదుగూఢ
వచనంబులను విని భావంబులోన
నమితసంకోచంబు నాసతి పొంది
భయసంకులాత్యంతభారాత్మ యగుచు
ఆ మహేశుని చెంత కరుగగా సాగె.

" నా నాథు వచనముల్ నమ్మలేనైతి
నా యవజ్ఞత రఘునాథుపై నిడితి
ఈశుతో నే నిప్పుడేమి చెప్పెదను ? "
సతి యిట్లు చింతింపసాగె జిత్తమున
ఆమె స్వాంతమున ఘోరాకులం బొదవె
అపు డామె హృదయాంతరార్తిని గాంచి
శ్రీరాము డొక్కింత స్వీయమైనట్టి
దివ్యప్రభావంబు దెలియ జూపించె:

సతి మార్గమందున జనుచుండ గాంచె
నొక మహాదృశ్యంబు యోగివరేణ్య !
జానకీలక్ష్మణసంయుతుండగుచు
ఆ సతీదేవికి నభిముఖంబుగను
ఆ రామభగవాను డరుదెంచుచుండె
వెనుకకు న్దిరిగియు వీక్షింప నామె

ఆ పూర్వభాగమునందునై తంబు
జానకీలక్ష్మణసంయుతుండగుచు
ఆ రామభగవాను డరుదెంచుచుండె
అమితసుందరమంగళాకార మొప్ప.

ఏవైపు గనుగొన్న నీశ్వరి కపుడు
సిద్ధమునీశసంసేవితుండగుచు
దివ్యసింహాసనాధిష్ఠితుండైన
ఆ రామచంద్రుడే యగపడుచుండె!
ఒకదానికన్న మఱొక్కటి మించి
వెలుగొందుచున్నట్టి విధివిష్ణురుద్ర
గణములు కనవచ్చె గణనలేనన్ని.

వివిధవేషంబుల వెలుగుదేవతలు
నతులు గావించుచు నానావిధాల
శ్రీరామచంద్రుని సేవించుచుండిరి:

తమతమ పతులకు దగినవేషముల
దాల్చి యనుపమ సౌందర్యంబు లొప్ప
బహుసతీభారతీపద్మావతులను
కాంచె సతీదేవి కడువింత గొలుప.
తమతమ సతులతో దనరెడు సురలు
భూరిచరాచరభూతజాలములు
శ్రీరాము నెటగన్న సేవించుచుండి;

రా రాము సేవించు నఖిలదేవతలు.
వివిధవేషంబుల వెలుగొందుచున్న.
ఆ రాము శుభరూప మవికల్పముగను
కానవచ్చెను దివ్యకాంతులీనుచును.
బహురామచంద్రుల బహుమహీసుతల
గాంచె సతీదేవి; కాని రూపంబు
లేకరీతిగ నుండె నేమార్పులేక;
ఆ రాముడే మఱి యా లక్ష్మణుండె
ఆ సీతయే యెట నరసిన న్గాని
యణువంత యైన మార్పునునది లేక
కానరాగా సతి కడుభీతి నొందె.
కంపంబునొంద హృత్కంజ మంతయును
తనువును మఱచె నా దక్షతనూజ
ముకుళితనేత్రియై పోవుమార్గమున
నొక ప్రక్క కొదిగియు నుపవిష్టయయ్యె.
స్మృతిదెచ్చుకొని కొంత సేపటి కామె
నలుదిక్కులను జూడ నయనముల్ తెఱచి
అడవిగా కింకేమి యగపడదయ్యె!
శ్రీరామపాదరాజీవంబులకును
ప్రణతులర్పించుచు బలుమారుభక్తి
కైలాసపతి యుండుకడ కేగె నంబ.
తను జేరవచ్చిన దక్షజ న్గాంచి

మందహాసాననమండలుండగుచు
కుశలంబు లడిగియు గూర్మి వెలుంగ
"శ్రీరాము నెట్లు పరీక్షించినావో,
ఉన్నయదార్థ మో యుమ! తెల్పు" మనియె.

## శివుడు సతీదేవిని పరిత్యజించుట: సతీవిషాదము.

ఆ రఘునాథు మహామహిమంబు
తెలియుటచేత సతీదేవి, హృదిని
భయవశయౌచును భవునిచెంగటను
సత్యంబు దాచి యీ చందంబు బలికె:
"శ్రీరాము నేను పరీక్షింపలేదు;
నీవలె మ్రొక్కియు నేవచ్చియుంటి
ఓప్రభూ! నీమాట లుత్తవియౌనె?
ఏను పూర్ణంబుగా హృదయంబులోన
సంతృప్తి బొందితి సర్వేశ! నాథ!"
అనిపల్క శంకరు డాలకించియును
సతి యొనరించిన సర్వకార్యమును
దివ్యదృష్టిని లోన దిలకించి, సతిని
అనృత మాడించిన ఆ రామచంద్రు
ఘనమాయకును నమస్కారంబు సలిపె.
"ఈశ్వరు సంకల్ప మేరీతిగలదొ
ఆరీతి జరుగక యాగ దేదియును."

అనుచు సుజ్ఞాని యా హరు డెంచె మదిని.
దక్షకుమారి సీతాస్వరూపమును
పూనిన విషయంబు పురహరుహృదిని
అతివిషాదము గూర్చె నయ్య! మునీంద్ర!
"ఇక సతిపై బ్రీతి యేనుచూపినచొ
భక్తిపథంబెడబాయులోకమున;
అటుల నే జేసిన నవినీతియగును."
పరమపావని సతిన్ వదలుద మన్న,
ఆమెపై రక్తిచే నఘము ఘటిల్లు
అని తలంచియు శివు డాంతర్యమందు
పైకొక్క మాటయు బ్రకటింపడయ్యె.
తనయెద నధికసంతాప ముండినను.
అంతట శంకరుం డతిభక్తితోడ
శ్రీరామపాదరాజీవంబులకును
శిరమువంచియు నమస్కృతులు గావించి
హృదిని రాముని స్మరియించినంతటనె
ఎందాక సతి ధరియించు నా దేహ
మందాక నామెపై యనురక్తి*యొప్ప
దను నొక్క సంకల్ప మాత్మలో గలిగె.
శంకరుం డట్లుండ శపథంబుబూనె.
ఆ ధీరమతి యైన హరు డట్లు తలచి

* యనురక్తి యన నిక్కడ భార్యాదృష్టితోగూడిన ప్రేమ.

రఘువీరపావననిర్మగ్నచిత్తమున
కైలాస శిఖరికి గమియింప సాగె.

అటు లా శివుం డొక్క యడుగు వేయగనె
"జయ మహేశా! జయ శర్వ! విశ్వేశ!
బహూద్దృఢభక్తిసంభరిత! సర్వేశ!
నీకన్న నెవ్వ రీ నిఖిల లోకముల
సలుపగాగల రిట్టి శపథంబు శంభు!
రామభక్తా! సమర్థా! భగవంత!"
అనుచు నిర్ఘోషించె నాకాశవాణి.

ఆవాణి నాలించి యా సతీదేవి
అంతర్యమందు పెల్లాకులం బొంది
గద్గదస్వనమొప్ప కంఠంబునందు
పలికె నీరీతిగా బరశివుతోడ:
"ఓకృపాళూ! ప్రభూ! ఓసత్యధామ!
ఓదీనవత్సలా! ఓమహాదేవ!
దేవ! నీవేమి ప్రతిజ్ఞ జేసితివి?"
అని యనేకవిధంబు లా యుమాదేవి
ప్రశ్నింప త్రిపురారి బదులాడడయ్యె
నొకమాటయేని ఋష్యుత్తమా! వినుమ.

సర్వజ్ఞు, డీశుండు, సర్వం బెఱింగె
నని యా సతీమణి ఆత్మ గ్రహించి
శంకరవంచన సలుపంగ దాను

యత్నించినందుకై యతిఖేదమొందె.
సహజంబుగా స్త్రీస్వభావంబు జడము,
అజ్ఞానయుత, మని యామె యెఱింగె.
పాలలో గలసిన పానీయములును
పాలటు లమ్మగా బడును ధరిత్రి;
ప్రేమైక్యతాశక్తి వీక్షించు మనఘ!
ఆ క్షీరనీరంబు లందొక్క చుక్క
కపటపు బులుసును గలిపిన యెడల
విడిబడు నీరముల్, విడియును రుచియు.
తాను జేసిన పని దలచి యా యంబ
అమితంబుగా హృదయంబులో వగచె.
ఆమెలో గలిగిన యాందోళనంబు
వర్ణనాతీత మపారమై యుండె.
కరుణాసముద్రుండు గావున శివుడు
తన యపరాధంబు దయబూని మిగుల
ప్రకటింపడయ్యెను బహిరంగరీతి
అని యా సతీదేవి యాత్మలో నెఱిగె.
శివుని వైఖరిజూచి చిత్తంబులోన
తనపైని రాగమ్ము త్యజియించెననుచు
దర్కించుకొని యామె తల్లడపడియె.
తనదోష మెఱిగి యా దక్షకుమారి
పల్లెత్తి యొకమాట పలుకగా వెఱచె.

ఆమె స్వాంతంబు మహాకులవశత
జండాగ్నికుండంబు చందమై పోయె.
ఆ సతీదేవి శోకాకులాక్షులను
కని వృషధ్వజుడు సత్కారుణ్య మొప్ప
శోకంబు మఱపించు సుందర కథల
బలుకగా సాగెను బహుమనోజ్ఞముగ.
విశ్వనాథుం డటుల్ వివిధేతిహాస
కథనంబొనర్చుచు గైలాస మరిగె.
అటజేరి శ్రీశంభు డాత్మలో దనదు
శపథంబు దలచి తచ్ఛైలశృంగమున
వటవృక్షతలమున బద్మాసనమున
ఆసీనుడై నిజాత్మానందమందు
నిర్వికల్పసమాధి నిష్ఠలో మునిగె.
అతివిచారాక్రాంతయై సతీదేవి
వసియించె గైలాసపర్వతాగ్రమున;
ఆమెచిత్తములోని యాందోళనంబు
నెవరెఱుంగుదురు? మునీశ్వరా! ప్రాజ్ఞ!
ఒక్కదినంబొక్కయుగముగానయ్యె
నక్కటా సతికి దుఃఖాకులవశత!
నిత్యనవ్యంబయి నిరుపమంబగుచు
ఆ సతీచిత్తశోకాగ్ని వెలింగె,
ఆ మహాఘోరదుఃఖాంబుధినెపుడు

తరియింపగల నని దక్షకుమారి
పలువిధంబుల లోన బరితాపమొందె.

" ఆ రఘుపతిని నే నవమానపఱచి
శంకరువాక్కు లసత్యంబు లనుచు
అక్కటా! తలచితి నజ్ఞానవశత!
విధి నాకు దగినట్టి విధముగా జేసె;
ఏను చేసిన కర్మమే యిప్పు డిట్టి
శిక్ష విధించెను చింతింపు మనుచు
ఓ భగవంతుడా! ఓ పరమేశ!
హరవియోగము గూర్చి యాపైన నన్ను
బ్రతుకజేయుట ధాత్రి బాడియా నీకు? "
అని దుఃఖపడసాగె నా సతీదేవి.

ఆ శోకమును వాక్కు లందుకోలేవు.
ఆ సునిశ్చలచిత్త యగు సతీదేవి
హృద్పద్మ మందున శ్రీరామదేవు
స్మరియించి ప్రార్థన సలిపె నీరీతి!
"హే రామచంద్ర! లోకేశ్వరా! శౌరి!
దీనవత్సలుడను దివ్యమౌ బిరుదు
నీకున్నయది; యది నిజమైన యెడల
ఆర్తిసంహరణుండ వని నిన్ను శ్రుతులు
నిరతంబు గానంబు నెఱపిన యెడల
శ్రీరామ నీ కిదే చేసి జోహారు

ఈ శరీరము శీఘ్రమే విడిపోవ
ప్రార్థించుచుంటిని భావంబులోన.
శివచరణాంబుజస్నేహ మీ హృదిని
ఒక్కింతయేనియు నుండిన యెడల
త్రికరణశుద్ధిగా శ్రీరామ ! నేను
సత్యవ్రతంబును సలిపిన యెడల
ఓ సర్వదర్శకా ! ఓ ప్రభూ ! రామ !
నా ప్రార్థనము విని నా శరీరంబు
బహుశీఘ్రముగ నెడబాసియు నేను
దుస్సహ మీబాధ దొలగు మార్గమును
నాకు జూపింపు మనాథశరణ్య !

ఈ రీతి దక్షజ యెంతయో వగచె.
ఆమె దారుణదుఃఖ మకథనీయంబు;
ఎనుబదియేడువే లేడు లిట్లేగ
అవినాశి, శంభుండు, హరుడు, శంకరుడు,
ఘనసమాధిని వీడి కన్నులు దెఱచి
రామనామం బనురాగంబుతోడ
జపియించుకొనసాగె జపమాల బట్టి.
విడిచె సమాధిని విశ్వేశు డనుచు
ఎఱిగి దక్షకుమారి యేగి సన్నిధికి
శ్రీశంభుపాదరాజీవంబులందు
భక్తితో సాష్టాంగపడి నతిజేయ

శంకరుం డామెను సత్కృపతోడ
ఎదురుగా గూర్చుండ నిచ్చి యాసనము
మధురసమంజుల మాధవకథల
వినిపింపగా సాగె స్త్రీల శోకంబు.

ఆ కాలమందె పద్మాసనుం డజుడు
దక్షుడే యన్నిట దక్షుం డటంచు
వలలు ప్రజాపతిపదవి నొసంగె.
ఆ యున్నతంబగు నధికార మొంది
దక్షుండు గర్వసంస్తంభితుం డయ్యె!
పెద్దదౌ పదవి లభించిన పిదప
గర్వమూనని జీవి కానరా డవని.

## సతీశరీరపరిత్యాగము-దక్షయజ్ఞధ్వంసనము.

అంత దక్షుండు మహర్షులందఱిని
ఆహ్వానమొనరించి యజ్ఞం బొకండు
సలుపగా దొడగె ప్రజ్వలవై భవముగ.

యజ్ఞహావిర్భాగులౌ సురలెల్ల
అతిగౌరవముగ నాహ్వానింపబడిరి,

నాగగంధర్వకిన్నరసిద్ధముఖ్య
సకలదేవతలు నిజప్రియాసహితు
లై చనుచుండిరి యజ్ఞంబుజూడ.
తద్బ్రహ్మహరిశివుల్ తప్ప నావేళ

అఖిలబృందారకు లాకాశ మందు
అరుగుచుండిరి విమానావళి నెక్కి.
వ్యోమమార్గంబున బోవుచున్నట్టి
మహితసౌందర్యవిమానపంక్తులను
శ్రీసతీదేవి వీక్షించె నయ్యెడను.
సురసుందరీగణసుమధురగాన
రవములు మునిజనశ్రవణంబులందు
బలవంతమున జొచ్చి వారిధ్యానముల
జెఱుపదొడంగె విచిత్రరీతిగను.
అంత సతీదేవి హరుని గాంచియును
గగనకోలాహలకారణం బడుగ
అఖిలవృత్తాంతంబు హరుడు వచించె.
తనతండ్రి చేయు నధ్వరవార్త వినియు
దక్షకుమారి సంతసమొందె హృదిని.
శ్రీమహేశుడు నాకు సెలవిచ్చెనేని
వెళ్లి కొన్నాళ్ళు నా పితృగృహం బందు
వసియింతు నని యామె భావమం దెంచె
తనపతిచే బరిత్యక్తయై యామె
అతిదుర్భరాకులం బాత్మలో నొందె;
ఐనను స్వీయమహాపరాధంబు
ఎఱిగియుండుటచేత నిది యే మటంచు
పల్లెత్తి యొకమాట బలుకలేదయ్యె.

ఎట్టకేలకు సతి యీరీతి బలికె
పరమమనోహరవాణి వెలుంగ
భయసంశయప్రేమభావంబు లొప్ప:
"నాతండ్రిగృహమున నాథ! లోకేశ!
జరుగుచున్నది మహాసవనకార్యంబు
హే కృపాయతన! విశ్వేశ్వరా! కృపను
సెలవొసంగిన నేను శీఘ్రంబె పోయి
ఆ సవనోత్సవం బరసి వచ్చెదను."
ఆ మాట లాలించి హరుడిట్లు బలికె.
"మంచిదే నీ యభిమతము; స్వాంతమున
అదె నాకుగూడ మోదావహం బగును.
అయినను విపరీత మాలింపు మిపుడు
మనల నాహ్వానింప మానె నీ తండ్రి.
నినుదక్క దక్షుండు నీదు చెల్లెండ్ర
నందఱ ప్రేమ నాహ్వానంబు జేసె.
మనయం దసూయచే మానెను పిలువ
నినుగూడ పిలువడు నిష్ప్రేము డగుచు.
మన వర్తనంబును మది నచ్చ కతడు
మును బ్రహ్మసభలోన బూనె ద్వేషమును.
ఇందుచేతనె యతం డిప్పటికైన
మనల నిందించుట మాన బోడయ్యె.
పిలువకుండగ నీవు వెడల, భవాని!

నీ సుశీలమునకు నీ స్నేహమునకు
నీ గౌరవమునకు నిజము కొంత.
పిలువకుండగ గూడ విహితు నింటికిని
విభుమందిరమునకు పితృగృహంబునకు
ఆచార్యునెలవున కరుగగావచ్చు
దీనియం దెట్టి సందేహంబు లేదు.
ఐనను నీవన నాత్మలో బడని
వానియింటికి బోవ భావ్యంబు కాదు.
అని యనేకవిధాల నా శంకరుండు
హితము జెప్పినగాని యిసుమంత సతికి
హృదిని జ్ఞానం బుదయింపక పోయె
బలవంతమగు విధివశముచే ననఘ !
"పిలువకుండగ నీవు పితృగృహంబునకు
అరిగినచో సతీ ! యశుభంబె కలుగు"
అనియు నింకొక్కపర్యాయంబు శివుడు
తెలియబల్కెను నుమాదేవితో గరుణ,
పలుసార్లుబోధించి పరమేశుడటుల,
ఎఱిగియు లాభ మొక్కింత లేదనుచు
తనముఖ్యగణముల దగ దోడొసంగి
త్రిపురారి తుదకు సతీదేవి నంపె.
అంత భవాని ప్రియంబొప్ప జేరె
తనతండ్రి యైనట్టి దక్షునింటికిని.

అట నా సతిని యెక్కరైనను గాని
పలుకరింపగలేదు పల్లు విప్పియును
దక్షునిభయముచే దాపసచంద్ర !
ఒక తల్లి మాత్రమే యుమను వీక్షించి
ఆదరించెను ప్రేమ నణచుకోలేక.
చెల్లెండ్రు నెదురేగి చిరునవ్వు లొప్ప
స్వాగతం బొసగిరి సంతోషమునను.
దక్షప్రజాపతి తన పుత్రి యనెడి
వాత్సల్యమేనియు వదలి వైచియును
అడుగడాయెను క్షేమమా ? యనికూడ !
ఆ సతీదేవిని అరసెనో లేదా
దక్షప్రజాపతి తనువెల్లనపుడు
క్రోధాగ్ని కీలికాకుండమైపోయె.
అక్కటా ! సతియంత నరిగి లోపలికి
యజ్ఞశాలను గాంచ నచ్చటా యుమకు
హరహవిర్భాగంబు లగపడవయ్యె.
అప్పు డామెకు జిత్తమం దర్థమయ్యె
హరుహితోక్తులలోని యాథార్థ్యమెల్ల
ఆత్మేశు శివున కా యజ్ఞంబులోన
కలిగిన యవమానకార్యంబుచేత
ఈశ్వరీహృది దహియింపగా దొడగె,
పూర్వశోకముకన్న భూరికఠోర

శోక మా సతి పొంది స్రుక్కఁగా సాగె.
ఈ ప్రపంచంబున నెన్నెన్ని వగలు
కల వందు మించు దుఃఖం బేది యన్న
దన బంధువులు నిరాదరణ సేయుటయె !
అందుచే నాసతి యతిదుఃఖ మొందె,
తనతల్లి వచ్చి యెంతగ బుజ్జగించి
యోదార్చినను గాని యుమ తనలోని
శంకరఘోరాపచారసంజనిత
దుర్భరపరితాపదుర్వారవహ్ని
నార్పుకొనంగ లేదాయె మునీంద్ర !
అంతటా సతి దుఃఖమాపుకోలేక
చరచర నాయజ్ఞశాలలో కరిగి
ఆ మహాసభనెల్ల నరసి తీక్ష్ణముగ
అనియె నీరీతి రోషావేశయగుచు :
"ఓ సభాసదులార ! ఓ ఘనులార !
ఓ మునీశ్వరులార ! ఓ విజ్ఞులార !
శ్రీశివనిందను చేసిన యట్టి
శ్రీశివనిందను చెవుల విన్నట్టి
మీరెల్ల దప్పక మీ పాప ఫలము
అనుభవించెద రిదే యనుభవించెదరు
మా తండ్రి సైతము మది బూర్ణముగను
పరితాపపడు దన పాపకృత్యమున.

హరిహరులను, సజ్జనాళిని ఖలులు
నిందించుటను విన్న, నియతి యే మనగ;
చేతనైన న్వాని జిహ్వను జీల్చి
వేయగా వలయును వేగంబె; వేడ
తన రెండు చెవుల హస్తములతో మూసి
పరుగెత్తిపోవుట పరగు ధర్మముగ,

త్రిపురారి, యా మహాదేవుండు, శివుడు,
జగదాత్మ, జగదేకజనకుండు, విభుడు,
సకలోపకారి; యా శంభుశంకరుని
మందుడై నిందించె మాతండ్రి యిప్పు
డా దక్షపుత్రజ యైన దీ తనువు!
ఆ చంద్రశేఖరు, నా వృషధ్వజుని,
నా హృదయంబులోన బ్రతిష్ఠించి
ఈ శరీరం బిప్పుడే త్యజించెదను!
అని పల్కి యోగాగ్నియం దామె తనువు
దగ్ధంబొనర్చెను తక్షణంబందె-
ఆ మహాయజ్ఞసభాంతరాళంబు
నందుండి యొక్కపర్యాయంబు లేచె
అతిభయోపేతహాహాకారరవళి,

అటుల యజ్ఞంబున నా సతీదేవి
తనువు వీడుట విని తచ్ఛివగణము
సవనవిధ్వంసమ్ము సలుపదొడంగ

భృగుమహాముని కాచె గృపను యజ్ఞమును.
ఈ వార్త వినియు మహేశుడుగ్రతను
వీరభద్రుని బంప వేగ నా ఘనుడు
యజ్ఞవిధ్వంసన మాచరించియును
తగువిధంబున దేవతలను శిక్షించె.
శివవిరోధంబున జెందు దుర్గతిని
దక్షుండు పొందిన తత్కథ యెల్ల
అఖిలప్రపంచవిఖ్యాతమై యుంట
జెప్పితి నేను సంక్షిప్తపద్ధతిని.

## శ్రీపార్వతీజననతపశ్చర్యాది వృత్తాంతము

సతి మరణించుచు జన్మజన్మముల
శ్రీశివపాదసంప్రీతియే తనకు
సిద్ధించుగాకని శ్రీహరిన్గూర్చి
ప్రార్థించినందున బార్వతి యగుచు
ఆ హిమాచలునింట నావిర్భవించె!
ఏనాడు పార్వతి హిమవంతునింట
ఆవిర్భవంబొందె నానాటినుండి
అఖిలసిద్ధులు సంపదావళికెల్ల
ఆవాసమయ్యె హిమాలయనగము.
అటనట నొదవె ఋష్యాశ్రమగణము
సముచితసుందరస్థానంబు లొసగి

శ్రీహిమాచలు డాదరించె మౌనులను!
సర్వదా సుమఫలసహితంబులైన
నానావిధంబులౌ నవ్యవృక్షములు
బహువిధమణిగణభాసురఖనులు
భాసించె నా రమ్యపర్వతమందు.
నిర్మలోదకములు నిండె వాహినుల
ఖగమృగమధుపసంఘములు సుఖించె.
ఆ హిమాలయగిరి నధివసియించు
సకలజీవంబులు సహజవైరముల
విడిచి పరస్పరప్రేమతో మెలగె,
ఆ పార్వతీదేవి యవతరించుటను
శ్రీరామభక్తిచే జెలువొందు నట్టి
భక్తోత్తముని ముఖపద్మంబువోలె
ఆ హిమాలయగిరి యతిశోభ నొందె.
నిత్యనూతనశుభనిలయుడై చెలగు
ఆ హిమవంతు బ్రహ్మాదిదేవతలు
ధన్యుండటంచు గీర్తన సేయుచుండ్రి.
ఈ వార్తనెల్లను నెఱిగి దేవర్షి
ఆ హిమాచలుని శుభాలయంబునకు
కౌతూహలం బొప్పగా నిర్గమించె.
ఆ వచ్చినట్టి మహామునీశ్వరున
కత్యాదరంబున నద్రివల్లభుడు

స్వాగతంబొసగియు భక్తిదీపింప
ప్రక్షాళనము జేసి పాదపద్మముల
ఉన్నతాసనమున నుపవిష్టుజేసి
భార్యాయుతంబుగా బదముల వ్రాలి
త న్నారదాంఘ్రితీర్థంబు గైకొనియు
స్వీయాలయమున ప్రోక్షించి యా పిదప
తన మహాదృష్టంబు దనరగా దెలిపి
ఆత్మపుత్రికను ప్రియంబొప్ప బిలిచి
నారదమునిపాద నళినంబులందు
సాష్టాంగనతులను సలుపగాజేసి
ఈరీతి బలికెను హిమవంతుడంత :
ఓ నారదాచార్య ! ఓ మునివర్య !
దేవా ! త్రికాలవేదివి సర్వమాత్మ
నెఱిగిన ఘనుడవీ వెల్లెడ న్దిరుగు
పరమపావన పరివ్రాజకమణివి;
తగ విచారించి తథాగతవర్య !
అస్మదాత్మజకు శుభాశుభంబులను
తెలుపగా గరుణ ప్రార్థించుచున్నాడ !
అనుమాటలను విని యా నారదర్షి
ముఖమున జిరునవ్వు మోసు లెత్తంగ
మృదుగూఢవాణితో నీరీతి బలికె :
" ఓ హిమాచల ! వినుమోయి తెల్పెదను

నిఖిలసద్గుణనిధి నీ తనూజాత
సహజసౌందర్య విజ్ఞానసౌశీల్య;
శ్రీభవానీదేవి, శ్రీయుమామాత,
యంబిక, యనియెడు అమలనామముల
బిలువంగబడు నీదు ప్రియపుత్రి యనఘ !

సకలసల్లక్షణసంపన్న యగుచు
ఈ బాల నిరతభర్తృప్రేమ గాంచు;
సర్వదా యీ గౌరి సౌభాగ్య మొంది
తల్లిదండ్రులకు సద్యశ మొనగూర్చు;
అఖిలజగత్పూజ్యయౌచు వెలుంగు
ఈమె సేవింప గాదేది దుర్లభము;
ఈమెనామము స్మరియించుమాత్రమున
ఈ ప్రపంచంబున నెల్లభామినులు
ఖడ్గధారావ్రతకల్ప మైనట్టి
వరసతీధర్మంబు వహియింప గలరు.

ఇవి గౌరిసుగుణంబు లిక రెండు మూడు
కల వవగుణములు క్ష్మాధ్రవరేణ్య !
అభిమానవిరహితు డగుఖండు, మఱియు
గన, తలిదండ్రులు గలుగనివాడు
ఛిన్నసంశయు, డుదాసీనచిత్తుండు;
జటిలుండు, యోగి, నిష్కాామి, నగ్నుండు
అల యమంగళవేషియగు నీమెభర్త;

ఈమెహస్తము జూడ నిది కానవచ్చు."
అను నారదుని పల్కు లాలకించియును
సత్యంబు లనియెంచి స్వాంతంబునందు
కడుదుఃఖమొందిరి; కాని శ్రీగౌరి
అతిహర్షమును జెందె నంతరంగమున.
ఈ భేద మా ఋషి యెఱుగకపోయె !
పై కందఱును నొక్కపగిదిగా నున్న
కలదు భేదంబు లో గలుగు భావముల,
ఆ మేనకాదేవి, కా గిరిపతికి,
శ్రీగౌరికిని, ఆమె చెలికత్తెలకును,
అందఱ కొకరీతి నాసమయమున
తనువులు పులకీకృతంబులైపోయె
కనుల బాష్పంబులు కారగాదొడగె.
దేవర్షినారదు దివ్యవాక్యములు
తప్ప వేనాడు యదార్థంబు లగును :
అని యుమ, లోన నాహ్లాదంబు జెందె.
ఆ పార్వతీహృదయాంతరాళమున
శ్రీశివచరణరాజీవానురక్తి
మొలకలెత్తెను; మహాముని ! భరద్వాజ !
ఐనను సందేహ మందె జిత్తమున
శంకరప్రాప్తి దుష్కరమంచు గౌరి.
తన శివప్రీతి వ్యక్తంబు సేయుటకు

సమయంబు కాదని స్వాంతమం దామె
తన మహోద్వేగంబు దాచి, యణంచి,
చెలికత్తెయొడిలోన జేరి కూర్చుండె.
తాపసోత్తముమాట తప్ప దటంచు
హిమవంతు, డతని గేహినియును, సకియ,
లతిశోకసంకులితాత్ములై రపుడు.
తదుపరి యెట్టులో దర్పెలవిభుడు
చెదరిన ధైర్యంబు జేరగాదీసి
"ఇపు డేమి సేయుటో యెఱిగింపు స్వామి!"
అనిన నా మునిపతి యనియె నీరీతి:

"వినుమయ్య హిమవంత! విధి దాటదరమె
నరసురాసురమునినాగుల కైన?
అయిన నే నొకయుపాయంబు వచింతు
నీశ్వరకృపయున్న నిది ఘటియించు
నేను తెల్పినరీతినే గిరిపుత్రి
కటువంటి పతి వచ్చు నది తప్పబోదు.
పార్వతీవిభుడగువాని కున్నట్టి
అవగుణంబులు శివు నందుననుండె
నని నేను నిస్సంశయముగ జెప్పెదను
శివకరగ్రహణంబు జేసినన్ గౌరి
దోషంబులన్ని నిర్దోషంబులగును.
హరి శేషపర్యంక మందు నిద్రించు;

నైనను అది దోషమందురా విబుధు ?
లా విధంబుగనె సూర్యాగ్నిదేవతలు
సర్వంబు దహనంబు సలుపుచుండినను
అది దోషమని యెవ్వ రాడగాబోరు.
శుద్ధోదకంబు, లశుద్ధోదకములు
వచ్చియు గంగలోపల మేళవించు
ఆ సురాపగ నెవ్వ రైనను గాని
అపవిత్ర మని యెంతురా ? హిమవంత !
పూషాగ్నిగంగల బోలు సమర్థు
లకు జెర్పులంటజాలవు శైలరాజ !
ఏ జ్ఞాని నని యెంచి హృది నహంకృతిని
నజ్ఞుండు ఘనుల దా ననుకరించినను,
ఒక కల్పపర్యంతమో లేక నతమొ
వా డుగ్రనరకసంవాసంబు సేయు;
దేహబద్ధుండుతా దేవుతో సముడె ? .
గంగోదకము దెచ్చి కలిపి మద్యమున
త్రాగుడన్నను బుధుల్ త్రాగగాగలర ?
కాని యా సురదెచ్చి గంగలో గలుప
అప్పు డా సురనైత మతిపూత మగును.
జీవేశ్వరులమధ్య జెలగుభేదంబు
ఈ రీతి మనము గ్రహింపగా వలయు.
ఆత్మ యా పరమాత్మయం దైక్యమైన,

జీవుడు దేవుడై చెలగును గాని
అందాక యుండు నా యంతరం బనఘ!
సహజసమర్థుండు, శంభుశంకరుడు;
ఆతడు భగవంతు డాత్మలో దెలియ;
అతనిని గౌరి పెండ్లాడినయెడల
నఖిలవిధంబుల నతిశుభంబగును;
ఆ మహేశ్వరుడు దురారాధ్యుడైన
సలిపినతపము ప్రసన్నుడౌ నతడు.
నీ పుత్రి తపమును నిర్వహింపంగ
త్రిపురారి, యా మహాదేవు, డీశ్వరుడు,
విధివ్రాతను దుడిచివేయగాగలడు.
ఘనవరు లెందరో కలరు లోకమున
కాని నీ తనయకు గడు దగు వరుడు
శివునికన్నను లేడు చింతసేయగను.

వరదాత, ప్రణతార్తిభంజనుం, డజుడు,
పరమకృపావార్ధి, భక్తరంజనుడు,
శ్రీమహాదేవుడు, శివుడు, శంకరుడు!
కోట్లకాలందిగా గొప్పయోగముల
జపము లెన్నెన్నియో సలిపిన గాని,
శ్రీశివారాధన చేయక, సచివ!
ఏనాడు సిద్ధింప విష్టకార్యములు.
అనిపల్కి శ్రీహరిధ్యానచిత్తమున

నగసుత స్రీవించి నారదమౌని,
"వదలుమా భయమెల్ల బర్వతనాథ!
అఖిలంబు కల్యాణ మగు" నని పల్కి
బ్రహ్మలోకమునకు బయనంబుజేసె.

ఇక ననంతరకథావృత్తంబు వినుము;
ప్రియుని మేనక యొంటరిగ నుంట జూచి
యింపుపెంపార నా నీరీతి బలికె
"ఓనాథ! నారదయోగివాక్యములు
నా మది కవగాహనంబు కాలేదు.
మన తనూజకు దగు మంచివరుండు
కులగోత్రములు మంచిగుణరూపులున్న
వాడు లభింప వివాహం బొనర్పు
మటుల గాకున్న గల్యాణమే వలదు.

కన్యగానే మన గౌరి యుండెడిని.
నా గౌరి నాదుప్రాణములతో సమము;
మనపార్వతికి దగు మనువు జూడనిచో
సహజజడుం డని సర్వులు నిన్ను
నిందింతు రో నాథ! నిక్కంబుగాను.

కూర్మి వివాహంబు గుదిరించునప్పు
డీ విషయంబు నీ హృదినుంచు మెప్పు
డాపయి ననుతాప మందకుండగను.
అని మేనకాదేవి ఆత్మేశుచరణ

పద్మంబులందునన్రవాలిదుఃఖించె.
అంత బర్వతపతి యనురాగమొప్ప
నీరీతి మేనక నీక్షించి పలికె;
"చంద్రునిలో నగ్ని జన్మింపవచ్చు
కాని నారదుమాట కల్లగా దెపుడు.
ప్రియురాల! నీ చింత విడువు మంతయును
భగవంతు నెంచుము భావంబులోన.
ఎవ్వడు పార్వతిన్ సృష్టించె నతడె
ఆమె కొసంగు గల్యాణంబు సకియ!
నీ సుతపై ప్రేమ నీకున్న యెడల,
శివసమాగమమును సిద్ధింపజేయు
తప మొనరింప నీ తనయను బంపు
మిదె వగవోయెడి యేకైక పథము.
దేవర్షివర్యుల దివ్యవాక్యములు
పూర్ణార్థగర్భితంబులు, సహేతువులు.
ఆ వృషకేతనుం డా మహాశివుడు
సకలసద్గుణనిధి సౌందర్యమూర్తి!
ఇంక శంకింపకు మీ సత్యమెఱిగి.
అన్నిట శంకరుం డకళంకు డబల!"
అను పతివాక్యంబు లాలించి ఆమె,
హర్షంబుజెందియు నాత్మలో, లేచి
గౌరిచెంతకుబోయె గడు ప్రేమతోడ,

ఆమె యుమాదేవి సరసి నంతటనె
ఆమెకన్నులలోన నశ్రు లుప్పొంగె;
ఆ మేనకాదేవి యత్యాదరమున
కూర్మిపుత్రిక నెత్తుకొనియు ముద్దాడి
యొడియందున గ్గూరుచుండగాజేసి
పలుసార్లు కౌగిట బరగ హత్తించె.
ఉజ్జ్వలితానురాగోద్వేగవశత
నామె గద్గదకంఠయయ్యె; నత్తటిని
ఆగె నాలుక మాటలాడలేకుండ.
ఆ తీరు గాంచియు నా జగన్మాత,
ఆ భవానీదేవి, అంబ, సర్వజ్ఞ,
మాతృసుఖప్రదమధురాతిమృదుల
వాక్యముల్ దనర యీ పగిది వచించె :
" స్వప్న మొక్కటి నాకు వచ్చె నోమాత !
వరసుందరుడు గౌరవర్ణుడౌ నొక్క
బ్రాహ్మణోత్తము డిట్లు పలికె నాతోడ :
ఓ శైలసుత ! నారదోక్తుల నీవు
సత్యంబు లనెడి విశ్వాసంబు బొంది
తపమొనరింపుము తప్పక వెళ్ళి;
నీవు తపశ్చర్య నిర్వహించుటయె
తగ సమ్మతము నీదు తలిదండ్రులకును.
తపము సుఖంబిచ్చు; దపమొనరింప

దుఃఖదోషంబులు తూలి నశించు;
ఘనతపోబలముచేగాదె విధాత
ఈ ప్రపంచంబెల్ల సృష్టించుచుండు;
ఘనతపోబలముచేగాదె శ్రీ విష్ణు
వీ జగంబులగాచు నెల్లవేళలను
ఘనతపోబలముచేగాదె మహేశు
డఖిలలోకముల లయం బొంద జేయు.
ఘనతపోబలముచేగాదె శేషుండు
తన ఫణామండలి ధరణి న్భరించు,
అఖిలసృష్టికి తపం బాధారభూత
మిది యెఱింగియు భవానీ! నీవు పొమ్ము
తపమొనరింపుము ధన్యతగనుము."

అని చెప్ప, మేనక ఆలకించియును
విస్మయం బొందియు విభుబిలిపించి
స్వప్నవృత్తాంతంబు సర్వంబుదెలిపె.
తాపంబుబొందెడి తల్లిదండ్రులకు
వేయివచించి యొప్పించియు దుదకు
తరలె నుమాదేవి తపమొనరింప
హర్షసంకలితహృదంబుజ యగుచు
పార్వతీప్రియపరివారంబు, లామె
తల్లిదండ్రులును, స్వాంతంబులం దెంతొ
భయసంకులంబుల బడసాగి రపుడు

వేదశిరుం డను విజ్ఞుడౌ మౌని
వచ్చి యోదార్చెను వారలనెల్ల.
పార్వతీమహితప్రభావంబువినియు
వారంద అప్పుడు స్వస్థత గనిరి
ప్రాణేశ్వరుండైన పరమేశు దివ్య
చరణాంబుజంబుల సంధించిహృదిని
అంబ, యుమాదేవి యడవుల కేగి
మొదలుపెట్టెను ఘోరముగ దపశ్చర్య.
ఆమె తనూలత యతికోమలంబు
భరియింప గలదె తపఃక్లేశములను?
అయినను పార్వతి యఖిలభోగముల
బతిపాదభక్తిసంభరితాత్మ యగుచు
వర్జించె నహా! తృణప్రాయంబులుగను.
ఆమెకు హరచరణానురాగంబు
నిత్యనవ్యంబయి నెగడగా దొడగె.
శివపదధ్యాననిష్ఠితచిత్త యగుచు
తనువునే మఱచెను తపమున గౌరి.
ఒక్క వేయేడు లా యుమ కాననమున
కందమూలఫలాల గడుపు నింపుచును,
శాకముల్ దిను చౌక శతవత్సరములు.
జలవాయుభక్షణ సలిపి కొన్నాళ్లు,
మఱి కొన్ని దినములు పరమతీవ్రముగ

కఠినోపవాసదీక్షారతి తోడ,
ఆ పయి నొకవేయి యబ్దంబు లాడవి
పండి రాలిన బిల్వపత్రముల్ దినుచు,
భూమిపై బడి, యెండిపోయిన యట్టి
ఆ బిల్వపత్రంబు లైనను తుదకు
గైకొనకుండగా గడు ఘోరఘోర
తప మొనరించె నా తరుణీలలామ!
ఆ నాటి నుండియే యామె "కపర్ణ"
అను నామ మొదవె మహర్షివరేణ్య!
ఆ మేతనూలత యత్యుగ్రమైన
తపముచే శుష్కించె; ధాత వీక్షించి
అంతరిక్షమునుండి యపు డనె నిట్లు
గంభీరమేఘసంఘాతరావమున:

"విను మమ్మ ఓ శైలవిభుతనూజాత!
నీ వాంఛ సిద్ధించె నీ వింక జనని!
ఆపు మీ దుస్సహంబైన తపంబు
అచిరకాలములోన నా త్రిపురారి
నీ ప్రాణవిభుడగు నిక్కంబు దేవి!
మున్నెందఱో ధీర మునులు, జ్ఞానులును,
కలరు లోకంబున గాని భవాని!
ఒక్కరేనియు నిట్టి యుగ్రతపంబు
సలుపలే దెన్నడు జగమందు గౌరి!

ఈ బ్రహ్మవరవాణి యెపుడు సత్యంబు;
సతత పునీతమై సంభాసురిల్లు
నని విశ్వసింపు మంబా! హృదయమున.
నీ తండ్రివచ్చును నినుగొని పోవ;
త్యాగంబుజేసి నీ హఠమెల్ల నపుడు
నిర్గమింపు మపర్ణ! నీ గృహంబునకు.
ఇదిగాక సప్తర్షు లిటకు వచ్చెదరు;
నా మాటలకు ప్రమాణం బదే యంబ!"

అను బ్రహ్మవాక్యంబు లాలించి, గిరిజ
హర్షాన్వితస్వాంతయయ్యె మౌనీంద్ర!
పరమసుందరమైన పార్వతీచరిత
మీ రీతి బలికితి నిపుడింకవినుము
పరశివుచరిత నోవరమౌనిచంద్ర!
ఏ నాడు సతి దేహ మెడబాసి చనెనో
ఆ నాటి నుండీ యా హరుని మానసము
పరమవైరాగ్యసంభరితమై పోయె.

సతతంబు రఘునాథసదమలనామ
జప మొనరించుచు సర్వంబు మఱచు;
అటనట కేగి మహాభక్తివశత
రాముని గుణముల శ్రవణం బొనర్చు.
ఆ సచ్చిదానందు, డా సుఖధాము,
డా మోహమదకామహరుడు, శివుండు

హారి, జగదభిరాము నాత్మలో నిలిపి
సంచరింపగ సాగె సకలధరిత్రి.
మునినికాయముల కా పురహరస్వామి
ఒక్కచో జేయు జ్ఞానోపదేశంబు;
ఇంకొక్కచోట సీతేశుగుణాళి
వర్ణించు భక్తిసంభరితాత్ముడగుచు.
నిఖిలజ్ఞుడును మహానిష్కాముడైన
శివభగవానుని చిత్తపద్మమును
భక్తవియోగము వ్యాకులపరచె.
కడుదీర్ఘకాలంబు గడచె నీ రీతి.
శ్రీరామపాదరాజీవసద్భక్తి
ఈశ్వరు పావనహృదయపద్మమున
నిత్యనవ్యంబయి నెగడదొడంగె:
ఆ శంకరునిదీక్ష నా యతిప్రేమ,
నా మహోన్నతభక్తి నరసి హర్షించి
ఘనకృతజ్ఞుడు, మహాకారుణ్యరాశి,
సద్రూపలావణ్యసౌశీల్యవనధి,
అమితతేజుండగు నా రామవిభుడు
పరశివు ముందట ప్రత్యక్షమయ్యె.
"ఇట్టి మహావ్రతం బెవరు నీకన్న
జేయగాగల రయ్యె శివ! పరమేశ!"
అని యనేకవిధాల హరు బ్రస్తుతించి

తెలిపెను శ్రీ పార్వతీజన్మకథను.
అతులకృపానిధియగుట రాఘవుడు
పార్వతీపరమపావనచర్యలెల్ల
విస్తరించి, పచించె ప్రేమపెంపార :
“శివ! నీకు నాపైన చిత్తంబులోన
బ్రేమ దీపించుచో వినుము నా వినతి :
ఆ శైలజను పెండ్లియాడుమా పోయి;
ఈవు నా కీవరం బీయగావలయు.”
అనగ శివుం డిట్టు లనె రాముతోడ.
“అధిప! నా కియ్యది యనుచితంబైన
బ్రభువాక్యముల దాట భావ్యంబుగాదు.
నాథ! నీ యాజ్ఞను నాశిరం బందు
దాల్చుటయే మహాధర్మంబు నాకు.
తల్లిదండ్రులమాట, తన గురుమాట,
ప్రభుమాటలను శంక వదలివైచియును
తలదాల్చ వలయును తప్పనిసరిగ;
ఆ నుడుల్ శుభముల కాలవాలములు.
అధిప! శ్రీరామ! నా కన్నివిధాల
పరమహితంబును పరగ నొనర్చు
నా స్వామి వీవె; ఓనాథ! నీ యాజ్ఞ
శిరమునఁ ధరియింతు శ్రీరామచంద్ర!”
భక్తివివేకముల్ భవ్యధర్మంబు

భాసిల్లు శంకరు వాక్యముల్ వినియు
శ్రీరాఘవుడు సంతసించి స్వాంతమున,
"నీదీక్ష నెఱవేఱు; నేను చెప్పినది
నీ వింక శంకరా! నెఱవేర్పు" మనుచు
కృప బల్కి రాము డదృశ్యుడై పోయె.
కాని శంకరుని హృత్కంజాంతరమున
శ్రీరామరూపంబు చెదరకనిలచె.
సప్తమహర్షు లా సమయంబునందె
ఆ శివుసన్నిధి కరుదెంచి రపుడు;
వారితో హరభగవాను డీరీతి
అతిమంజులంబుగా ననియె మౌనీంద్ర!
"పార్వతికడ కేగి పరమర్షులార!
ఆమెకు గల ప్రేమ నట బరీక్షించి
ఆపయి హిమవంతు నటకు బంపించి
ఆమెను గృహమున కంపుడీ మీరు.
తీర్పుడీ ఆమె సందేహంబులెల్ల."

## సప్తమహర్షులు పార్వతీదేవిలోని శివప్రణయమును పరీక్షించుట

అంత నా సప్తమహర్షు లేగియును
తనువు దాల్చిన మహాతపము చందముగ
భాసిల్లు చున్నట్టి పార్వతి న్గాంచి

"ఓ శైలపుత్రి! ఈ యుగ్రమౌ తపము
చేయ గారణ మేమి? చెప్పుమా గౌరి!
ఈ తపం బెవరికై? యెందుకై? చెపుమ
సత్యమర్మంబు దాచగ నేల? బాల"
అన విని యా గౌరి యనియె నీ పగిది:
"నా యాశయంబు విన్నపమొనరింప
ఆత్మలో గడులజ్జ నందుచున్నాను.
"నా జడత్వము విన్న నవ్వరా మీరు;
ఐనను నాబుద్ధి హఠము దాల్చియును
మాఅదాయెను మహామౌనీంద్రులార!
అది నీటిపై గోడ నహా! కట్ట దలచె;
నారదసద్బోధ నమ్మియు నేను
పక్షముల్ లేకయే పై కెగురంగ
యత్నించుచుంటి బేరాసను పూని
కనుడు నా యజ్ఞత ఘనఋషులార!
ఆ సదాశివుని బెండ్లాడ నెంచితిని."
ఆ మాటలను విని ఆ సప్తఋషులు
హసితముఖాబ్జులై యని రీ విధముగ:
"భూరిశైలమునకు బుట్టె నీ తనువు
తండ్రిపోలిక నీకు తప్పక వచ్చు!
నారదు బోధలు నమ్మి యెవ్వండు
నిజగృహంబులలోన నిలచిరో చెపుమ!

ఆ నారదుని బోధ లాలించి నట్టి
ఆ దక్షనందను లడవుల కేగి
ఇంటిముఖంబు దా మెఱిగిరా తిరిగి ?
ఆ నారదుడెకదా, ఆ చిత్రకేతు
సంసారమెల్ల నాశం బొనరించె;
ఆ నారదుని చేత నా హేమకశిపు
డే గతి బొందెనో యెఱుగవా ? గౌరి !
నారదు మాటల నమ్మిన యట్టి
వారెవ్వ రైనను పర్వతతనయ !
ఇండ్లు వాకిండ్లను నెడబాసి తుదకు
సన్న్యాసు లౌదురు సత్యంబుగాను.
అతడు హృదయమం దత్యంతకపటి;
పైకి ధరించెను భక్తవేషమును.
తనవలె జేయు నందఱిని నారదుడు.
ఆ నారదునిబోధలా-నమ్మి నీవు
భవు, నుదాసీనస్వభావు, నిర్గుణుని,
నిర్లజ్జుని, కువేషు, నిష్కులున్, మఱియు
అనికేతనుని, సర్పహారభూషణుని,
ఆ కపాలిని, కటా ! ఆ దిగంబరుని,
పెండ్లాడుటకు మహాప్రీతి నొందెదవు ?
అట్టివానిని పెండ్లియాడియు నీవు
అకట ! ఏ ఘనసుఖం బనుభవించెదవు ?

ఆ వంచకుని యనృతాలాపములనె
ఆత్మనమ్మితి వమాయకురాల ! బాల !
తనస్నేహితులు బలాత్కారంబు సేయ
శ్రీసతీదేవిని శివుడు పెండ్లాడ
ఆ పయి వపలివేయంగ నిర్దయను
పాప మా యిల్లాలు ప్రాణముల్ విడిచె.
ఇంకేమి-శివు డింక నే చింత లేక
ఎక్కడో భిక్ష మూడిండ్ల గావించి
హాయిగా నిద్రించు ననవరతంబు.
అహా ! సహజై కాకు లగు విరాగులను
ఏ కన్యలైన దా మీక్షింపబోరు.
ఇప్పుడైనను మాదు హితవాక్కు వినుము
నీ సరిజోడుగా నెగడు సద్వరుని
బాల ! విచారించివచ్చినామిపుడు;
అతిసుందరుడు, శౌరి, అతిసుఖదుండు,
పరమసుశీలుండు, వరవేదవినుత
చిరయశోలీలావిశేషుం, డనింద్యు,
డఖిలసద్గుణరాశి, హరి, శ్రీవిభుండు,
వైకుంఠవాసు, డా వరుడు కుమారి !
కూర్తుము నీ కట్టి గొప్పదౌ మనువు".
అన విని నవ్వుచు ననియె భవాని
"మీరు తెల్పినరీతి మేదినిలోన

ఈ శరీరము గిరికే యుదయించె.
ఈ దేహమును త్యజియింతునేకాని
నా హఠంబును విడనాడగా జాల.
పాషాణమందున ప్రభవించి నట్టి
హేమంబు నగ్నిలో నెంతగాల్చినను
వన్నె బాయదుకదా భవ్యాత్మలార!
నారదమునివాక్కు నమ్మెద సతము.
నేను వసించెడి నిలయంబు బహుళ
జనపూర్ణమైన, నిర్జనమైనసరియె
నే భయపడను మునీశ్వరులార !
తన గురుదేవు బోధల నమ్మనట్టి
వ్యక్తికి తుదకు స్వప్నంబులోనైన
కలుగదు సౌఖ్యంబు, కలుగదు సిద్ధి.
ఆ మహాదేవుడు, హరుడు, విశ్వేశు
డవగుణభవనుడేయగుగాక; విష్ణు
వఖిలసద్గుణధాముడగుగాక; ఎవరి
కెవరిపై సంప్రీతి యెసగునో వారె
వారికిం గూర్తురు పరమ సంతసము.
మొదటనే మీరిది బోధించియున్న
ఓ మునీశ్వరులార ! ఓ ఘనులార;
మీ వచనంబుల మిక్కిలి ప్రీతి
నే భక్తి శిరసావహించి యుండెదను.

కాని నే నిప్పు డా కైలాసవిభున,
కా శివదేవున, కా మహేశునకు,
నా జీవితం బర్పణంబు చేసితిని.
ఆ శివదేవు గుణాగుణావళిని
ఏల నా కికపైన నెంచు కార్యంబు ?
అంతగా నిటు వివాహంబుల జేయ
కౌతూహలము మీకు గలిగిన, జగతి
గలరు వధూవరుల్ గణనకు మించి.
వారికిం గూర్పగావచ్చును మీరు
అలసట నెఱుగక యత్యుత్సుకమున.

దశకోటిజన్మల న్దాల్చినన్ నేను
శివుని వివాహంబు జేసికోవలయు;
కానిచో నుందును కన్యగానైన.
ఒకవందసార్లు ఋష్యుత్తములార !
శివుడె వచ్చియు నాకు జెప్పనుగాక
ఆ నారదోక్తి ననాదరించెదనె ?
నతి జేతు మీ పాదనళినంబులకును;
తడవయ్యె నింద్లకు దయతోడ జనుడు."
అని పల్కె నా జగదంబయౌ గౌరి.

ఆ మునీశ్వరులు, మహాజ్ఞానధనులు
పార్వతీదేవిసద్భక్తి వీక్షించి,
"జయజయ జగదంబ ! జయము భవాని !

పరమాత్మ శంభుఁ డంబా ! మాయ వీవు ;
తల్లిదండ్రులు మీరె తతవిశ్వమునకు ! ''
అనుచు సంకీర్తించి ఆమెయంఘ్రులకు
శిరము వంచియు నమస్కృతుల గావించి
అధిగమించిరి మహాహర్షనిర్భరత
బులకరింపగ దనువులు పలుసార్లు.
అట్లేగి సప్తర్షులా హిమవంతు
బార్వతిచెంతకు బంపగా నతడు
వివిధవిధంబుల వినతుల జేసి
ఆమెను దోడ్తెచ్చె నాలయంబునకు.
అంత నా సప్తమహర్షు లేగియును
ఆ యుమాచారిత్ర మా భవుతోడ
దెలుపగా నా శివదేవుండు హృదిని
అద్రిజాప్రణయప్రహర్షాత్ముడయ్యె ;
సప్తర్షు లేగిరి సంతోషపడుచు.
సర్వజ్ఞుడైన నా శంకరుం డంత
భావంబు నేకాగ్రపఱచి ప్రగాఢ
రఘునాయకధ్యానరతియందు మునిగె-
ఆ కాలమందె యీ యవని వసించె
తారకుం డను ఘోరదానవాధిపుడు.
అసమానభుజబలుం, డతిశౌర్యరాశి,
చండతేజుడు ; వాడు సర్వలోకముల,

అఖిలలోకేశుల, నందఱ గెలిచె.
ఆ తారకాసురుం డఖిలదేవతల
భాగ్యసుఖంబుల బడి కొల్లగొట్టె.
అత డజరామరుం డయి యుంట చేత
ఎవ్వరు వాని జయింపలేరైరి.
వానితో దేవతల్ పలుసార్లు పోరి
అపజయంబుల బొంది రఖిలయుద్ధముల.
అన్యమే గతిలేక యఖిలదేవతలు
నిర్గమించి విరించి నిలయంబునకును
బ్రహ్మతో దమ వగల్ వచియించుకొనిరి.
సర్వనిలింపవిచారచారిత్ర
మెల్ల విధాత గ్రహించె స్వాంతమున.
బ్రహ్మదేవుం డిట్లు పలికె ధైర్యమును :
"శంకరవీర్యసంజనితునిచేత
మాత్రమే వా డిల మరణంబు బొందు,
ఎఱుగు డీశున కుదయించిన వాడె
తారకాసురుని యుద్ధంబున గూల్చు.
చేయగావలయు నే జెప్పినరీతి
ఈశ్వరకృపయున్న సిద్ధి సిద్ధించు.
దక్షయజ్ఞములోన దనువు త్యజించి
ఆ హిమాచలుని దివ్యాలయం బందు
పార్వతిగా సతి ప్రాదుర్భవించి

శివకరగ్రహణంబు సేయగా దలచి
సలిపిన దమితప్రచండతపంబు ;
సర్వంబు త్యజియించి శంకరుం డుండె
నిర్వికల్పసమాధినిష్ఠలో మునిగి.

అది యసమంజసం బైనను వినుడు
నే జెప్పుచున్నట్టి నిర్ణయం బొకటి :
కాముని మీరింక గలిసియు వాని
హరుసన్నిధికి బంపి యా శివదేవు
చిత్తంబు జలియింప జేయగా వలయు.
ఆపయి మనమెల్ల హరుచెంత కేగి
పాదపద్మంబుల వ్రాలి, ప్రార్థించి
శైలపుత్రిని బెండ్లి సలుపుకొనంగ
ఎటులైన నొప్పింత మిదియె మార్గంబు
దేవతల్ దుఃఖముల్ తీర్చుకొనంగ".

ఆ మాటలను విని యమరులెల్లరును
బాగుబాగనుచు సంబర మొంది రపుడు.
దేవతలెల్ల ప్రార్థింపగా భక్తి,
పంచబాణుడు, ఝషధ్వజుడు, మన్మథుడు
ప్రత్యక్షమయ్యె; నాపయి సురావళులు
తమశోకకథన మాతనితోడ దెలుప
నా దుఃఖవృత్తాంత మంతయు వినియు
స్వాత్మలో గొంతవిచారంబు సలిపి

ముఖమున జిరునవ్వు మొలకలెత్తంగ
పలికె నీ విధముగ బంచబాణుండు :
"శివవిరోధముచేత జేటె నా కౌదవు.
ఐనను మీ పని నసురక్తి నేతు.
పరహితాచరణమే పరమమౌ ధర్మ
మని పల్కుచున్నవి యఖిలవేదములు.
పరహితాచరణతత్పరతను తన్నెష్ట
నిజదేహు లగువారి నిరతంబు బుధులు
తగ బ్రశంసింత్రు బృందారకులార ! "
అనిపల్కి మదను డా యమరుల కెల్ల
శిరమువంచియు నమస్కృతులను జేసి,
ప్రసవశరాసనపాణియై వెడలె
ననుచరుల్ తనవెంట నరుగుదేరగను.
అటులబోవుచు గాము డాంతర్యమందు,
"శివునితో వైరముచే నాకు జావు
తప్పదటంచును తలచె మునీంద్ర !

## మన్మథ విజృంభణము

అంత మన్మథుడు స్వీయప్రభావంబు
ప్రకటించి సర్వప్రపంచంబు నొంచె.
అపుడు మీనధ్వజుం డాగ్రహింపగనె
అఖిలవేదముల మర్యాద లెల్లెడల

నొక్క క్షణంబులో నూడ్చుకపోయె.
బ్రహ్మచర్యవ్రతబహుళసంయమము,
లా ధైర్యధర్మంబు, లా సదాచార
జ్ఞానవిజ్ఞానముల్, జపతపోయోగ
వరవిరాగములన బరగుచున్నట్టి
అఖిలవివేకసైన్యావళి యెల్ల
అతిహళాజ్జనితభయాకులత్వమున
బాఱిపోయెను భరద్వాజమునీంద్ర !

పాఱె వివేకము బంధుయుక్తముగ;
వాని మహావీరభటు లెల్ల బెదరి
వెన్ను జూపి రుదగ్రవిధురరంగమున.
ఆ సమయంబున నా భటులెల్ల
సద్గ్రంథపర్వతచయకందరముల
బాఱియు, డాగిరి ప్రాణరక్షణకు.

కల్లోలపడియె లోకంబెల్ల నపుడు,
"ఇంకేమి జఱుగునో యీశ్వరా! ముందు?
ఏ శక్తి రక్షించు నిక మమ్ముదేవ!
ఆగ్రహంబును బూని యా రతివిభుడు
ప్రసవబాణాసనపాణియై నిలువ
అతని జయించెడి యా రెండుతలల
ఘను డెవ్వ డుండు జగత్త్రయమందు?"
అని ప్రతివ్యక్తియు ననుకొనసాగె.

భూరిచరాచరభూతజాలములు
సర్వనారీనరుల్ జగతి నెల్లెడల
ఆత్మీయసహజమర్యాదల వదలి
పరిపూర్ణముగ గామవశ్యాత్ములైరి.
ఆక్రమించెను కాము డఖిలచిత్తముల.
వృక్షశాఖలు లతావిసరమ్ము నరసి
కడుప్రీతితో వంగె గౌగిలించుటకు ;
పరుగులెత్తె నదీప్రవాహముల్ పొంగి
సంగమింపగ మహాసాగర ముందు-
ఘనసరోవరతటాకంబులు కలిసె
ప్రణయభావోన్మత్తపారవశ్యమున.
జడములే యీరీతి సంచరింపగను
చేతనంబుల మాట జెప్పగావలెనె ?
క్ష్మాతలి న్దిరిగెడు జంతుజాలములు,
ఆకాశయానవిహంగసంఘములు,
జలముల వసియించు సర్వజీవములు,
సమయమర్యాదవిసర్జన చేసి
మదనపాదములకుం బానిసలయ్యె.
అఖిలప్రపంచంబు వ్యాకులంబయ్యె
కామాంధకారంబు క్రమ్మె గాఢముగ,
రేయింబవలు విస్మరించి భేదమును
సంచరించెను ప్రీతి- జక్రవాకములు.

నరసురాసురులు, కిన్నరనాగములును,
ప్రేతభూతపిశాచ భేతాళములును,
నిరతంబు కాముబానిసవృత్తి గనిరి.
సిద్ధవిరక్తఋషిమహామునులును,
యోగముల్ వదలి కామోపభోగముల
బడి తేలసాగిరి పరమమునీంద్ర !

పరమయోగీంద్రులు భవ్యతాపసులె
పరిపూర్ణముగ గామవశ్యులుగాగ
పామరుల న్గూర్చి పలికెడిదేమి ?
సచరాచరంబగు సర్వవిశ్వమును
బ్రహ్మమయంబుగా బరికించునట్టి
సజ్జనులెల్లరు సర్వవిశ్వంబు
గామమయంబుగా గనుచుండి రిపుడు.
అఖిలలోకంబుల నబలలు కనిరి
పురుషమయంబుగా ; బురుషులు కనిరి
అబలామయంబుగా నఖిలలోకమును.
కామకృతాద్భుతకౌతుకక్రీడ
ఘటికాద్వయంబె యీ కరణి వర్తించె
బ్రహ్మాండమున భరద్వాజమునీంద్ర !
ధీరుడై నిలిచిన స్థిరచిత్తు డొక్క-
డేనియు లేడయ్యె నెల్లలోకమున.
అపహరించెను గాము డందటి హృదిని-

రఘువీరు డెవ్వారి రక్షించె వారె
మారున కోడక మనగల్గి రహహా !
శివుదాపు మదనుడు చేరెడు దనుక
ఒకరెండుగడియ లత్యద్భుతలీల
జరిగె మన్మథవిలాసక్రియాకేళి.

శివు, మహాదేవు వీక్షించినంతటనె
కాముని తనువు ప్రకంపించిపోయె ;
సర్వప్రపంచంబు స్వస్థతగాంచె.
మద్యప్రమత్తతం బాసినవిధవ
తెలివొందు మనుజుని తీరుగా సకల
జీవజాలము శాంతి జెందెను తిరిగి-

ఆ రుద్రభగవాను, నా దురాధర్షు,
నా దుర్గముని, శివు నరసినంతటనె
ఆ మన్మథుని గుండియలు ఝల్లు మనియె.
సిగ్గుచే నాతడు శిరము వంచియును
నిస్తబ్ధుడై అట్టె నిలిచె బొమ్మటుల-
సిద్ధమై చావుకు జివర కాతండు
పన్ని భావములోన బన్నాగ మొకటి
ప్రకటించె దా ఋతురాజ మైనట్టి
సకలసౌందర్యవసంతకాలమును.
కుసుమితబహువృక్షకుంజపుంజముల
పంక్తులు కన్నులపండువు సేసె

అఖిలవనోపవనావళుల్, సకల
వివిధకాసారవాపీతటాకములు,
సర్వదిశాతతి సంశోభ మెందె-
ప్రకృతియెల్లను రాగరంజితం బయ్యె :
శవములందును కామచలనంబు కలిగె-
కామసంజనితవికారభావంబు
వచ్చినవారిలో సైతమురేగె ;
వర్ణనాతీత మా వనిసోయగంబు.

విమలసువాసనల్ విరజిమ్ముకొనుచు
వీచెను చల్లని పిల్లహాయువులు.
కామాగ్నికిని దోడుగా నరణ్యమున-
సదమలకాసార-జలతరంగముల
వివిధపద్మంబులు వికసించి వెలిగె-
ఆ పద్మపంక్తుల నతిమంజులముగ
భృంగసంగీతముల్ వినబడందొడగె-

కలహంసశుకపికకలనినాదములు
రేగె దిశల్ పుల్కరించిపోవగను-
అమరకన్యలు పాడి, రాడి రయ్యెడను-
తనసేనతోడను తరలి మన్మథుడు
అగణితవ్యూహంబు లన్నియు బన్నె ;
కాని శ్రీశివునిప్రగాఢసమాధి
భంగముకాదయ్యె : ప్రసవాస్త్రు డంత

ఆగ్రహావేశతామ్రాక్షుడై నిలిచె.

## మన్మథదహనము

శివునిసమాధిని జెఱుపగా దలచి
ఒక మనోహరరసాలోర్వీజశాఖ
నీక్షించి దానిపై కెక్కి మన్మథుడు
పంచబాణంబుల బట్టి, చాపమున
జేర్చియు, నారిని జెవిదాక లాగె
చురచుర బరశివు జూచు చుగ్రతను.
ఆ వాడిబాణంబు లైదు మన్మథుడు
గుఱిజూచి శివదేవు గుండెపై వదలె.

భవుడు సమాధివిభగ్నంబుగాగ
బొందె బాహ్యజ్ఞానమును భరద్వాజ!
అమితసంక్షుభితాత్ముడై శంకరుండు
కన్నుల దెఱచియు గాంచె నల్దిశలు:
మామిడాకులగుంపుమాటున దాగి
పంచబాణుడు కానవచ్చె నంతటను;

రుద్రుండు పొందెను రూక్షకోపమును;
విశ్వమెల్లను ప్రకంపించె నాతఱిని.
విప్పి ఫాలాక్షంబు; వీక్షింప శివుడు
కాలి భస్మంబయ్యె గాముండు తృటిని;
బ్రహ్మాండగహ్వరభాగంబునుండి

పుట్టె హాహాకారభూరిరావములు !
బృందారకులు మహాభీతిని గనిరి,
దానవుల్ మిగుల సంతసమును గనిరి.
మదనలీలల నెల్ల మనములో దలచి
భోగులు వగచిరి ఘోరమటంచు;
యోగులు, సాధకు లుల్లాసపడిరి
కాముండు చావ నకంటకు లగుచు.

## రతివిలాపము : శివానుగ్రహము

నిఖిలయోగీశులు నిర్భయులైరి;
ఆత్మేశుగతి విని యా రతీదేవి
భూమిపై వ్రాలియు మూర్ఛను జెందె.
పలురీతులేడ్చుచు, బరితాపపడుచు
ఆ రతీదేవి శ్రీహరుచెంత కేగి
అతిభక్తి వెలుగొంద నాంతర్యమందు
వివిధవిధంబుల వినతులు చేసి
చేతులు జోడించి శివుముందు నిలిచె.
ఆ దిక్కులేనట్టి అబలను గాంచి
ఆ శుతోషుడు, శివుం, డా కృపాజలధి,
ఈ రీతి బలికెను కృపవహించి :
"ఇటనుండి ఓరతీ ! యీ నీదు భర్త
మనుగా 'కనంగ' నామంబునుదాల్చి,

తనువు లేకున్న నీతండు సర్వులను
పాలించు; నీవు నీ భర్తను దిరిగి
కలియగాగల్గు మార్గంబును వినుము:''
"భూతలభారంబు బోగొట్టుకొఱకు
శ్రీకృష్ణపరమాత్మ యీ వసుంధరను
యదువంశమందున నావిర్భవించు.
తిరిగి యీ శ్రీకృష్ణదేవు పుత్రునిగ
ప్రద్యుమ్ను డన బుట్టు పంచాస్త్రు డవని.
నా వాక్కు తప్ప దేనాడు చింతిలకు''
మన విని యా రతి యరిగె మోదమున.
ఆపయి కథ వినుమా! భరద్వాజ!

ఆ సమాచారంబు నంతయు వినియు
బ్రహ్మాదిసురలెల్ల వైకుంఠపురికి
జేరియు, గలిసి యా శ్రీవిష్ణుదేవు,
నా కృపాలయుడైన హరుపాలి కరిగి
పరిపరివిధముల బ్రస్తుతింపగను
చంద్రశేఖరుడు ప్రసన్నత నొందె.
ఆ కృపావారాశి, యా వృషధ్వజుడు
పలికె నీ పగిది, దేవతలార! యిప్పు
డిటకు మీరందఱు నేతెంచినట్టి
కారణంబును తెల్పగా గోరుచుంటి''
అన విని యా బ్రహ్మ యనియె నీ రీతి:

"ఈశ ! అంతర్యామి వీవు సర్వమున;
అయినను భక్తివశాత్ముడ నగుచు
ఒక విన్నపముసేయు చుంటిని స్వామి !

## పార్వతీశివకళ్యాణమునకు దేవతల ప్రార్థన

" అఖిలామరుల హృదయాంతరంగమున
ఒక మహాసంకల్ప మున్నది నాథ !
కన్నులపంటువుగా వారలెల్ల
భవదీయదివ్యవివాహంబుజూడ
నుత్సాహపడుచుండి రో విశ్వనాథ !
"మన్మథ మదభంగ ! పరశివా ! దేవ !
ఈ వివాహోత్సవ మెంతయో మేము,
కన్నులారగ జూడగల భాగ్య మిమ్ము.
కామునిగాల్చియు గరుణతో రతికి
వర మొసంగితివి కృపాజలరాశి !
ఇది ప్రశంసాపాత్ర మెల్లలోకముల
సేవకజనముల శిక్షించి పిదప
సుప్రభువులు కృప జూపుచుండెదరు
వారల సహజస్వభావ మయ్యదియె.
పార్వతి సల్పె నపారతపస్సు;
కరుణతో నామెను గైకొను మయ్య ! "
విధి యిట్లు సలిపెడు వినతిని వినియు,

ఆ రాము వాక్యంబు లాత్మ స్మరించి
హర్షించియును "తథాస్తు" ని వచియించె ;
ఘోషితదేవదుందుభులును మ్రోసె.
కుసుమవర్షంబులు కొల్లగా గురిసె.
"జయజయ దేవతాచయసార్వభౌమ"
అను జయధ్వనులు బ్రహ్మాండంబు నిండె.
అదె మంచి సమయ మటంచుదలంచి
వచ్చి రచ్చటికి సప్తర్షు; లంతటను
బ్రహ్మ శీఘ్రంబుగా వారల నంపె
ఆ హిమాచలుని దివ్యాలయంబునకు.
వార లచ్చోగి భవానిని గాంచి
ప్రప్రథమంబున బలికి రీరీతి,
మధురవిభ్రమకరమహితవాక్యముల :
"నారదు బోధను నమ్మియు నీవు
మా హితవాక్కుల మది నుంచలేదు.
నీ దీక్ష తప్పెను నేడుమా ! గౌరి !
కాముని శంభుడు కాల్చె విన్నావ ?"
ఆ పల్కులను విని యచలేంద్రతనయ
చిరునవ్వు తనరగా జెప్పె నీరీతి :
"పరిజ్ఞానఘనులైన పరమర్షులార !
బాగుగా మీరలు వచియించినారు.
ఈ నాడె శివుడు దహించె మన్మథుని;

ఇప్పటిదనుక నా యీశుండు, శివుడు
కామవికారంబు గలిగియే యుండె
నని మీరు భావించు నట్టుల దోచె.
కాని నా దృష్టికి గన బరశివుడు
అహా! సదాయోగియు, నజు, డనవద్యు,
డమలుండు, నిష్కాము, డతులుం, డభోగి.

అని నే నెఱింగి యే యమ్మహాదేవు
త్రికరణశుద్ధి జింతించితి నేని
ఆ కృపానిధి, పరమాత్మ, శంకరుడు
సంపూర్తి సేయు నా శపథంబు విడక;
హరుడు కామునిగాల్చె నను మాటజూడ
మీలోని యవివేకమే తెల్లమాయె.
అగ్నిస్వభావంబు నరయుడు మీరు;
హిమము తత్సన్నిధికే చేర గలదె?
ఒకవేళ జేరినదో నశియించు-
అట్టులే మన్మథు డా మహాదేవు
చెంతకుజేరి భస్మీభూతు డయ్యె."

ఆ భవానీవాక్కు లాలించి ఆమె
భక్తివిశ్వాసభావంబుల కలరి
వినమితశీర్షులై విమలమౌ భక్తి
నా మునుల్ చనిరి హిమాచలు కడకు.

సర్వవృత్తాంత మా సప్తర్షు లపుడు

హిమవంతునకు దెల్ప హిమవంతు డంత
ఆ కామదహనవృత్తాంతంబు వినియు
అతిదుఃఖ మొందె, ననంతరం బతడు
విని రతీవరదానవిషయంబు, మిగుల
సంతోష మొందెను స్వాంతంబులోన.

హిమవంతు డంతట హృదయంబులోన
శంభుప్రభావంబు సంస్మరించియును
సాదరంబున మునీశ్వరుల రావించి
వేదోక్తపద్ధతి విశదమౌ నట్లు
శుభతార శుభదిన శుభలగ్నమందు
ఆ వివాహముహూర్త మప్పుడు పెట్టి
ఆ లగ్నపత్రిక నా హిమాచలుడు
సప్తమహామునీశ్వరుల కొసంగి
భక్తివినమ్రతల్ భాసిల్లుచుండ
వారి పాదాంబుజద్వయముల వ్రాలె.

ఆ శుభపత్రిక నంత గైకొనియు
త న్మునీశ్వరులు విధాత కొసంగ
పఠియించి దానిని బ్రహ్మదేవుండు
పరమసంతోషనిర్భరహృదుం డౌచు
తన సభాస్థితుల కందఱకు విన్పించె
ఆ శుభపత్రిక నాలించి నంత
అఖిలమునీశ్వరు, లమరులెల్లరును

పరమసంతోషసంభరితాత్ము లైరి.
కుసుమవర్షంబులు కురిసె నంతటను
వివిధవాద్యంబులు పెల్లుగా మ్రోసె.
మంగళకలశముల్ మంజులరీతి
దశదిశలందు సంస్థాపింప బడియె.
తమతమ వాహనతతు లందు, మఱియు
మహితవిచిత్రవిమానంబులందు
దేవతాగణము లధిష్ఠించుచుండె,
శుభశకునంబులు చూపట్టె నపుడు
తీయగా బాడిరి దేవకన్యకలు
సంతోష ముప్పొంగ స్వాంతంబు లందు.

## శివపార్వతీపరిణయము

ప్రమథగణంబులు పరమేశు శివుని
కడుప్రీతితోడ శృంగారించి రపుడు.
ఘనజటాజూటంబు గట్టిగా గూర్చి,
పన్నగమాలలు పైన జుట్టియును,
కర్ణకుండలముల, గంకణంబులను,
పాములతోడ నేర్పాటు గావించి,
పూసిరి మేనిపై బూదిని దెచ్చి,
మొలచుట్టుగట్టిరి పులిచర్మ మొకటి.
పరశివసుందరఫాలభాగమున

ఘనచంద్రరేఖ ప్రకాశించుచుండె.
హరజటాజూటాగ్ర మందు వెలింగె
రంగదుత్తుంగతరంగయౌ గంగ,
భుజగోపవీతంబు, మూడునేత్రములు
గరళకంఠంబును, గళమందు వ్రేలు
నుగ్రకపాలమాలోత్కర మొప్ప
అశివవేషం బూనె ఆ శివమూర్తి,
పరమకృపాళు, వా భవుడు, శంకరుడు.

ఉగ్రత్రిశూలంబు నొకచేత దాల్చి
ఒకచేత డమరుక మొప్పారు చుండ
నంది నెక్కియు విశ్వనాథుండు వెడలె
భూరిహాద్యవిశేషముల్ భోరుకొలుప.
" ఈ పెండ్లి కొమరున కెనయైన వాడు
కానరా డెందు లోకంబులో" ననుచు
అమరకాంతామణు లా హరు జూచి
నవ్విరి మునిముసి నవ్వు లొండొరులు.

విష్ణువు, బ్రహ్మయు, వివిధదేవతలు
పెండ్లి కుమారుని బృందము గలిసి
కదలిరి తమతమ ఘనవాహనముల.

ఆ పెండ్లి వారిలో నన్ని విధాల
అమరబృందము వెగ్గె ననుపమానముగ.
ఆ పెండ్లి సంబర మరయగా నపుడు

వరునకు సరిపోవు పగిది లేదయ్యె.

అప్పుడు శ్రీ విష్ణు వమరనాయకుల
బిలిచియు జిరునవ్వు వెలుగొంద ననియె :
" మీరెల్ల, విడివడి, మీ మీ సమాజ
ములతోడ వేఱుగా బొండిక మీద,
మీ రటుల్ పోనిచో మిమ్ముల జూచి
వరునకు దగు పెండ్లివారు కారనుచు
పరపురజనులహో ! పరిహసించెదరు"
అని విష్ణు వాడు వాక్యంబుల వినియు
నవ్వి బృందారక నాయకులెల్ల
విడిబడి తమతమ బృందయుక్తముగ
గమియింప సాగిరి ఘనతమీఱంగ.

హరి మాటలను విని హరుడు నైతంబు
తనరగా దనలోన దా నవ్వుకొనియు
హరిహాస్యమును నిజ మగునట్లు జేసె
ప్రియముకుందుని కడు ప్రియవాక్యములను
వినినంతనే మహావిశ్వనాథుండు
పిలిచి భృంగీశ్వరు "వేగమే నీవు
ప్రమథుల నాయత్తపఱుపు" మనంగ-
భృంగిచే శివునాజ్ఞ విని శివగణము
వచ్చియు శివపాదపంకజంబులకు
శిరముల వంచియు జేసెను నతులు.

వారల బహువిధ వాహనంబులను
వివిధవేషంబుల వీక్షింప హరుని
ఆననంబున గ్రమ్మె హాసచంద్రికలు
ఆ శివగణముల యాకృతుల్ వినుము.
ముఖవిహీనులు, బహుముఖభయంకరులు,
కరపాదహీనవికారవిగ్రహులు,
బహుమహాసంఖ్యాకపాదహస్తులును,
నేత్రహీనులు, బహునేత్రసంయుతులు,
అతిపుష్టదేహులు, నతిశుష్కితాంగు,
లతిబలిష్ఠాంగు, లత్యంతదుర్బలులు,
విమలతాయుతు, లపవిత్రవర్తనులు.

ఇ ట్లనేకవిధాల నీశ్వరుగణము
చిత్రరీతిగను భాసించె మునీంద్ర !
అతిభయంకరభూషణావళి న్దాల్చి,
ఉగ్రారుణాతిసద్యోరుధిరముల
భయదవిశాలకపాలపాత్రికల
త్రాగు చుండిరి వారు దారుణలీల.

శునకముఖంబులు చూడ గొందఱికి
గార్దభముఖములు కనగ గొందఱికి
సూకరముఖములు చూడ గొందఱికి
కనగ గొందఱికి సృగాలముఖంబు
లొప్పార శివగణం బుండె మునీంద్ర !

అహా! వారివేషంబు లగణనీయములు.
ప్రేతభూతపిశాచభేతాళ శాకి
నీ ఢాకినీ యోగినీమహాగణము
వర్ణన కందని పగిదిగానుండె.

ఆ భూతగణములు హరుని ముందటను
ఉత్కటపారవశ్యోన్మత్తు లగుచు
పాటలు పాడుచు బహువిచిత్రముగ
అతివిపరీతదృశ్యాకృతు లౌచు
దాండవించిరి భరద్వాజమునీంద్ర!

ఆ పెండ్లికొమరున కనువైన రీతి
సరిపోయె నా పెండ్లి జనముల సంచు.
వారి దారిని గన్న వారెల్ల మిగుల
వివిధవినోదసంభృతచిత్తులైరి.
ఇట్లుండ హిమవంతు డింపొప్ప నటుల
పెండ్లి పందిరి వైచె బృథువిచిత్రముగ.
దానిని వర్ణింప దరమేరి కౌను!
పెద్దది చిన్నద న్భేదంబు లేక
జగతిలోగల సర్వశైలసంఘముల
సర్వనదీనదసాగరంబులను
హ్రదముల వనముల నన్నిటి న్బ్రీతి
నాహ్వాన మొనరించె నా హిమాచలుడు.
వా రెల్ల కామరూపప్రభావమున

దాల్చియు మహితసౌందర్యరూపముల
భార్యామణులతోడ, భటరాజితోడ
నేగిరి హిమవంతు గృహరాజమునకు.
స్నేహరసాంచితచిత్తులై వారు
పాడిరి మంగళభవ్యగీతముల.
ప్రప్రథమమె హిమవంతుండు పురిని
నవ్యశోభాయమానంబు లైనట్టి
విడిది గృహంబుల విరచింప జేసె.
ఎవరికి దగినట్టి యిండ్లలో వారు
విడిసిరి సంతోషవిభవంబు లొప్ప.
ఆ పురశోభ నహో! కనునెడల
వెల వెల బోవును విధికౌశలంబు.
ఆ పురసౌందర్య మరసిన యెడల
ఆ బ్రహ్మనిపుణత అల్పమై తోచు.
అఖిలవనోపవనావళుల్, నదులు
సర్వకూపతటాకసంఘంబు లెల్ల
వర్ణనాతీతశోభాయమానములు.
బహుశుభతోరణపంక్తులతోడ
మహితదివ్యకేతుమండలితోడ
ప్రతిమందిరంబు సంభాసురంబయ్యె.
పురిలోని వనితలు పురుషు లందఱును
సౌందర్యజలధులు చాతుర్యయుతులు

వారిని గన్నచో భ్రాంతు లయ్యెదరు
మునులు సైతము మహాముని! భరద్వాజ!
జగదంబ పార్వతి జన్మించి నట్టి
ఆ పురి వర్ణన కందగా బోదు.
బహువృద్ధిసిద్ధిసంపచ్ఛుభావళులు
అభివృద్ధి యగుచును అఖిలకాలముల
నిత్యనూతనశోభ నింపుచు నుండె.
పెండ్లి వారలు సమీపించిరి నగర
మను వార్త తెలియంగ నా పురంబందు
కలకల ధ్వానముల్ గగనంబు నంటె.
ఆ మహాపురశోభ యధికమై వెలుగ.
పర్వతనాయకు పరివార మంత
భూరిభూషణవస్త్రభూషిత మగుచు
నానామహితవాహనంబుల నెక్కి
పెండ్లి వారలను సంప్రీతి దెచ్చుటకు
ఎదురుగా నేగెను ఇంపు సొంపొప్ప.
అమరసేనను గాంచి యాత్మలో వారు
హర్షంబు గాంచిరి; హరిని దర్శించి
ఇంకను గడుబులకాంకితు లైరి.
అల్లంత దూరాన హరసమాజమును
కనినంతనే వారి ఘనవాహనంబు
లన్నియు బెదరి ముం దడుగిడకుండ

వెనుకకు బరుగెత్తె భీతి జెందియును.
పరుగెత్తు వాహన వర్గంబు లెటులొ
ఆపియు, ధృతిబూని యాంతర్యములను,
ఆగిరి పెద్దలు హరుని గాంచుచును.
పిల్ల లెల్లరు ప్రాణభీతిని బొంది
పరుగిడి యిండ్ల లోపల దూరి; రపుడు
తమతమ బాలుర తలిదండ్రు లడుగ
భయకంపితాంగులై బాలు రిట్లనిరి :
"ఏమి చెప్పుదు మింక నిసుమంతయైన
వారల వర్ణింప వశ మేరి కౌను !
వింతయ్యొ, వారలు పెండ్లిజనంబొ,
యమభటులో తెలియంగ రాదయ్యొ.
వరు డెన్నగా వెఱ్ఱి బాగుల వాడు,
ఎక్కె నాతడు ముసలెద్దు-మూపునను.
ఘనభూషణంబులుగా గళమందు,
వ్యాళకపాలమాలావళి న్దాల్చి,
పూసెను తనువెల్ల బూది దట్టముగ.
ఆ బూది యలమిన యట్టి దేహంబు,
పుఱ్ఱెల దండలు, భుజగమాలికలు,
ఆ దిగంబరరూప, మా పెనుజడలు,
ఆ పెండ్లికొమరుని యాకృతి గ్గనిన
భయము జనించును భావంబు లందు.

ప్రేతభూతపిశాచభేతాళగణము
యోగినీబృందము లుగ్రరాక్షసులు
ఆ పెండ్లికొమరుని యనుచరగణము.

ఆ పెండ్లివారల నరసిన పిదప
ప్రాణముల్ విడువక బ్రతికెడి వాడు
బహుపుణ్యశాలి ప్రపంచమం దెల్ల
గౌరీవివాహంబు కనజాలునతడె"
ఇంటింట బాలకు లీరీతి బలుక
శిశుగణంబులు మహాశివు సమాజమును
చూచి భయం బొందు సొదల నెఱింగి
తల్లిదండ్రులు నవ్వి, తమ బిడ్డలకును
"భయ మేల మీకని" బహువిధంబులుగ
ధైర్యంబు జెప్పిరి తా ముజ్జగించి
ఎదురుకో లరిగిన బృందంబు వెడలి
పెండ్లి కుమారుని బృందము నెచ్చి
మానితసౌందర్యమందిరంబులను
విడియ జేసిరి మహావిభవంబు తోడ.

అంతట మేనక యరుదెంచి యటకు
బహుశుభహారతుల్ వరున కొసంగె
ఆమెతో వచ్చిన యంగనామణులు
పాడిరి మంగళప్రథితగీతముల.
కాంచనకలశంబు కరమున గొనియు

వధున కర్ఘ్యం బిచ్చి స్వాగతం బొసగ
మిగుల సంతసమున మేనక వెడలె.

రుద్రుని భీషణరూపంబు గాంచి
ముత్తైదువలు భీతి బొంది డెందముల
జాఱియు గృహములోపల నొచ్చి రంత
విశ్వేశ్వరుడు నొచ్చె విడిది గృహంబు.
మేనక హృదిలోన మిగుల దుఃఖించి
గౌరిని బిలిపించి కడుప్రీతి తోడ
యొడిలోన జేర్చి కూర్చుండగా జేసె :
నీలోత్పలోపమ నేత్రాంచలముల
బాష్పధారలు పొంగి వరదలై పాఱ
ఈ రీతి మిగుల తపింపగా సాగె :
"ఇంత చక్కగ నిన్ను సృష్టించి బ్రహ్మ
వెఱ్ఱివానిని నీకు విభునిగా గూర్చె.
అధికమందుడు సుమా ఆ విధి చూడ !
ఇంతటి శృంగార మిచ్చియు నీకు
వెఱ్ఱిబాగులవాని విభు జేసె బ్రహ్మ
ఎంత చోద్యం బిది యెన్నగా నకట !
సురవృక్ష మందున సొంపుగా నుండ
వలసిన ఘనమైన ఫల మక్కటకట
గచ్చ చెట్టున గాంచగా నయ్యె నేడు.

ని న్నెత్తుకొని నేను నిమిషమాత్రమున
పర్వతాగ్రమునుండి పడుదు ధరిత్రి.
అగ్నిలో దుమికెద నబ్ధి గూలెదను,
నా యిల్లు నిలిచినన్ నాశమొందినను
అఖిలజగంబున నపకీర్తి గన్న,
ఊపి రీ బొందిలో నుండెడివనుక
పార్వతీ ! ఆ వెఱ్ఱివానికి నిన్ను
నే బెండ్లి చేయను నిక్క మీ మాట.''
అక్కడ జేరిన యబల లెల్లరును
ఆ మేనకాదేవి యాకులత గని
తామును మిగుల ఖేదంబును గనిరి.
పుత్రికావాత్సల్యమును సంస్మరించి
పెల్లుగా మేనక విలపించె నిట్లు :
''ఆ నారదునకు నే నపకార మేమి
సలిపితి నాత డీ చందంబు గాను
బాగుగా బోధించి పార్వతి నకట
వెఱ్ఱిబాగుల వాని బెండ్లాడు కొఱకు
చండతపంబును సలుపగా జేసె.
అహా ! యదార్థంబున కా నారదర్షి
మోహమాయాగుణములు లేనివాడు
పుత్రమిత్రకళత్రభూధనగేహ
సర్వశూన్యుండు నసంగి సన్న్యాసి;

ఇందుకే నారదు డితరుల యిండ్ల
పాడొసరింపగా బాల్పడుచుండు,
మతిలోన లజ్జాభిమానభయంబు
లతనికి లేవు సుంతైనను గాని,
ప్రసవవేదనలు గొడ్రాలి కే మెఱుక ? ”
ఈ రీతి తలి యడలెత్తగా గాంచి
పృథువివేకోపేతమృదులవాక్యముల
ఆ భవానీదేవి యనియె నీ రీతి :
“విధివిధానంబు తప్పింపగా దరమె,
ఇది యెఱింగియును నీ వేల శోకింప ?
విధియందు, జడుడు నా విభు డని యుండ
పరుల నిందింపగా బనియేమి జనని !
విధివ్రాతను దుడిచి వేయగా గలవె ?
అందుచే నేల మాతా ! వ్యర్థముగను
అపకీర్తి నొందుట అవనిలో నీవు !
నీపై గళంకంబు నిలుపుకో వలదు
ఈ జాలి విడువుము హృదయంబు లోన
సమయంబు గాదు విచారింప నిపుడు
చూడగా ప్రారబ్ధసుఖదుఃఖములను
ఏ నెట కేగిన నేని యో మాత !
అనుభవింపక తప్ప దమ్మరో ! వినుమ ! ”
ఈ రీతి గౌరి వచించినయట్టి

మధురవినీతకోమలవాక్యములను
అబలామణులు విని వ్యాకులపడిరి,
విధిని ధూషించిరి వేయివిధాల,
అశ్రువుల్ జార నేత్రాంచలంబులను
ఈ వార్త నాలించి హిమవంతు డంత
సప్తర్షినారదసహితుడై వచ్చె.
తన మందిరమునకు దాపసవర్య !
ఆ నారదాచార్యు డరుదెంచి యతుల
శ్రీగౌరి పూర్వచారిత్రంబు నెల్ల
తెలిపియు వారికి ధృతిని జేకూర్చె.
దేవర్షి, మేనకాదేవితో నిట్లు
పార్వతీచరితంబు పలికె మునీంద్ర !
"ఏ బల్కుచున్నట్టి బుజువాక్యములను
వినుమమ్మ మేనకా ! విశదంబుగాను,
నీ పుత్రి యెవరని నీ వెంచినావు ?
సాక్షాద్భవాని యా జగదంబ సుమ్మి,
అభవ, అనాది, దివ్యానంతశక్తి,
నిరతశివార్ధాంగనిలయ యీ గౌరి.
విశ్వసృష్టిస్థితివిలయకారిణియు,
ప్రేమవిలాసశరీరధారిణియు,
అగుచు భాసిల్లెడి అంబ నీ తనయ;
ము న్నీమె దక్షుని పుత్రిక యౌచు

పుట్టి 'సతీనామమును బూని ధాత్రి
పరమసౌందర్యప్రభాసాంగ యగుచు.
ఆ జన్మ యందును హరుని బెండ్లాడె-
ఆ మహాకథ జగ మంతట నెలియు
శివునితో గూడియు శ్రీ సతీదేవి
కైలాస మేగు చొకానొకనాడు,
రఘుకులకమలసూర్యస్వామి యైన
శ్రీరామచంద్రు దర్శించి డెందమున
విభ్రాంతయౌచును వినక శివోక్తి
సీతాస్వరూపంబు స్వీకరించుటను
ఆ యపరాధంబు నరసి శంకరుడు
ఆమెపై బ్రీతిని త్యాగంబుజేసె ;
తదనంతరము సతి తండ్రి యొనర్చు
యజ్ఞంబు జూడగా నరిగె నచ్చోట
ఆత్మ దేహమును యోగాగ్ని దహించె
మీ యింట దిరిగి జన్మించె దా నిపుడు.
ఆత్మేశ్వరుండైన హరునికై గౌరి
ఉగ్రతపశ్చర్య నొనరించె దాను.
ఇది యెఱింగియు సంశయింపకు మింక-
ఈశ్వరప్రియ యీమె యెల్లకాలముల "
అను నారదుని వాక్కు లాలించి నంత
అందఱి హృదిలోని వ్యథ ప్రీలిపోయె

పట్టణంబున గల ప్రతి యింటిలోన,
క్షణములోఁ బ్రాకె నీ సంవాద వార్త.
మేనకాహిమవంతమిథునంబు లపుడు
ఆనందకందళితాత్ములై, లేచి
అమలగౌరీచరణాంబుజంబులకు
భక్తితో సలిపిరి వందనశతము.
పట్టణవాసు లా బాలగోపాల
మత్యంతహర్షాత్ములైరి మునీంద్ర!
హిమవంతు పట్టణం బెల్లను నిండె
మంగళగీతికామంజులధ్వనులు
పలువిధకాంచనపాత్రంబు లొప్పె
అందరి హస్తంబు లందు డంబముగ.
పాకశాస్త్రములోని పద్ధతి గాను
పంచభక్ష్యాంచిత పక్వాన్నములను
షడ్రసంబులతోడ జక్కని రీతి
వడ్డన జేసిరి పంక్తులు దీర్చి;
అల జగజ్జననియౌ ఆ యన్నపూర్ణ
ఉమ, భవానీదేవి యుపయించి నట్టి
భవనంబునందున వడ్డింప బడిన
బహువిధభోజనవస్తుజాలముల
వర్ణింప నెవ్వరి వశమౌ మునీంద్ర!
బ్రహ్మవిష్ణ్వాదిదేవతల నందఱిని

హిమవంతు డత్యాదరమున దిలకించె
వివిధపంక్తుల నుపవిష్టులై రంత
నిపుణపాకజ్ఞులు నేర్పు మీఱంగ
వడ్డన జేసిరి బహుపదార్థముల;
బృందారకులు భుజియించుట గాంచి
పరిహాసవాక్కుల బలుక దొడంగి
రతిమృదులంబుగా నంగనామణులు.
సౌందర్యవతులు సుశ్రావ్యకంఠముల
బరిహాస వాక్కుల బలికిరి, మిగుల
వ్యంగ్యోక్తు లాడిరి వరుసల కొలది;
ఆ వాక్కులను విను చా దేవవరులు
పరమవినోదసంభరితాత్ము లగుచు
విందారగించిరి విశ్రాంతిగాను.
అతివిలంబన మయ్యె నా కార్యమునకు
ఆ విందులోని మహానంద మెన్న
గోటిముఖంబులకును వశ మౌనె ?
భోజనకార్యంబు ముగిసిన పిదప
కర ముఖంబులను ప్రక్షాళించు కొనగ
జలముల బోసిరి సకలపాత్రముల.
అంత తాంబూలంబు లందఱి కొసగ
తమ విడిదిండ్లకు దరలిరి వారు
అంతట సప్తమహామునుల్ వచ్చి

క్రమమైన లగ్నకాలము సమీపించె
నని తెల్ప హిమవంతు డాపయి దాను
సుముహూర్త మేతెంచ జూచి, సంప్రీతి
సందఱు దయసేయు డని కబురంపె
నిఖిలబృందారకనికరంబునకును.
అటుల హిమాచలు డత్యాదరమున
నఖిలనిలింపుల కాహ్వాన మంపి
ఉచితాసనంబుల నొసగె సందఱికి.
వేదిక, వేదోక్తవిధి వేయబడియె
సుభగసుమంగళసుముఖగీతికల
గానంబు సేయగా గడగి రంగనలు,
ఆ మహాశుభవేదికాగ్రంబునందు
బ్రహ్మదేవునిచేత రచిత మై నట్టి
వర్ణనాతీతమై భాసిల్లుచున్న
ఒక దివ్య పీఠంబు నుంచి రా యెడను.
వినమితశీర్షుడై విప్రవర్యులకు
శ్రీరఘునాథు స్మరించి డెందమున
శివుఁడు సింహాసనాసీనుడై వెలిగె.
అంత మునీశ్వరు లా యుమకొఱకు
వర్తమానము బంప, పర్వతసుతను
లలితసుభూషణాలంకృత జేసి
దివ్యసఖీమణుల్ తెచ్చి రా సుభగ

మహితకల్యాణసుమంటపంబునకు.
ఆమె యందము గాంచి యఖిలదేవతలు
ఆశ్చర్యచకితముగ్ధాత్ము లై రనఘ!
ఆమె శృంగారము నహహా! లోకమున
ఏ కవీశుడు వచియింపగా గలుగు?
ఆమె జగన్మాత హరురాణి యనుచు
నెల్ల బృందారకు లెఱిగి, పార్వతికి
బ్రణతు లొనర్చిరి భావంబు లందు.
సౌందర్యపరిపూర్ణసంస్థాన మైన
ఆ భవానీదేవి నహహా! పూర్ణముగ
వర్ణించు నే కోటి వదనంబు లైన?
ఆ జగన్మాత మహాశోభ నెన్న
చేతగా దల కోటి జిహ్వాల కైన.
వేదముల్, శేషుండు, విధిరాణి యైన
వర్ణింప సంశయపడు చుందు రెపుడు
అయినచో జడమతి యైన యీ "తులసి"
ఏ రీతి దా వచియింపగా గలడు?
ఆ భవానీమాత, యతిరూపరాశి
శ్రీసదాశివుడు వేంచేసి యున్నట్టి
భవ్యమంటపమధ్యభాగంబు జేరె.
హరపాదపద్మభృంగాయత హృదయ
యైన, నా గౌరి లజ్జాతిరేకమున,

విభుపాదపద్మముల్ వీక్షింప వెఱచె.
ఆ భవానీశంభు, లంతట మునులు
చెప్పిన రీతిగా శ్రీగణనాథు
మును ముందు భక్తితో బూజించి రపుడు.
ఎవరైన నిది విని యిదియేమి యనుచు
సంశయపడకుడు స్వాంతంబు లందు
తలప ననాదిజన్మలు కారె సురలు !
ఆగమపద్ధతి నా మౌను లపుడు
సలిపిరి కల్యాణసత్క్రియాతతుల
క్షోణీధ్రపతి యంత కుశ జేతదాల్చి
పార్వతీహస్త మా పాణితో బట్టి,
శంభుసనాతనశక్తిభవాని
అని హృది గ్రహియించి యా శంకరునకు
కన్యధారను బోసి కడు ధన్యుడయ్యె.
ఆ మహేశుడు శివు డా యుమాదేవి
పాణిని దన పాణిఁబట్టి నంతటనె,
సకలసురాధిపుల్ సంతోషపడిరి.
వేదమంత్రంబుల విమలర్షివరులు
ఉచ్చరించిరి మధురోచ్చైస్స్వరముల-
"జయజయజయజయశంకరా ! అనుచు
సలిపిరి దేవతల్ జయజయ ధ్వనుల !
భూరివాద్యవిశేషములు భోరుకొలిపె.

కురిసెను దివినుండి కుసుమవర్షములు.
గౌరీహరుల దివ్యకల్యాణ మిట్లు
జరిగెను వైభవసంయుతంబుగను.
సంతోషమున నిండె సకలజగత్తు.
దాసదాసీజనతతరథతురగ
గజగోగణంబులు ఘనవస్త్రమణులు,
బహువిధరమణీయవస్తుజాలములు,
బండ్ల కొలందిగా బహుధాన్యసమితి,
కాంచనపాత్రలు, కట్నం బొసంగె
పార్వతీశివులకు బర్వతేంద్రుండు.
వర్ణనకందని పగిది మునీంద్ర!
అల్లున కీ రీతి నా హిమాచలుడు
బహువిధకట్నముల్ భక్తితో నొసగి
కరములు ముకుళించి కడు భక్తితోడ
ఈ రీతిగా బల్కె నీశ్వరు గాంచి:
"నీకేమి నే నివ్వ నేర్తు విశ్వేశ!
పూర్ణకాముడ వీవు పురహరా! శంభు!"
అని భక్తిపొంగ మాట్లాడగా లేక
శ్రీశివచరణరాజీవయుగ్మమును
గట్టిగా బట్టెను కరపల్లవముల.
ఆ కృపాసాగరు డైన శివుండు
మామగారిని సర్వమార్గంబు లందు

సంతోష పఱచెను స్వాదుభావమున
మిక్కిలి ప్రేమతో మేనకాదేవి
పట్టియు శివపాదపద్మద్వయంబు
పలికె నీ రీతిగా బరమమునీంద్ర!
"నాథ! యీ పార్వతి నా ప్రాణతుల్య
ఈమెను గైకొను మిల్లాలి గాగ
ఈమె దోషంబుల నెల్ల క్షమింపు-
మీ వర మివ్వవే ఈశ! లోకేశ!"
అత్తగారిని శంభు డఱసు శంకరుడు
ఓదార్చె దా నెన్నియో విధానముల.
శంకరాంఘ్రులకును సలిపి వందనము
అంత మేనక చేరె నంతిపురంబు.
అంతట మేనక ఆత్మపుత్రికను
శ్రీయుమాదేవిని జేరి సంప్రీతి
నొడి యందు జేర్చి కూర్చుండగా జేసి
ఈ రీతి సుందరహితవాక్కు లాడె:
"సర్వదా శంకరచరణపూజనము
మానక సేయుమా మంగళగౌరి!
ఇదియె సతీధర్మ మెఱుగుమా తనయ!
పతియె దైవమ్మగున్ సతిపాలి కరయ!
విభుకన్న దైవము వేఱొండు లేడు."
అను మాటలను బల్కి నంత మేనకకు

కండ్లలో గ్రిక్కురిసె గ్రమ్మె నీరములు.
కూర్మి పుత్రిని హత్తుకొనె వక్షమునకు
"ఇంతుల సృష్టించె నేల నా బ్రహ్మ?
పరతంత్రజీవనుల్ స్వప్నమందైన
సౌఖ్య మెట్టుల నొంద జాలుదు రకట!"
అని ప్రేమవికలితస్వాంతయై యామె
సమయంబు గాకుంట ధైర్యంబు బూనె.

ఆ మేనకాదేవి అతిప్రీతి తోడ
ప్రియసుతన్ పలుసార్లు బిగి కౌగిలించి
బాలపాదంబుల బట్టి మూర్ఛిల్లె.
ఆమె మహాప్రేమ యలవియే పలుక?
స్త్రీల యందఱికడ సెలవొంది గౌరి
పరుగెత్తి తనతల్లి వక్షంబు మఱల
బిగికౌగిలించెను ప్రేమవశ్యమున.

మాతాజ్ఞనొందియు మఱియొక్క సారి
పయనంబు జేసె భవాని శ్రీగౌరి,
సముచితాశీస్సుల సర్వు లొసంగ.

అశ్రుపూర్ణాక్షుల నా యద్రితనయ
మరలను మరల దా మాతను గనగ
వెనుకకున్ దిరిగెను ప్రేమభావమున.
ఆమె సఖీమణు లామె నా శివుని

సన్నిధికి న్గొని చనిరి మునీంద్ర !
సంతృప్తిపఱచి యాచకజనంబులను,
శంకరుం డద్రిజాసంయుక్తు డగుచు
నిర్గమింపగ సాగె నిజవాసమునకు.
సర్వామరులు ప్రహర్షస్వాంతు లగుచు
కురిపింప సాగిరి కుసుమవర్షముల,
నమరదుందుభులు వియత్తునన్ మ్రోగె
బహుమనోహరముగ, బరమమునీంద్ర !
పరమేశు సాగ నంపంగ సంప్రీతి
శివదేవు ననుగమించెను హిమాచలుడు.
పలువిధంబుల హిమవంతు శంకరుడు
పరితోష పఱచియు బంపె నింటికిని.
వెంటనే ఆ యద్రివిభు డింటి కేగి
సకలశైలంబుల సరసుల బిలిచి
ఆదరదానక్రియావినయముల
నతిగౌరవాతిశయంబులతోడ
సత్కార మొనరించి సదమలప్రీతి
నందఱ వీడ్కొల్పె నా యనంతరము
శివుడు కైలాసంబు జేరిన పిదప
తమతమ లోకముల్ తా జేరుకొనిరి
సకలబృందారకసంయము లనఘ !
పార్వతీశివులు విశ్వంబున కెల్ల

తలిదండ్రు లౌచును దనరు చున్నారు.
వారి శృంగార దివ్యక్రియావళిని
ఏ రీతి వర్ణింతు నే భరద్వాజ!
వివిధభోగవిలాసవిభవాల దేవ
గణసంయుతంబుగా గైలాస మందు
వసియించి రా దివ్యభవ్యదంపతులు
నిత్యనూతనసుఖనీరధిన్దేలి
రద్రిజాశంకరు లనుదినం బచట.
గడచిపోయెను దీర్ఘకాల మీ రీతి.
అంతట వారికి నావిర్భవించె
షణ్ముఖుం డను నొక్క సత్పుత్రకుండు.
ఆ కుమారస్వామి ఆహవం బందు
తారకదైత్యవధన్ వేగజేసె.
ఆ షణ్ముఖస్వామి యమలచారిత్ర
ఆగమనిగమమహాపురాణముల
నఖిలలోకముల బ్రఖ్యాతి వహించె.
షణ్ముఖదేవుని జన్మకర్మములు
అత్యంతబలపౌరుషాదులు జగతి
కడు బ్రసిద్ధంబులై గణన కెక్కుటను
ఆ శివతనయుని యమలచారిత్రి
చెప్పితి నిటుల సంక్షిప్తపద్ధతిని.
పార్వతీశివుల వివాహచారిత్ర

పలికిన వారలు పాడిన వారు,
ఆత్మీయ శుభకృతు లందు, వివాహ
కార్యాదు లందున గాంతురు సుఖము
సర్వదా ఓ మునిచంద్రమా! వినుము!
గౌరీశ్వరుల మహాగంభీరచరిత
వార్ధి చందముగ నపారమై వెలుగు.
వేదముల్ సైతము వాని పారమును
సాంతంబు దెలియంగ జాలని యెడల,
ఈ నాడు తులసిదా సీ మందబుద్ధి
ఏ విధంబున వచియింపగా గలడు?

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### తృతీయవిశ్రామము.



కాంచనకశిపహృదంత్ర
 స్సంచయమాలాభిరామ ! సౌందర్యనిధా
 నాంచిత దివ్యోరస్థల !
 పంచాననవంద్య ! మట్టపల్లినృసింహా !

సరసమంజుల మైన శంభుచారిత్ర
శ్రవణంబొనర్చి భరద్వాజమౌని
పరమసంతోషసంభరితాత్ము డయ్యె.
హరికథాశ్రవణమహాకుతూహలము
అతనిలో నుప్పొంగె నద్భుతరీతి.
కన్నుల బాష్పముల్ కారగా సాగె
తనువెల్ల రోమాంచితంబై వెలింగె
ప్రేమభావావేశవివశతచేత
మాట్లాడగా నసమర్థు డైపోయె.
ఆ మహాజ్ఞానియౌ యాజ్ఞవల్క్యర్షి
ఆ ముని దశగాంచి హర్షితుం డయ్యె.
"ధన్యము నీజన్మ తాపసాధీశ !

పార్వతీపతి నీకు ప్రాణతుల్యుండు.
భవపాదపంకజభక్తిహీనుండు
కలనైన శ్రీరాము కరుణార్హు డగునె ?
విశ్వనాథపదారవిందంబులందు
నిర్మలం బగు భక్తినిలిపి యుండుటయె
రామ భక్తుని యధార్థపులక్షణంబు.
రాఘవవ్రతరతరాజితులైన
వారెవ్వరుందు రా భవునకు మించి ?
అనఘచరిత్రయౌ ఆ సతీదేవి
వంటి సతీమణి న్వదలి వైచియును,
చండనిశ్చలమహాశపథం బొనర్చి
ఆదర్శరామపాదాంబుజభక్తి
ప్రకటించు నెవ్వడు పరశివుకన్న ?
శ్రీరామునకు మహాప్రియ మైన వాడు
ఈశునికన్న నిం కెవ్వడున్నాడు ?
మున్ముందు శంకరు పుణ్యచారిత్ర
పలికితి నేను, నీభావంబు దెలిసె.
అఖిలవికారశూన్యామలరామ
పదదాసుడవు భరద్వాజ ! మౌనీంద్ర !
నీ గుణశీలముల్ నే నెఱింగితిని
శ్రీరామలీలల జెప్పెద వినుము,
సీతోడ గలియుట నే నీ దినంబు

పొందిన సంతోషమును పల్కఁజాల.
అత్యపారము మునీశా! రామచరిత
శతకోటిశేషులు సైతము రామ
ఘనగుణజాలముల్ గణియింపగలరె?

ఐన నా కోదండపాణి, వాక్పతిని
ఆ జగన్నాథు మదాత్మలో నిలిపి
నేను విన్న కొలంది నీకు వచింతు.
కనినచో శారద కఱ్ఱబొమ్మగను
అఖిలాంతరాత్మయౌ ఆ రామవిభుడె
అలబొమ్మ నాడించు నా సూత్రధారి.
శ్రీరాఘవుడు కటాక్షించిన యెడల
కవిహృదయాంతరంగంబున నిలిచి
శారద నాట్యంబు సలుపు మునీంద్ర!

అమితకృపాంబుధి యౌచు వెలుంగు
ఆ రఘునాథపాదాంబుజంబులకు
ప్రణతులర్పించి యాపయిని వర్ణింతు
తదారామగుణకథావిశేషముల.

## పార్వతీ శివుల సంవాదము.

పరమరమ్యంబగు పర్వతశ్రేష్ఠ
మెన్నగా కైలాసమే, దాని పైన
శ్రీశివాశివులు వసింతు రెల్లపుడు.

సిద్ధతపోధనశ్రేష్ఠయోగీంద్ర
మునిసురకిన్నరుల్, పుణ్యాత్ములెల్ల
ఆ మహాకైలాస మందు వసించి
ఆనందకంధియౌ హరు, మహాశివుని,
సేవించు చుందురు స్థిరతరభక్తి.
హరిహర విముఖులౌ అల్పమానసులు
ధర్మమందాపేక్ష దవులని వారు
స్వప్న మందైన నచ్చటి కేగ లేరు.
ఆ మహాగిరిశిఖరాగ్రభాగమున
కడు విశాలంబును, ఘననిత్యనవ్య
సార్వకాలికమహాసౌందర్య మైన
ఒక మహావటవృక్ష ముండె మునీంద్ర!
మందశీతలగంధమారుతోపేత
మై దాని నీడ మహాసుఖమిచ్చు.
వేదగానముతోడ వెలయు శంకరుని
విశ్రమస్థల మదే విను భరద్వాజ!
హరు డొకానొకసారి యా వటవిటపి
మూలంబు జేరి ప్రమోదాత్ముడయ్యె
దాని మనోజ్ఞసౌందర్యంబు గాంచి.
ఆ కృపాళుడు శివు డట నేలపైన
స్వయముగా నొక పులి చర్మంబు పఱచి
అందు ముదంబున నాసీనుడయ్యె.

భవ్యకుందేందుధవళదివ్యగౌర
వర్ణశరీరంబు భాసిల్లు చుండ
ఆజానుదీర్ఘబాహాంచితుం డౌచు
పావనవల్కలపరిధాను డగుచు
విలసిల్లుచుండెను విశ్వేశ్వరుండు.
తరుణారుణాబ్జపదంబులు తనరె
భక్తహృత్తిమిరవిభంగసభాగ్ర
దివ్యద్యుతులతోడ దేజరిల్లుచును.
పన్నగంబులు దాల్చి భస్మంబు నలది
విజితశరచ్చంద్ర విమలముఖాబ్జు
డై త్రిపురారిమహాదేవు డుండె.
గంగాతరంగశృంగారసంభరిత
పృథుజటామకుటసంభృతశీర్షమొప్ప
సారసపత్రవిశాలనేత్రములు
గరళబంధురనీలకంఠంబుతోడ
బాలేందుభూషితఫాలంబుతోడ
నిజమహాలావణ్యనిధి యౌచుదోచె
పరమేశ్వరుండగు పరమశివుండు.
శాంతరసాకృతి చందంబు శివుడు
కామారి శర్వుండు కనవచ్చు చుండె
ఇదె మంచి తరుణమం చెఱిగి భవాని
శంభుసన్నిధి కేగ, శంకరప్రభువు

ప్రియురాలు గనుక సంప్రీతి జూపించి
తన వామభాగసుస్థలమునం దామె
నాసీన గావించె నహా! భరద్వాజ!
పార్వతి సంతోషభరితాత్మ యగుచు
హరపార్శ్వభాగ మం దాసీన యగుచు
తన పూర్వజన్మవృత్తంబు స్మరించె.
వెనుకటి కన్నను విభుని డెందమున
ఘనతరప్రేమంబు కలదని యెఱిగి
చిరునవ్వు లొలుకగా శ్రీమహాదేవి
పలికె నీ రీతిగా భవ్యవాక్యములు:
ఆ శైలనందిని యఖిలలోకముల
కుపకారకరమైన యుత్తమకథను
శివునిచే నాలింప జిత్తమందెంచె.
"నానాథ! ఓవిశ్వనాథ! పురారి!
ఈశ! నీ మహిమ మీ యెల్లలోకముల
విదితమై యున్నది, ప్రియ! మహాదేవ!
సర్వచరాచర జంతుజాలములు
నాగనరామరుల్, నాథ! యెల్లరును
భవదంఘ్రిపద్మముల్ భక్తి సేవింత్రు"
"సర్వసమర్థ! ఓసర్వజ్ఞ! నాథ!
సకలకళాగుణసదనా! మహేశ!
పరమయోగజ్ఞానవైరాగ్యనిలయ!

భక్తకల్పద్రుమమా ! పావననామ !
ఓసుఖరాశి ! లోకోన్నత ! నీకు
నా యందునన్ కరుణాదృష్టియున్న
నీ పదదాసిని నే నని స్వామి !
గ్రహియింతువేనియు గరుణతో నాథ !
తద్రఘునాథకథావిశేషముల
బలికి నా మౌఢ్యత బాప బ్రార్థనము”
కల్పవృక్షమె యండగా గలవాడు
దారిద్ర్యదుఃఖంబు తా జెందనేల ;
ఇది విచారించి యర్ధేందువిభూష !
మచ్చిత్తగతవిభ్రమంబుల నెల్ల
పాఱదోలుము ప్రభూ ! పరమదయాళు !
పరమార్థవాదులౌ పరమర్షిజనులు
రాము డనాది పరబ్రహ్మమంద్రు.
ఆదిశేషుడు, వాణి, యఖిలవేదములు,
సకలశాస్త్రపురాణసంఘంబులెల్ల,
రఘుపతిఁగీర్తించిప్రబలుటఁగనమె ?
హేయనంగారాతి ! హేవిశ్వసుగతి !
ఈవును భక్తితో నెల్ల వేళలను
రామరామ యటంచు బ్రబలమౌభక్తి
జపియించుచున్నావు స్వాంతంబులోన-
ఆ రాముడెవ్వరు ? ఆ యయోధ్యేశ

పుత్రుడేనా, లేక పోయిన యెడల
అజము నిర్గుణ మింద్రియాతీతమైన
ఆ బ్రహ్మమా ? తెల్పుమా, ప్రాణనాథ !
పార్థివపుత్రుడు బ్రహ్మ మెట్లగును ?
బ్రహ్మమే యైనచో, భార్యావియోగ
బాధామనస్కుడే పగిదిగా నౌను ?
చర్యలు చూడ నీ చందంబుదోచె
వింటిని మహిమలు వేఱు విధాన,
అత్యంత విభ్రాంతమయ్యె నా బుద్ధి.
" అల, యనీహంబును వ్యాపకం బఖిల
శక్తిమయం బగు సదమలబ్రహ్మ
మిం కొక్క టున్నచో నెఱిగింపు దాని"
నా యవజ్ఞత్వంబునకు క్షమియించి
నా యవివేక మణంచుమా నాథ !
బాగుగా రామప్రభావంబు గంటి
గాని, సీతో, మది గల సందియంబు
పలుకనైతిని, మహాభయ సంకులమున.
కాని నా బుద్ధి సకల్మషంబగుట
రామప్రభావంబు గ్రహియింపనైతి.
తత్ర్భాంతి కే నహా ! తగినట్టి ఫలము
అనుభవించితి నాథ ! అయిన నిప్పటికి
సంశయం బున్నది స్వాత్మలో దేవ !

చేతులు జోడించి చేతు ప్రార్థనము
నను గటాక్షింపు మనాథశరణ్య!
మును నీవు పలుసార్లు బోధించినావు
కాని నా కర్థము కాలేదు నాథ!
ఆగ్రహింపకుము నా యజ్ఞత్వమునకు.

పూర్వపు విభ్రాంతి పోయిన దిపుడు
రామమహాకథాశ్రవణాభిలాష
నా లోన గలిగె నీ నాడు దేవేశ!
భుజగేంద్రహారవిభూషితదేహ!
పరమపావన మౌచు భాసిల్లుచున్న
శ్రీరామగుణకథాబృందంబు కృపను
ప్రవచింపుమా! నాకు బరశివా! దేవ!

అస్మచ్ఛిరంబును నవని దాకించి
నీ పాదపద్మముల్ నియతి బూజించి
చేతులు జోడించి చేతు బ్రార్థనము:
శ్రుతిమతసారవిశుద్ధగంభీర
రఘువరమహిమంబు ప్రవచింపు మీశ!
ఈ మహాతత్వంబు నేను వినంగ
నబలను గాన ననర్హనే యైన
నేను త్రిశుద్ధిగా నీ దాసి నీశ!
ఆర్తులౌ వారెవ్వరైనను గాని
కనుపింప సాధుపుంగవులు, వారలకు

అతిగూఢతత్వమే యైన, బోధింత్రు.
ఆర్తురాలను గాన నధికారినైతి
నత్యంత మగు నార్తి నడుగు చున్నాను
న న్గటాక్షించియు నాథ! విశ్వేశ!
రఘునాథుకథ నాకు బ్రవచింపు మిపుడు
బాగుగా నాత్మలోపల విచారించి
పరమేశ! నిర్గుణబ్రహ్మం బదేల
సగుణరూపము దాల్చి సదయుండవగుచు
ప్రప్రథమంబున బలుకు, మా పిదప
దద్రామచంద్రావతారచారిత్ర
వచియింపు, మా పయివర్ణింపు మీశ!
పావన శ్రీరామబాల్యలీలలను.

పిదపను, రాము డే విధముగా దాను
సీతను బెండ్లాడె, శ్రీరాఘవుండు
ఏ దోషమున ద్యజియించె రాజ్యమును
ఇంపు పెంపార వచింపుమా స్వామి!
వనవాసరఘువరాపారకార్యముల.

తదనంతరంబు నాథా! రాఘవుండు
ఎట్లు రావణు గూల్చె నెఱిగించి, పిదప
రాజ్యాభిషేకకార్యం బైన పిదప
శ్రీరామచంద్రుడు చేసిన యట్టి
లెక్కింపరాని యా లీలల నెల్ల

దెలుపుమా ! సుఖశీల ! తేట తెల్లముగ.
పలుకు మా పయిని గృపాధామ ! శర్వ !
రఘువంశమణి యెట్లు ప్రజలతో గూడి
వైకుంఠ మరిగె నా పరమచిత్రమును.
జ్ఞానధాములు మునీశ్వరు లెల్ల హృదిని
ఏ మహాసత్యంబు నీక్షించి, యందు
మగ్నులై యుందురో మఱువక యెపుడు—
ఆ తత్త్వ మెఱిగింపుమా ! ప్రాణనాథ !
పిదప వచింపుమా విస్తర రీతి
భక్తిని గూర్చిన బహుళసంగతుల
నవ్యవిజ్ఞాననానావిశేషముల
వైరాగ్యసంబంధబహువిషయముల.
పృథుపరిశుద్ధవివేకస్వరూప !
అగణితరామరహస్యతత్త్వముల
విశదీకరింపుమా విశ్వేశ ! నాకు.
మఱచి నే నడుగని మహదర్థములను
నైతము విడకు మీశ్వర ! కృపాసాంద్ర !
ఈ జగద్గురుడ వీవే యని శర్వ !
నిగమముల్ వచియించు నీలకంఠేశ !
ఇతరపామరజీవు లే మెఱుంగుదురు ?
పార్వతి యీ రీతి బలికిన యట్టి
సహజసుఖాకరసదమలప్రశ్న

లన్నియు విని శివుం డానంద మొందె
శ్రీరామచంద్రుచారిత్ర మా శివుని
మదిలోన మెఱసెను మహితపద్ధతిని.
భక్తిభావానందపారవశ్యమున
దను వెల్ల పులకీకృతం బయి పోవ
నశ్రుపూర్ణము లయ్యె నా శివు కనులు.
ఆతని హృద్దర్పణాంతర మందు
శ్రీరామమంగళాకృతి గాన వచ్చె.
ఆ పరమానందు డైన శ్రీశివుడు
అత్యంతసుఖవార్ధి యందున మునిగె.
ఒక గంట కాల మా యోగీశ్వరేశు
డగు మహాదేవుండు ధ్యానసమాధి
మునిగి, బాహ్యాజ్ఞానమును బొంది పిదప
కన్నులు తెఱచియు గడు సంతసమున
శ్రీరాము చరితంబు చెప్పె నీ రీతి:
రజ్జు విజ్ఞానంబు ప్రాప్తింప నపుడు
సర్పవిభ్రాంతియే సంభవ మగును.
రామతత్వజ్ఞానరాహిత్యమునను
సత్యమైనదియు నసత్యమై తోచు.
నిద్ర మేల్కాంచిన నిమిష మాత్రమున
స్వప్నవిభ్రమ మెల్ల సమసిన రీతి
ఆ రాము నెఱిగిన నా క్షణంబందె

దృశ్యమానం బగు నీ జగంబెల్ల
మిధ్య యై పోవు సుమీ ! గిరిపుత్రి !
"ఎవని నామము జపియించుట చేత
అఖిలసిద్ధులు కల్గు నతిసులభముగ
ఆ బాలరాముని కభినతి జేతు.
మంగళనిలయు డమంగళహారి
ఆ దశరథుని సౌధాంతర్విహారి
కరుణార్ద్రచిత్తు డౌ గాక నా పైన."
ఈ ప్రకారమ్ము మహేశుండు శివుడు
శ్రీరామునకు నమస్కృతుల గావించి
మధురసం బొలకగం బలికె నీ రీతి:
"ధన్యధన్యవు నీవు ధరణీధ్రతనయ !
ఉమ ! నిన్ను బోలు మహోపకారిణులు
వే రెందు లేరహో ! వీక్షింప, నీవు
ఘనజగత్పావనగంగవిధాన
మూడు లోకముల బ్రహూత మొనర్చు
రామకథార్థముల్ ప్రవచింపు మనుచు
నర్థించి నావు న న్నతిభక్తితోడ.
రఘువీరు శ్రీపాదరాజీవములను
సంపూర్ణభక్తి నీ స్వాత్మలో గలదు;
ఈవు జగద్ధితదృష్టితో నిటుల
ప్రశ్నించినావు పర్వతరాజతనయ !

పార్వతీ ! రామకృపావిశేషమున
స్వప్నమందైన ని స్వాంతంబులోన
శోకమోహభ్రమల్ చొరలేవు సుమ్మ.

ఇది నా దృఢాశయ మిందీవరాక్షి !
పరులెల్ల వినియు లాభంబు గాంచుటకు
వెనుకటి ప్రశ్నలే వేసితి వీవు.
రమణీయహరికథాశ్రవణంబు లేని
శ్రవణరంధ్రంబులు సర్పరంధ్రములు.
సాధుసత్పురుషదర్శనము లేనట్టి
కన్ను లెంచ, నెమలి కన్నులు గావె
గురు, హరిపదములకు మ్రొక్కనట్టి
తలకాయ, చేదుగా దగు సొఱకాయ
హరిపాదయుగభక్తియాత్మలో లేని
జీవుడు నిజముగా జీవచ్ఛవంబు
రామసద్గుణగానరతి లేని యట్టి
జిహ్వాలు, కప్పల జిహ్వాలే యగును.
హరిచరిత్రము విని హర్షింపనట్టి
గుండె, కఠోరమౌ బండతో సమము.
అమరహితంబును, నసురభీకరము,
రామదేవుని శుభరమణీయలీల.
వినుము గౌరీ ! భక్తి వెలుగొందజాల.
కామధేనువు రీతిగా, రామచరిత

తనను సేవించెడి ధన్యజీవులకు
సర్వసౌఖ్యములు ప్రసాదించు బాల !
సాధుసజ్జనసమాజంబులు కనగ
వివిధబృందారకవిమలలోకముల
నెవ్వ డీ విషయంబు నెఱిగియులోన
శ్రవణం బొనర్పడు రామచారిత్ర ?
సంశయగణపక్షిచయముల ద్రోలు
రమణీయకరతాళరవము లై చెలగు
శ్రీరామదివ్యచారిత్రంబు గౌరి !
కలియుగపాపవృక్షంబు ఖండించు
శితకుఠారవరంబు శ్రీరామచరిత !

అట్టి రామాయణం బాదరబుద్ధి,
వినుము హిమాచలప్రియతనూజాత !
ఆ దివ్యరామనామావళీసుగుణ
గాథావతరణసత్కార్యంబు లెన్న
నగణనీయములని యఖిలవేదములు
ఘోషింపు చున్నవి క్షోణీధ్రతనయ !
అల, రామదేవు డనంతుడై నట్లు
ఆ రామగాథామహాయశోగుణము
లహా ! యనంతములు, ప్రియా ! గణియింప.
ఐనను, నేను నీ యనురక్తిగాంచి,
ఏవి నా బుద్ధి గ్రహించిన రీతి

నీ కవి వచియింతు నే డుమా! వినుము.
సహజసుఖప్రదసన్మాననీయ
ములు, నీదు ప్రశ్నలు బుధసమ్మతములు
నాకును వినగ నానందంబు కలిగె.
ఐన భవాని! నీ వజ్ఞానవశత
పలికియుండిన, నొక్క వాక్యంబు నాకు
ఇనుమంతయును రుచియింపకపోయె:
నిగమముల్ నుతిసేయ నెగడు రాముండు
మునులు ధ్యానించు రాముడు వే అటంచు
భావించి నా విది పరమహేయంబు.
భయదమోహపిశాచవశ్యు లౌ వారు,
పాషండు లచ్చ్యుతపదపరాఙ్ముఖులు
విమలసత్యాఽసత్యవేచనాశూన్యు
లగు నరాధము లిట్టి యజ్ఞానవాక్కు
లందురు విందు రో యచలేంద్రతనయ!
అజ్ఞు, లకోవిదు, లంధు లౌ వారు,
మందభాగ్యులును కల్మషపరిచ్ఛన్న
హృదయులు, లంపటుల్, హీనమానసులు
కపటులు, కుటిలసంకలితమానసులు,
కలనైన సాధుసాంగత్యంబు గనని
వారు, లాభాలాభభావనారహిత
మానసులే, వేదమార్గవిరుద్ధ

సంభాషణంబుల సలుపు చుండెదరు.
వారి హృన్ముకురముల్ బహుమలాత్తములు
చూడ వారికి కనుల్ శూన్యంబు లాయె.

ఆ దీను లే రీతి నరయగా గలరు
శ్రీరామసుందరాకృతి ! సఖి ! బాల !
సగుణంబుగూర్చిన జ్ఞానమా లేదు,
నిర్గుణజ్ఞానమో నిలువ దొకింత-
కల్పితోన్మత్తవాక్యము లనేకముల
వారలు సర్వదా వదరుచుండెదరు;
హరిమహాకథనమాయావశ్యు లగుచు
లోకపుచక్రములో దగుల్కొనియు
వార లెప్పుడు పరిభ్రమణంబు జేతు
రెంత చెప్పిన వారి కేమిలాభంబు !
పైత్యప్రకోపితభావులౌ వారు,
పిచ్చివారలు, భూతవివశులౌ వారు,
మద్యంబు ద్రావిన మందు లెప్పుడును
సముచితరీతి బ్రసంగింపబోరు.
ఆ మోహమద్యపానావేశవివశ
వాక్యజాలమ్ము లెవ్వడు చెవి దూర్చు ?
అని విచారించియు నాత్మలో నీవు
అఖిలసంశయపరిత్యాగం బొనర్చి
భజియింపుమా రామపాదపద్మముల.

భ్రమ యను నంధకారం బణగింప,
సూర్యకిరణములై శోభిల్లుచుండు
మద్వాక్యముల వినుమా ! శైలతనయ !
సగుణనిర్గుణముల సందు భేదంబు
నరయ లేదనుచు మహర్షులు, బుధులు
వేదశాస్త్రపురాణబృందముల్ పలుకు.

అగుణం బరూపంబు, అలయదృశ్యంబు,
అజమై వెలింగెడి యా పరబ్రహ్మ
భాగవతప్రేమవశముచే దాల్చు
సగుణస్వరూపంబు సాధ్వీలలామ !
అగుణంబు సగుణ మెట్లగు నందువేని
జలము హిమం బగు చందమే యగును.

భ్రమతమఃపటలంబు బాపగా నెవని
పావన నామంబు భాస్కరుం డగునో
అతనిని మోహంబు నంటగా గలదె ?
అల సచ్చిదానందు డైన శ్రీరామ
పూషోగ్రమండలంబున నుండ బోదు
మోహనిశావేశమును, శైలతనయ !

సహజమహాప్రకాశస్వరూపుండు
ఆ రామభగవాను డాతనిలోన
జ్ఞానోదయం బను సంగతి లేదు,
మోహవివేకముల్, మోదఖేదముల్,

గర్వాఽఽహములు, చూడగా నిజంబునకు
జీవ ధర్మంబులు చెలియా! అపర్ణ!
రాముడు, వ్యాపకబ్రహ్మంబు, పరమ
సుఖరూపుడును, పరేశుడు, సనాతనుడు,
ఇది ప్రపంచం బెల్ల నెఱుగును గౌరి!
"పురుషం డనంగను భువనంబు లందు
విఖ్యాతి గాంచియు వెలుగొందు వాడు,
అమలతేజోనిధి, అఖిలరూపకుడు,
జీవజగద్భర్త శ్రీరఘువంశ
రత్నమై రాజిల్లు రామచంద్రుండు
నా స్వామి"–యని విశ్వనాథుండు శివుడు
రామదేవునిపాదరాజీవములకు
శిరము వంచియు నమస్కృతిని గావించె.
"అజ్ఞులు తమదోషమరయగా లేరు
ఆ జడప్రాణులు నంతతో బోక
ఆ మోహ మీశ్వరు నందువై చెదరు-
మేఘముల్ కప్పిన మిన్నును గాంచి
ఆ మేఘములచేత నర్కు తేజంబు
పాసిన దండురు వక్రచింతనులు.
వ్రేలితో గను నొత్తి వీక్షించు నెడల
కాను పించును రెండుగా జంద మామ.
ధూళిని, దమమును, ధూమజాలంబు,

నాకాశమందున నరసిన రీతి
అల రామునకు మోహ మంటగట్టెదరు.
*విషయంబు లింద్రియబృందంబు, సురలు,
జీవుడు— తమతమ చేతనత్వముల
నొకదానినుండి యింకొక్కటి పొందు.
కాని యన్నిటిని బ్రకాశింప జేయు
పరమప్రకాశకపరమాత్మ, అరయ
నా యనాది నిధాను డాయయోధ్యేశ
రఘురామచంద్రపరబ్రహ్మమౌను !
సర్వజగన్మూల చైతన్యమతడె !
ఆ రామవిభుడు మాయాధీశ్వరుండు
జ్ఞాన, సద్గుణగణసదనుండు చెలియ !
జడమయం బగు ప్రపంచంబు సైతంబు
రామసత్యత్వకారణముచే, గనగ
భాసించు సత్యంబువలె, మాయచేత.
కాకి చిప్పలు వెండిగా నెంచబడును
మరుమరీచికలోన మసలునే నీరు ?
తద్దృశ్యములు సర్వదా యసత్యములె.
ఈ భ్రమ బాయగా నెవ్వరి వశము !

---

విషయములు ఇంద్రియములచేత, ఇంద్రియములు అధిష్ఠానదేవతలచేత, ఆయా ఇంద్రియాధిష్ఠాన దేవతలు చిదాత్మచేత చైతన్యమును పొందు చున్నవి.

ఈ రీతిగా బరమేశునియందు
బడయుచుందురు జగద్భ్రాంతిని సకియ !
జగమెల్ల గనగ నసత్యమే యైన
ఘనతరదుఃఖంబు కలిగించు చుండె.
కలలోన దనతల ఖండింపబడిన
నతడు మేల్కొనుదాక ఆ బాధవిడదు.
ఆ కృపాసాగరుండైన శ్రీరాము
దయచేత మాత్రమే తద్భ్రమ వ్రీలు.
ఆ రామదేవు డాద్యంత శూన్యుండు,
తగ విచారించి వేదంబులు రాము
నీ రీతి వర్ణించె నింకీవరాక్షి !
"పదములు లేకయే పయనించు నతడు.
కర్ణముల్ లేక నాకర్ణించు నతడు.
కరములు లేకయే కార్యముల్ సేయు.
ముఖము లేకయె సర్వమున్ రుచిజూచు,
వాక్కు లేకయె మహాభాషణ సేయు,
తనువు లేకుండనే తాకు నన్నిటిని,
కన్నులు లేకయే కాంచు నన్నిటిని,
నాసిక యుండకున్నను చిత్రరీతి
నాఘ్రాణ మొనరించు నత్యద్భుతముగ
నతని విధానంబు లత్యలౌకికము
లాతని మహిమంబు లకథనీయములు.

వేదముల్ విబుధు లీ విధముగా నెవని
వినుతింతు, రెవ్వని విమలర్షిగణము
లాత్మలోధ్యానింప నాశించు నతడు
దశరథసుతు డయోధ్యాధీశ్వరుండు.
ఆశ్రితహితకరుం డా రామచంద్ర
భగవానుడే సుమా- పార్వతీ ! వినుమ.
కాశీపురంబున గాయముల్ విడుచు
జీవులకే ముక్తి చేకూర్చు చుంట
నా రామనామమహాబలంబుననె
సర్వచరాచర స్వామి, సర్వాత్మ,
యగు రఘువర్యుడే అస్మత్ప్రభుండు.
చివరకు వివశదుఃస్థితిలోన నైన
మనుజు లా రామనామంబెంచు నెడల
జన్మజన్మాంతసంచయములు, దూది
పింజలై కాలి వేవే భస్మ మగును.
ఎవరు భక్తిని స్మరియింతురో రాము,
వారు గోష్పాదము వలె సులభముగ
సంసారవార్ధిని సంతరించెదరు-
రాముడు పరమాత్మ రాజీవనేత్రి !
"రాముడు పొందె విభ్రమ' మన్న నీదు
మాట లత్యంతసమ్మతములు గావు.
ఇట్టి సంశయ మెప్డు డెదలోన గల్గు

నా క్షణంబున వాని యందలి జ్ఞాన
వైరాగ్యసద్గుణభావంబు లెల్ల
నిలువక యో భవానీ ! నశియించు"
అని శివు డాడు మోహాంతకసూక్తు
లాలించి నంతట నా యద్రితనయ
సకలకుతర్కంబు సమయింప గలిగె.
ఆ పార్వతీహృదయాంతరాళమున
శ్రీరామపాదరాజీవంబు లందు
భక్తివిశ్వాసముల్ ప్రభవించె, నామె
ఘోరసందేహంబు కూలి నశించె.
పలుసార్లు తనపతిపాదముల్ పట్టి
యంజలి ఘటియించి యతిభక్తితోడ
ప్రేమరసప్లుతవిమలవాక్యముల
నీ రీతిగా బల్కె నీశ్వరుతోడ.
"అతిశరత్కాలసూర్యాతపతుల్య
మైన నా మోహంబు హర ! శివా ! నీదు
చంద్రికాసమసత్ప్రసంగంబు చేత
శాంతించె, దీరె నా సందేహమెల్ల.
ఓదయాళూ ! ప్రభూ ! ఓమహాదేవ !
రామస్వరూపంబు గ్రహియించుకొంటి.
నాథ ! నీ కృపచేత నా వ్యథ తీరె-
స్వామి ! నీ చరణప్రసాదంబు చేత

శాంతి లభించెను స్వాతంబు నందు.
నాథ ! నీ దాసిగా న న్నెంచు కొనుము
ఏను నైజంబుగా స్త్రీని, యజ్ఞాను
రాలను, జడనైన ప్రాణేశ ! నీవు
నాయందున ప్రసన్నత పూని యున్న
ప్రథమమం దడిగిన ప్రశ్నంబునకును
ప్రత్యుత్తరం బిమ్ము, పరశివా ! నాథ !
రాము డనంతపరబ్రహ్మ మనియు
చిన్మయాకారుడు, శ్రీనిరంజనుడు,
వాసుదేవుం డని భావమం దిపుడు
నే గ్రహించితిని ప్రాణేశ ! విశ్వేశ !
ఆ రాము డేల నరాకృతి దాల్చె ?
వృషకేతనా ! దీని వివరింప వినతి''
అని గౌరి పలికిన నమితవినీత
వాక్యముల్ విని యామె పరమపునీత
రామకథార్థానురాగసమేత
అని యెఱింగియు శివుం డా శంకరుండు
పరమదయాబ్ధి సర్వజ్ఞుండు, భవుడు
కామారి యానందకలితాత్ము డౌచు
గౌరిని బ్రీతిదొల్కగ బ్రశంసించి
రామాయణం బిట్లు ప్రవచింప సాగె.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### చతుర్థ విశ్రామము

—o—

ఉక్కు స్తంభము నడిమికి
వ్రక్కలు గావించి పుట్టి భయదార్భటితో
రక్కసి వల్లభు జీల్చిన
చక్కని మా మట్టపల్లి చందనృసింహా !

## శ్రీరామావతారకారణములు

వినుము భవాని ! పవిత్ర మై వెలుగు
రమణీయమంగళ "రామచరిత్ర
మానస"కథను నిర్మలమానసమున.
కాకభుశుండి యీ కథ నెల్ల బ్రీతి
మహనీయు డగు గరుత్మంతుని తోడ
బ్రవచించె మున్ను పర్వతరాజతనయ !
ఈ మహాసంవాద మే రీతి జరిగె
తదుపరి వినుపింతు దరుణీలలామ !
పరమసుందరము నిష్పాప మై వెలుగు
దద్రామదివ్యావతారచారిత్ర
శ్రవణం బొనర్పుమా ప్రప్రథమమున.

హరిగుణ, నామ, కథార్థ, రూపములు,
సత్యపారంబులు, నగణనీయములు,
శక్తికొలందిని శ్రవణం బొనర్తు
నో యుమా ! ఆదరం బొప్పగా వినుమ !
నిగమాగమంబులు నేర్పు కొలంది
బహుళ, మనోజ్ఞ, పావనము లైనట్టి
శ్రీహరిలీలల జేసె సన్నుతిని
ఘనహరియవతారకారణంబులను
ఇదమిత్థమని చెప్ప నెవరి వశంబు ?
ఓ బుద్ధిశాలినీ ! ఓ గౌరి ! వినుము !
ఏమనోవాక్కుల కెపు డంద బోడు
శ్రీరాము డిది నాదు సిద్ధాంత మగును.

ఐనను నా కర్థ మైన రీతిగను,
సజ్జనముని వేదశాస్త్రపురాణ
జాలముల్ తమ తమ శక్తి కొలంది
తెలిపిన రీతిగా, దెలిపెద నీకు.

ఎప్పుడెప్పుడు ధర్మహీనత గలుగు
నెప్పు డధర్మవింజృంభణం బొదవు
నెపు డహంభావసంభృతు లైన ఘోర
రాక్షసాధములు ధరన్ జెలరేగి
వర్ణింప రానట్టి పాపకృత్యముల
సలిపెద రా కష్టసమయంబు లందు,

నెపుడు గోబ్రాహ్మణబృందారకాళి
భూదేవి దుఃఖంబుబొందునో, యపుడు
నారాయణుడు కరుణాపరాయణుడు
వివిధరూపము లొంది పృథ్వీస్థలాన,
దొలగించు సజ్జనదుఃఖభారముల
సంహార మొనరించి చండరాక్షసుల
సకలదేవత లందు శాంతి స్థాపించు.
తనదు నిశ్వాస లై తనరు చున్నట్టి
వేదమర్యాదల బృథ్వి రక్షించు,
నిజయశం బెల్లెడ నిండగా జేయు
రామావతరణకారణ మిదే సకియ !
భగవంతు లీలాప్రభావసంతతుల
భాగవతోత్తముల్ పాడి, కీర్తించి
సంసారవార్ధిని సంతరించెదరు.
తన భక్తరక్షణార్థమె, జనార్దనుడు
తనువు ధరించును ధాత్రిపై గౌరి !
రామావతారకారణముల నెన్న
బహుళంబు లౌచును భాసురిల్లెడిని
ఆ కారణంబుల నరసిన యెడల
నొక దాని కన్న నింకొకటి చిత్రంబు-
ఆ కారణంబుల యం దేను నీకు
నొక్కటో రెండింటినో వచించెదను-

పార్వతీ ! సుమతీ ! భవాని ! అపర్ణ !
శ్రవణంబు సేయుము సావధానముగ
శ్రీహరికిన్ గడు ప్రియు లైన యట్టి
వైకుంఠమందిరద్వారపాలకుల
జయవిజయుల ప్రపంచం బెల్ల దెలియు.

సనకాదిభూసురశాపంబు చేత
నా సహోదరు లిద్ద ఱత్యుగ్రశౌర్య
తామసాసురదేహధారు లై రవని
గనకాక్షు డన హేమకశిపు డనంగ
నమరేంద్రగర్వాపహారు లటంచు
వారలు జగతిలోపల బేరు గనిరి.

వారిద్దరును జగత్ప్రఖ్యాతసమర
వీరవరేణ్యు లై విజయంబు గనిరి.
వారిలో హేమాక్షు బడగూల్చు కొఱకు
హరి ధరించెను వరాహావతారమును-
ఆపయి నారసింహావతారమున
నా హేమకశిపగర్వాంతరాళమును
నిర్భిన్న మొనరించి నిస్తులశాత
వజ్రనఖాగ్రదుర్ధరవిక్రమమున
బరమభక్తుం డగు ప్రహ్లాదు యశము
దశదిశాక్రాంత మై తనరంగ జేసె.
ఈ సహోదరు లిద్ద ఱేధరన్ తిరిగి

పృథుబలిష్ఠులు మహావీరులై నట్టి
రావణకుంభకర్ణ సమాఖ్యు లౌచు
ధరణి జన్మించి రా దానవాధిపులు
ఖండనపాండిత్యవైభవాన్వితులు.
గీర్వాణులనుగూడ గెలిచి రుద్ధతిని
అఖిలప్రపంచవిఖ్యాత మౌ నట్లు.
ఆ హేమకశిపహేమాక్షు లిర్వురును
సర్వేశ్వరునిచేత జంపగా బడియు,
మూడు జన్మంబుల బొందు నట్లున్న
బ్రాహ్మణఘోరశాపప్రకారముగ
ముక్తిని వారలు పొంద లేరైరి.
అందుచే నొక సమయంబున శౌరి
ఆ భక్తవత్సలు డవతార మొందె
నా జన్మయందున నదితికశ్యపులు
హరికినిదలిదండ్రు లైరి ధరిత్రి.
అదితి కౌసల్యగా, నల కశ్యపుండు
దశరథుం డను పేర ధరణిలో మనిరి.
ఒక కల్పమున బురుషోత్తము డిటుల
నవతార మొందియు నవనీస్థలమున
బావనలీలల వర్తించి నాడు
ఇంకొక కల్పమం దెల్ల దేవతలు
దానవుం డగు జలంధరుతోడ బోరి

యపజయం బొంది దుఃఖాక్రాంతులైరి.
వారి దుఃఖంబును పరశివుం డరసి
సలిపె నపారమౌ సంగ్రామకేళి.
కాని మహాబలకలితుడైనట్టి
ఆ దానవుడు కూలడాయెను ఘోర
నతుల పతివ్రత యా దైత్యభార్య;
ఆమె సతీత్వమహాశక్తిచేత
త్రిపురారిచే గూడ దెగడయ్యె వాడు.
ఒక యుక్తిచే బురుషోత్తము డపుడు
ఆమె సువ్రతభంగ మాచరించియును
దేవకార్యమును సాధించె, నా పయిన
నీ యుక్తి నెల్ల దా నెఱిగి యా కాంత
ఆగ్రహ మొంది యా హరిని శపించె.
కౌతుకనిధియు సత్కారుణ్యవనధి
భగవాను డామె శాపంబు గ్రహించె.
ఆవలి కల్పమందా జలంధరుడె
రావణుం డన బునర్భవమును బొందె.
సంగ్రామమున వాని సంహరించియును
శ్రీరాము డతని కిచ్చెను సత్పదంబు.
ఒక జన్మ మందున నుర్వీస్థలమున
రాముడు నరశరీరము దాల్చినట్టి
కారణం బిదిసుమా కాంచిన యెడల.

"ఓ భరద్వాజఋష్యుత్తమా ! వినుము:
ప్రత్యవతార శుభంకరకథను
పలువిధంబుల గవుల్ పాడుకున్నారు.
మఱి యొకానొక సారి మౌని నారదుడు
సారసనాభుని శపియించి నాడు.
ఒక కల్పమున ముకుందోదయంబునకు
గారణం బిదియయ్యె క్ష్మారంగమందు".
అన గౌరి యీ మాట లాలించి నంత
జకితయై యిట్లనె శంకరు న్గాంచి,
"అల నారదుండు విష్ణ్వంఘ్రిభక్తుండు
జ్ఞానిగదా, అట్టి సంయమీశ్వరుడు
ఏ తఱి శపియించె ? నిందిరావిభుడు
ఏ కీడు చేసెనో యెఱిగింపు మీశ !
మునినారదుం డట్లు మోహితుం డౌట
జిత్రమయ్యెను నాకు శివ ! త్రిపురారి !"
చిఱునవ్వు నవ్వుచు శివు డంత బలికె :
"జ్ఞానియే కాని, యజ్ఞాని కానిమ్మ,
శ్రీరాఘవుండు వాంఛించిన రీతి
ప్రతిజీవి సమయమ్మ వచ్చిన తఱిని
మార్పు చెందును హరిమాయ చిత్రంబు !"
యాజ్ఞవల్క్యుం డిట్లు లనియె నంతటను
"శ్రీరామగుణగాథ చెప్పుచున్నాడ

వినుము భరద్వాజ ! ప్రీతి వెలుంగ"
మానమదంబుల మదిలోన విడిచి
భవవిభంజనరామభజనంబు సతము
చేయుమా హృది, దులసీదాస ! నీవు-

## నారదునిగర్వము ; శ్రీహరిమాయా ప్రభావము

ఆ హిమాలయపర్వతావళి యందు
గల దతిపావనకందరం బొకటి.
ఆ గుహప్రాంతము నం దంద మైన
గంగామహానది కలకల బాఱు
పరమపావనము, శోభావంత మైన
ఆ యాశ్రమస్థల మరసిదేవర్షి
పరమసంతోషసంభరితాత్ము డయ్యె.
ఆ వెండికొండను, ఆ దివ్యగంగ,
నావనభాగంబు లరసి నంతటనె
ఆ నారదుని హృదయాంతరాళమున
బొంగె శ్రీపతిపదాంభోజానురక్తి.
అతడు హరిధ్యాన మందు గూర్చుండె
"నొక్క తావున నిల్వకుందువుగాక—"
అనెడి దక్షుని శాప మయ్యె నిష్ఫలము-
సహజవినిర్మలస్వాంతుడై యుంట

దేవతాముని సమాధినిమగ్నుడయ్యె.
ఆ మునిస్థితి గాంచి యమరేంద్రు డంత
భీతిల్లి కాముని బిలిపించి యతని
మహితరీతిగను సన్మానంబు చేసి
పలికె నీ విధముగా "పంచాస్త్ర ! సచివ !
నీవు నా కొఱకుగా నేడు పోవలయు
ననుచరయుక్తుండ వై " యన నపుడు
జలచరధ్వజుడు హర్షంబును బొంది
పయనంబు గావించె బరమమునీంద్ర !
అహా ! నిజపదవిని నా దేవమౌని
యాక్రమించు నటంచు నమరేంద్రు భయము
కామలోలుడు, లోభి, కాంచి యందఱిని
కపటకాకము వోలె గడు భీతి జెందు.
ఎండిపోయిన వట్టి యెముకను నోట
గఱచియున్ జడశునకంబు పోవుచును
మృగరాజమును గాంచి, యిది తన యెముక
కాజేయు నని భయకలితయై పాఱు
నీ విధంబుగనె దేవేంద్రుడు గూడ
సిగ్గును విడిచిన చింత గావించె-
నారదాశ్రమము, మన్మథు డంత జేరి
లలితవసంతకాలము ప్రకటించె
నిజమాయచేత; మునీశ్వరా ! అపుడు

రంగురంగుల పూలు రమణీయముగను
వివిధవృక్షము లందు విరియ బూసినవి.
కోయిలల్ పాడెను 'కూహూ' అటంచు.
భృంగసంగీతముల్ వినపడ సాగె-
వీచెను చల్లని పిల్ల తెమ్మెరలు
విమల సువాసనల్ విరజిమ్ము కొనుచు
కామాగ్నికిని దోడుగా నరణ్యమున-
గడు నవయౌవనాకారశోభితలు
నిఖిలమన్మథకళానిపుణ లై వెలుగు
రంభాదు లత్యంతరమణీయలీల
బాటలు పాడిరి పలు తెఱంగులను.
పూలబంతుల జేత బూని కుల్కుచును
ఆడిరి పలు రీతు లతిమనోజ్ఞముగ.
ఆ సహాయంబుల నరసి మన్మథుడు
హర్షంబునెంది నిజాంతర్యమందు
బలు పన్నుగడలను బన్ని జృంభించె.
కాని కాముని పరాక్రమధాటి యెల్ల
మొక్క వోయెను దేవమునివర్యు ముందు.
పాపాత్ము డగు మనోభవు డంత దాను
ప్రాణభీతిని జెందె భావంబు లోన
కన, రమాపతికృపాకవచరక్షితుని
భంగం బొనర్చెడు బలశాలి యెవడు ?

ప్రసవాస్త్రు డంతట భయమును బొంది
తన పరాభవమును దా నొప్పుకొనియు
శ్రీనారదాంఘ్రిరాజీవంబు లందు
సానుచరుం డయి సాష్టాంగపడియు
దమ తప్పు సైప ప్రార్థనము గావించె.
నారదమౌని మనంబులో నపుడు
ఆగ్రహం బుదయింప దయ్యె నుంతయును.
ఆ ముని కాముని నతిప్రియోక్తులను
పరితోషపఱుపగా, బంచబాణుండు
మునిపదాబ్జములకు మ్రొక్కి నమ్రతను
సానుచరుం డయి చనె సెలవొంది.
ఇంద్రసభాస్థలి కేగి మన్మథుడు
స్వీయకృత్యంబుల జెప్పి యా పయిని
మునివర్యు సౌశీల్యమును నివేదింప
నా కథ నాలించి యచటి వా రెల్ల
రాశ్చర్యమొందియు నమరమునీంద్రు
గడు బ్రశంసించియు ఘనభక్తితోడ
నతులు గావించిరి నారాయణునకు.
తదనంతరము నారదర్షివర్యుండు
శ్రీశివదేవు దర్శింపగా నరిగె-
ఏను మన్మథుని జయించినా ననెడి
యభిమాన ముదయింప నాత్మ నారదుడు

శంకరుతో గాము చర్యల దెలిపె.
అత్యంతప్రియు డౌట నా నారదునకు
నా మహాదేవుడు హరుడు శ్రీశివుడు
హితవాక్యముల బల్కె నీ రీతి ప్రీతి
"నాకు జెప్పిన రీతి నారదా! నీవు
హరితోడ దెలుపకుమా - ఎన్నడైన
నీ ప్రసంగం బెన్నడేని వచ్చినను
గుప్తంబుగా నిల్పుకొనుము లోపలనె.
పలుసార్లు ని న్నిదే బ్రతిమాలుచుంటి
క్షేమదాయక మైన శివుని హితోక్తి
నారదు హృదయంబున న్నాటదయ్యె-
ఆపయి జరిగిన నతికౌతుకమును
ఓ భరద్వాజఋష్యుత్తమా! వినుము-
అహా! బలీయము కదా హరియిచ్ఛ! సచివ!
జరుగు రామేచ్ఛయే సర్వకాలముల,
నన్యథా జరుగదహో! దాని కెవుడు
శివు వాక్కులను ముని చెవి బెట్టకుండ
బ్రహ్మలోకమునకు బయనంబు చేసె.
సన్నుతగానవిశారదుం డైన
నారదముని యొకనాడు, హస్తమున
వరమనోహరవీణ వాయించు కొనుచు
బాడుచు హరిగుణభజనకీర్తనల-

వేదాంతరూపు డై వెలుగొందు ఘనుడు,
శ్రీనివాసుం డున్న క్షీరసాగరము
జేర, శ్రియఃపతిచిత్తంబు నందు
నతిహర్షితుం డయి యాదరం బొప్ప
నెదురేగి స్వాగతం బిచ్చియు దెచ్చి
యాత్మీయసింహపీఠాగ్రభాగమున
గూర్చుండగా జేసె గూర్మి యుప్పొంగ.
ఆ చరాచరపతి యైన కేశవుడు
చిఱునవ్వు ముఖమున జెంగలింపంగ
"బహుదినంబులకు నీ భాగ్యంబు కలిగె
మా, కహో ! నారదమౌనీంద్ర !" అనియె.
శివుడు వద్దని మున్ను జెప్పి యుండినను,
పూస గ్రుచ్చిన రీతి బుష్పాస్త్రిచర్య
లన్నియు హరితోడ నమరర్షి తెలిపె
నమితప్రచండమహో ! రామమాయ !
ఈ లోకమున దాని కెవరు లోబడరు ?
ముసిముసి నగవులు మోముపై జెలగ
మృదువచనంబుల శ్రీశు డిట్లనియె:
"తాపసోత్తమ ! నిన్ను దలచు మాత్రమున
మద, మోహ, కామాభిమానంబు లుడుగు"
మునినాథ ! నారదా ! మోహంబు, జ్ఞాన
వైరాగ్యములు లేని వారల గెలుచు.

బ్రహ్మచర్యవ్రతరతుడవు, మఱియు
నతిధీరచిత్తుండ వరయగా నీవు
కామపీడితుడవు కాజాల వెపుడు.''

అన విని నారదుం డభిమాని యగుచు
''పరమాత్మ ! యిది నీ కృపావిశేషంబె''
అని వచించెను పరమాత్మతో నపుడు.
హరి కరుణానిధి యాత్మ జింతించి
యా నారదుని హృదయాంతరాశమున
బెను గర్వవృక్షంబు పెఱుగుట గాంచి
''వేగమే దానిని బెఱికి వైచెదను;
అస్మదాశ్రితహిత మాచరించుటయె
నా దీక్ష; గాన నీ నారదమౌని-
కురుహితంబును గూర్చు నొక యుక్తిపన్ని
కౌతకం బొనరింపగల'' నని తలచె.
శ్రీహరిపాదరాజీవంబు లందు
శిరము వంచియు నమస్కృతుల గావించి
ఏగె నారదుడు, మునీశ్వరా ! వినుము
ఆ మునిహృది వృద్ధి యయ్యె నహంబు.
శ్రీపతి తన మాయ బ్రేరణ జేసె
దాని కఠోరకృత్యము లింక వినుము.
మాధవు మాయచే మార్గమధ్యమున
శతయోజనాతివిస్తార మై నట్టి

ఘనపురం బొక్కటి కల్పింప బడియె.
తత్పురరచనావిధాననిపుణత
వైకుంఠమును మించి భాసించు చుండె
ఆ నగరంబులో నధివసియించు
స్త్రీపురుషాళి వీక్షించిన యెడల
ఆ రతీమన్మథు లవనిపై నిట్లు
బహుళరూపంబుల బ్రభవించి నట్లు
తలపు కల్గును భరద్వాజమౌనీంద్ర!
ఆ పురం బేలెడి యధిపు నామంబు
"శీలనిధి"యనంగ జెలువొందు చుండె.
బహుళాశ్వగజసైన్యభాసమానుండు
పరగ శతేంద్రవైభవవిలాసుండు
సుందరరూపతేజోబలనీతి
నిలయు డా ఘన"శీలనిధి"నృపాలుండు.
'విశ్వమోహిని' యను పేర వెలుంగు
నా రాజసుతసుందరాకార మరసి
మిగుల మోహించు లక్ష్మీదేవి యైన.
ఆ బాల యఖిలగుణాలయ యైన
హరిమాయయే సుమా! ఆమె సోయగము
వర్ణింప నెవ్వరి వశమౌ మునీంద్ర!
ఆ రాజతనయాస్వయంవరం బపుడు
జరుగ నుండెను రాజసౌధాంతరమున.

అందుచే వచ్చిరి యగణితనృపులు,
కౌతుకభావసంకలితదేవర్షి
ఆ పట్టణంబున కరుగుదెంచియును,
ఎఱిగె బౌరులచేత నెల్ల వార్తలను.
ఆ రీతి వృత్తాంత మంతయు వినియు
నా ముని చనియె నృపాలయంబునకు.
నృపు డంత మౌని నర్చించి సంప్రీతి
నుచితాసనంబున నుపవిష్టుజేసె.
ఆ రాజు తన పుత్రి నటకు రావించి
చూపి నారదమునీశున కిట్లు బలికె :
" నాథ ! విచారించి నా కూర్మి సుతకు
సర్వశుభాశుభసంగతుల్ తెలుప
బ్రార్థించు చున్నాడ, బరమమునీంద్ర !"
ఆ రాజపుత్రిని నరసి నంతటనె
నారదమౌని, మనంబులో దనదు
వైరాగ్యమున కెల్ల స్వస్తి చెప్పియును
ఱెప్ప వాల్పక చూచె నృపతనూభవను.
ఆమె సులక్షణా లన్నింటి గనగ
నా ముని మతి విభ్రమాయత్త మయ్యె.
హర్షంబు జెందెను నాత్మలో నతడు.
ఆ సులక్షణముల నన్నింటి నపుడు
ప్రకటింపకయె దాచి భావంబు నందు

దా నిట్టు లెంతయో తలచె నారదుడు:
"ఈ బాలికామణి యెవని వరించు
నాత డజేయుడై, యమరుడై మనును.
ఈ శీలనిధిసుత యెవని బెండ్లాడు
నతడు చరాచరారాధితుం డగును."
ఈ సులక్షణముల నెల్ల బఠించి,
వానిని బహిరంగ పఱుపక దాచి,
వేగ నే మేమొ కల్పించి వచించె.
శుభలక్షణములు నీ సుతకున్న వనుచు
నృపుతోడ వచియించి యేగె నారదుడు.
తనలోన దా నిట్లు దలచె నారదుడు:
"ఏ నెట్టి యత్నంబు నిపు డొనరింప
నృపతనూజాత వరింపగా గలదు ?
జపతపంబులు సేయు సమయంబు లేదు,
అందుచే "ఓవిధీ ! ఆ బాల నెటుల
జేపట్టు" టని చింత సేసె నారదుడు
ఏను వాంఛించున దీ సమయమున
నమితశోభాయమానాకార మొకటె,
అది యున్న నన్గాంచి, యా రాజతనయ
మత్కంఠమున జయమాల గీలించు
సౌందర్యదానంబు సలుపగా నాకు,
శ్రీహరి న్నేను బ్రార్థింతును, గాని

అక్కటా క్షీరాబ్ధి కరుగుద మన్న
గాలవిలంబము కాగల దైన
హరికన్న లేడు నా కాత్మహితుండు.
అత్యవసర మగు నట్టి యీ తఱిని
హరి నాకు దగు సహాయం బొనరించు''
అని నారదుండు నిజాత్మ జింతించి
బహువిధవినయసంభావన లొప్ప
బ్రార్థించె శ్రీహరిపాదపద్మముల.
కౌతుకప్రియు డహో! కారుణ్యవనధి
హరి మునిముందు బ్రత్యక్షమై నిలిచె.
ఆ దృశ్యమును గాంచ నా నారదునకు
కన్నులవిందయ్యె, గలిగె సంతుష్టి.
తన కోర్కె సిద్ధించు దప్పక యనుచు
ధైర్యంబు కలిగె స్వాంతంబుంబులో మునికి.
అత్యార్తిగదురగా హరితోడ నతడు
వినిపించి జరిగిన వృత్తాంత మెల్ల
నిట్లు ప్రార్థించెను "కృపబూనుమీశ!
నాకు సహాయం బొనర్పుమా; నాకు
నీ రూప మొసగు మా నేడు లోకేశ!
వే తొకరీతి లభింపదా కన్య
త్వరగ నా వాంఛ దీర్పంగ బ్రార్థనము,
నీ పాదదాసుండ నే ప్రభూ! శౌరి!"

తనదు మాయాబలధాటిని గాంచి
దీనదయాళు డా దేవదేవుండు
తనలోననే, మునీ! తా నవ్వుకొనియు
నీ రీతి బలికె నా ఋషిని గాంచియును:
"వినుము, నారద! నీకు హిత మై నదియె
కావింతు నా నుడుల్ కల్లగా వెపుడు.
ఓమునీ! నారద యోగీశ! వినుము!
అల రోగపీడితు డైన మానవుడు
తినరాని వస్తువుల్ తిన నెంచు నెడల
వైద్యుండు సమ్మతింపడుగదా? యటులె
నీ కేది హితమౌనొ నే నది సేతు."
అనియు నంతర్హితుం డాయెను చక్రి.
మాయావశుం డయి మౌఢ్యత పూని
హరిగభీరోక్తులయం దర్థ మాత్మ
దెలియ జాలక పోయె దేవర్షి యహహా!
అంత నాత్రముతోడ నా ఋషిరాజు
తత్స్వయంవరసభాస్థలమును జేరె.
తమ పరివారయుక్తంబుగా వచ్చి
దేశదేశముల పృథ్వీనాథు లెల్ల
బహువిధభూషణభాసురు లగుచు
నుచితాసనమ్ముల నుపవిష్టు లైరి.
"అహా! నాదు సౌందర్య మరసిన పిదప

ఆ రాకుమారి పెండ్లాడ దిం కెవని
తప్పకుండగ నన్నె తా వరియించు''
అని పొంగు చుండె నా యమరర్షిలోన.
మునిహితం బొనరింప బూని కృపాబ్ధి,
ఆతనికి నెదలియంగ రాకుండ
గడు వికారం బగు కపిరూపు గూర్చె.
ఎఱుగ రీ సంగతి యితరు లెవ్వరును
అంద మాతడు నారదాచార్యు డనుచు
గడు భక్తితో నమస్కారంబు లిడిరి.
ఆ నారదుని కంటి కతడు శ్రీవిష్ణు
సుందరాకృతిగను జూపట్టు చుండె.
రాజుల దృష్టి నారదునిగా దోచె.
రాజకన్యకకు మాత్రము, నారదుండు
పండు కోతిగ గానవచ్చె మునీంద్ర.
తత్స్వయంవరసభాస్థలభాగ మందు
రుద్రకింకరు లిర్వురునునుంట జరిగె.
ఈ రహస్యం బెల్ల నెఱిగి యా భటులు
విప్రవేషంబుల వేసి యేతెంచి
రా కౌతుకక్రీడ నరయ నచ్చటకు
నిజరూపగర్వంబు నిండ నారదుడు
క్షోణీధవుల మధ్య గూర్చుండి యుండె.
ఆ ప్రక్కనే బ్రాహ్మణాకృతు లూని

రుద్రకింకరు లిద్ద్వరును గూరుచుండ్రి.
బ్రాహ్మణాకృతు లూని వా రుంటచేత
వారి నొరుల్ గుర్తు బట్టలే రైరి.
విని వినిపించని విధముగా వారు
"ఇంత సుందరరూప మిచ్చె సీతనికి
నిందిరాపతి కృప; నితని గాంచియును
తప్పక రాపుత్రి తబ్బిబ్బు జెంది
ఈతడు *హరి యని యెంచి వరించు."
అని పరిహాసంబు లాడి రా యెడను.
మన్మథవశ్యుడై మౌనీశ్వరుండు
మోహప్రమత్తత మునిగె మునీంద్ర!
అతని తీరును జూచి యా శివభటులు
నవ్వుచు ముసిముసి నవ్వుల మర్మ
పరిహాసవాక్కుల బలుకుచుండినను
భ్రాంతాత్ముడై యుంట పాప మా మౌని
పట్టించు కొనడయ్యె వారి హాస్యముల.
ఆ యతిశోచనీయాకృతి యొక్క
రాజనందినికి మాత్రమె కాన వచ్చె;
ఆ రాజపుత్రిక యా మునీశ్వరుని
కోతి ముఖంబును, ఘోరరూపమును
గనుగొని క్రోధసంకలితాత్మ యయ్యె.

---

* హరి— అనగా ఒకఅర్థము కోతిఅని— మఱొకఅర్థము విష్ణువని.

ప్రియసఖీజనములు వెనువెంట రాగ
రాసుత నడచె మరాళంబు వోలె.
కలుగగా జయమాలకరపంకజముల
అఖిలరాట్పుత్రుల నరయు చా బాల
యొయ్యారముగ బోవు చుండె నచ్చోట.
ప్రింగుచు గుటకలు మిగుల గర్వమున
నుండె నారదముని యుపవిష్టు డగుచు
ఆతని వైపున కా రాజతనయ
క్రీగంటనైన వీక్షింపక పోయె.
పాపము! నారదస్వామి, పేరాస
నిక్కినిక్కియు జూచు నృపసుత వైపు
అది చూచి హరభటుల్ హసియించుచుండి
రా కృపానిలయుడౌ హరి సైత మచట
భూవల్లభుని రూపమున వచ్చియుండె.
ఆ రాజనందిని హరి మెడలోన
జయమాల వైచెను సంతోష మొప్ప.
శ్రీనివాసుం డామె జేకొని వెడలె
నవనీపతులు నిరాశాత్ములు గాగ
మోహాంధు డౌటచే ముని నారదుండు
అమితవై కల్యంబునందె జిత్తమున.
మాలలో ముడి వీడి మణిజారి నట్లు
నారదమౌని మనంబులో వగచె

హరభటుల్ నవ్వుచు "అద్దంబులోన
నరయుమా నీ ముఖం" బని వచియించి
పరుగిడి రెంతయో భయమును జెంది.
ఆపయి ముని నీట నరసెను ముఖము
అంతు తే దాతని యాగ్రహంబునకు
నంత నా నారదు డతిభీష్మరీతి
శంకరభటులను శపియించె నిటుల :

## నారదుడు శివదూతలను, శ్రీహరిని శపించుట

" కపటఘోరాఘసంకలితాత్మలార !
దనుజు లై 'పుట్టు' డీ ధాత్రిలో మీరు
నన్ను గాంచియు మీరు నవ్వినందులకు
ననుభవింపుడు తగి నట్టి ఫలంబు
ఇక జేతనైన మునీశులన్జూచి
యెగతాళి సేయుడీ హీనాత్మలార ! "
మరల దా నారదమౌనీశ్వరుండు
నిజముఖంబును గన నీటిలోపలను
తనపూర్వతనువు యథారీతి దోచె
ఐన నాతని హృదయాంతరాళంబు
శాంతింప దయ్యెను. చండకోపమున
నాతని యధరంబు నదరగా దొడగె.

కమలావిభుం డున్న కడకు నారదుడు
వెనువెంటనే బయల్వెడలె గ్రోధమున.
"నగుబాటు గూర్చెను నాకు లోకమున
నా హరిన్ శపియింతు నటుగాక యున్న
వాని ద్వారము ముందు బ్రాణముల్ విడుతు"
నని నారదుండు నిజాత్మలో దలచె
పోవుచుండిన మార్గమున నారదునకు,
రాజకన్యారమారమణీయుతముగ
నా దనుజారి శ్రీహరి కాన వచ్చె.

అప్పు డా సురపతి యతిమంజులముగ
నీ రీతి బలికెః "మునీశ్వరా! ఏల
వికలుడ వై నీవు వెడలుచున్నాడ?
వెటకు నీ వేగుట యెఱిగింపు మనఘ!"
ఆ మాటలను వినినంత నారదుని
తను వెల్ల క్రోధసంతప్త మై పోయె
మాయావశుం డయి మతిపోయి యుంట
నాత డీ రీతిగా ననె హరి గాంచి :

"పరుల సంపద జూచి భావంబులోన
నీ వోర్వ జాలవు నిక్కంబు చూడ
నీర్ష్యయు గాపట్య మెక్కువ నీకు,
క్షీరసముద్రంబు చిలికెడి తఱిని
పాప మా శివు వెఱ్ఱివానిగా జేసి

బృందారకులచేత బ్రేరణ జేసి
అకట ! త్రాగించితి వతనిచే విషము
దనుజావళికిని మద్యంబు నొసంగి
హాలాహలంబును హరున కొసంగి
ఘనరమాదేవిని, కౌస్తుభమణిని
గొంటివి, సర్వదా కుటిలచిత్తుడవు
స్వార్థసాధకుడ వై వర్తింతు వెపుడు
నిను నమ్మగా రాదు నీరజనాభ !
పరమస్వతంత్రప్రవర్తన గల్గి
పెద్దవు నీకు నీవే యాట చేత
నీ యిచ్చవచ్చిన నియతి జేసెదవు.
మంచివానిని నీవు మందుని జేసి
మందుని జేతువు మంచివానిగను.
కాని చిత్తము నందు గలుగవు నీకు
ఖేదమోదంబు లొకింతయు దాన
బ్రతివాని నీ విట్లు వంచించుచుంట
నలవాటుపడితివీయపకారములకు.
నిర్భయత్వంబున నీవు నీ పనుల
నిర్వహింతువుగదా నేర్పు మీఱంగ.
శుభకర్మయేని యశుభకర్మయేని
నీ మార్గమున కడ్డు నిలువగా లేదు.
నిన్ను శిక్షింపగా వేర రెవ్వరును.

నీ యాట లిటు సాగ నేడు గర్వించి
యగ్నితో జెల్లాట లాడినా విపుడు
పొందుము తత్ఫలంబును తప్పకుండ.

కేశవా! నను మోసగించిన యట్టి
నృపరూపమును ధరియింపుము నీవు.
ఇదె నాదు శాపమోయీ! నీవు నన్ను
గోతి జేసితివి యా కోతులే నీకు
సాయంబు మిత్రులై సలుపు టౌగాక!
నా కపకారం బొనర్చిన రీతి,
ఓహరీ! భార్యావియోగదుఃఖమును
నీవును పొందుట నిక్కమౌ గాక!"
ఇటు నారదుడు శపియించె శ్రీహరిని.

## హరిమాయావిముక్తి, నారద పశ్చాత్తాపము

సంతోషమునను తచ్ఛాపవాక్యమును
శిరమున ధరియించి, శ్రీరమావిభుడు
ఆ కృపాళువు హరి యమ్మునీశ్వరుని
బహువిధానంబుల బ్రార్థన జేసి
ఘనబలాకర్షణాకలిత మై నట్టి
తన మాయ దొలగించె దాపసి పైన.

హరి మాయదొలగించి నంతనే యచట
రమ యదృశ్యం బయ్యె, రాపుత్రి లేదు.

అతిభీతచిత్తు డై యా ముని యంత
హరిపాదముల బట్టి యనియె నీ రీతి :
"ప్రణతార్తిహరణ ! మాంపాహి మాంపాహి"
స్వామీ ! దయాళు ! నా శాపంబసత్య
మగుగాక - యని పల్క 'అది నాదు వాంఛ'-
అని పల్కె దీనదయాళు డా శౌరి.
"అనరాని పలుకుల నంటిని నిన్ను,
ఈ పాపములబాయు టే రీతి నాథ"
అని పరితాపంబు నందె నారదుడు.
అనవిని శ్రీహరి యనియె నీ తెఱగు :
"అరిగియు నూఱుపర్యాయంబు లీవు
శంకరనామంబు జపియించు కొనుము.
సత్వరంబుగ నీకు శాంతి లభించు.
హరసమానుం డగు నాత్మప్రియుండు
నా కొండు లే డెందు నారదా ! దీని
భ్రమ నైన మఱవకు భావమం దెపుడు
శ్రీశివానుగ్రహసిద్ధి లేకుండ
విమలమద్భక్తి లభింప దేనాడు.
దీనిని మతిలోన స్థిరముగా నిలిపి,
సంచరింపుము నీవు సకల విశ్వమున
నిక మాయ నిను స్పృశియింప బో దెపుడు."
ఇటుల నోదార్చి మునీశు నారదుని

దనుజారి శౌరి యంతర్ధాన మొందె.
శ్రీరామకీర్తన జేయుచున్ భక్తి
సత్యలోకమునకు జనియె నారదుడు.
విగతమోహుం డయి వెడలుచున్నట్టి
మునినారదుని గాంచి పురహరభటులు
పరమసంతోషసంభరితాత్ము లైరి.
వా రంత కడు భయపడుచు స్వాంతమున
నారదమునిపాదనళినముల్ బట్టి
అత్యార్తులై యిట్టు లనిరి, మునీంద్ర !
"కామారిభటులము; కాము విప్రులము.
చండాపరాధంబు సలిపియు మేము
ఘోరితత్ఫలమును పొందితి మిపుడు.
ఓకృపాళూ ! శాప ముడుపుము కరుణ"
అనగ నా దీనదయాపరుం డయిన
శ్రీనారదర్షి వచించె నీ రీతి :
"ఉభయులు పోయి, మీ రుర్వీస్థలమున
బుట్టుడీ రాక్షసపుంగవు లగుచు.
ప్రబలవైభవమహాబలము, తేజమును
కలిగి మీ రిర్వురు క్రాలగా గలరు;
భుజబలంబున మీరు భువనముల్ గెలువ.
నరరూపమును తాల్చు నారాయణుండు.
హరిచేత రణరంగమందున గూలి

ము_క్తిగాంతురు మీరు పుట్టరు తిరిగి".
నారదాంఘ్రుల వందనం బొనరించి
రుద్రుని భటు లిద్దఱును నిర్గమించి
కాలాంతరమున రాక్షసవీరు లౌచు
జన్మ మొందిరి ధరాచక్రంబులోన.
ఒక కల్పమున బురుషో_త్తము డవని
నరు డౌట కిది కారణంబుగా నుండె.
సురరంజనంబును, సుజనరక్షణము,
క్ష్మాభారహరణ మా మాధవవ్రతము.
హరి తాల్చి యి ట్లనేకావతారముల
సుందరాద్భుతమహాసుఖదలీలలను
బహుళంబుగా సల్పె బర్వతతనయ !
ప్రతికల్పమందున బరమాత్మపుట్టి
రమణీయవివిధకార్యంబు లొనర్చు.
ప్రతికాలమున మునీశ్వరులు తత్క_థల
పరమపునీతప్రబంధరూపముల
గానంబు గావించి కడు ధన్యులై_రి.
తన్మహాద్భుతవివిధప్రసంగముల
విని, బుద్ధిశాలురు వింతను గనరు.
ఆ యనంతుం డగు హరిచందముగనె
హరికథావళియు ననంతమే సుమ్మి.
పరిపరివిధముల బండితు లవ్వి

పాడియు వినియు సంబరపడుచుండు
రా రామచంద్రు దివ్యాహ్లాదకథల
సంపూర్ణముగ బాడ సరిపోవుచుండు
గనగ గోట్లకొలంది కల్పంబులైన
జ్ఞాను లౌ మునులను సైతమోహోహో !
పురుషో త్తముని మాయ మోహింప జేయు
నని తెల్ప నీ యుపాఖ్యానంబు నేను
నీకు జెప్పితి భవానీ ! గిరితనయ !
లక్ష్మీవిభుండు లీలావినోదుండు,
ప్రణతహితుండు, సేవానులభుండు,
నఖిలసంతాపాపహారి; యా శౌరి
సురనరమునులను జూడ నందఱిని
ఆ హరిప్రబలమాయ జయింపగలుగు
నిది చి త్తమందు గ్రహించియు సర్వు,
లా మహామాయకు నధిపతి యైన
నారాయణుని భజనము సేయ వలెను.
అజుడును, నిర్గుణుం, డలరూపరహితు
డైన బ్రహ్మము కోసలాధీశ్వరుడుగ
బుట్టిన కారణంబును మఱియొకటి
శ్రవణం బొనర్పుమా శైలకుమారి !
ఆ మహాచిత్రకథార్థజాలముల
వి స్తరించుచు నుంటి వినుము సంప్రీతి.

తాపసవేషసంధారణ చేసి
యనుజునితోడ మహారణ్యమందు
దిరుగుచున్నట్టి యే దివ్యుని మున్ను
గన్నులారగ నీవు కాంచగల్గితివో
నీవు సతీరూపిణివిగ నున్నప్పు
డెవని చర్యకు భ్రమియింప నిప్పటికి
నా భ్రమచ్ఛాయ నిన్ననుగమించెడిదో
ఆ రామచంద్రమహాచరిత్రమును
వినుము భవాని! నీ విభ్రాంతి ద్రీలు.
ఆ యవతారమునందు గేశవుడు
చేసిన లీలావిశేషంబులేను
సకియ! వచింతును శక్తి కొలంది
యను శంకరునివాక్కు లాలించినంత
ఓ భరద్వాజఋష్యుత్తమా! గౌరి
వికసితానన యౌచు బ్రేమ పొంగార
వెలి గ్రక్కె జిఱునవ్వువెన్నెలకాంతి.
ఆ వృషకేతనుం డగు సాంబశివుడు
తత్కాలహరియవతారకారణము
ప్రవచింపసాగె నీపగిది మునీంద్ర!
కలిమలహారణదక్షంబైన యట్టి
మంగళకర మతిమంజులం బైన

శ్రీరామకథను వచింతును వినుము
సావధానుండవై సంయమివర్య !

## శ్రీస్వాయంభువమనురాజర్షిచరిత్రము

మహిని స్వాయంభువమనుచక్రవర్తి
యతని సతీమణి యగు శతరూప
ప్రజలయం దెల్లను ప్రథమదంపతులు
నఖిలసృష్టిని వార లసమాను లెన్న
దద్దంపతుల మహాధర్మశీలంబు
లహా ! యమోఘంబు లత్యంతదివ్యములు
వారల నైతికభవ్యలక్ష్యముల
గీర్తించు నెప్పటికిని వేదచయము
శ్రీమనుచక్రవర్తికి బ్రియపుత్రు
డుత్తానపాదమహోర్వీతలేశు
డాతని పుత్రుడే హరిభక్తుడైన
ధ్రువకుమారుడు మహాద్భుతచరిత్రుండు.
ఆ మనుప్రథమద్వితీయాత్మసంభూతు
డల ప్రియవ్రతనాము డా మహితాత్ము
వేదపురాణముల్ వినుతించుచుండు
నా మనువున కొక్క యాత్మజ కలదు
దేవహూతి యనంగ దివ్యనామమున
నామె కర్దమముని కర్ధాంగి యయ్యె

నా సతీమణి గర్భమందు ధరించె
నఖిలసమర్థుండు, నాదిదేవుండు,
ఘనకృపాళుం డగు కపిలు, మహాత్ము
నా దీనవత్సలు డాభగవంతు
డగు కపిలుండు సాంఖ్యము బ్రకటించె
దత్త్వవిచారవై దగ్ధ్యంబు వెలుగ.
ఆ మనుభూపతి యఖిలవిధాల
సర్వేశ్వరాజ్ఞానుసారము, ధరణి
బరిపాలనము సేసె బహుకాలమనఘ !
"నరు దశలందున నాల్గవదైన
ముదుసలితనమును బొందియున్నాడ
నింకను గృహమునందే పాదుకొంటి
విషయవిరాగంబు, వీక్షింప నాకు
నమరలే దిప్పటి కైన జిత్తమున."
ననుచు విచారించె నాత్మలో మనువు.
ఈశ్వరభక్తివిహీనమై ధరణి
దన జీవితంబు వృథా యయ్యె ననుచు
నా మహారాజు మహాకులుం డయ్యె
నాత్మపుత్రునకు రాజ్యంబు నొసంగి
భార్యాసమేతుడై పార్థివోత్తముడు
వనమున కేగెను వైరాగ్య మొప్ప
నఖిలతీర్థంబుల నగ్రగణ్యంబు,

నమితపుణ్యము, నైమిశారణ్య మెన్న
సాధకజనులకు సంసిద్ధిదంబు.
ఘనమునీశ్వరసిద్ధగణము లచ్చటను
వసియించు చుండును పాయక యెప్పు
డా కారణమున మహారాజు మనువు
నైమిశారణ్యమునకు బయనించె.
ఆ పుణ్యదంపతు లతిధీరులగుచు,
భూరిభక్తిజ్ఞానములు రూపుగన్న
గతి నేగుచుండిరి గహనమార్గముల
జని చని వార లాచంచంబుగాను
దివ్యమౌ గోమతీతీరంబు జేరి
తన్నదీనిర్మలోదకముల లోన
స్నానంబు సేసిరి సంతోషపడుచు,
సుజ్ఞాను లగు మునీశులు, సిద్ధజనులు,
రాజర్షి ధర్మధురంధరుం డనుచు
జూడ వచ్చిరి మనుక్షోణీంద్రమణిని.
ఆ దంపతులను మహర్షిగణంబు
లచ్చటచ్చట గల యఖిలతీర్థముల
సుందరస్థలముల జూపించుకొఱకు
దోడ్కొని చనిరి యెంతో యాదరమున.
శుష్కించె వారల సుందరాంగములు,
వారు ధరించియు వల్కలంబులను

మునిసంఘమున నిత్యమును చేరుకొనియు
వివిధపురాణముల్ వినిరి మునీంద్ర!
తదుపరి వారలు దత్కాననమున
వాసుదేవుని పాదపంకజంబులను
సంధించి హృదయాంబుజంబున భక్తి
మతి ద్వాదశాక్షరిమంత్రరాజమును
జపము సేసిరి సునిశ్చలనిష్ఠతోడ.
కందమూలముల భక్షణ చేసికొనుచు
నా సచ్చిదానందమగు పరబ్రహ్మ
మును భక్తితో ధ్యానమును జేసి రనఘ!
తదుపరి వారలు తత్కందమూల
ఫలముల సైతము వదలి యా పిదప
నహ! కేవలాంబుపానాధారులగుచు
శ్రీహరిప్రీతికై చేసిరి తపము.
"అగుణుం, డఖండు, డనంతుం, డనాది
యై యెవ్వ డెప్పుడు నెసగుచు నుండు
బరమార్థవాదు లెవ్వాని ధ్యానింత్రు
'నేఽతినేఽతి' యటంచు నిగమగణంబు
లెవ్వాని మహిమంబు లెపుడు గీర్తించు
నెవడు నిజానందు, డెవ్వండు తనరు
నిరుపాధికుండును, నిరుపము డగుచు
దగ నిజైకాంశమాత్రంబున నెవ్వ

డగణితవిధివిష్ణుహరుల సృజించు
నా పరబ్రహ్మంబు నరయు శేనాడు ? ”
అనుచు వారలు డెంద మందున నిత్య
మభిలషింపగసాగి రతితీవ్రముగను.
అట్టి పరబ్రహ్మ మాశ్రితభక్త
పరతంత్రు డౌటచే వారల కొఱకు
లీలార్థ తనువు దాల్చియును గ్రీడించు
నను వేదవాక్యంబు లగునేని నిజము
స్వీయ మౌ అభిలాష సిద్ధింపగలదు.
షట్సహస్రాబ్దముల్ జలముల న్గొనియు,
సప్తసహస్రవర్షంబులు వాయు-
భక్షణ జేసిరి వారిద్ద రనఘ !
దశసహస్రాబ్దముల్ తద్వాయువేని
గైకొనకే యొంటికాలిపై నిలచి
సలిపిరి వారు ప్రచండ తపంబు.
ఆ యపారతపంబు నరసి విరించి
హరిహరుల్ పలుసారు లట కేగుదెంచి
“వరము కోరు మటంచు” పలు తెఱంగులను
భ్రమపెట్టజూచి రా రాజర్షి మణిని
గాని యా దంపతుల్ కడు ధీరులగుచు
జలియింపకే తపశ్చర్యలోనుండి
రస్థిమాత్రశరీరులైనను వారి

హృదిలోన జింత యొకింతయు లేదు.
సర్వజ్ఞు డైన యా సర్వేశ్వరుండు
"తాపసు లైన తద్రాజదంపతులు
నిజపదదాసులు నిజముగా జూడ
నహా! యనన్యశరణ్యు" లనియు గ్రహించె
నాకసమందుండి యా సమయమున
బరమగంభీరకృపాయుతవాణి
"కోరుమా వరమును, కోరుమా వరము"
నని విన వచ్చె నత్యద్భుతలీల.
మృతుల కేనియు బునర్జీవం బొసంగు
నట్టుల మధురమై ఆ వాణియుండె.
శ్రవణరంధ్రముల నా శబ్దంబు సొచ్చి
వారల హృదయగర్భంబున జేరె
దక్షణంబున వారి తనువులు వెలిగె
దతహృష్టపుష్టసుందరములు నగుచు
నిప్పుడే వచ్చిరా యిలువీడి యనగ.
శ్రవణంబులకు సుధాసమ మైన యట్టి
యా దివ్యవాక్యంబు లాలించినంత
నా రాజమిథునపుణ్యాంగంబు లెల్ల
బులకప్రఫుల్లితంబులుగా వెలింగె.
మనువు సాష్టాంగనమస్కృతుల్ సలిపి
భక్తిసముద్రిక్తభావుడై యిట్లు

బ్రార్థించె నోభరద్వాజమునీంద్ర !
"వినుము నాప్రార్థన విశ్వాధినాథ !
ఓ భక్తసురతరూ ! ఓ నిజపాద-
సేవకసురధేను ! శ్రీవిధివిష్ణు-
భవవందితామలపదపద్మరేణు !
సకలచరాచరేశ్వర ! సర్వసుఖద !
ప్రణతార్తపాల ! సేవాకార్యసులభ !
ఓ యనాథశరణ్య ! ఓ దేవదేవ !
ఈశ్వరా ! మాయెడ గృప గలదేని
ఈ వరం బొసగుమా యిపుడు సర్వేశ !
ఏ రూప మా శివు హృది వెలుగొందు,
నెద్దాని మౌనులు నీక్షించుచుందు
రే దివ్యమగు రూప మెపుడు 'భుశుండి'
మానససత్సరోమధ్యము నందు
పరమహంసగను సంభాసించు చుండు.
వినుతించు దేనిని వేదచయంబు
గుణయుతంబుగను, నిర్గుణముగా నిరత
మా దివ్యరూపు మా యక్షులకిపుడు
కనుపింప జేయుము కరుణవహించి,
ప్రణతార్తిమోచనా ! పాహి ! మాంపాహి !"
నృపదంపతులు పల్క మృదులవినీత
భక్తిరసప్లుతభవ్యవాక్యములు

భగవంతునకు గూర్చె బరమప్రియంబు.
పరమకృపానిధి భక్తవత్సలుడు
వాసుదేవుడు భగవంతు డీశ్వరుడు
వారి కట్టెదుటను బ్రత్యక్షమయ్యె
నీలసరోరుహనీలమాణిక్య
నీలనీరదసాంద్రనీలదేహుండు,
స్వీయసౌందర్యలజ్జితకోటికోటి-
బహువిధాలంకారపంచబాణుండు,
ఘనశరత్కాలరాకాచంద్రబింబ-
సమమహాసౌందర్యసదనాననుండు,
చారుకపోలలసచ్చుబుకుండు,
ప్రథితశంఖోపమరమణీయకంఠు
డరుణాధరుండు, మహాకమనీయ-
రదనసునాసికారాజమానుండు
నమలేందుకిరణప్రహాసభాసురుడు,
నిర్మలనవఫుల్లనీరజాక్షుండు,
సకలమనోహరచారువీక్షణుడు,
విదితమన్మథచాపభృకుటీతటుండు,
లావణ్యతిలకలలాటభాగుండు,
మకరకుండలభాసమానకర్ణుండు,
శృంగారమహితకిరీటశీర్షుండు,
కోమలాళిసమాజకుటిలకుంతలుడు,

శ్రీవత్సకౌస్తుభ, శృంగారరుచిర
వనమాలికాదీప్త వక్షఃస్థలుండు,
మణిహారభూషణమండితగ్రీవు
డతిరమ్య పరిపుష్టహరికంధరుండు,
సుందరభవ్యయజ్ఞోపవీతుండు,
భద్రేభవరతుండబాహుదండుండు,
కంకణకేయూరకలితభుజుండు,
కటితటశోభితఘననిషంగుండు,
దారుణబాణకోదండహస్తుండు,
విజితవిద్యుల్లతావిభవప్రకాశ
విమలమనోహరపీతాంబరుండు,
నుజ్జ్వలరేఖాత్రయోదరస్థలుడు,
వరయమునాజలావర్తసౌందర్య
హరమనోహరనాభు డసమతేజుండు,
మునిచిత్తమధుపసమ్మోహనాకథన
పావనరమణీయపాదాంబుజుండు,
రామచంద్రుడు శౌరి ప్రత్యక్షమయ్యె.
వరదుడౌ రాముని వామభాగమున
భర్త్రనుకూలశోభావారిరాశి,
యా జగన్మూలమౌ యా యాదిశక్తి
సీతామహాదేవి చెలువొందుచుండె.

రాముని వామపార్శ్వంబున వెలుగు
నా సీతయొక్క దివ్యాంశంబునుండి
యఖిలసద్గుణనిధు లౌచు వెలుంగు
బహుళలక్ష్మిశివాభారతీసాధ్వు
లవతరించుచు నుందు రగణితంబుగను
లలితమౌ భృకుటీవిలాసమాత్రమున
జగతీత్రయంబును జన్మింప జేయు
సౌందర్యరసమహాసాగరంబైన
శ్రీహరిమంగళాకృతి, శతరూప-
మనుమహారాజులు మహితసంప్రీతి
గనుచెప్ప వాల్పక కనసాగి రపుడు.
ఆ యనుపమరూప మమితాదరమున
నెంత జూచినను సంతృప్తివారలకు
గలుగక పోయె హృత్కంజంబులందు
నానందపారవశ్యంబున వారు
తనువుల మఱచియు ధాత్రిపై వ్రాలి
సాష్టాంగపడి హరిచరణాబ్జములను
గట్టిగా బట్టిరి కరకమలముల
నా దయావనధి శ్రీహరి హృషీకేశు
డంతట వారి శీర్షాగ్రభాగముల
దన కరాంబుజమున దాకి వత్సలత
వారల నంత లేవగనెత్తె నోహో!

అంత నా కరుణాబ్ధి యనియె నీ రీతి :
"మీ తపోనిష్ఠకు మెచ్చితి నేను
నా మహోదానగుణంబు గ్రహించి
యడుగుడు మీ కిష్టమైన వరంబు."
ప్రభువాక్కులను విని పార్థివోత్తముడు,
హృదయాంతరంబున ధృతిగూర్చికొనియు
బాణిపల్లవముల భక్తి జోడించి
మృదువచనంబుల నీ రీతి బలికె :
"నాథ ! నీ శుభపాదనలినముల్ గంటి,
నస్మదభీష్టంబు లన్ని ఫలించె
నైనను నొక వాంఛ యాత్మలోదనరు
నది సుగమంబును, నగమము నాథ !
అందుకే వచియింప ననుమాన పడెద
నది ప్రసాదింప నీ కతిసుగమంబు,
కాని యీ యల్పున కది యగమంబు.
పరమదరిద్రు డే పగిదిగా దాను
కల్పవృక్షంబును గాంచియు, దాని
ఘనశక్తినెఱుగని కారణంబుననె
యమితధనంబును నడుగ శంకించు
నా రీతి నా హృదయంబు శంకించు
నఖిలాంతరాత్మల యందున్న నీకు
నా వాంఛ తెలియదా నాథా ! ముకుంద !

దేవ! నా వాంఛను దీర్పఁబ్రార్థింతు
నన విని హరి యిట్టు లనియె "ఓరాజ!
సంశయంబును వీడి స్వాంతంబు లోన
నడుగుము నీ యిష్ట మైన వరంబు.
నీ కివ్వరానిది నృప! లేదు, లేదు."
అన విని మను విట్టు లనె హరితోడ:
"దాతృశిరోమణీ! త్రాతా! కృపాబ్ధి!
నాథ! నా కోర్కె విన్నప మొనరింతు:
నినుబోలు పుత్రుని నేను వాంఛింతు.
నే నేది దాచెద నీ యొద్ద నాథ!"
అతని ప్రీతిని జూచి, యతని యమూల్య
వాక్యముల్ విని, కృపావనధి యిట్లనియె
"అట్టులే యగుగాక! అవనీంద్రమౌళి
నాతో సమానుండు నా కెట దొరకు?
నీకు పుత్రుండను నేనె కాగలను."
అని పల్కెనంత నారాయణప్రభువు.
ముకుళితహస్త యై ముందు నిల్చున్న
శతరూప నరసి యీ చందంబు బలికె:
"దేవి! ఓశతరూప! ధృతగుణరాశి!
అడుగుము నీ యిష్టమైన వరంబు."
ననవిని శతరూప యనియె నీ పగిది:
"ఓ కృపాసాగరా! ఓ జగన్నాథ!

ఇప్పుడు చతురుడౌ నృపతి యే వరము
కోరెనో, అది నాకు గూడ బ్రియంబు
ప్రభు ! అది వాంఛింప రాని వరంబె
ఐనను భక్తహితా ! నీవు దాని
సదయుండవౌచు బ్రసాదించినావు
సారసభవముఖ్యజనకుండ వీవ.

అఖిలజగంబుల నధివసియించు
బ్రహ్మంబ వల జగత్స్వామివి నీవె
యనియు నే సంశయం బందుచునుంటి
గాని నీ వచనముల్ కల్లగా వెప్పు
డాశ్రితభక్తగమ్యస్థాన ! నాథ !
భక్తానుభూతదివ్యానందరూప !
"ఆ నిత్యసుఖమును, ఆ మహాగతిని
ఆ మహాభక్తిని, ఆ భవదీయ
పాదాంబుజద్వయపరమానురక్తి
నా వివేకవిభూతి, నా మహాస్థితిని
దేవదేవా ! బ్రసాదింపవే నాకు.
శ్రీశతరూప వచించిన యట్టి
తన్మృదుగూఢసుందరవరవాక్కు-
లాలించి యా కరుణాబ్ధి కేశవుడు
మృదువచనంబుల నీ రీతి బలికె:
"నీవు నీ మనములో నెంచిన దెల్ల

సే నొసంగితి జననీ! శతరూప!
ఈ వింక మది సంశయింపగా వలదు.
అమ్మ! మదీయదివ్యానుగ్రహమున
నీ యలౌకికమైన నిర్మలజ్ఞాన
మెప్పుడు వెలుగు, లయింపక మాత!
అంతట మనువు నారాయణాంఘ్రులకు
వందనం బొనరించి పలికె నీ రీతి :
"ఇంకొక్క వినతి, లోకేశ! నేజేతు
నొకనికి దనతనయుని యందు వోలె
నీ పదరతి నాకు నిలుచునుగాక.
ఎవడైన నాథ! లోకేశ్వరా! నన్ను,
గడు మూఢుడని పిల్చుగాక! చింతిలను.
మణి లేక సర్పంబు మనని చందమున
జేప నీటిని వీడి జీవింపనట్లు
నా జీవితంబును నాథ! నీ పైన
నాధారపడుగాక! యనవరతంబు."
అని వరం బడిగియు నా మనురాజు
పట్టుకొనెన్ ప్రభుపాదపద్మముల
నంత గృపానిధి హరి యిట్టు లనియె :
"అట్టులే యగుగాక! అవనీశ! యిప్పు
డస్మదాజ్ఞను శిరమందు ధరించి
యింద్రలోకంబున కేగియు నిలుడు.

ఆ యింద్రలోకమునందున నీవ
యమితసుఖంబుల ననుభవించియును
కొంతకాలమునకు గోసలేశునిగ
జన్మింపగలిగె, వో జనక ! నే నపుడు
నీకు బుత్రునిగ జన్మింపగా గలను.

జగతి మదిచ్ఛానుసారము నేను
నరరూపమును దాల్చి. నరనాథ ! నీదు
గృహ మందు నే నుదయింపగా నుంటి
నఖిలాంశయుతముగా, నవతరించియును
భక్తసుఖప్రద భవ్యలీలలను
నిర్వహించెదను క్షోణీరంగమందు
నా మహాలీలల సాదరబుద్ధి
వినిన ధన్యులు భవాబ్ధిని దాటగలరు
మమతామదత్యక్తమానసులగుచు.

ఈ విశ్వ మెల్ల సృజించు నాయొక్క
యాదిశక్తియె సుమా, అనఘ ! యీ మాయ
యీమె నైతము జనియించు భూస్థలిని
నీ వాంఛ నీ రీతి నెఱవేర్ప జూతు
నీ నా ప్రతిజ్ఞ భూమీశవతంస !
సత్యము ! సత్యము ! సత్యమటంచు
బలికియు మఱిమఱి, పరమకృపాబ్ధి
శ్రీభగవాను డదృశ్యుడై పోయె.

భక్తవత్సలు డైన పరమేశుదివ్య
మంగళాకారంబు మదిలోన నిలిపి,
యా దంపతులు నైమిశాశ్రమం బందు
మఱికొంతకాలము మనియు శాంతముగ,
నవసానకాలంబె యరుదెంచినంత
గడు ననాయాసముగా వారు స్వీయ
తనువుల నట బరిత్యాగంబు జేసి
యమరావతిని జేరి రట వసియింప.
ఈ మహనీయ పుణ్యేతిహాసంబు
వృషకేతనుడు వచియించె బార్వతికి.
రామావతారకారణము నింకొకటి
ఓ భరద్వాజఋష్యుత్తమా ! వినుము.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### పంచమ విశ్రామము

---

చంచలభీషణకేసర
సంచయసంచలితదైత్యచక్రా! చక్రో
దంచిత శంఖ గదాధర!
పంచాననసాద! మట్టపల్లి నృసింహా!

## ప్రతాపభానుచరిత్రము

పార్వతీదేవితో బరమేశ్వరుండు
ప్రవచించి నట్టి పురాణపునీత
కమనీయచరిత మాకర్ణింపు మనఘ!
ఓ భరద్వాజఋష్యుత్తమా! యిపుడు
విశ్వవిఖ్యాత మై వెలుగొంది నట్టి
"కైకయ" దేశంబు కలదు పూర్వమున.
సత్యకేతుం డను క్ష్మానాయకుండు
బాగుగా నా భూమి బాలించు చుండె
ధర్మధురంధరత్వంబును గలిగి
నీతినిధానుండు, నిస్తులశీల
శౌర్యతేజోబలశాలియై మించె.

సర్వగుణాకరుల్ సమరాతిధీరు
లైన యిర్వురు పుత్రు లతనికి గలరు.
అందు జ్యేష్ఠుడు ప్రతాపార్కాభిధుండు,
అరిమర్దనాహ్వయుం డల చిన్నవాడు.
నిస్తులభుజబలనిధియుసంగ్రామ
సుస్థిరుండా రాజసుతుడు మునీంద్ర!

ఆ యన్నదమ్ము లత్యైకమత్యమున
నిర్దుష్ట మగు ప్రీతి నెగడుచుండెదరు.
తన జ్యేష్ఠసుతుడౌ ప్రతాపభానునకు
పట్టంబుగట్టియు బార్థివోత్తముడు
హరిని గొల్వగ నరణ్యంబున కరిగె.

తా గద్దె నెక్క బ్రతాపభానుండు
ఈ వార్త దేశ మం దెల్ల మూలలను
ప్రకటింపగా బడె ప్రథితపద్ధతిని.
ఆతడు వేదధర్మానుసారముగ
బాలించె బ్రజలను పరమానురక్తి-
నాతని పుణ్యరాజ్యంబునం దప్పు
డఘలేశమేనియు నగపడ దయ్యె.

అల ధర్మరుచినాము డాతని మంత్రి,
యిం కొక శుక్రుడే, పృథుబుద్ధిశాలి,
రాజభక్తిని గల్గి రాజిల్లుచుండు.
మహితవివేకి యా మంత్రితో గూడి,

తతబలవీరుడౌ తమ్మునితోడ
ధాత్రీశు డైన ప్రతాపధానుండు
తను వొంది నట్టి ప్రరాపమేయనగ
బుంజీభవించిన భూరిసంగ్రామ
ధీరత్వ మనగ బ్రదీపించె మిగుల
బహుళాతిచతురంగబలయుతుం డాత
డాతని సేనలో నగణనీయముగ
యుద్ధనిర్భయు లగు యోధులు గలరు.
తన సేన గని ప్రముదం బొందె రాజు
జృంభించె విజయభేరీనినాదములు
నఖిలభూదిగ్విజయం బొనరింప
జండసైన్యంబుల సమకూర్చి, వెడలె
నొక మంచి రోజున నుర్వీధవుండు
రణభేరు లలమహోగ్రంబుగా మ్రోయ.
ఇట నట జరిగె ననేకాహవములు,
నఖిలభూపతులు పాదాక్రాంతులైరి
ఘనప్రతాపాఢ్యు విక్రమమున కోడి.
నిజభుజబలమున నృపమౌళిచంద్రు
డేడుద్వీపముల జయించి యా రాజు
క్ష్మాధీశగణముచే గప్పముల్ గొనియె.
సర్వవసుంధరాచక్రంబు నేలె
ఘనుడౌ ప్రతాపు డేకచ్ఛత్రపతిగ.

ఇట్లా నృపాలుండు నెల్లభూతలము
నిజభుజశక్తిచే నిర్జించి చేరె
దన రాజధాని నుద్యద్వైభవమున
నా చతుర్విధపురుషార్థార్జనంబు
సమయోచితంబుగా సలిపె నా నృపతి.

ధర్మప్రభావప్రతాపభానుండు
పరిపాలనము సేయ వసుధాస్థలంబు
కామధేనువుగా బ్రకాశింప సాగె
సర్వదుఃఖముల విసర్జించి ప్రజలు
సుఖియించి, రెల్లరు సురుచిర, ధర్మ
శీలము ల్గలిగి భాసించి రెంతయును.
ఆ ధర్మరుచిమంత్రి హరిపాదరతుడు
నవనీంద్రు హిత మెంచి యా యమాత్యుండు
నృపనీతి బోధించు నిత్యంబు ప్రీతి.
గురుసురసజ్జనక్షోణీసురులను
పితృదేవతలను సేవించు సతంబు
తద్రాజమౌళిప్రతాపభానుండు.
వేదశాస్త్రంబుల విధియింప బడిన
విభు ధర్మముల నెల్ల ప్రీతియు, ముదము
నిండగా నా రాజు నెరవేర్చె ననఘ!
ప్రతిదినం బాతడు బహుదానపటలి
నొనరించు చుండు మహోన్నతరీతి,

వేదశాస్త్రపురాణబృందముల్ వినును.
అఖిలతీర్థంబుల నా చక్రవర్తి
ప్రథితవాపీకూపవరతటాకముల
బ్రసవాటికలసు రమ్యోపవనుల,
బ్రాహ్మణగృహముల బహుచిత్రశిల్ప
దేవాలయముల బ్రతిష్ఠించె ధరణి.
వేదశాస్త్రపురాణబృందంబులందు
పృథ్వీతలేశు డేయే యజ్ఞములను
చేయగా వలెనని చెప్పగా బడియె
నా యజ్ఞములనన్ని యా నృపాలుండు
ప్రతిదాని వేయిపర్యాయముల్ జేసె
నైన, నాతనిలో, ఫలాపేక్ష లేదు.
పరమసుజ్ఞానియు బ్రథితవివేకి
తద్రాజమౌళి ప్రతాపభానుండు
తనుమనోవాక్కుల దద్విజనృపతి
యే ధర్మకృతి నొనరించిన నాని
యా వాసుదేవున కర్పించు చుండు.
ఒక దినంబందు నా యుర్వీధవుండు
మృగయార్థ పరివారబృందంబుతోడ
నశ్వరాజంబుపై నాసీను డగుచు
ఘోరవింధ్యారణ్యభూములం జొచ్చి
బహుమృగగణముల బరిమార్చె నతడు.

ఆ యరణ్యమున వేటాడు చుండగను
గాంచెను నృపు డొక ఘనవరాహంబు.
రాజబింబమ్మును గ్రసియించుచున్న
రాహువు డాగె నరణ్యమం దనగ
గానగా వచ్చె నా ఘనవరాహంబు.
పోల్చ జంద్రుడు రాహుముఖమునకన్న
గడు పెద్దయైనను క్రౌర్యంబు చేత
వదలదు రాహువు వడనష్టశశిని.
అతుల బోల్చగ వచ్చు నా వరాహోగ్ర
చండకరాళదంష్ట్రలనోయగమును.
అద్దాని ఘనతను వతిబలిష్ఠంబు
హయసురింఖాధ్వని నది విని నంత
ఘోరతరంబుగా ఘుర్ఘురించుచును
రెండు చెవుల్ నిక్కరించి వీక్షించె
జకితనేత్రంబుల; క్ష్మాపతియంత
నీలాద్రిశిఖరసన్నిభఘూరికిటిని
కనియు నశ్వమును వేగంబుగా దోలె
"ఎటకు బోయెదవు నీ వింక చావకయె,
ఆగు మిదే కూల్తు" నని దానివైపు.
అధికాశ్వరావము నాలించి నంత
వాయువేగమున నా పంది పర్వెత్త
వెంటనే నరపతి వింట నారాచ

మెక్కెడి నంతట నీక్షించి ఘోణి
చెట్ల చాటున నక్కె జిత్రంబుదోప.
గుఱి జూచి ప్రతిసారి క్షోణీధవుండు
విడిచెను బాణముల్ విక్రమం బొప్ప,
గాని వరాహము, కడు కౌశలమున
దద్బాణముల నెల్ల దప్పించు కొనియె
నొక సారి దాగుచు నొకసారి యురికి,
చిక్కె నట్లుగ నిల్చి, చిక్కక పాఱి
పఱుగిడుచుండె నా వనవరాహంబు.

వెన్నంటె దానిని విభుడు రోషమున
నా రీతి బఱుగెత్తి యా వరాహంబు
తురగగజాదులు దూరరా నట్టి
యతిసాంద్రమౌ నొక యడవిలో జొచ్చె
నడవిలో, నేకాకి యైనను గాని
పలు పరిశ్రమలను బడసిన గాని
వేటలో దమకంబు విడదయ్యె రాజు

ఆ రాజు చూపెడు నతిపట్టుదలను
కనుగొని యా పంది కడు వేగ నొక్క
యతిగభీరాద్రిగుహాస్థితి జొచ్చె
దత్కందరంబున దా ప్రవేశింప
దారి లేకుండుట ధారుణీధవుడు
చెందె నిరాశను చిత్తంబు లోన

నదిగాక రాజు మహారణ్య మందు
పాపము, సరి యైన పథమును దప్పె.
రాజును గుఱ్ఱ మరణ్యంబు లోన
గడు డస్సి పోయి, యాకలి బాధచేత
దాహముచే గడు దల్లడంబంది
యేటైన జెఱువైన నెందేని గనగ
వెదకియు వెదకియు వేసారి రకట!
ఆ వని దిరుగుచు నవనీశు డటుల
నరసె నొకానొక యాశ్రమస్థలము.
ఆ యాశ్రమంబున నధివసియించె
గపటర్షివేషి యా క్ష్మాపాలు డొకడు
నాతని రాజ్యంబు నంతయు మున్ను
ధాత్రీంద్రు డైన ప్రతాపభానుండు
నాక్రమించుటచేత నా రాజుపోరి
తన సేనలను పరిత్యాగంబు జేసి
పాఱిపోయెను భరద్వాజమునీంద్ర!
ధాత్రీంద్రు డైన ప్రతాపభానునకు
నది మంచి కాలంబటంచును, తనకు
జెడు కాల మనియును చిత్తమం దెఱిగి
యతిదుఃఖ మొందియు నాత్మలో నతడు
స్వీయగృహంబును జేర లజ్జించె
నభిమానవశు డౌచు నా నృపాలుండు

తద్వీరు డైన ప్రతాపార్కు తోడ
సంధి నొనర్పగా జాలక పోయె
తన కోప మెల్లను తన హృది యందె
యణచియు, నా భూపు డా కాన లోన
దాపసిరూపంబు ధరియించు కొనియు
గాపురం బుండె బికారి చందమున.

ఆతని చెంతకే ఆ ప్రతాపుండు
దారి తప్పియు జేరె దత్కాననమున
ఆ యేగు దెంచిన యా గంతకుండు
తన వైరి యైన ప్రతాపభానుండె-
అని వెంటనే చిత్తమందు గ్రహించె
గపటతాపసియైన క్ష్మాపాలకుండు
దప్పిచే డస్సి ప్రతాపభానుండు
పరిపంథినృపు, గుర్తు పట్టక పోయె,
నా మంచి వేషంబు నరసి ప్రతాపు
డాత డెవ్వండొ మహాముని యనుచు
దలచి గుఱ్ఱము డిగ్గి దండంబు పెట్టె
నతిచతురుం డగు నా చక్రవర్తి
తన పేరు మాత్రము దా దెల్పలేదు.

భూపతి దాహంబు పొందుట గాంచి
కపటర్షి చూపెను కాసార మొకటి
దానిలో రాజును తత్తురంగంబు

సంతోషపడుచును స్నానంబు సలిపి
త్రాగిరి కడుపార దజ్జలంబులను.
శ్రమయెల్ల దీర నా సార్వభౌమునకు
బ్రాణముల్ స్వస్థతఁ బడియె నా పిదప
నా ముని యానృపు నాశ్రమంబునకు
మరల దోడ్కొని పోయి మాన్యతతోడ
నది యస్తమయకాల మౌటను గాంచి
యాసనం బొసగి యిట్లనె మృదులముగ :
"ఎవరు నీవు కుమార ? ఎంతయో నీవు
యవ్వనుండవు సుందరాకారయుతుడ
వైనను ప్రాణభయంబును వీడి
యీ కానయందున నేకాకివగుచు
సంచరించుట దేల ? సచివ ! నీ యందు
ఘనసార్వభౌమలక్షణముల గాంచ
గరిగె నా చిత్తము కడుదయచేత."
"తాపసవర్య ! ప్రతాపభానుండు
అనురాజు కలడు, నేనా నృపాలునకు
మంత్రిని, వేటలో మార్గంబు దప్పి
నా మహాదృష్టమున న్మహాభాగ !
చనుదెంచితిని భవత్సన్నిధి కేను.
మీ దర్శనము నాకు మిగులదుర్లభము
భవదీయదర్శనభాగ్యంబుచేత

నేదో శుభము లభియింపగానుండె
నని తలంచుచునుంటి నాత్మ, మహాత్మ !"
అని రాజు పలుక ని ట్లనియె నా మౌని :
"చీకటిపడినది, చేరగా నీదు
పట్టణం బుండె డెబ్బది యోజనముల
దవ్వందుచేత వత్సా ! ఏగ లేవు-
"విను మిది ఘోరగంభీరనిశీథి
దట్టమైనది కాన, దారియా లేదు.
ఈ రాత్రి విశ్రాంతి నిట బొందితేవు
ప్రొద్దుననే నీవు పోవచ్చు సచివ ! "
భవితవ్య మేదియో, పరగ నద్దాని
కనువౌ సహాయంబు లరుదెంచు ముందె.
విధి వచ్చి కలియు॰ నా విధముగా దేని
వానినే చేర్చు నా భవితవ్యమునకు.
"సరియె మంచిది మునీశా !" అని రాజు
ముని యాజ్ఞ తన శిరమున ధరియించి,
గుహ ముందు చెట్టుకు గుఱ్ఱంబు గట్టి,
వచ్చి కూర్చుండె దాపసిమ్రోల నంత
నృపుడు కపటర్షి ననేకరీతులను
బ్రస్తుతి సల్పి మద్భాగ్యం బటంచు
నతని పాదంబుల కభివందనంబు
చేసి యీ రీతి వచించె నత్యంత

మృదులప్రియోక్తులు మెఱయగా నంత :
"తండ్రిగా నిన్ను నాథా ! యెంచి నేను
తమతోడ భాషింప ధైర్యమూనితిని
నీ కుమారునిగను నీ సేవకునిగ
న న్నెంచి యో మునినాయకా ! నాకు,
భవదీయనామంబు ప్రభు ! దయతోడ
వివరింపగా నిన్ను వేడుచున్నాడ."
నృపతి యా మునిని గ్రహింపలేకున్న
నాతడు మాత్రము స్వాత్మలో నృపుని
బాగుగా గుర్తించె బరమమునీంద్ర !
నృపతియో పరిశుద్ధహృదయుండు, మౌని
యన్ననో బహుకపటాత్ముండు, మఱియు
బ్రథమవిషయ మెన్న వైరియే యాత
డా పైన క్షత్రియుం డాతని యందు
రాజరక్తముగదా ప్రవహింపు చుంట,
అందుచే నెట్టైన నాతడు తనదు
కార్యంబు నెఱవేర్పగా నెంచె లోన
నల కుయుక్తిని బన్నియైనను సరియె.
రాజసౌఖ్యముల నరాతినృపుండు
తలచి చిత్తమున ఖేదంబును బొందె
నావము నందలి యగ్ని చందమున
నా శత్రునృపు హృందయాంతరాళమున

వడిగమండె నసూయ భగభగ మనుచు.
దత్ప్రీతాపార్క-భూధవు సరళోక్తు
లాలించి యతనిపై నాత్మలో గలుగు
వైరంబు తలపోసి, భావంబు, లోన
గడు సంతసించె నా కపట తపస్వి.

కపటకుయుక్తులు గలిగి గర్భమున
బైకి మెత్తగ నున్న వాక్యంబు లొప్ప
బలికె నా ముని యిట్లు పార్థివుతోడ :
"ఇల్లు వాకిలి ధనం బేమియులేదు
కావున, నిపుడు, బికారి నా పేరు."

రాజిట్లులనె, "మహారాజ ! ఓ యనఘ !
నీ వంటి విజ్ఞాననిధు, లభిమాన
శూన్యు లెన్నండును చూపక వెలికి
దాచుచుందురు నిజతత్వమెల్లపుడు,
సర్వవిధంబుల సామర్థ్య మున్న.
గోచిపాత ధరించు కొందురువారు,
విబుధసంఘంబులు వేదజాలములు
నందుకే, ఆ పదమాకించనులను
శ్రీహరి మిక్కిలి ప్రేమించు నంచు
ఘోషింపుచున్నవి గొప్పగా ననఘ !
తలదాచ గొంపయు దమ్మిడీలేక
వెతలందుమీవంటి పేదలన్గనియె

సారసభవశివుల్ సైతము లోన
'ఓహో! వీరల సౌఖ్యమున్నదా మనసు?'-
అని సంశయప్రపూర్ణాత్ములౌచుందు
రెవ్వరైనను సరియే, మహాభాగ!
నీ పాదయుగళికి నే మ్రొక్కుచుంటి.
స్వామి, నాపై గృపాపరుడవు గమ్ము-
క్ష్మానాయకునిసహజప్రేమ జూచి
వాని విశేషవిశ్వాసంబునరసి,
యా ముని భూపాలు నఖిలవిధాల
గడు వశీభూతుని గావించు కొనియు,
నధికానురాగమే యగపడునటుల
బలికె నీ రీతిగా బార్థివుతోడ ;
"హృదయపూర్వకముగ నే జెప్పుచుంటి
వినుము మహీశ! యీ విపినగర్భమున
బహుకాలమందుండి వసియించుచుంటి.

ఇప్పటివరకిట కెవరురారైరి
యేనైన గనపడి యెఱుగ నెవ్వరికి
దప మను కానను దహియించునట్టి
యనలంబు లోకమాన్యత, మహారాజ!
మూర్ఖులే కా దలబుద్ధిమంతులును
వీక్షించి పైపై సువేషంబు లౌర
వంచింప బడెదరు భ్రాంతాత్ము లగుచు

బరమసుందరమైన బర్హినిగాంచు
డద్దాని పాటలో నమృతంబుజిలుకు
నైన బాములుదానియాహారమనుచు
బ్రవచింపుచున్నాడు బాగుగా దులసి''
కపటర్షి యీ రీతిగా బల్కసాగె :
''ఇందుకే నే నిట్టు లీ ప్రపంచమున
సలుపుచుంటిని రహస్యపుజీవనమ్ము
నీశుండుదప్ప నా కితరప్రయోజ
నంబేమి కలుగు నా నారాయణుండు
నా జగన్నాయకు డంతయు నెఱుగు
నే జెప్పకుండగనే ప్రియాసచివ !
ఈ ప్రపంచక్రీడ నేమి సిద్ధించు ?
సుమతివి నీ వతిశుచి వౌటచేత
నా కతిప్రియుడవైనావు చూడగనె
నీకును నాయందు నిర్మలప్రీతి
విశ్వాసమొదవెను ప్రియతమా ! వత్స !
నీకడ నేదైన నేదాచునెడల
బరమపాతిత్యమాపాదించునాడు.''
ఈరీతి దాపసి యెంతెంత దాను
వైరాగ్యమును గూర్చి ప్రవచింప సాగె
నంతంత రాజున కాత్మలో గలిగె
మునిపైన విశ్వాసముల్ మునిరాయ !

త్రికరణశుద్ధిధాత్రీపతి తనకు
వశుడయ్యె ననియు భావంబులో నెఱిగి
తద్భకధ్యానియౌ తపసి యిట్లనియె:
"ధరవీని పేరేకతనువు కుమార !"
అనవిని నరనాథు డాపయి బలికె
శిరము వంచియు నమస్కృతి జేసి మునికి:
"నీముఖ్యభృత్యుడ నే నని తెలిసి
దాని యర్థంబును దయతోడ నాకు
దెలుపగా మిగుల బ్రార్థించు చున్నాడ."
"సృష్ట్యాదిలో జనియించి యున్నాడ
నప్పటినుండియు నన్యదేహంబు
నే నెప్పుడును ధరియింపకుండుటను
నా కేకతనువను నామంబు గలిగె-
"వింతనొందకు మిది విని నీవు పుత్ర !
తపముచే సాధింప దగనిదేముండు ?
తపముచే జగతి విధాత సృష్టించు
దపముచే హరి జగత్త్రాణంబు సేయు,
నాతపంబుననె సంహారంబు సేయు
జగములనెల్లను సాంబశివుండు
తపముచే నరుడు పొందంగ రానట్టి
దేదియు లేదహో యీప్రపంచమున"
ఆమాటలను వినినంత భూవిభుడు

పరమానురాగసంభరితాత్ము డయ్యె
నా సమయంబున నా కపటర్షి
కడుపురాతనపుణ్యకథల వచించె
గర్మధర్మానేకఘనచరిత్రముల
విపులవైరాగ్యవివేకసంబంధ
విషయంబులను ముని వివరించి చెప్పె.
విలయసృష్టిస్థితివిషయంబు లైన
యమితవిచిత్రకథావళు లెన్నొ
యాపయి ముని చెప్పె నా నృపాలునకు
నీప్రసంగమ్ముల నెల్లను వినియు
భూపతి పూర్తిగా మునివలన్బడియు,
దన నిజనామంబు తపసితో దెలిపె
దదనంతరం బిట్లు దాపసి పలికె:
"ఈ వెవ్వరో నే గ్రహించితి మున్నె
హేరాజ! నాతోడనే యబద్ధంబు
పలికితివై నగోపంబు నే జెంద
నీ నీదు చర్యకు నే మెచ్చుచుంటి.
నృపసత్తమా! రాజనీతి యే మనగ
నన్నికాలంబుల యందున రాజు
తనపేరు దెలుపగా దగదితరులకు-
నీ దగు ఘనరాజనీతిచాతుర్య
మరసి నీపై బ్రీతి నందితినిపుడు"

"త్వన్నామ మధిప! ప్రతాపభానుండు
సత్యకేతునృపుండు జనకుండు నీకు.
గురుకటాక్షంబుచే క్షోణీతలేంద్ర!
యెల్ల విషయముల నెఱుగుదు లోన
గాని నాకది మంచికాదని యెఱిగి
బహిరంగపఱుపను భావంబు లోన
విదితమై యున్నట్టి విషయంబు లెల్ల
గన, నీదుసహజనిష్కపటగుణంబు,
ప్రీతిన్ప్రతీతిని, నృపనీతి గరిమ,
నీపైన గడుప్రేమ నే నొందినాడ
నందుకే నేను నీ వడిగినంతటనె
నా కథ చెప్పితి నరనాథ! యిపుడు.
నేను ప్రసన్నుండ నీ యెడ నైతి.
సంశయింపకుము రాజా! మనసార
నడుగుము నీ యిష్టమైనకోరికను."
అనవిని భూవిభుం డాహ్లాదపడుచు
నా ముని పాదంబులతిభక్తిబట్టి
వివిధవిధంబుల వినయంబు జూపి
యనియె నీ తెఱగు, కృపాబ్ధీ! మునీంద్ర!
భవదీయదర్శనభాగ్యమాత్రమున
వల చతుర్విధపురుషార్థముల్ నాకు
గరగతంబయ్యెను, గాని నా ప్రభుడ

వింతగా నాపయి గృపజల్లుచుంట
నన్యదుస్సాధ్యమై నట్టి వరంబు
ప్రార్థించి దుఃఖంబు పాయగా గలను.
"మచ్ఛరీరముజరామరణదుఃఖముల
బొందకుండునుగాక, పోర నన్నెవరు
గెలువకుందురుగాక కేవలం బేను
క్ష్మాతలం బెల్ల నేకచ్ఛత్రపతిగ
వందకల్పంబులు పాలింతుగాక!
శత్రుహీనుండనై శాంతింతుగాక!"
పలికె దాపసి యిట్లు పార్థివుతోడ:
"నట్టులే యగుగాక యవనీశ! కాని,
యొక కష్టమున్నది ఓ వత్స! వినుము.
నీ పాదముల ముందు నిజము మృత్యువును
మోకరిల్లును గాని భూపరిపాల!
బ్రాహ్మణజనముతో వచ్చును బాధ
బ్రాహ్మణుల్ ఘనతపోబలదీప్తు లెపుడు
వారల కోప మవార్యమేరికిని.
క్ష్మాసురుల్ నీ వశంకరు లైన యెడల,
నల బ్రహ్మ హరిమహేశాదులు గూడ
భవదీయవశు లౌచు వర్తింపగలరు.
బలమున లొంగరు బ్రాహ్మణు లెప్పు
డీ సత్యమును చేతు లెత్తియు నేను

వచియించెదను, ధరాపాలక ! వినుము.
విప్రశాపంబు దప్పించుకొం టేని
నిక నీవు నిజముగా మృత్యుంజయుడవె !"
ఈ మాటలను విని నృపుడు హర్షించి
పలికె నీ పగిదిదాపసిని వీక్షించి.
"ఓ నాథ ! నాకు మృత్యువు కల్గబోదు.
త్వత్కటాక్షమున గృపాధామ ! నాకు
సర్వదాకళ్యాణసంతతిగలుగు."
నన గపటర్షి "తథాస్తు"ని లోన
గుటిలత్వదృష్టితో క్షోణీశుతోడ
నీ రీతి బలికెను; "పృథ్వీశ ! వినుము,
వనములో నీవిటు పథము దప్పుటయు,
నీ తోడ నిచ్చట నే గలయుటయు,
నీవు చెప్పితివేని యెవరితోనైన
నా తప్పు నాది కాదనియెంచుకొనుమ
యింత నివ్వారించు టెందుల కనిన
నెవరితో నైన నీ వీవిషయంబు
చెప్పినచో గొప్పచేటు నీ కౌదవు
నీ ప్రసంగం బెప్పుడేని గానిమ్ము
మూడవచెవి యందు బోయిచేరినద,
ఏను సత్యమువచియించుచున్నాడ
నిక నీకు నాశనమే తటస్థించు

నో యుగ్రప్రతాపభానూ ! వినుమయ్య !
యీ రహస్యంబు నీ వెవరితో నైన
దెలిపినన్, లేకున్న ద్విజు డెవ్వడేని
శాపంబుబెట్టినం జచ్చెదవీవు,
హరిహరులేకమైయాగ్రహించినను
మఱియొక రీతిగా మరణింప వీవు."
అనవిని రాజిట్టు లనియె నంతటను
తపసిపాదముల హస్తంబుల బట్టి
"నిజమే, మహాప్రభూ ! నీ వన్నమాట.
విప్రుండు, గురువు, శపింప నెవ్వండు
రక్షింప గలుగును ప్రవచింపు మనఘ ?
బ్రహ్మ శపించినన్ వానిని గురువు
రక్షించుటకు సమర్థత గల్గియుండు
నింక నా గురువాగ్రహించిన యెడల
వానిని రక్షించు వారలు లేరు.
నీ యుపదేశమున్ నే దప్పునెడల
నేను నశింతు మునీంద్ర ! కానిమ్మ
అతిఘోరమైనట్టి యా విప్రశాప
భయ మొక్కటే నాదు భావంబుగలచె.
బ్రాహ్మణుల్ నా కెట్లు వశ్యులై యుందు ?
రిదికూడ దయతోడ నెఱిగింపు మనఘ !
దీనదయాపరా ! దేవ ! నీ కన్న

నాప్తులురేరు మహాత్మ ! మాంపాహి !"
అనవిని ముని యిట్టులనియె, "నృపాల !
వినుము లోకంబున వివిధయత్నములు
కలవవి యన్నియు గష్టసాధ్యమ్ము,
లదిగాక యవి సంశయాస్పదంబులగు
నొక సులభోపాయమున్నది, రాజ !
కాని యందును నొక కష్టంబుకలుగు
నస్మదధీనంబు నా యుక్తి ! భూప !
నీ పట్టణమునకు నేను వచ్చుటకు
నవకాశ ముండ దీ, యవనిలోనేను
పుట్టినదాదిగా బోలేదు లేదె
వారి గృహమున కే పట్టణమునకు
నేను రానైతినా, నీకు మువ్పొదవు
నందుచే నేను నా యాత్మలో నిపుడు
సందిగ్ధపడుచుంటి క్ష్మాపరిపాల !"
నృపు డది యాలించి యీరీతి బలికె
మృదువచనంబుల ఋషిని వీక్షించి
"ఒకనీతి కలదు ప్రభూ ! వేదములను—
ఘనులు, స్వల్పుల పైన గరుణ జూపెదరు.
పర్వతంబులు, శిరోభాగంబు లందు
దృణజాలములను వహించు సంతతము
వెసనగాధోదధి ఫేనంబు దాల్చు

దన తరంగోపరిస్థలము నం దెపుడు
ధరణి, ధూళికణాల దాల్చు వక్షమున-"
అని వచించియు భూపుడా కపటర్షి
పదములబట్టి యీ పగిదిగాబలికె:
"స్వామి! నాపై గటాక్షముజూపవయ్య!
దీనదయాపరదివ్యచిత్తుడవు,
సజ్జనుండవు గాన స్వామి! నాకొఱకు
నీక్లేశమును భరియింపగావలయు"
పూర్తిగా వశు డయ్యె భూమీశుడనుచు
గ్రహియించిలోన నా కపటప్రవీణు
డైన తపస్వి యి ట్లనివచియించె:
"సత్యమాడుచునుంటి క్ష్మానాథ! వినుము
నాకు దుస్సాధ్య మై నదిలేదు జగతి.
వాఙ్మనఃక్రియ లెల్ల బరికింప నీవు
మద్భక్తుడవు గాన మానవనాథ!
నీ వాంఛ నెరవేర్తు నిక్కంబుగాను.
యోగ, తపోమంత్రయుక్తిశక్తులను
గుప్తంబుగా నుంచు కొన్ననే గాని
యవి పని చేయవో, యవనీశచంద్ర!
స్వయముగా నేను నీసౌధంబు నందు
సర్వభోజ్యముల రుచ్యముగ వండెదను
వడ్డింపవలయును వానిని నీవ.

ఒరులు నన్గుర్తింప కుండగావలయు
నట్లైనచో నెవ్వ రాపదార్థముల
భుజియింత్రు వారు సంపూర్ణంబుగాను
నీ వశవర్తులై నిలువగా జూతు
రదిగాక, ఆ తిన్నయట్టిబ్రాహ్మణుల
యిండ్లలోపలభుజియించువారలును
నీ వశ్యు లౌదురు నిక్కంబు రాజ!
వెళ్ళి యీ పని నెరవేర్పుమీ త్వరగ
నీ వ్రతంబును పూను మేకవత్సరము
బంధుయుక్తుల గోత్ర వారల నరసి
అను దినంబొక్కసహస్రబ్రాహ్మణుల
నాహ్వానపఱుపుమా యవనీశమౌళి!
నీ వ్రతాంతము దాక నిత్యంబు నేనె
పాకకార్యముల నిర్వర్తింప నేర్తు
నీ విధంబుగను భూమీశ్వరా! కొలది
కష్టము పడినచో క్ష్మాసురులెల్ల
నీ వశంబౌదురు నిక్కంబు గాను.
ధారుణీసురులు ప్రత్యాహ్నయముగను
అల హోమ యజ్ఞ సేవాదుల జేయ
దేవతల్ గూడ సంతృప్తులై దాన,
నవలీల నీకు వశ్యాత్ము లయ్యెదరు.
ఇంకొక గుర్తు నీకే జెప్పుచుంటి

నీ వేషమూనియు నేరాను, రాజ!
యస్మదీయాతిమాయాప్రభావమున
నేను హరించియు నీ పురోహితుని,
నా తపోబలముచే నా వలె వాని
గావించి యిటనుంచ గలను వత్సరము
నీ పురోహితురూపు నే ధరించియును
నీ కార్యమెల్లను నెరవేర్పజూతు
నర్ధరాత్రము దాటె నవనీశ! యింక
నీ శయ్యజేరియు నిద్రింపుమిపుడు.
మూడవదినమున, భూనాథ! మనము
కలుసుకొందము, నాదు ఘనతపశ్శక్తి
నీవు మేల్కాంచులోననే నేను నిన్ను
నీ గుఱ్ఱమును గూడ నేర్పుమీఱంగ
జేర్చెద నీ సౌధసీమకు వత్స!
నీకు జెప్పిన రూపు నేను ధరించి
వచ్చెద నేను భూపాలవతంస!
ఏకాంతమునకు ని న్నేను రావించి
యీ విషయంబులనెల్ల వచింతు
నీవు నన్నపుడు గ్రహింపగాగలవు
ముని మాటలను విని భూనాయకుండు
తనశయ్యజేరె నిద్రను జెందుకొఱకు
నాకపటర్షి నిజాసనంబందు

పోయికూర్చుండెను, భూమీంద్రు డంత
నలసిపోవుట జేసి యతిశీఘ్రముగను
గాఢనిద్రను జెందె, గాని సంకుపిత
మానసుండైన యా మౌనికేరీతి
నిద్దురవచ్చు మునీ ! భరద్వాజ !
అంతట జనుదెంచె నా ముని కడకు
గాలకేతుం డను ఘనరాక్షసుండు.
ఈతడే సూకరాకృతి బూని నృపుని
దారి తప్పించిన దానవాధముడు.
కపటర్షి కాతడు గడుప్రాణహితుడు.
కపటతంత్రము లందు ఘనదక్షు డతడు.
వానికి సుతు లొకవందమం దెన్న
బదిమందితమ్ములు, వారందఱమిత
దుష్టులు సంగ్రామదుర్జేయబలులు
బృందారకకదంబపీడనాపరులు,
విప్రసజ్జనసురవిసరంబు లెల్ల
శోక మొందుట గాంచి క్షోణీవిభుండు
మున్నె వారల నెల్ల బోరునగూల్చె.
వెనుకటి వైరంబు విడువ కా ఖలుడు
కపటర్షితోడను కలసి, శత్రువును
నశియింపజేయ బన్నాగంబుపన్నె-
విధిబలం బట్లుంట బృథ్వీతలేశు

దెలుగడించుకలోన నీ విషయంబు !
శౌర్యాన్వితుం డైన శత్రువొక్కండు
నిలచిపోయినసరే నిర్లక్ష్యదృష్టి
పనికిరా దెప్పుడు, భయదరాక్షసుడు
రాహునకొక్క శిరంబెకా మిగిలె
నినహిమాంశుల నది యిప్పటివఱకు
బాధించు శక్తిని వహియించి యుండె.
కపటర్షి మిత్రుని గాంచి హర్షంబు
నొంది ప్రత్యుత్థాన మొనరించి, వాని
నొక సుఖాసనమున నుపవిష్టుజేసి
మిత్రుని రాకకు మిగులపొంగుచును
వినిపించె జరిగిన వృత్తాంత మెల్ల.
దైత్యుడుగూడ మోదంబును చెంది
యీరీతి బలికెను నృపమునితోడ:
"వినుము నృపాల ! నా విహితవాక్యముల
నీవు పాలించుట, నీ శత్రువింక
సర్వనాశనమౌను సత్యంబు సుమ్మ,
యిక దుఃఖమును వీడి నృప ! నిద్రబొమ్ము.
భగవంతుడతిచిత్రపద్ధతి గాను
మందు లేకుండనే మాన్పె రోగమును.
నీ పరిపంథిని నే నింక మూల
నాశనంబొనరించి నాల్గవ నాడు

వచ్చి ని న్గలసెద బార్థివా! కనుము.''
అని వేగగపటర్షి నతితోషపఱచి
యత్యంతరోషియై ఆ మహాకపటి
చనియె నా గిరిగుహాస్థలమును విడచి
క్షణమాత్రమున వాడు శయ్యనిద్రించు
నా ప్రతాపార్కు నినతనిగుఱ్ఱమ్ము
నతనియంతఃపురంబందునజేర్చె.
నిద్రించుచున్నరాజ్ఞీశయ్యయందు
జేర్చెను నృపుని విచిత్రరీతిగను
గట్టి వైచెను తురంగము నశ్వశాల.
రాజపురోహితున్ రాక్షసు డంత
హరియించి తనదు మాయాశక్తిచేత
వాని మనస్సును పాడొనరించి
యొక పెద్ద గిరిగుహా నుంచెగుప్తముగ
నంతట రాక్షసు డా పురోహితుని
నాకృతిధరియించి యతని యనుపమ
శయ్యాతలం బందు శయనించె ననఘ!
తెలవారు ముందు పృథ్వీశుండు లేచి
తన మందిరంబున దా నుంట మిగుల
నాశ్చర్యమందెనిజాంతర్యమందు
నిది మౌనిమాహాత్మ్యమే యని యెంచి
రాణి మేల్కొనకుండ రాజు మెల్లగను

శయ్య నుండియు లేచి సత్వరంబొప్ప
నశ్వంబు పైనెక్కి యడవుల కేగె
నే వ్యక్తి కంటిలో నేనియు బడక.
ఆపయి మిట్టమధ్యాహ్న మైనంత
దిరిగి తా వచ్చె ధాత్రీపతిపురికి
ప్రతిగేహమున శుభధ్వనులుత్సవములు
జరిగెను హర్షవశంబుచే నపుడు
రాజు పురోహితబ్రాహ్మణుగాంచి
వ్రతము జ్ఞప్తికి రాగ భావంబులోన
సంతోషమొందెను సంయమివర్య !
మూడుదినంబులు మూడుయుగాలు
గా రాజునకు దోచె, గడుభారములుగ
గపటర్షిపాదలగ్నంబయ్యె రాజు
మానసం బెల్లను మౌనివరేణ్య !
అనుకున్న సమయము నందున; సరిగ
బౌరోహితుడు వచ్చి పార్థివేంద్రునకు
సర్వవృత్తాంతంబు జ్ఞప్తికి దెచ్చె
నా పురోహితురూప మందున దనదు
గురుని గుర్తించియు క్షోణీధవుండు
బహుతోషమును బొందె భావంబు నందు
భ్రమవశంబున ధరాపతిమానసంబు
పూర్ణమౌ మాంద్యంబు బొందె మునీంద్ర !

ధారుణీశుండు ప్రతాపభానుండు,
వెంటనే యొకవేయి విప్రవర్యులను
ఘనకుటుంబయుతంబుగా బిలిపించె.
షడ్రసంబులతోడ జక్కగానొప్పు
తతచతుర్విధపదార్థములను వండి
యా పురోహితుడు మాయామయంబైన
విందునుగూర్చెను వివిధంబులైన
యగణితరమ్యపాత్రావళితోడ
వివిధమృగంబుల పిశితంబు వండి
యందులో గలిపె బ్రాహ్మణమాంస మతడు
వచ్చిన బ్రాహ్మణప్రవరు లెల్లరును
విందారగింపగా బిలువంగ బడిరి.
పాదపద్మంబుల భక్తితో గడిగి
రాజు బ్రాహ్మణుల గౌరవమొప్పు చుండ
నుపవిష్టులంజేసె నుచితాసనముల
నంతమహీధవు డాహారవస్తు
జాలంబువడ్డించు సమయము నందె
కాలకేతునిచేత గల్పితం బగుచు
నాకాశ మందుండి యద్భుతరీతి
వినవచ్చెశబ్దమీ విధముగా నధిప !:
"ఉత్తిష్ఠతో త్తిష్ఠతోవిప్రులార !
అరుగుడీ మీ మీ గృహంబుల కింక

నీ యన్నమును భుజియింపగావలవ
దిది తిన్నగలుగు మీ కెంతయో హాని.
క్ష్మాసురమాంసంబు కల దిందుగలసి."
ఆకాశవాణిని నాత్మలోనమ్మి
ముందున్న భోజనంబుల నెల్ల వీడి
రయమున లేచిరి బ్రాహ్మణు లెల్ల
బృథ్వీవిభుం డంత వికలుడై పోయె,
నాతని మనము మోహాంధత్వ మొందె-
విధివశుడై ధరావిభు డంతనకట!
పల్లెత్తియొకమాట పలుక లేడయ్యె
నాగ్రహాపరవశులై ధరామరులు
మంచిచెడ్డల జింతమాని చిత్తమున
నీరీతి బలికిరి నృపుని గాంచియును.
"మూర్ఖనృపాధమా! పోయి నీవింక
బరివారయుతుడవై పరగి దైతేయ
వంశంబు నందున బ్రభవింపుమోరి!
క్షత్రియాధమ! నీవు క్ష్మాసురావళిని
సకుటుంబముగను నాశన మొనరింప
సమకట్టినావె, భోజనమనిపిల్చి
మా ధర్మమునుగాచె మాధవుండిప్పు
డీవును నీవారలే హతమైరి
ఏకసంవత్సర మేగులోపలనె

నీవు నశింతువు నిజముగా రాజ !
నీ వంశమందున నీకు నీర్విడువ
నొక్కఁడేనియు దుదకుండబో డవని."
ఆ శాపమును విని యవనీశ్వరుండు
భయవికలుండయ్యె బరమమునీంద్ర !
అంతవియద్భాగ మందుండి మఱల
వినవచ్చె వాణి యీ విధమందఱికిని
"పావనులైన యో బ్రాహ్మణులార !
చక్కఁగా మీరు విచారింపకుండ
నృపున కొసంగితి రీ శాప మకట !
నిర్దోషి యీ రాజు నిజమెంచిచూడ."
ఆ వాణి విని విప్రులాశ్చర్యపడిరి
వంటశాలకు రాజు పఱుగిడిచూడ,
వంటవిప్రుడు లేడు పాకముల్ లేవు.
కడువిచారంబుతో క్ష్మాతలేశ్వరుడు
తిరిగి వచ్చియును భూదేవులతోడ
వృత్తాంతమెల్లను విశదీకరించి
సాష్టాంగపడియెను క్ష్మాతలంబందు
నమితభయాకులుం డగుచు మునీంద్ర !
"నీవు నిర్దోషివే నృప ! యైన గాని
తప్పదెన్నడు భవితవ్యంబు రాజ !
అవనీసురుల శాప మతిఘోరమైన

దది యన్యథాకాద" టంచు బ్రాహ్మణులు
నృపతి నోదార్చిరి యీ వార్తనెల్ల
బౌరులెల్లరు విని బహువిచారించి
హంసను సృష్టింప నాత్మలో దలచి
చివరకు గాకిగా జేసినాడనుచు
విధిని నిందించిరి వివిధరీతులను.
అసలు పురోహితు నంత రాక్షసుడు
వాని గృహంబులో వదలివైచియును
వినిపించె దపసికి వృత్తాంత మెల్ల
నాఖండలుం డంత నఖిలదిక్కులకు
బంపించె లేఖలు పరభూపతులకు
శాత్రవనృపు లెల్ల సైన్యముల్ గొనుచు
యుద్ధభేరులు మ్రోయ నుద్భటలీల
ముట్టడించిరి ప్రతాపునిపట్టణమును
ప్రతిదినం బచ్చట బలుతెఱంగులుగ
జరిగె యుద్ధములు ప్రచండవిధాన-
ఆ ప్రతాపుని యోధు లందరుగ్రముగ
బోరి హోరాహోరి బొలిసి రంతటను
తమ్మునితోడ బ్రతాపభానుడును
యుద్ధరంగంబున నొరిగె ధరిత్రి
నహా! సత్యకేతుధరాధీశమౌళి
వంశమంతయును నిర్వంశమైపోయె

"వరమును గోరుమా వత్సా !" యనంగ
దశశిరుం డంత విధాతృపాదముల
బట్టియు వినయసంభాషితుండగుచు
బలికె నీ రీతిగా బ్రహ్మనుగాంచి :
"నా విన్నపము జగన్నాయకా ! వినుము :
నరవానరులు తప్ప నన్నెవరైన
జంపజాలని రీతి సద్వరమిమ్ము."
అన "తథాస్తు"ని పంకజాసనుండేను
వరమొసంగితిమి రావణునకు దేవి !
కంజాసనుం డంత ఘటకర్ణు జేరి
వాని గంభీరరూపంబును జూచి
విస్మయంబొంది యీ విధముగా దలచె :
"అనుదిన మీ ఖలుం డాహారమౌర
కైకొన్న సర్వలోకములు నశించు."
నని లోనదలచి యా యబ్జాసనుండు
శ్రీ శారదాంబను ప్రేరణజేయ
నామె యాతని హృదయము మార్చివేసె
నా కారణంబున నా దానవేంద్రు
డాఱుమాసములపర్యంతంబు నిద్ర
జెందునట్లుగను కాంక్షించె వరంబు.
విధి యంత తుదకు విభీషణు జేరి
"వరమునుకోరుమా వత్స !" యనంగ

మాధవపాదనిర్మలభక్తి నాకు
దయసేయు మని విధాతనుగోరె నతడు.
వారల కారీతి వరముల నొసగి
నిర్గమించెను బ్రహ్మ, నీరజగర్భు
డా దానవులు కడు నానందపడుచు
దమ మందిరములకు దా మేగిరపుడు.
మండోదరీనామ, మయదైత్యతనయ,
పరమసుందరి, మహాభవ్యసౌశీల్య
యామెను దెచ్చి మయాసురుం డంత
దశకంఠునకిడి యుద్వాహంబు జేసె
గాగలడతడు రాక్షసచక్రవర్తి
యనుచు గ్రహించి నిజాంతర్యమందు.
అట్టి సతీమణి నా రావణుండు
పొందినందుల కతిమోదంబు జెంది
తనతమ్ములకుగూడ దదనంతరంబు
పెండ్లికార్యముల గావించె సంప్రీతి
నంబుధిమధ్యమం చలరారుచున్న
శ్రీత్రికుటాచలశృంగభాగమున
బ్రహ్మచే స్వయముగా రచితమైనట్టి
యొక మహోన్నతదుర్గ ముండె మునీంద్ర!
మయదానవుడు దాని మఱల నిర్మించె
మణిమయకాంచనమందిరాపశల్యు

గణనకు మించి ప్రకాశించురీతి.
నాగలోకముగ గణ్యత గాంచినట్టి
భోగవతీనామపురమునకన్న
నల యింద్రునకు వాసమై భాసురిల్లు
నమరావతినిమించి యా పురరాజ
మతిరమణీయమై యలరారె నదియె
ఖ్యాతివహించె లంకాపురం బనగ
మూడులోకములందు మునిలోకనాథ!
ఆ నగరంబున కన్ని వైపులను
ఘనతరాగాధమౌ కందకంబగుచు
వెలుగొందుచుండె గంభీరసాగరము.
కాంచననవరత్నఖచితంబులైన
దృఢదుర్గకుడ్యముల్ దీపించుచుండు.
వానిసౌందర్యంబు వర్ణింపవశమె!
శ్రీహరి యెవని ప్రేరేపించునవని
నసురేశుడౌట కా యా కల్పములను,
వీరుడై ముల్లోకభీకరుండైన
శూరుడే నిజసైన్యశోభితుం డగుచు
నందు వసించు నయ్యా! భరద్వాజ!

రావణాదులదౌర్జన్యములు

అమితబలోపేతులగు దైత్యభటులు
వసియించుచుండి రా పట్టణమందు.

వారలనెల్ల దేవతలు యుద్ధమున
సంహరించిరి బాహుశౌర్యంబు మెఱయ
నింద్రుని యాజ్ఞచే నిప్పు డా పురిని
పదికోట్లు యక్షేశు భటు లాక్రమించి
కాపురంబుండిరి కాపాడుకొనుచు.
ఈ వార్త దశకంఠు డెక్కడో వినియు
నడిపించి తనదు సైన్యంబుల నెల్ల
బోయి, లంకాదుర్గమును ముట్టడించె
నా పంక్తికంఠు భయంకర సైన్య
గణమహాబలమును గని యక్షభటులు
పాఱిపోయిరి ప్రాణభయమును జెంది.
అంతట రావణుం డా పురమెల్ల
గలయ వీక్షించియు గడు ముదం బొందె
నతని యాందోళన మంతయు దీఱె.
సహజసుందరమును, శాత్రవాభేద్య
మైయుంట లంకామహానగరమును
రాజధానిగ జేసి రావణబ్రహ్మ
యా యా భటుల యోగ్యతానుసారముగ
దగు నివాసముల బ్రదానంబు జేసి
దనుజుల కెల్ల సంతస మొనగూర్చె.
దశకంఠు డొకసారి ధనదునిపైన
దండయాత్రను జేసి తద్యక్షలోక

నాథు పుష్పకవిమానంబును గొనియు
స్వపురంబునకు దెచ్చె జయచిహ్నముగను.
మఱియొకసారి నా పంక్తికంధరుడు
కౌతుకార్థంబుగా గైలాసగిరిని
పైకెత్తి నిజభుజబలము దలంచి
కడు సంతసమున లంకాపురి జేరె.
వాని సుఖంబును వాని సంపదలు
తనయులు, సేన, బాంధవసమూహములు
విజయప్రతాపముల్, పృథుబాహుబలము,
బుద్ధిశక్తియు యశంబును, దినదినము
నధికంబుగా లాభ మందిన కొలది
యధికలోభముకల్గు నట్లుగా మిగుల
నభివృద్ధి నొందె నాహా! భరద్వాజ!
అప్రతివీరమహాబలుడైన
కుంభకర్ణుడు వాని కూరిమితమ్మ
డొక్కపర్యాయమే యుదరంబునిండ
నాతడు భుజియించి యాఱుమాసంబు
లొక్క రీతిగ నిద్ర నొందు గాఢముగ
నాఱుమాసముల యనంతరం బతడు
నిద్రమేల్కొను నంత నిఖిలలోకములు
గడగడవణకును, కడు భయంబొంది
యింక నిత్యమ్ము భుజించిన వాడు

సర్వవిశ్వంబునాశనమయిపోవు
సమరమందున వాని శౌర్యధైర్యములు
వర్ణింప నెవ్వారి వశముగా దనఘ !
అతనితో సములగునట్టి బలాఢ్యు
లగణితంబుగ గల రా లంకలోన.

దశకంధరుని జ్యేష్ఠతనయు డైనట్టి
మేఘనాథుం డను మేటివీరాత్ము
డఖిలప్రపంచయోధాగ్రణులందు
నాతని కెదురుగా నాహవంబందు
నిలుచుండ గలిగిన నేర్పరి లేడు-
ప్రతిదినంబును సురపట్టణంబందు
వాని గూర్చిన భయభ్రాంతులు ఱేగు.

కుముఖుం డకంపనకులిశారదులును
దుష్టాతికాయుండు ధూమకేతుండు
మొదలైన రాక్షసుల్ మొనగాండ్రు నుండి
రొక్కొక్కడే జగాలోడించివేయ
జాలిన యట్టి ప్రచండసాహసుడు.
ఆ మహారాక్షసు లందఱుగూడ
గామరూపులును, రాక్షసమాయలందు
నారితేరినవార, లఖిలవిధాల-
నలదయాధర్మంబు లనునవి స్వప్న
మందైన వారల యందున లేవు-

దశకంఠు డొకనాడు తన సభాస్థలిని
సింహాసనమున నాసీనుడై కనియె
నగణితభటులను నాత్మనందనుల
బౌత్రుల, బాంధవపరివారజనుల
నత్యపారనిశాచరానీకములను.
అతుల సైన్యమ్ముల నరసి రావణుడు
సహజాభిమాని యీ చందంబుబలికె
క్రోధమదోద్రేకఘూర్ణితుం డగుచు:
"ఓ మహారాక్షసయూధంబులార !
మద్విరోధులు దేవమండలియెల్ల.
వారు ముఖాముఖి వచ్చి నిల్చిండి
యుద్ధమొనర్పగా నోపరు, సబల
పరిపంథి గాంచిన బాఱిపోయెదరు
వారిని బడగూల్చు పథమునువెదుక
నొక్కటే కనవచ్చుచుండెను వినుడు:
భూదేవతాజనభోజనంబులను,
యజ్ఞహోమముల, శ్రాద్ధాదికృత్యముల,
దదితరమైనసత్కార్యంబులెల్ల,
వెడలి, నిరోధించి వేయుడు మీరు
మలమలమలమలమాడియాకటిని
క్షీణత్వమొంది కృశించి యా సురలు
నప్రయత్నమ్ముగా నరుగుదెంచియును-

నాకు లొంగియు శరణంబు కాంక్షింతు
రప్పుడు వారల నందఱబట్టి
సంహారకార్యము సలుపుటో లేక
నా యాజ్ఞచొప్పున నడవంగ జేసి
వదలుటో చూచెద, భటవర్యులార !
అంతట రావణుం డా మేఘనాథు
బురికొల్పి పౌరుషముల్ పొంగునట్లు
హెచ్చరించె మునీంద్ర ! యీ చందముగను:
"దేవతల్ సంగ్రామధీరాతిబలులు,
దురభిమానులు, వారి దోర్బలమొప్ప
యుద్ధరంగంబున నోడించియిటకు
బంధించి నీవు తేవలయు గుమార !"
నావిని యా మేఘనాథు డంతటను
పీఠికపైనుండి వేగమే లేచి
తండ్రి యాజ్ఞను దన తలపైనదాల్చె
నీరీతి రావణు డెల్లవీరులకు
దగు నాజ్ఞ గావించి తానుసైతమును
విజయయాత్రకు బయల్వెడలె నుగ్రముగ
ఘనగదాదండంబు కరమున వెలయ.

దండయాత్రను సేయదశకంధరుండు
వెడలినంతనె ప్రకంపించె భూతలము
వాని కఠోరదుర్భరగర్జనలకు

దిగజాతె దేవతాస్త్రీలగర్భములు-
క్రౌర్యంబు దీపింప రావణాసురుడు
దండెత్తివచ్చు వార్తను విని నంత
దేవతలెల్లరు దిగ్భ్రాంతులగుచు
బఱుగెత్తి మేరుపర్వతగుహాలందు
దాగిరి, యో భరద్వాజమునీంద్ర !
దశకంధరుం డంత దశదిశాధీశ
వాసంబులకుబోయి పరికించి నంత
శూన్యంబులై అవిచూపట్టె, మున్నె
తద్దిశాధీశులుదరలియుండుటను,
మాటమాటకు హాడు మండుచుగ్రముగ
సింహనాదంబులు చేయుచు, సురల
సంగ్రామ మొసరింప సైగొట్టి పిలచె
బరిహాసవాక్యముల్ పలికి నిందించె.
మహితరణోన్మాదమత్తుడై యతడు
తన నెదిరింపగా దగు ప్రతివీరు
బరికింపదిరిగె సర్వప్రపంచంబు,
గాని యొక్కండైన గానరాడయ్యె.
భానుచంద్రాగ్నులు, వరుణవాయువులు
ధనదుండు, కాలము, దండధరుండు
నితరాధికారులౌ బృందారకులును,
నరసురకిన్నరనాగసిద్ధులును

నతనికిదాసోహమనిరి మునీంద్ర !
ఘనబ్రహ్మసృష్టిలోగల దేహధారు
లందఱు వశవర్తులై రావణునకు
దమతమ ప్రాణముల్ దక్కించుకొనిరి.
గడగడలాడుచు గడుభీతితోడ
బాలించి రెల్లరు వానియాజ్ఞలను.
సర్వదా రావణు చరణంబులకును
వినమితులౌచు జీవించి రెల్లరును.
నిజభుజబలమున నిఖిల విశ్వమును
తనవశంబొనరించె దశకంధరుండు,
లోకమందెటనైన లొంగక నిలచి
స్వాంతత్ర్యముననుండ జాలిన వాడు
వాని పాలనమున బరికింపలేడు.
రాజాధిరాజౌచు రావణాసురుడు
పాలించె నిజమంత్రపద్ధతి జగతి.
తన భుజశక్తినందఱినిజయించి
నరసురయక్షకిన్నరుల కింపురుష
నాగగంధర్వకన్యకలను మఱియు
మానితసుందరీమణుల బెండ్లాడె
నా దశకంధరుం డరమర లేక.
ఆ దశకంఠు డేమనిచెప్ప, దాని
చెప్పి చెప్పక ముందె చేయుశీఘ్రముగ

మేటి బల్లిదుడగు మేఘనాథుండు.
ప్రప్రథమంబున రావణాసురుని
యాజ్ఞను గైకొన్న యసుర వీరాత్మ
లే మొనరించిరో యిప్పుడు వినుము :
భయదరూపులు మహాపాపాత్ము లైన
దైత్యులెల్లరు దేవతాబృందములను
సంతాపపెట్టగా సాగిరుద్ధతిని.
సంచరించుచు నిశాసమయంబులందు
గడు నుపద్రవముల గావించిరెన్నొ.
స్వీయమాయాశక్తిచేత నా ఖలులు
బహువిధరూపముల్ వహియించిరనఘ !
అన్ని విధంబుల నా నిశాచరులు
వేదవిరోధులై విహరించి రెపుడు.
ధర్మనిర్మూలనా తత్పరు లైరి,
తమశక్తికొలదిగా దాపసచంద్ర !
వారికి గోవైన బ్రాహ్మణుండైన
గంటిలో బడిన నా గ్రామసీమలను
నగరంబులను దహనముచేసి రకట !
ఘనసదాచారముల్ గానరావయ్యె
దేవతాబ్రాహ్మణదేశికభక్తి
మటుమాయమయ్యెను మౌనివరేణ్య !
లేదు శ్రీహరిభక్తి, లేవేమియజ్ఞ

దానతపోజ్ఞానధర్మవ_ర్తనలు
వేదపురాణముల్ వినుటలు లేవు
స్వప్నమందును భరద్వాజమౌనీంద్ర !
జపతపోయోగయజ్ఞక్రియావళులు
వైరాగ్యమనుమాట పడినదో చెవుల
నచటికి రావణుం డాక్షణంబందె
వెడలును వానిని విరతిగావింప
నిట్టి కార్యంబుల నించుకాతండు
సాగనివ్వండు; నాశమ్మొనరించు.
ధర్మప్రశంసయే తగనివిధాన
నఖిలజగంబు భ్రష్టాచారమయ్యె;
బరగ వేదపురాణపఠనంబు సేయు
వారల నాతడు బహుబాధపెట్టె;
బంపించె ఘోరప్రవాసములకును.
ఆ నిశాచరుల భయంకరాధర్మ
కృత్యముల్ వర్ణింప నెవ్వరితరము ?
అమితహింసాప్రియు లైనట్టివారి
పాపకృత్యములకు బరిమితిలేదు.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### షష్ఠవిశ్రామము

శ్రావణమేఘశరీరా !
పావనకృష్ణాతటస్థవనసంచారా !
శ్రీవనజాసనముఖసం
భావితశుభరూప ! మట్టపల్లి నృసింహా !

జూదరుల్ దుర్జనుల్ చోరజనంబు
పరదార పరధన వాంఛామనస్కు
లమితంబుగా వృద్ధి యైరి యెల్లెడల.
దల్లిదండ్రుల దేవతల భక్తి జూడ
మానిరి ప్రజలు దుర్మదచిత్తులగుచు.
బొందసాగిరి సాధువులచేత సేవ
లిట్టి కార్యంబుల నెవరు చేసెదరొ
ఆ ప్రాణు లెల్లరు నసురులే దేవి !

భూదేవి దేవతలతో మొఱపెట్టుకొనుట

పరమధర్మగ్లాని వసుధ వీక్షించి
యతిభీతి నొందియు నాకులపడియె.
"పర్వతవాహినీవార్ధిసమూహ

భారంబు నా కొక భారంబు గాదు,
ఒక లోకకంటకు నురుభారమునకు
సమము గా దీ భారచయము నా కకట!"
అనుచు భూదేవి నిజాత్మ జింతించె.
మహితధర్మము తారుమారౌట గనియు
నా పంక్తికంఠు భయంబుచే ధరణి,
పలువిప్పి యొక మాట పలుకలేదయ్యె.
హృదయంబులో విచారించి మిక్కిలిగ
నామె గోరూపిణియై నిర్గమించె
సురమునుల్ దాగిన చోటున కనఘ!
కన్నుల బాష్పముల్ కాల్వలై పాఱ
వారికి దన మనోవ్యథ వినిపించె.
కాని వారలయం దొకానొకడేని
ఆమె కొకింతసహాయంబు సేయ
జాలక పోయెను సంయమివర్య!
గంధర్వసురమునిగణము లన్నియును
కాంచనగర్భలోకమునకు జనియె.
పాపము! భూదేవి వారితో గూడి
గో రూపమును దాల్చికొని నిర్గమించె
నమిత వైకల్యభయార్తచిత్తమున;
నఖిలంబు గ్రహియించి యంబుజాసనుడు
భూదేవి దుఃఖంబు పోగొట్టుటకును

తగిన సామర్థ్యంబు తనకు లే దనుచు
హృదయాంతరంబున నెఱిగి యిట్లనియె :
"ఎవ్వని సేవింతురెప్పుడు మీర
లా యవినాశి యా ఆ పరమాత్మ
నన్నును, మిము, రక్షణము సేయువాడు.
"ధైర్యంబు పూనుమా ధాత్రీమతల్లి !
సంస్మరింపుము హరిచరణపద్మముల
నెఱుగు కింకరదుఃఖ మీశ్వరుం డతడు
భవదీయఘోరవిపత్తు భంజించు."
అట సభజేసియు నాసుర లెల్ల
రీ రీతి దలచిరా యీశ్వరు గూర్చి :

శ్రీపతి నెచట దర్శింపగాగలము ?
మన బాధలను విన్నపంబొనరింప
వైకుంఠనగరికి బయనంబు సేయ
వారిలో నొకడు సభాస్థలి దెలిపె;
నింకొక్క "డదికాదు; ఈశ్వరుం డెపుడు
క్షీరాబ్ధిలోన వసిం" చని పలికె.
హృదిలోనభక్తిసంప్రీతివెలుంగు
వానికి సర్వదా ప్రత్యక్షమౌను
సర్వేశుడెప్పుడు స్వాత్మపీఠమున
నో గౌరి ! యీ నేను నుంటి నా చోట;
నీ రీతి బలికితి నే నొక్కమాట

నవసరసమయమునందుభవాని !
సర్వత్ర సమముగా సర్వేశ్వరుండు
వాసుదేవుడు శౌరి వ్యాపించియుండు
ప్రేమచేతనె హరి వీక్షితుండగును.
దేశకాలంబుల దిశలనెందైన
ప్రభువుతేని స్థలంబు పలుకు దేదైన
నఖిలజగన్మయుండై వెలుగొందు
చేమియు లేనట్టి యేకాకి యగుచు
బరమ విరాగియై పరగుచున్నాడు.
కాష్ఠముల్ రెంటిని కలిపి మథింప
వెలువడు నగ్నియా విధి భక్తిచేత
శ్రీహరిదర్శనశ్రీ లభియించు"
ననెడి నా వాక్యంబు లందఱు గూడ
సమ్మతించిరి. పద్మసంభవుండపుడు
"మంచివాక్యంబులు మంచివాక్యములు'
అని వచియించె; దా నానందపడుచు
నా వాక్యముల విన నళినసంభవుడు
పరమసంతోషసంభరితాత్ముడయ్యె;
నాతని తనువు రోమాంచితంబయ్యె:
గన్నుల బాష్పముల్ కారగాదొడగె
సావధానతబొంది స్వాంతమం దంత

షీరాత్ము డగు బ్రహ్మదేవుడు భక్తి
గరములుముడిచి యీ కరణి బ్రార్థించె :

## బ్రహ్మదేవకృత-శ్రీహరిస్తవము

### గేయము

జయ సురనాయక ! జనసుఖదాయక ! ప్రణతపాల ! భగవంతా!
జయ గోద్విజహిత ! జయదనుజాహిత ! జయలక్ష్మిప్రియకాంతా !
జయ ధరణీసురచయపరిరక్షణ ! జయమహితాద్భుతకార్యచణా !
నీలీలలమర్మంబులనెఱుగగ నేరికైనప్రభు ! వశమౌనా ?
సహజకృపాళూ ! దీనదయాళూ ! నీకృపజూపుముమాపైన.

జయ అవినాశీ ! హృదయనివాసీ ! వ్యాపక! పరమానందా !
జయ అజ్ఞాత ! అతీత! సుచరితా ! మాయారహితముకుందా !
విగతమోహులును విరాగమతులగు మునిబృందములతిప్రీతిన్
దివానిశలు నిను ధ్యానము సేయుచు వినుతింతురు నీకీర్తిన్
జయముజయముగోవింద ! జనార్దన! జయముసచ్చిదానందా !

త్రివిధసృష్టినేతోడునెఱుంగక సృష్టించిన అఘదూరా !
మఱవకు మము నీ భక్తియుబూజయు మతినెఱుగనివారమురా !
భవభయభంజన ! మునిహృద్రంజన ! దళితత్రితాపదబృందా !
త్రికరణశుద్ధిగ జతురతలను విడి శరణంటిమి గోవిందా !

శారద, వేదములును, శేషాహి, యశేషఋషిశ చయములున్
ఎఱుగరు నిను; దీనప్రియుండవని కీర్తించును వేదములున్
మాయెడగరుణార్ద్రవహృదయుండవు గమ్ముహరీ ! పరమేశా !

భవవారిధిమందర ! గుణమందిర ! బహువిధసుందర ! సుఖవాసా !
సకలామరమునిసిద్ధులు పరమభయాకులతన్ దనుజారీ !
నీ పదకంజయుగమ్మునకున్ నతి సేయుచుండిరో శౌరీ !

## శ్రీమన్నారాయణుని అభయప్రదానము

ఆ భూసురావళి యార్తినెఱింగి
యాలించి వారి స్నేహాలాపవితతి
నాకాశభాగంబునందుండి యపుడు
వినవచ్చె నొక్క గంభీర మౌ వాణి
యఖిలార్తిసందేహహారకంబగుచు :
"ఓ మునిసిద్ధసురోత్తములార !
భయమొందకుడు మీరు భయమొంద వలదు.
వేగ మీ కొఱకు బృథ్వీరంగమందు
నర వేషమూన నున్నాడను నేను.
ఔదార్యవంత మౌ అర్కవంశమున
నంశసమేతుండ నౌచును నేను
మనుజావతారంబు మహిని దాల్చెదను.
అదితికశ్యపులు మహాతపశ్చర్య
సలుపగా మున్ను ప్రసాదించినాడ
వారికొొకానొక వరము; భూతలిని
సాకేతపురమున జన్మంబు గాంచి
రదితి శ్రీ కౌసల్య యనెడి నామమున,

దత్కాశ్యపబ్రహ్మ దశరథేంద్రుడుగ.
వారి గృహంబున ప్రభవింతు నేను
రఘుకులతిలకమై రాజితరీతి
నల సోదరచతుష్టయస్వరూపమున.
నారదమునివచనంబుల నెల్ల
సత్యంబుగా నేను సలిపెడివాడ
బరమశక్తిని గూడి ప్రభవింతు నేను
తెగువనేనిట్లు ధాత్రీభారమెల్ల
హరియింపగల నమరావళులార !
యిక నిర్భయులుగండు హృదయంబులందు."
ఆకాశభాగంబునందుండి యిటుల
బలికిన భగవంతు వాణిని వినియు
సకలదేవత లాత్మశాంతిని గనిరి.
అపయి భూదేవి నబ్జసంభూతు
డోదార్చె దైవాభయోక్తులదెలిపి.
అంతట భూదేవి ఆత్మలో గలుగు
సకల భయంబు విసర్జించివైచి
స్వస్థతబొందెను స్వాంతంబులోన.
"వానరరూపముల్ వహియించి మీర
లుర్వీస్థలంబున నుద్భవించియును
శ్రీహరి పాదముల్ సేవింపు" డనుచు
నాదేశమొసగియు నమరావళులకు

నిర్గమించె విరించి నిజలోకమునకు.
అవనీసమేతులై యఖిలదేవతలు
తమనివాసంబుల దగ జేరుకొనిరి.
వారెల్ల విశ్రాంతభావులై రనఘ !
అజునియాజ్ఞకు సురల్ హర్షాత్ములగుచు
గార్యంబు నెఱవేర్పగడగిరెల్లరును
కాలంబుపోనివ్వకయె శీఘ్రముగను
వనచరరూపులై వారెల్ల భువిని
ప్రభవించిరయ్య భరద్వాజమౌని !
హరి బలప్రతాపంబుల నెన్న
ననుపమానంబు లా యగచరులెల్ల
వీరాధివీరులు వివిధ రంగముల
నా వానరులయాయుధావళు లచల
వృక్షనఖంబులు విబుధవరేణ్య !
ఆ ధీరమతులైన యగచరవరులు
శ్రీహరికొఱకు నిరీక్షించుకొనుచు
నతి బలిష్ఠంబులై యలరారుచుండు
పలుబృందములుగ విభాగింపబడియు
బర్వతారణ్యగర్భంబులయందు
దమయిష్టమైనట్టి తావులలోన
వసియించిరో భరద్వాజ మునీంద్ర !
అతిరుచిరంబగునట్టి యీ చరిత

భాషించితిని విను పైకథ నింక :

## శ్రీ దశరథమహారాజచరిత్ర, పుత్రకామేష్టి

ఇల నయోధ్యాపురంబేలుచు నుండె
రఘువంశరత్నమై రాజిల్లు నట్టి
వేదంబులందున విదితమై వెలుగు
దశరథుండను పేరు దాల్చిన నృపతి.
ఆ మహారాజు గుణాబ్ధియు, జ్ఞాని,
రాజితధర్మధురంధరుండతడు
శార్ఙ్గిని హృదిగొల్చు సద్భక్తవరుడు.
కౌసల్య మొదలైన కాంతలందఱును
దివ్యవర్తనలు పతివ్రతాముఖులు
హరిపదకమలంబులందున మిగుల
గాఢమౌ భక్తిని గలిగినవారు.
ఒక్కదినంబున నుర్వీధవుండు
తనయులులేకుంట దన స్వాంతమందు
జింతను బొందియు శీఘ్రంబుగాను
నిజగురుదేవు సన్నిధికేగి, యతని
పాదపద్మంబులపైనను వ్రాలి,
బహుళవిధంబుల బ్రార్థనల్ సలిపె.
దన కష్టసుఖముల దన గురువునకు
విన్నపంబొనరింప విని వసిష్ఠుండు

పలువిధములనరపాలునోదార్చి
యీరీతి బలికెను కృపయుబెంపొంద
"ధీరత బూని పృథ్వీనాథ! హృదిని
నోపికపట్టుమా యొక్కింత నీకు.
త్రిభువనవిదితులై దీపించువారు
భక్తభయంబుల బాపెడివారు
పుత్రులు నలుగురు పుట్టగాగలరు."
అంత వసిష్ఠమహర్షివర్యుండు
శృంగిమహర్షిరావింపగా జేసి
భూపతిచేతను పుత్రకామేష్టి
యను నొక శుభవంతమైన యజ్ఞమును
సలుపగా జేసె నా సవనంబునందు
భక్తియుక్తంబుగా మౌనివరుండు
నాహుతు లగ్నిలో నర్పించినంత
నగ్నిదేవుండు ప్రత్యక్షమై పలికె
బాయసాన్నము బూని పాణిపద్మమున:
"నీకై వసిష్ఠమునీశుండుహృదిని
తా విచారించిన తత్కార్య మెల్ల
దప్పక సిద్ధించు దశరథరాజ!
ఈ పాయసంబును నృప! స్వీకరించి
విభజింపుమా యథావిహితపద్ధతిని"
ఆ యజ్ఞసభ్యులకందఱ కగ్ని

యాపయిజేసెడి దంతయు దెలిపి
యంతర్హితుండయ్యె; నంతట భూపు
డమితసంతోషంబునందున మునిగె.
హృదయంబులో పొంగులెత్తు హర్షంబు
నాపజాలకపోయె ననఘా! మునీంద్ర!
వెంటనే దశరథపృథ్వీవిభుండు
ప్రియసతీమణుల రావింపగా బంపె.
కౌసల్యమొదలైన కాంతలంతటను
వచ్చిన గనుగొని పార్థివేంద్రుండు
నా పాయసంబున నర్ధభాగంబు
గౌసల్యకొసగెను; ఘనతరప్రీతి.
శేషార్ధభాగంబు చేసి రెండుగను
నొకటి గైకేయికి నొసగి, రెండవది
రెండుభాగము లొనరించియు, దిరిగి
యొకటి గౌసల్య, కింకొకటి గైకేయి
కిచ్చిన, వారు సంతృప్తివహింప
నా రెండు భాగంబు లాపయి నృపుడు
మిగులప్రేమమున సుమిత్రకొసంగె.
ఈవిధి నా రాణు లెల్లరు గౌరి!
గర్భముల్ దాల్చిరి కడు హృదయమున
నాహ్లాదమొంది మహాసుఖపడిరి.
కౌసల్యపావనగర్భగోళమున

శ్రీహరి, తా బ్రవేశించె నేనాడు
నప్పటినుండియు నఖిలలోకములు
సుఖసంపదలతోడ శోభిల్లదొడగె.
శోభాసుశీలతేజోనిధులైన
రాణులందఱు గూడ రాజసౌధమున
వెలుగొందసాగిరి విమలతేజమున
గాలమిట్లేగె సుఖంబుదీపింప,
బ్రభు వింక జగతిపై బ్రభవించునట్టి
దివ్యమౌ సమయమేతెంచె: నంతటను-

## శ్రీరామ జననము-బాల్యలీలలు

అల యోగలగ్నగ్రహానీకవార
తిథులన్నియును మహాదివ్యవిధాన
ననుకూలముగనుండె; ననఘచరిత్ర !
సచరాచరం బగు జగతి హర్షించె
సుఖమూల మగు రామశుభజన్మమునకు.
మంగళం బగు చైత్రమాసంబునందు-
నల శుక్లపక్షమునందున, నవమి,
శ్రీహరిప్రియమభిజిత్కాల మందు
మార్తాండు డాకాశమధ్యమందుండ
సమముగా శీతలోష్ణత లొప్పుచుండె.
సకలప్రపంచవిశ్రమకాల మద్ది.

మందశీతలగంధమారుతం బపుడు
వీచుచుండెను; దేవబృందంబు లెల్ల
హర్షించుచుండిరి ఆత్మలలోన
సంతోషపడుచుండ్రి సాధుసజ్జనులు
వనములెల్లను పుష్పభరితంబులయ్యె
భాసించె మణులతో బర్వతవ్రజము
లమృతధారలుపాఱె నఖిలవాహినుల.
శ్రీరామదేవు డీ క్షితితలంబందు
నవతరించెడికాలమాసన్న మయ్యె
నని గ్రహించెను బ్రహ్మ; యఖిలదేవతలు
తఱలివచ్చిరి తమ తమ విమానముల.
సదమలాకాశంబు సంకులంబయ్యె
సురయూథముల చేత జుట్టగాబడియు
హరిగుణగణముల నతి శ్రావ్యముగను
గానంబుసేసిరి గంధర్వగణము.
సుందరకరముల సుమవర్షములను
వర్షించి రానందభరితాత్ములగుచు
నాకాశమండల మంతయు దేవ
దుందుభిధ్వనములతో మారుమ్రోసె.
నాగ మునీంద్రగణంబులు, సురలు
ప్రస్తుతుల్ సలిపియు బహువిధానముల
నిజనిజోచితసేవ నెఱవేర్చిరప్పు

డా జగద్వాసుడు ఆ జగత్ప్రభుడు
సకలప్రపంచ విశ్రాము డీ భువిని
ప్రకటితుండైన దేవతల్ల హరిని
సన్నుతు లొనరించి సదమలభక్తి
నిర్గమించిరి నిజ నిజవాసములకు.
ఆ దీనవత్సలు డా కృపాళుండు
శ్రీకోసలాత్మజాహితకారి శౌరి
ప్రత్యక్షమయ్యె భరద్వాజమౌని !
ఎవని మహాద్భుతాకృతి విచారించి
మునుల చిత్తములు ప్రముగ్ధంబు లగునొ
ఆ దివ్యమగు రూపమా మాతృదేవి
బరమసంతోషసంభరితాత్మ జేసె.

నయనాభిరామఘనశ్యామతనుడు,
శంఖచక్రగదాబ్జసందీప్తమాన
వరచతుర్భుజుడు, దివ్యరత్నహార
మహితభూషణవనమాలికాధరుడు,
సంఫుల్లపద్మవిశాలనేత్రుండు,
నఖిలశోభాసింధు వైన ఖరారి
గనుగొని కౌసల్య కరములుమోడ్చి
యీ రీతి దా వచియించె మునీంద్ర !
"హే అనంతా ! ప్రభూ ! ఏ రీతి నిన్ను
సంస్తోత్ర మొనరింప జాలెద నేను !

మాయాగుణజ్ఞానమానంబులకును
నీ వతీతుండవై నిలుతువటంచు
వేదపురాణముల్ వేనోళ్ళజాటు.
కారుణ్యగుణసుఖఘనసాగరుండు,
నఖిలసద్గుణనిధి యని వేదవిబుధ
చయము లే పరమేశు సన్నుతింజేయు
నా రమావిభుడు భక్తానురాగుండు
నాత్మహితార్థమై యవతార మొందె.
భవదీయతనువున భాసిల్లుచుండు
బ్రతిరోమరోమకూపంబు నందుండి
మాయావిశేషబ్రహ్మాండసంచయము
ప్రభవించు నని శ్రుతుల్ ప్రవచింపుచుండె.
ఆ నీవు నాదు గర్భాంతరాళమున
నహా ! వసించితివీ మహాద్భుతచరిత
ధీరమానసుల బుద్ధినిగూడ దేవ !
సంచలింపగజేయు స్వామీ ! ముకుంద !''
జనని యీ రీతిగా జ్ఞానంబు నొంద
జిఱునవ్వు నవ్వెను శ్రీరమావిభుడు
మహితసల్లీలాసమర్థు డా శౌరి
తనయందు బుత్రవాత్సల్యంబు నుంచ
నతిమంజులంబగు నా మెపూర్వంపు
జన్మగాథను తెల్పి సంతోషపఱచె.

మాతృచిత్తంబెల్ల మారె నా పిదప
నీ రీతి దిరిగి వచించె నా జనని :
"ఈ యమానుషరూప మింక ద్యజించి
యమితప్రియంబు నా యాత్మకు గూర్చు
శైశవలీలల సలుపుము స్వామి !
అట్టి లీలలచేత నాత్మకు గలుగు
నానందమహా ! మహాదత్యద్భుతంబు !"

ఆ మాటలనువిని యా జనార్దనుడు
సుజ్ఞానరూపు డా సురవల్లభుండు
నిలలోన బాలుడై యేడ్వగాసాగె-
నీ దివ్యచారిత్ర మెవరుపాడెదరొ
వారలు శ్రీహరిపదమును బొంది
భవకూపమందున బడరెన్నటికిని !
మాయాగుణేంద్రియపరు డైన శౌరి
బ్రాహ్మణగోసురభక్తహితంబు
సలుపగా నెంచియు క్ష్మాతలంబందు
ధరియించె మనుజావతార మీ రీతి
స్వేచ్ఛావినిర్మితవిమలాంగుడగుచు.
పరమప్రియం బగు వాణితో వెలుగు
శిశురోదనము తమ చెవులందు సోక
సంభ్రమ మొప్పగా సర్వరాజ్ఞులును
పరుగెత్తిచేరిరి ప్రసవగేహమును

దాసీగణంబు లుదారమోదమున
నటునిటు బరుగిడి రంతఃపురమున
నానందమగ్నులై రఖిలపౌరులును.
పుత్రజన్మవిశేషమును విని నంత
నాత్మ బ్రహ్మానందమంతటి సుఖము
పొందెను దశరథభూమీశ్వరుండు.
మనమునందున బరమప్రేమ నిండ
బులకితదేహుడై భూవల్లభుండు
చలమున దెలివిని సమకూర్చుకొనుచు
లేవగా నుంకించి లేవలేడయ్యె.
వినిన మాత్రమున నే విభుని నామంబు
సకలశుభంబుల సమకూరజేయు
నా జగన్నాథుండు నావిర్భవించె
నా గృహమందున నా భాగ్యమేమి!
యని తలపోసియు నా మహారాజు
పరమసంతోషసంభరితాత్ము డయ్యె.
వాయిదకాండ్ర సత్వరము రావించి
యెల్లవాద్యముల మ్రోయింపగా బనిచె.
గురువసిష్ఠమునీంద్రుగూడ రావించె
నా మహాముని భూసురాన్వితుం డగుచు
వచ్చి చేరెను నృపద్వారదేశమును.
అంతట వారెల్ల రరిగి సౌధమున

నగణితగుణనిధి, యతిరూపరాశి
యనుపమానుం డగు నా బాలుగనిరి.
సలిపి నాందీముఖశ్రాద్ధకర్మముల
జాతకర్మంబుల సర్వం బొనర్చి
దశరథేంద్రుండు ప్రదానంబు సేసె
హాటకధేనువస్త్రాంచితమణుల
బ్రాహ్మణులకు భరద్వాజమౌనీంద్ర !
ధ్వజములతోడ బతాకలతోడ
దోరణబృందంబుతోడను నిండె
నా యయోధ్యాపుర మంతయు నాడు
వర్ణనాతీత మా పట్టణశోభ !
ఆకాశమండలమందుండి పురిని
కుసుమవర్షంబులు కురియగా సాగె
నఖిలజీవులును బ్రహ్మానందమందు
మునిగి పోయెను మహాముని! భరద్వాజ !
సహజశృంగారంబు సందీప్తి గాంచ
గుంపులు గుంపులు గూడియు స్త్రీలు
పరుగిడు చుండిరి పరవశత్వమున
గనకకుంభముల మంగళవస్తుజాల
భరితంబు లైనట్టి పళ్లెరంబులను
కరముల ధరియించి, కడు శ్రావ్యముగను
పాటలుపాడు చా వనితలందఱును

భూపునంతఃపురంబున కేగుదెంచి,
హారతుల్ వెలిగించి, యానందపడుచు
దృష్టిదోషంబుల దిగదీసివైచి,
బాలుని శ్రీపాదపంకజంబులకు
బలుసార్లు సాష్టాంగపడిరి మునీంద్ర!
వందిమాగధసూతభటగాయకులును
పాడిరి రఘునాథు పావనయశము
సర్వులు దమతమ సర్వసంపదల
దానంబు సేసిరి; తద్దానములను
గొనినట్టి వారలు గూడను వాని
నుంచుకోరైరి ఋష్యుత్తమా! వినుము.
మృగమదకుంకుమశ్రీగంధములును
బురదగా మాఱెను పురవీథులెల్ల
సౌందర్యకందమే జగతీతలాన
నవతరించుటజేసి యఖిలగేహముల
శుభవాద్యములు మ్రోయజొచ్చె నెల్లెడల.
నగరనారీబృందనరులెల్ల మిగుల
నానందసంపూరితాత్ములై యుండి
రా కేకయాత్మజ కా సుమిత్రకును
జననంబు నొందిరి చక్కని పుత్రు
లా సుఖసంపద లా సమయంబు
నా జనగణముల నభివర్ణనంబు

సలుపగా వశమౌనె శారదకైన
నా వేయితలలున్న యహికైనగాని
ఆ యయోధ్యానగరాధిరాజంబు
శోభాయమానమై చూపట్టుచుండె
బ్రభుదర్శనము సేయ రాత్రి యేతెంచి
తనపతి యైనట్టి తరణిని గాంచి
సంకోచపడుచును స్వాంతంబులోన
నట నిల్చియుండె సంధ్యారూపమందు
నను నటుల్ గనిపించె; నా సమయమున
గ్రమ్మిన సందెచీకటులట్లు దోచె
నగరుధూపముల మేఘావళులెల్ల
గనగ బైకెగజిమ్మగా బడినట్టి
బుక్కాయి ఛర్గుండ పొడు లాకసమున
నరుణసంధ్యారాగమై వెలుగొందె.
మందిరాగ్రంబుల మణిసమూహములు
తారకాకోటివిధంబున నుండె;
క్ష్మానాథసౌధాగ్రకలశంబు దోచె
విమలమంజులచంద్రబింబంబు వోలె.
నతిమృదులంబులై యలరారుచున్న
రాజమందిరవేదరావముల్ జెలగె.
సాంధ్యకాలోచితశ్రావ్యవిహంగ
సంగీతకలకలస్వనములవోలె.

నీ కౌతుకముగాంచి యినుడు మైమఱచె
నేకమాసంబిట్టు లేగె సూర్యునకు
తెలియకుండగనె సతీ! శైలతనయ!
ఆ దినం బొకమాస మయ్యె నీ మర్మ
మెవ్వ రెఱుంగ రొకించుకేనియును
నిల్చెండె రథమాపి నింగి సూర్యుండు
నింక నిశీథిని యెట్లుండ గలదు?
ఎవ్వ రెఱుంగలే దీ రహస్యమును
చివరకు సూర్యుండు శ్రీరామచంద్రు
గుణగాన మొనరించుకొనుచు గమించె.
నా మహోత్సవరీతి నానందముగను
సురమునినాగులు చూచి కండ్లార
దమ మహాభాగ్యంబు దా మెంచుకొనుచు
నిర్గమించిరి నిజనిలయంబులకును.
అతిదృఢవిశ్వాస మాత్మలోగలుగు
దాన వీమాటచే ధరణీధ్రతనయ!
ఏను గావించిన యింకొక్క పనిని
దెలుపుచునుంటిని దేవిరో! వినుమ.
ఎఱుగని రీతిగా నితరు లెవ్వరును
నరరూపముల దాల్చినార మా నాడు
నేను, గాకభుశుండి యిరువుర మప్పు
డా యయోధ్యాపురమందుంటి మహాహా!

పరమసంతోషంబు, భావంబులోన
ప్రేమసుఖంబు ధరింపగా లేక
తనువుల మఱచియు దన్మయత్వమున
విహరించితిమి మేము వీథులవెంట
నా రామకృప కెవ్వ డర్హుడౌ నతడె
మా శుభచర్యను మదిలో గ్రహించు;
నా సమయంబున నవనీశ్వరుండు
సర్వులవాంఛల సఫలంబొనర్చె.
గజరథతురగగోగణముల మఱియు
గాంచనరత్నసంఘంబుల వివిధ
చీనిచీనాంబరశ్రేణుల నృపతి
దానంబొనర్చె నౌదార్యంబు వెలుగ.
సర్వులు హృదిలోన సంతృప్తిగాంచి
"వర తులసీదాసు-ప్రభువు లైనట్టి
దశరథభూనాథు తనయు లందఱును
నవని జిరంజీవు లౌదురుగాక"
అనుచు దీవించిరి యానందపడుచు.
ఇటుల గొన్ని దినంబు లేగె మునీంద్ర!
తెలియకుండ భ్రమించె దివములు నిశలు
నామకరణము లొనర్పంగ దగిన
సమయ మేతెంచుట క్ష్మాధీశు డెఱిగి
జ్ఞానియైన వసిష్ఠసంయమీందుృనకు

వర్తమానము బంప వచ్చె నా మౌని;
ఆ ఋషివర్యుపాదాంబుజంబులకు
బూజ గావించియు భూపాలమౌళి
యీరీతిగా వచియించెను భక్తి:
"తాము విచారించి తగిన నామముల
ధరియింప జేయుడీ తనయుల" కనిన
బలికె నీ తెఱగు నా మౌనివర్యుండు:
"అగణితానుపమంబు లైనవి వీరి
నామధేయంబులు నరనాథ! ఐన
నస్మదాత్మకు దోచినట్టి విధాన
నామకరణము లొనర్చెద నేను.
ఆనందసింధువు, అతిసుఖరాశి,
నిజశీకరాహ్లాదనిఖిలలోకుండు,
నీ జ్యేష్ఠతనయుడు నృపలోకనాథ!
ఆనందధామ మీ యఖిలప్రపంచ
విశ్రామకరమౌచు వెలుగొందు నట్టి
'రామ'నామమున విరాజిల్ల గలడు.
నృపశేఖరా! నీదు రెండవ సుతుడు
భువనంబు భరియించి పోషించుగాన
భరతనామంబున భాసిల్ల గలుగు.
నెవ్వని లో స్మరియించి నంతటనె
యరివినాశంబగు నతడు శత్రుఘ్ను

డని వేదములలోన నభినుతుండగును.

సకలసల్లక్షణసదనుడౌ వాడు
శ్రీరామునకు గడు ప్రియమైనవాడు
నఖిలలోకాధారుడైన సౌమిత్రి
గురువసిష్ఠునిచేత గూర్మిమీఱంగ
ధరియించె లక్ష్మణోదారనామమును.

చక్కగా లోన విచారణజేసి
యే వసిష్ఠాచార్యు డీ ప్రకారముగ
నామకరణము లొనర్చి యిట్లనియె :
"నరనాథ ! నీదగు నలువురు సుతులు
వేదతత్త్వాకృతుల్; వీరలలోన
శ్రీరామచంద్రుడు శివుని ప్రాణంబు,
మునుల ధనంబునుపుడమి నెల్లరకు
సర్వస్వమైయున్న సారసాక్షుండు
బాలకేళీసుఖపారవశ్యమున
నిప్పుడున్నాడు క్షోణీంద్రవతంస !"
పిన్ననాటను గోలె ప్రీతి లక్ష్మణుడు
శ్రీరామచంద్రుని చిత్తంబులోన
నాత్మాధిపతి, హితుడంచు నెఱింగి
రామాంఘ్రిరాజీవరతు డౌచుండె.

భరతశత్రుఘ్నులు ప్రభుభటులట్లు
నొండొరుల్ ప్రీతితో నుండి రెంతయును...

శ్యామలగౌరవర్ణాంగులై యున్న
రామలక్ష్మణుల సత్ప్రథితసౌందర్య
మును గాంచి మాతలు మోదంబు జెంది
దృష్టిదోషముబోవ దృణమును ద్రెంపి
పాఱవేయుచునుంద్రు మౌనివరేణ్య !
ఆ నలుగురు బాలు రతిశీలరూప
గుణధాము; లైననుగూడ శ్రీరాము
డందఱకన్న నత్యధికమైనట్టి
సుఖసాగరుండయి శోభించుచుండె.
శ్రీరామచంద్రుని హృదయంబులోన
సదమలానుగ్రహచంద్రుండు వెలుగు.
నా రాఘవుడు మనోహరహాసములను
విశ్వతాపముదీర్చు; వెన్నెలలొలుకు;
నొడిలోన గానేపు, నూయలలోన
గానేపు బాలరాఘవుని గౌసల్య
"నా కన్నతండ్రి! ఓ నా ముద్దుతనయ !"
అనుచు లాలించు నత్యంతానురక్తి.
ఆ జగద్వ్యాపకు, డా నిరంజనుడు,
నా నిర్గుణుండు, మఱి యా నిష్క్రియుండు,
నగు పరబ్రహ్మ యహో ! చిత్రరీతి
గౌసల్యపాణిపంకజయుగ్మమందు
నాటలాడుచునుండె నర్భకుండగుచు

నామె భక్తిప్రేమ లందునజిక్కి.
నీలాబ్జగంభీరనీరదశ్యామ
కామకోటిమనోజ్ఞకాయంబుతోడ,
గమలపత్రస్థితఘనమౌక్తికోప
మానారుణాంఘ్రిపద్మద్వయదీప్త
నఖముఖద్యుతుల విన్నాణంబుతోడ,
వరకులిశాంకుశధ్వజరేఖ లొప్పు
మహితసత్పాదపద్మంబులతోడ,
మునిజనమానసమోహనం బైన
పాదాబ్జనూపురధ్వానంబుతోడ,
గమనీయకింకిణీకటితటితోడ,
నుజ్జ్వలరేఖాత్రయోదరభాగ
నిరుపమానాన్యదుర్జ్ఞేయగంభీర
పృథుమహాగాధనాభిస్థలితోడ,
భూరిభూషణమహాభుజములతోడ
వ్యాఘ్రనఖాంచితాత్యంతసౌందర్య
భాస్వద్విశాలసద్వక్షమ్ముతోడ,
మహితమనోహరమణిహారపదక
ధాత్రీసురాంఘ్రిముద్రాశోభలీను
ఘనతరోదము కంబుకంఠంబుతోడ,
సుందరంబై వెల్గు చుబుకంబుతోడ,
నగణితమదనశోభాలయం బైన

భవ్యభవ్యాననపద్మంబు తోడ,
నరుణాధరంబులు నందముల్ చిలుక
జిగురులపైన గ్వచిత్తుగా మొలచి
తనరెడి రెండేసి దంతాలతోడ,
సంపెంగ మొగ్గకు సరిదీటువచ్చు
ముద్దులు గులికెడి ముక్కుతోడుతను,
ఫాలరంగంబునవర్ణనాతీత
కస్తూరికాతిలకంబుతోడుతను,
రమణీయరూపకర్ణంబులతోడ,
లావణ్యమయకపోలంబులతోడ.
నత్యంతమధురంబు లౌచు, దీపించు
వచ్చియు రానట్టి పలుకులతోడ,
జన్మించుటాదిగా నవరింపబడక
తల్లిచే బహుళవిధానంబులందు
రమ్యరమ్యంబుగా రచితమైనట్టి
మృదువక్రకుంతలబృందంబు తోడ,
ఒంపైన పచ్చని చొక్కాయితోడ
మోకాళ్ళపైనను మోచేతులందు
ప్రాకుచు బోయెడు బాలరాఘవుడు
సమ్మోహపఱచు నా స్వాంతంబు నెల్ల.
ఆ బాలరామదివ్యాకారశోభ
నాశ్రితులైన, సద్వాధీశు డైన

వర్ణింపజాలరు పర్వతతనయ !
కలనైన దానిని గాంచినవారె
ఇది చిత్తమందు గ్రహింపగా గలరు.
ఆనందమయుడు, మాయారహితాత్మ,
డా మనోవాక్కుల కఖిలేంద్రియముల
కందక వెలుగుచున్నట్టి ఘనుండు
నా రాజమిథునమహాప్రేమవశత
భవ్యంబు లైనట్టి బాలలీలలను
సలిపినా డో గౌరి! సకియ! అపర్ణ!
జగతికి జననియు జనకు డైనట్టి
యీ రామభగవాను డీ ప్రకారముగ
నా యయోధ్యగల ప్రజావళి నెల్ల
నానందసంభరితాత్ముల జేసె.
రఘునాథపాదాబ్జరతులకే యిట్టి
పరమసుఖంబు భవాని! ప్రాప్తించు.
రఘుపతివిముఖుడు శ్రమలెన్ని పడిన
భవబంధముక్తిని బడయగా లేడు.
సచరాచరప్రపంచంబెల్ల గనగ
నే మాయచే జిక్కి యిడుములబడునొ
ఆ మాయసైతమహో! ప్రభుముందు
భయముచే గడగడ వణకు-శ్రీరాము
లావణ్యభృకుటీవిలాసమాత్రమున

నా మాయ మఱియు నాట్యం బొనరించు
నట్టి జగన్నాథు ద్యజియించిన మన
మెవ్వని భజియింతు మింక భవాని ?
తమ చతురత్వంబు ద్యాగంబొనర్చి
త్రికరణశుద్ధి నే ధీరులు తనను
భజనం బొనర్తురో వారలయందు
శ్రీరఘురాముడు కృప జూపగలడు.
ఈ ప్రకారము జగదీశుండు శౌరి
లావణ్యబాలలీలావిలాసముల
సకలపౌరావళి సంతోషపఱచె.
ఆ బాలరాముని నా జనయిత్రి
ఆడించు కరములయం దెత్తికొనియు
నొకసారి నూయల నుంచియు నూపు
నా ప్రేమలో మగ్నయైన కౌసల్య
మఱచె దివానిశల్ మానసమందు
బుత్రవాత్సల్యసంపూరిత యగుచు
నా బాలరామలీలావళులెల్ల
దగ బాటబాడు నా తల్లి కౌసల్య.
కౌసల్య యొకనాడు కన్నకుమారు
జలకమాడించి భూషణముల దొడిగి
ఊయల యందు బరుండగా బెట్టి
బుజ్జిపాపను నిద్రబుచ్చినపిదప

దన యిష్టకులదేవతను సమర్చింప
స్నానకార్యంబును సలిపె దా భక్తి
నాపయి నిజదేవతార్చన జేసి,
నైవేద్య మొసగి, యనంతరం బామె
పాకగేహమునకు వచ్చియు దిరిగి
పూజాగృహమునకు బోయి వీక్షింప
నైవేద్య మిడిన యన్నంబును బ్రీతి
భక్షించుచుండెను బాలరాముండు.
భయపడి ఆమాత పరుగిడి పోయి
ఊయలలో జూడ నూయలయందు
నిద్రించుచుండెను నిసుగు రాఘవుడు.
తిరిగి యా కౌసల్య దేవమందిరము
గనుగొన నెప్పటి కరణి యందుండె
బాలుడౌ రాముడు బహువిచిత్రముగ
నామె కంపించె భయభ్రాంతయగుచు
ధీరత్వమెల్ల గతించె జిత్తమున.
నొకని దేవళమున నొకని నూయెలను
బాలకద్వయము నప్పడతి వీక్షించె
"నా మతి భ్రమియించెనా ?, లేక యిద్ది
చిత్రమౌ మాయావిశేషదృశ్యంబ ?"
అనుచు జింతించెను నాత్మ గౌసల్య
తనతల్లి యాకులత్వంబును గాంచి

పరిజనగణము సంబరమొంద నంత
నాచార్యు డరుదెంచి ఆ కుమారులకు
జూడాకరణకర్మ సొంపొప్పజేసె.
భూరిదక్షిణల విప్రులు పొంది రప్పు
డా కుమారచతుష్టయంబు ధరిత్రి
పరమమనోహరాపారచర్యలను
సలుపుచు దిరిగెను సాకేతపురిని.
ఆ మనోవాక్క్రియ లందుకో లేని
ప్రభువహో! దశరథప్రాసాదమందు
విహరించె బాలుని విధముగా గౌరి!
భోజనం బొనరింప బోవుచు రాజు
పిలిచిన తనతోడి పిల్లల విడచి
పోడయ్యె నా బాలమూర్తి రాఘవుడు.
అంతట గౌసల్య యరుగ బిల్చుటకు
ప్రభువహో! చిక్కక పరువెత్తుచుండె.
నేతినేతి యటంచు నిగమంబు లెవని
సన్నుతించుచునుండు; సాంబశివుండు
నైతమే కేశవు సాంతంబు గనడో
ఆ పరమేశ్వరు నా జనయిత్రి
బలమున బట్టగా బరువెత్తె నప్పు
డా ధూళిధూసరితాంగుడై వచ్చి
నట్టి బాలుని గాంచి యవనీశ్వరుండు

పకపక నవ్వుచు బైకెత్తుకొనియె.
ఆ బాలరాఘవు డన్నము న్దినగ
గూర్చుండి యుండిన గూడ జిత్తంబు
చలియించుచుండెను. సమయ మొక్కింత
దొరకినచో నింక దొరకక లేచి
పకపక నవ్వుచు బరుగిడుచుండు;
పెదవులసందున బెరుగన్న మొప్ప.

నతిసరళంబు సుఖాస్పదం బైన
బాలరాముని కథ భారతీదేవి,
శేషుండు, శ్రీసాంబశివుడు, వేదములు
గానంబు చేసి రా కథలయందెవరు
విముఖులో వారలు విధిచేత మిగుల
వంచితు లోభరద్వాజమునీంద్ర!

అంత నా సోదరు లందఱుగూడ
గౌమారదశ నొంద గాంచి గురుండు,
తల్లిదండ్రులును శాస్త్రములు పల్కినట్టు
లుపనయనంబుల నొనరించి రంత
శ్రీరఘుపతి గురుగృహమున కేగి
యల్పకాలమ్మున నన్ని విద్యలను
ఆరితేరెను నహో! అరయగా నెవని
సహజనిశ్వాసలో సకలవేదములు
నా హరికొక్కొ విద్యార్జనాశ్రమము?

ఇది యెంత కౌతుకం బెంచి చూడంగ.
విద్యావినమ్రతావిమలసౌశీల్య
నిపుణులై వారలు నృపలీల లెల్ల
జగతి గ్రీడించిరి సంయమివర్య!
బాణధనుష్పాణిభాసురు లైన
ఆ సహోదరుల మహాశోభ నరసి
సచరాచరప్రపంచము మోహమొందె
ఆ సోదరులు నల్వు రా నగరమున
వీథులయందున విహరించుచుండ
నచ్చటి జనులెల్ల నరయుచు వారి
గదలక నిలుచుంద్రు కాయముల్ మఱచి.
ఆ యయోధ్యానగరావాసియైన
ఆ బాలగోపాల మఖిలజనంబు
రాము గృపాళుని బ్రాణాధికముగ
దలచిప్రేమించె నాత్మల సంతతంబు.
నిజసోదరసుసఖాన్వితుడౌచు రాము
డనుదినంబును మృగయావినోదంబు
సలుపగా నేగును సాంద్రాటవులకు.
సముచితాలోచనాస్వాంతంబుతోడ
పావనం బై నట్టి పథమును విడక
వేట గావించి తా వేసినయట్టి
క్రూరమృగంబుల గొని తెచ్చి చూపు;

నవనీశునకు రాము డనుదినం బటుల
దద్రామబాణహతప్రాణులైన
మృగములెల్లను స్వర్గమేగె మునీంద్ర!
ఆ రామచంద్రుడు ననుజులతోడ
సఖులతోఁగలసి భోజనమొనరించు;
దల్లిదండ్రుల యాజ్ఞ దాటక నడచు;
సర్వదా పౌరులు సంతోషపడెడు
పద్ధతియందె కృపామూర్తి యగుచు
వర్తించు; నా రామభద్రుండు మిగుల.
సంప్రీతి గదురగా స్వాంతంబునందు
వేదపురాణముల్ వినును; తదీయ
దివ్యార్థములను బోధించు దమ్ములకు.
ఉదయమే లేచి, రఘూద్వహస్వామి
మాతాపితాచార్యపాదవందనము
సలిపియు, వారి యాజ్ఞను బొంది, పిదప
బట్టణకార్యతత్పరుడౌచు నుండు.
నా రాముధర్మచర్యలను వీక్షించి
హర్షించుచు నెసంగె నాత్మలో నృపతి.
ఆ యఖిలవ్యాపి ఆ యద్వితీయు
డా యనీహుం డజు డా నిర్గుణుండు
ఆ నామరూపశూన్యబ్రహ్మ మహాహా!

భక్తహితార్థమై బహువిధానుపమ
చిత్రలీలల నొనర్చెను భరద్వాజ!

## యజ్ఞరక్షణకై విశ్వామిత్రమహర్షి
## రామలక్ష్మణులను తనవెంట దీసికొనిపోవుట

ఆ పయి కథ శ్రద్ధ నాలింపు మింక:
జ్ఞానఘనుండు విశ్వామిత్రమౌని
వర్యం డొకానొక పావనాటవిని
నివసించు కొనుచును నియమంబు దనర
జపయజ్ఞయోగముల్ సలుపుచునుండె;
కాని యా మునిపతి కడుభీతి జెందె.
భయదమారీచసుబాహులనియెడి
రాక్షసాధముల దౌర్జన్యంబులకును.
యజ్ఞంబు గనుగొన్న నా నిశాచరులు
చని, యుపద్రవముల సలిపి, యా మునికి
దుఃఖంబు కలిగింపదొడగి రెంతయును.
హరిచేత దప్ప దా మన్యులవలన
పాపపుదానవుల్ వధియింపబడర
టంచును తలపోసె నా గాధి పుత్రు
డంత నా మునిపతి యాత్మ నిట్లెంచె
"అవనీమహాభారహరణంబు సేయ

నా హరి యవతార మందియే యుండె
నిదిమూలకంబుగా నే నేగి వాని
శ్రీపాదములను దర్శింతును గాక!
తగురీతి బ్రార్థించి తత్సహోదరుల
నిర్వైర గొనితెత్తు నిటకు సంప్రీతి.
జ్ఞానవైరాగ్యముల్ సకలగుణంబు
లెవ్వానియందున నెపుడు వసించు
నా జగన్నాథు గండ్లార వీక్షింతు."
నని బహువిధచింత లాత్మ గావించు
చరిగి యయోధ్యకు నా ముని వేగ
సరయూజలంబుల స్నానంబుజేసి
దశరథభూనాథు దర్బారు జేరె.

ఆలించి, యా మునియాగమనంబు
భూమినిర్జరబృందముల గూడి, నృపతి
ఎదురేగి, స్వాగతం బిచ్చి, పాదముల
దండప్రణామముల్ తా నొనరించి,
మహితరీతిగను సన్మానంబు జేసి,
ఆ మునివర్యు నిజాసనాసీను
గావింపగాజేసి, కడిగి, పాదముల
ఘనపూజ గావించి, కడుభక్తితోడ
నీ రీతి వచియించె: "నీనాడు నన్ను
బోలిన ధన్యుడీ పుడమిలో గలడె?"

అని వచియించి మహారాజు పిదప
సంతృప్తిపఱచె నా సంయమీశ్వరుని
వివిధరుచ్యాన్నముల్ పెట్టించి ప్రీతి.
రాజు చేసిన సపర్యల నెల్ల జూచి
యతిహర్ష మందె మహర్షి స్వాంతమున.
అంతట నృపతి నిజాత్మనందనుల
నలుగుర నా మునినాథుపాదముల
జేర్చి నమస్కృతుల్ సేయగా జేసె.
శ్రీరామచంద్రు వీక్షించినంతటనె
తాపసి మఱచెను తన తనుస్మృతిని;
ఆ రామముఖశోభ నరసి యా మౌని
అలపూర్ణశశి గన్న యట్టి చకోర
మటుల బ్రహ్మానందమందున మునిగె.
అంతట రాజు నిజాత్మ హర్షించి
యీ విధంబుగ వచియించె: "మునీంద్ర!
ఇంతకు మున్నెన్న డిట్టి సత్కృపను
నా పైన జూప రీ నాడు జూపితిరి.
ఏ కారణమున మీరేతెంచి నారు ?
తమ ఆజ్ఞ నెఱవేర్తు దక్షణ మందె."
అనిన విశ్వామిత్రు డనియె నీ రీతి:
"అవనీశ! దశరథా! అసురబృందములు
నను బాధపెట్టుచున్నవి యందుచేత

అధిప! నిన్నొక్కటి నడుగ వచ్చితిని;
అనుజుడౌ లక్ష్మణు డనుగమింపంగ
రాము నంపగవలె రాజ! నా వెంట
నా నిశాచరుల వధానంతరంబు
నాకు స్వాస్థ్యము గల్గు నరలోకనాథ!
హర్షచిత్తమున నీ యాత్మనందనుల
నా వెంట బంపు మీ నాడు నీ లోని
మోహంబు నజ్ఞానమును ద్యజియించి
ధర్మసద్యశము ప్రాప్తంబగు దీన
నతిశుభం బొదవు నీ యాత్మజులకును.

అత్యప్రియంబు లీ యాలాపములను
విన్నంత దశరథోర్వీనాథు నెడద
నడలెత్తె నతని ముఖాబ్జంబు వాడె;
నీ రీతి బలికె మునీంద్రునితోడ:
"ముదుసలి తనమున మునిరాయ! నాకు
బుట్టి రీ నలుగురు పుత్రులు స్వామి!
ఈ విషయము మీ రెంచ కేమేమొ
యడిగినారలు. మహాత్మా! విప్రవర్య!
అడుగుడు భూగోధనాగారసమితి
నడుగుడు సర్వస్వ మానందపడుచు
నీ క్షణంబందె మీకే నమర్పింతు
బ్రాణికోటికి దనుప్రాణాలకన్న

వేఱొండు నధికమౌ ప్రియములు లేవు
ఇవి తక్షణము త్యజియించెద నేను.
నా సుతులందఱు నాకు ప్రాణమ్ము
లందులో రాముని నణుమాత్రమైన
విడనాడి నేను జీవింపలే ననఘ!
అతిఘోరతరకఠోరాత్ము లైనట్టి
ఆ నిశాచరులేడ? అతి సుకుమారు
లైన నా ముద్దుల ఆత్మజు లేడ?"
అని నృపశేఖరు డాడిన యట్టి
ప్రేమరసప్లుతప్రియవాక్యపటలి
నాలించి తన హృదయమున హర్షించె
జ్ఞానఘనుండు విశ్వామిత్రమౌని.
అంత వసిష్ఠమహర్షి బోధింప
బరిపరివిధముల భావంబు లోన
నృపుడు సందేహనివృత్తిని బొంది,
యత్యాదరంబున నాత్మనందనుల
రామలక్ష్మణులను రావింప జేసి,
గుండెకు హత్తించుకొని, ప్రేమపొంగ,
మంచిబుద్ధులు బహుమార్గాల దెలిపి,
గాధేయు గాంచి యీ కరణివచించె:
"నాథ! యీ యిర్వురు నాదుప్రాణమ్ము
లిక పైన దండ్రి మీరే వీరి కనఘ!

ఇంకొక్క దిక్కు లేదీ బాలకులకు."
బహువిధాశీస్సుల పై గురిపించి
యొప్పగించెను; ఋషి కుర్వీధవుండు
రామలక్ష్మణుల గారాబంపు సుతుల.
నంతట వారు మాత్రాలయంబులకు
జని, యంఘ్రులకు నమస్కారముల్ సలిపి,
యాజ్ఞల బొంది ప్రయాణమై రంత.
నా వీరులిద్దరు నా నరసింహు
లా కృపాసాగరు లా మతిధీరు
లా విశ్వకారణు లా మహామహులు
ఆ రామలక్ష్మణు లానందపడుచు
మునిభయంబును బాపబోయిరి గౌరి!

అరుణమనోజ్ఞనేత్రాంబుజాతములు,
బహువిశాలాంచితవక్షస్స్థలంబు,
వరకరికరదీర్ఘబాహుదండములు,
చారునీలాంబుజసాంద్రతమాల
సమమహాకోమలశ్యామలాంగంబు,
పీతపటప్రదీపితకటిస్థలము,
ఘనధనుర్బాణసంకలితహస్తములు
గలిగి రాఘవుడు ప్రకాశించుచుండె.
శ్యామలగౌరాంగులై సొంపుగులుకు
నా రామలక్ష్మణు లను మహానిధుల

బొందె విశ్వామిత్రమునిశేఖరుండు !
"అహ ! ఈశ్వరుంతు బ్రాహ్మణహితకరుడు.
అందుకే భగవాను డాతని జనకు
వదలి నా కొఱకయి వచ్చుచునుండె."
ననుచు విశ్వామిత్రు డాత్మదలంచె.
మౌని యస్లేగుచు మార్గమధ్యమున
దాటక యను ఘోరరాక్షసి జూపె.
వారి ప్రసంగశబ్దంబు విన్నంత
నా ఘోరరాక్షసి ఆగ్రహం బొప్ప
పరుగిడి వచ్చెను వారలపైకి
నొక్క బాణమున నా యుగ్రరాక్షసిని
సంహరించియు రామచంద్రుండు శౌరి
అది దీనురాలని యాత్మనెఱింగి
తనపదం బొసగెను దాక్షిణ్య మొప్ప.
అంత గాధేయమహర్షిపుంగవుడు
తన హృదీశుండు విద్యానిధి యంచు
చిత్తంబులోనెంచి, శ్రీరాఘవునకు
క్షుత్పిపాసలు లేక శోభించురీతి
నసమానదేహబలాధిక్యములను
ఘనతేజ మొనగూర్చ గలిగిన యట్టి
విద్యనొసంగె సంప్రీతి వెలుంగ.
నఖిలాస్త్రశస్త్రవిద్యారహస్యముల

నన్ని సమర్పించి, యా జగత్ప్రభుని
స్వీయాశ్రమంబున జేర్చి, భుజింప
గందమూలఫలాల గడుభక్తి నొసగె;
నాతడే తనహితుం డనుచు గ్రహించి.

## విశ్వామిత్రయజ్ఞసంరక్షణ

ఉదయకాలమున రఘూత్తమస్వామి
మునిని గనుంగొని, "పోయి, మహాత్మ!
యజ్ఞంబు సలుపుమా! అతి నిర్భయముగ"
నన మును తెల్లరు నగ్నికుండముల
హోమంబు లొనరించుచుండి రా, మఖము
రాముడే స్వయముగా రక్షింపుచుండె.

ఈ సమాచారంబు నెల్ల దా వినియు
నల మునిద్రోహి దురాగ్రహోదగ్రు
డైన మారీచనీచాసురుం డంత
దనసైన్యముల గొని దండెత్తివచ్చె.
గొనలేని బాణంబు గొని రాఘవుండు
వదలగా వా డల వార్ధియావలను
శతయోజనంబులు జని మూర్ఛబడియె.
నాపయి శ్రీరాము డగ్నిబాణమున
నా సుబాహుని ప్రాణహరణం బొనర్చె.
దక్కిన రాక్షసతండంబు నెల్ల

నా లక్ష్మణుండు సంహారం బొనర్చె.
ఇటుల రాక్షసవధకృత్యంబు సలిపి
బ్రాహ్మణభయము నివారించె శౌరి.
యఖిలదేవమునీంద్రు లానందపడుచు
సంస్తుతించిరి రామచంద్రు. మునీంద్ర !
మఱి కొన్నిదినము లా మౌనులమధ్య
శ్రీరఘుస్వామి వసించి సత్కృపను
విప్రులపైన జూపించె. నా ద్విజులు
నా రామవిభు డెన్న యఖిలజ్ఞుడైన
భక్తివశంబుచే బహుళపురాణ
విపులకథావళి వినిపించి రనఘ !

## అహల్యాశాపవిమోచనము

అంతట గాధేయు డాదరమొప్ప
శ్రీరాముతోడ వచించె నీరీతి:
" ఓ ప్రభూ ! మన మొకానొక కార్యమరయ
బోవుద " మన రఘుపుంగవుం డలరి
యలధనుర్యజ్ఞంబు నరయ దలంచి
యనుగమించె మునీంద్రు ననుజునితోడ.
ఖగమృగజీవముల్ కన నొక్కటైన
వసియింపకుండగా బావురు మనెడి
యాశ్రమం బొక్కటి నరసిరి; వారు

మార్గమధ్యంబున. మౌనీంద్ర! అంత
నా యాశ్రమస్థలమందున్నయొక్క-
శిలను గనుంగొని శ్రీరామవిభుడు
దాని విశేషంబు దాపసి నడుగ
నద్దాని కథనెల్ల నా మునిపలికె:
"ఘనశాపవశమున గౌతమపత్ని
యీ శిలాకృతి ధరియించి యిచ్చోట
రామ! నీ పాదాబ్జరజము నాశించి
యోర్పుతో వీక్షించుచున్న దీవేళ
నీమెను కరుణింపవే రఘువీర!"

అఖిలదుఃఖంబుల హరణం బొనర్చు
పావనశ్రీరామపాదాంబుజములు
సోకిన మాత్రాన జోద్యంబు గదుర
నమలతపఃపుంజమై యా యహల్య
వ్యక్తమయ్యెను. భరద్వాజమునీంద్ర!
దాసజనాహ్లాదదాయకుండైన
యా రఘునాయకు నరసి, యహల్య
ముకుళించి కరములు ముందు నిల్చిండె
నతిభక్తివశతచే నవశాత్మయగుచు
బులకీకృతాంగయై ముఖమునందుండి
మాటలు వెడలక పరవశయయ్యె.
అతిభాగ్యశాలిని యైన యహల్య

పట్టెను; శ్రీరామపాదపద్మముల
బాష్పముల్ కన్నుల వరదలుగట్ట.
స్మృతితెచ్చుకొని, కొంత సేపటి కామె
ఆతడు హరి యని ఆత్మలో నెఱిగి,
ప్రభు రఘునాథు కృపావిశేషమున
నా యహల్యాదేవి హరిభక్తిపొందె.
నతిపవిర్మలవాణి యలర నహల్య
శ్రీరామునిటుల స్తోత్రింపగా దొడగె :

## అహల్యాకృత-శ్రీరామ స్తవము

### గేయము

"జ్ఞానగమ్య, జయజయరఘునేతా !
రావణారి ! బుధజనసుఖదాతా !
నేనపవిత్రస్త్రీని మహాత్మా !
ఐన గాచితివి జగత్పరిపూతా !
శరణు గోరితిని భవభయమోచన !
పాహి ! పాహి ! పంకేరుహలోచన !
నా పతి యొసగిన శాపము దేవా !
గొప్ప వరంబె కృపామయభావా !
భవమోచనహరిమంగళాకృతిన్
గనుల పండువుగ గాంచగల్గితిన్.
శంకరుండు నీ సందర్శనమున్

మహాభాగ్యమని యెంచు సతమ్మున్.
అజ్ఞురాల నే నో రఘురామా!
నా దొకవిన్నప మాలకింపుమా!
ఇతరవరంబులు గోరను నాథా!
నీ పదపద్మరజంబు సర్వదా
పుష్పమరందము మధుపము రీతిన్
సత మాశించెడి సదమలభక్తిన్
నా మతియందున బాదుకొల్పుమా!
జగన్నాథ! తండ్రీ! రఘూత్తమా!
ఎవని పదోద్భవపావనగంగన్
శివుడు శీర్షమున దాల్చె వెలంగన్.
ఎవని పదాబ్జములన్ నిజాత్మలో
పంకజాసనుడు పూజసేయునో
ఆ నీ పాదము లా దయాఝరీ!
నా శిరమున నిల్పితివి శ్రీహరీ!
ఆ గౌతమాంగన హరిని నా రీతి
సంస్తోత్ర మొనరించి సద్భక్తితోడ
శ్రీరామపాదరాజీవంబులంటు
బలుమాఱు వ్రాలియు బ్రదక్షిణ మొసర్చి
స్వాత్మప్రియంబైన పరమును బొంది
యా రామచంద్రుని యాజ్ఞ గైకొనియు

నానందసంభరితాంతరంగమున
నాథుని లోకంబునకు నిర్గమించె.

గేయము

అట్టి యహేతుకకరుణానిలయుం
డార్తబాంధవుం డా శ్రీరాముడు
కపటకలహములు పరిత్యజింపుము
మూఢతులసి ! శ్రీహరిని భజింపుము !

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### సప్తమవిశ్రామము

ఛత్రీభూత ఫణీంద్రా !
ధాత్రీశోకాపహార ! ధర్మాధ్యక్షా !
శాత్రవభీకర ! భవతా
పత్రయహార ! మట్టపల్లివాస నృసింహా !

సంయమివర్యు విశ్వామిత్రు గూడి
శ్రీరామలక్ష్మణుల్ చేరిరి లోక
పావనగంగాప్రవాహతీరమును.

ఆ సురవాహిని యవనీస్థలంబు
చేరిన కథనెల్ల జెప్పె గాధేయు
డంతట శ్రీరాము డఖిలర్షిగణము
స్నానాదికృత్యముల్ సలిపిరి పిదప
విప్రులుబడసిరి వివిధదానముల.

మునిబృందముల గూడి మోదంబు తోడ
బయనమై శ్రీరామభద్రుండు వేగ

దద్విదేహుల రాజధానియై వెలుఁగు
మిథిలాపురంబు సమీపించె ననఘ !
రాము డా పట్టణరమ్యత గాంచి
యనుజునితోడ మహాహర్షమొందె.
మణిమయసోపానమహితంబు లైన
యమృతోపమానశుభ్రాంబుసంపూర్ణ
వాపీసుకూపప్రవాహకాసార
ఘనతటాకంబులు గనిపించె నెన్నొ.
మంజులకుంజప్రమత్తభృంగములు
మధురకూజితచిత్రమయవిహంగములు
బహువర్ణవికసితపంకజాతములు
సర్వదాసుఖము నొసంగుచు వీచు
మందశీతలగంధమలయమారుతము
వారల నాహ్లాదపఱచె గాఢముగ.
ఆ నగరంబున కన్నివైపులను
విపులవిహంగసంభృతములై చెలఁగి
ఫలపుష్పపల్లవభరితంబు లైన
వరవాటికోద్యానవనము లొప్పారె.
వర్ణనాతీత మా పట్టణశోభ
యందలి ప్రత్యణు వతిముగ్ధపఱచు.
పృథులసుందరరాజవీథి వెలుంగు
బ్రహ్మ స్వయంబుగా వచియించె ననగ

మణిమయమై చిత్ర్యమహితసౌధములు.
ధనదసమానులై తనరుచున్నట్టి
వరవణిగ్జనులు వ్యాపారశాలాళి
నఖిలవస్తువులతో నలరారుచుండ్రి.
మహితమనోహరమార్గకూటములు
సుందరవీథులు శోభిల్లుచుండె
నమితసుగంధజలార్ద్రింబు లగుచు.
మందిరావళులెల్ల మంగళమయము
లా మందిరంబులయందు వెలుంగు
చిత్రముల్ రతిపతిచే వ్రాయబడిన
పగిది నాశ్చర్యంబుపఱచు నెల్లరను.
పురము నందున్న స్త్రీపురుషు లెల్లరును
సుభగసుభక్తులు శుచిగలవారు
సద్ధర్మశీలురు జ్ఞానభాసురులు
సద్గుణవంతులు సంయమివర్య !
నిరుపమానంబౌచు నెగడుచునుండె
జనకభూపతియుండు సౌధరాజంబు;
నతని సంపద గాంచి యమరులుగూడ
నాశ్చర్యమందెద రాత్మలయందు.
ఆ మహాదుర్గకుడ్యంబు నైతంబు
మనసు నాశ్చర్య నిమగ్నం బొనర్చు;
నఖిలప్రపంచంబు నందలి శోభ

డానిలో గూడినదా ! యనిపించు.
వివిధవర్ణంబుల వెలుగొందుచున్న
బహుమణిమయధర్మపటము లందందు
దనరారు ధవళసౌధంబు లందుండె.
వానిలో సీత నివాసంబు సేయు
సుందరమందిరశోభ వర్ణింప
వశమౌనె ! ఓ భరద్వాజమునీంద్ర !
అందంబు లొలుకు సింహద్వారములను
వజ్రకవాటముల్ భాసిల్లుచుండె;
నమ్మహాద్వారసీమాంగణమందు
సామంతనరపాలసంఘంబు లఖిల
వందిమాగధనటభట్టారకజన
మనయంబు కితకితలాడు క్రిక్కిరిసి.
హయగజరథసంకులాకరంబులుగ
గ్రాలు విశాలాశ్వగజశాల లచట.
బహుశూరజనమంత్రివరచమూపతులు
తనరారుచుండి రా ధాత్రీంద్రమణికి.
వారల సదనముల్ వఱలు నృపాలు
మందిరంబునకు సమానంబు లగుచు.
ఆ పురబాహ్యమునందు రాజిల్లు
దివ్యసరస్సరిత్తీరదేశముల
నిటనట విడసి రనేకభూపతులు.

అన్ని విధంబుల నతియోగ్యమైన
యసమానశోభతో నలరారు నొక్క-
చూతవనమ్మును జూచి కౌశికుడు,
"సుజ్ఞాని! రఘువీర! చూడు మీ వనము
బాగుగానున్నది వసియింత మిందు."
అన గృపాలయు డైన నా రామవిభుడు
"స్వామి! మంచి" యటంచు బలికి యచ్చోట
విడిసెను మునిజనబృందయుక్తముగ.

## శ్రీరామలక్ష్మణులను సందర్శించి జనకమహారాజు ప్రేమపరవశుడగుట

"వచ్చె విశామిత్రవరముని" యనెడు
వార్త విదేహభూపాలుని జేరె.
జనకభూపతి యంత సదమలసచివ-
భటగణభూసురవరగురుజ్ఞాతి-
జనులతో గూడి యా సంయమీశ్వరుని
దర్శింపనేగె సంతసము దీపింప.
అల్లేగి జనకమహారాజమౌళి
మౌనీంద్రు పాదపద్మంబులయందు
శిరమునుంచియు నమస్కృతిని గావింప
మునిపతి దీవించె ముదితాత్ము డగుచు.
పిదప భూపతి విప్రబృందంబులకును

వందనంబులు జేసి భక్తి మెఱుంగ
దన మహాభాగ్యంబు దలచి యుప్పొంగె.
పలుసార్లు కుశలముల్ ప్రశ్నించి నృపుని
గూర్చుండనియమించె గుశికనందనుడు.
అప్పుడే వనిజూడ నరిగిన యట్టి
శ్రీరామలక్ష్మణుల్ చేరి రచ్చటకు.
శ్యామలగౌరాంగు లతిసుకుమారు
లఖిలనేత్రానందు లఖిలప్రపంచ
హృచ్చోరు లా బాలు రిద్దఱుగాడ.
శ్రీరఘుస్వామి వేంచేసినంతటనె
యందఱు లేచిరి యప్రయత్నముగ.
అంత విశ్వామిత్రు డాదర మొప్ప
రామచంద్రుని తన ప్రక్కభాగమున
గూర్చుండగా జేసికొనియె జేచాచి.
ఆ యన్నదమ్ముల నందఱు జూచి
పరమసంతోషసంభరితాత్ము లైరి.
వారి కన్గవల బాష్పములు జాల్వాఱె
దనువులు పులకీకృతంబులై పోయె;
మధురమనోహరమంజులం బైన
యా రామచంద్రు దివ్యాకృతి జూచి
యా విదేహనృపాలు డయ్యె విదేహు
డతివిశేషంబుగా నానందవశత.

ప్రేమనిమగ్నుడై నృపతి తెల్వొంది,
స్థైర్యంబు నెలకొల్పి స్వాంతంబు నందు
మునిపాదపంకజములకంత మ్రొక్కి
గద్గదకంఠుడై గంభీరఫణితి
నీ రీతి దా వచియించె మునీంద్ర!
"ఈ మనోహరబాలు రెవరు? మునీంద్ర!
మునికులతిలకులా? భూపాలసుతుల?
'నేతి నేతి' యటంచు నిగమంబు లాడు
ఆ పరబ్రహ్మ మీ యాకృతుల్ గనెన?
సహజవిరాగమత్స్వాంతంబు నేడు
వీరల దర్శించి వివశత్వమొందె-
నల చకోరము చంద్రు నరసినరీతి.
అందుచే నేనిటు లడుగుచున్నాడ
నాకడ దాచక నాథ! గాధేయ!
సత్యంబు దెలుపుమా! సంయమివర్య!
ఈ కుమారులను నే నీక్షింపగానె
అత్యనురాగమ్ము నంది నా మనసు,
త్యజియించె బ్రహ్మలీనానందమిపుడు."
అన విని ముని నవ్వుచనియె నీరీతి:
"సమ్మతవాక్యముల్ జనక! పల్కితివి
నీదు వాక్యమ్ము లనృతములు గావు.
రాజ! లోకమున సర్వప్రాణికోటి

ఈ బాలకులను దా మెపుడు ప్రేమించు"
నన విని యా వాక్కు లానందపడుచు
దనలోన రాముడు దా నవ్వుకొనియె.
"రఘుకులమణిదశరథసుతుల్ వీరు
నృపతి వీరలను మద్హితమునకంపె.
ఈ రామలక్ష్మణు లీ సహోదరులు
వరరూపసౌశీల్యబలధాము లధిప!
తతజగత్త్రయవిదితంబుగా వీరు
సంగ్రామమున నిశాచరుల జయించి
నా యజ్ఞమును గాచినారు నరేంద్ర!"
"భవదీయసత్పాదపద్మముల్ గనగ
బూర్వ మందెంతటి పుణ్యంబు నేను
సలిపినానో గదా! సంయమివర్య!
శ్యామలగౌరవర్ణాంగు లైనట్టి
యీ సహోదరు లిద్ద ఱెంతయు జూడ
నానందమునకె మహానంద మొసగు
చున్నా రహో! పరిశుద్ధమై వెలుగు
వీరి పరస్పరప్రేమతత్త్వంబు
వర్ణనాతీతము, పరమమంజులము
నాథ! కృపామతి నా నుడుల్ వినుము."
అని విదేహుండు మహాహ్లాదపడుచు
మరల నీ రీతిగా మాటాడదొడగె:

"అనఘజీవబ్రహ్మలట్టుల వీరు
సహజస్నేహాతిశయులు మహాత్మ !"
ఆనందమున జనకావనీవిభుడు
ప్రభుని రూపంబును పలుమారు జూచి
తనువెల్ల బులకింప దన్మయుండయ్యె.
జనకు డంతట మునీశ్వరు బ్రశంసించి
మునిపాదముల శిరమ్మును మోకరించి
వారల నందఱ బరమసంప్రీతి
నిజనగరంబులోనికి గొని తెచ్చి
సర్వకాలంబుల సౌఖ్యదం బైన
యందమౌ మంచిరమం దుండజేసె.
ఆపయి నృపతి మహర్షి కౌశికుని
నర్చించి, సేవించి యఖిలవిధాల
నమ్మునివర్యుని యాజ్ఞ గైకొనియు
నిర్గమించెను నిజనిలయంబు ననఘ !

## శ్రీరామలక్ష్మణులు జనకపురమును చూడనేగుట

శ్రీరాము డంతట ఋషులతో గూడి
భోజనకార్యంబు బూర్తి గావించి
కొంత విశ్రాంతి గైకొని యంత లేచి
తమ్ముని చెంగట దా గూరుచుండె

నొక్క యామంబు ప్రొద్దుంచె నప్పటికే.
జనకుని నగరంబు జని చూచి రాగ
సౌమిత్రి హృది విశేషప్రీతి కలిగె;
కాని, రామునకును కౌశికమునికి
భయపడి తనలోని వాంఛను దాచె
ముసిముసినగవులు మొగమున జెలగ.
తమ్ముని హృదిలోన దాగిన వాంఛ
నెల్ల గ్రహించియు నినకులవిభుడు,
భక్తవాత్సల్యసంభరితాత్ము డయ్యె.
గుర్వాజ్ఞ నంత గైకొనగ దలంచి
చిరునవ్వు ముఖమున జెంగలింపంగ
పరమవినమ్రతాభయభక్తులొప్ప
బలికె నీ రీతి విశ్వామిత్రు తోడ :
"స్వామి ! లక్ష్మణునకు జనకపురంబు
గాంచగోరిక పుట్టె గానీ మహాత్మ !
తమకు జెప్పుటకు స్వాంతంబునం దతడు
భయము సంకోచంబు పడుచున్నవాడు.
ఆజ్ఞ నొసంగిన యనుజుని గొనియు
బట్టణంబును జూపి త్వరితంబుగదుర
తిరిగి యేతెంతుము. దేవ ! ఆచార్య !"
అన మునివరు డిట్టులనియె సంప్రీతి :
"నీతిమార్గమ్మునే నీ వాదరింతు

వనునది వింతగా దరయ శ్రీరామ !
ధర్మ సేతువునకు ద్రాతవు నీవు
ప్రేమరసంబున వివశుండ వగుచు
నాయనా ! దాసజనంబుల కీవు
సదమలసుఖము ప్రసాదింతు వోయి !
ఓ సుఖనిధులార ! ఓ భ్రాతలార !
పోయి మీ సుభయులు బురిఁజూచి రండు.
భవదీయసుందరవదనముల్ చూపి
సఫలం బొనర్పుడీ ! సకలనేత్రముల."
అంత మునీంద్రపాదాంబుజంబులకు
నతిభక్తి నతిఁజేసి ఆ సహోదరులు,
నఖలప్రపంచనేత్రానందదాత
లా రామలక్ష్మణు లరిగిరి పురికి.
వారల యమితశోభను జూచినంత
వెంటనంటెను బాలబృందంబు లెల్ల
లోచనచిత్తముల్ లోభంబు నొంద
పీతాంబరంబులు వెలయంగ గట్టి
నడికట్లు గట్టి విన్నాణంబు దనర
మూపుల దూణీరములను ధరించి
ఘనశరచాపముల్ కరములనుండ
గమనీయసుశ్యామగౌరవర్ణముల
నా యన్నదమ్ములు నలరారుచుండ్రి.

ఆ దేహశోభల కనువైన రీతి
నలదగాబడియెను హరిచందనంబు;
సింహకంఠములు, విస్తీర్ణబాహువులు,
గజమణిమాలికాగళదేశములును,
విమలారుణాబ్జశోభితలోచనములు
నిఖిలతాపంబులనిహతం బొనర్చు
పూర్ణచంద్రసమానముఖసరోజములు,
హృదయాపహారకశృంగారరుచిర
కాంచనకుండలకర్ణయుగ్మములు
కార్ముకసుందరాకారంబులైన
భృకుటీయుగంబులు వెలుగొందుచుండ
సౌందర్యపుముద్రచందంబు మెఱయు
తిలకరేఖలతో బ్రదీపించుచున్న
లలితవిశాలలలాటముల్ గలిగి
యా రామలక్ష్మణు లలరారుచుండ్రి.
మేచకకుంచితమృదుకేశయుక్త
సుభగశిరంబుల సొంపులు గులుకు
మిసిమికుళ్లాయలు మెఱయుచునుండె;
నా సహోదరు లిర్వు రాహా! మునీంద్ర!
నఖశిఖపర్యంతనవ్యసుందరులు
వారల ప్రత్యంగభాగంబుగూడ
నుచితవిధంబున నుండె శోభిలుచు.

నగరంబు గాంచ నా నరపతిసుతులు
వచ్చినా రనియెడు వార్త నాలించి
పరుగిడి వచ్చిరి పౌరు లెల్లరును
తమతమ పనులను త్యాగం బొనర్చి
నిష్ఠదరిద్రులు నిధుల గన్నట్లు.
ఆ సోదరుల సహజాద్భుతశోభ
గాంచి యా జనులు సుఖస్వాంతు లైరి
తమ లోచనములు సార్థక్యము నొంద.
సౌధసీమల గవాక్షంబులందుండి
యువతీమణులు చూచుచుండి రాత్రమున
రామరూపం బనురాగంబుతోడ.
అపుడు వారొండొరు లనుకొనిరిట్లు :
"జితకోటిమన్మథశృంగారు డెన్న
నా రాజపుత్రు డహా! చూడు సకియ!
నరసురాసురమునినాగులలోన
నిట్టి శోభారాశి నెందైన వినము.
నాలుగు భుజములు నారాయణునకు
నాలుగు ముఖములా నలువకు గనగ
నా త్రిపురారికో నైదు ముఖంబు
లతివికటాకృతు; లందుచే జెలియ!
ఈతని కెనయైన శృంగారమూర్తి
సురలం దొకండైన జూడగా లేడు.

అతికిశోరవయస్కు లానందనిధులు
శ్యామలగౌరవర్ణాంగసంయుక్త
లీ సోదరులు మహాశృంగారసదను
లహా! వీరి ప్రత్యంగమందున గూడ
నవకోటికోటిమన్మథుల సోయగము
పరిహారింపగ బడవలయు నిక్కముగ.
అట్టి సౌందర్యంబు నరసి యే దేహి
విభ్రమ మొందదు ప్రియ! వచియింపు"
మన నొకానొకతె ప్రేమాంచితరీతి
మృదువాణి గదురగా నిట్లు వచించె:
"ఏ జెప్పెడిది వినవే! మిత్రురాల!
మంజుమరాళయుగ్మంబటులున్న
నీ నృపబాలకు లిద్దఱుగూడ
దశరథరాజేంద్రు తనయులు; వీరె
కౌశికమౌనిమఖంబు రక్షించి
రణరంగమున ఘోరరాక్షసావళిని
సంహారించిన యట్టి శౌర్యవార్నిధులు:
ఆ శ్రావణాంబుదశ్యామలాంగుండు
ఆ నవనవసుందరాబ్జలోచనుడు
ఆ ధనుర్బాణసమాయతపాణి
భయదమారీచసుబాహురాక్షసుల
మదవిమోచన జేసె మహితశౌర్యమున;

ఆతడే కౌసల్యకాత్మనందనుడు.
ఆ సుఖధాముని యమలనామంబు
శ్రీరాము డందురు చెలియ! విన్నావె!
ఆ గౌరవర్ణాంగు డతికిశోరుండు
శరచాపములను హస్తంబుల దాల్చి
శ్రీరాము వెనువెంట జెలగెడి యాత
డా రాము చినతమ్ము డాతనిపేరు
లక్ష్మణు డందు రా లావణ్యరాశి
యల సుమిత్రాదేవియాత్మనందనుడు.
ఈ రామలక్ష్మణు లిద్దఱుగూడ
విప్రకార్యము నెఱవేర్చి యా పిదప
మునివధూశాపంబు పోజేసి, కాచి,
వచ్చి రిచ్చటకు జాపక్రతువరయ''-
అన విని హర్షించి రఖిలాంగనలును.
శ్రీరామచంద్రుని శృంగార మరసి
యి ట్లొక్క నారి వచించె సంప్రీతి:
''జానకీదేవికి సరితూగు నట్టి
వరు డీతడే సుమా పార్థివు డితని
దర్శించెనా, యింక దన శపథంబు
నావల ద్రోచి నిరాటంకముగను
సీత నీతని కిచ్చి చేయును పెండ్లి.''
అనవిని మఱియొక యంగన పలికె:

"వీరల సంగతి విభునకు దెలిసె;
వచ్చి యాతడు మునీశ్వరయుక్తముగను
వీరి సన్మానించె బ్రీతి వెలుంగ;
కాని, ప్రియా ! మన క్ష్మానాయకుండు
తన శపథంబును త్యజియింప డయ్యె;
విధివశ్యుఁడౌచు బృథ్వీనాథమౌళి
యజ్ఞానమును వీడడయ్యె దా నకట !"
అనవిని మఱియొక్క యతివ వచించె :
"ఆ బ్రహ్మ మంచివాఁడైనచో-మనము
నెంచిన రీతిగా నెవరికి దగిన
ఫలము వారల కిచ్చు పద్ధతి యున్న
దప్పక యీతడే ధారుణీసుతకు
వరుడు గాగల డని పలికెద నేను;
దీనిని గూర్చి సందేహంబు లేదు.
ఇట్టిదౌ సంయోగమే విధివశత
జరిగినచో నింక సర్వమానవులు
పరమకృతార్థత బడయగా గలరు.
ఇట్టి కూటమి లభియించిన యెడల
నితడు తప్పకవచ్చు నిచటకు మఱల
నని మానసము కడు నాత్రమొందిడిని.
అటుగానిచో సఖి ! అన్యథా మనము
నితని దర్శించుట యిక పట్టిమాసె;

ఉరుపురాకృతపుణ్య ముండిన గాని
ఈ యదృష్టము లభియింపదు మనకు.''
ఇంకొక స్త్రీ వచియించె నీ రీతి :
''బాగుగా నోసఖీ ! పలికితి వరయ
నీ వివాహం బతిహిత మందఱకును.''
ఇంకొక్క స్త్రీ వచియించె నీ తెఱగు:
''హరచాప మెన్నగా నతికఠోరంబె
యీ నీలబాలుడా మృదులశరీరు
డఖిలంబు, ముడివడు నట్లు లేదోయి !''
ఈ మాట లాలించి యింకొక్క వనిత
యీ రీతి వచియించె మృదులోక్తు లొప్ప:
''ఓ సఖీ ! జనులాడుచుండ నే వింటి
పైకి జూడగ చిన్న బాలుడై యున్న
నరయ నీతండు మహాప్రభావుండు.
అమితపాపము చేసినట్టి యహల్య
యీ రామచంద్రపాదాబ్జరజంబు
సోకి తరించెను చోద్యంబు మీఱ
నందుచే నీతడే యరమర లేక
శివధనుర్భంగము చేసియే తీరు.
తన కళాకౌశలత్వంబు దీపింప
సీతను దా సృష్టిచేసిన బ్రహ్మ,
యీ శ్యామలాంగు సృజించి ముందుగనె

వరునిగా నామె కేర్పాటు గావించె."
ఈ మాటలను విని యెల్ల స్త్రీగణము
సంతోషపడుచును స్వాదుకంఠముల
"శుభమస్తు శుభమస్తు శుభమస్తు"—అనిరి.
హర్షాతిరేకమునంది దెందముల
సుముఖులోపసుందరస్త్రీలు
గుంపులు గుంపులుగూడి పైనుండి
కురిపింప సాగిరి కుసుమవర్షముల;
నే వంక జనిన నా నృపసహోదరులు
నటునటు నహా! పరమానందమొదవె.
శ్రీరామలక్ష్మణుల్ చేరిరి పిదప
ఘనధనుర్యజ్ఞరంగస్థల మున్న
పట్టణప్రాగ్దిశాభాగ మచ్చోట
పరమవిశాలశోభాసమస్థలిని
ఘనతరాలంకారకలితమౌ నొక్క—
విమలవేదిక యుండె; వేదిక చుట్టు
నాలుగు వైపుల నరపతులుండ
గాంచనపృథుపీఠికలు వేయబడియె.
వానికి వెనుక పార్శ్వమున దాపుననె
మండలాకారసమంచితం బగుచు
నున్నతాసనపంక్తి యుండెను చుట్టు
ముందున్న యాసనపుంజమ్ము కన్న

నివి కొంచె మెక్కువ యెత్తుగా నుండె
సర్వవిధంబుల సౌందర్య మొప్ప.
వీనిపై బ్రజ లుపవిష్టు లయ్యెదరు.
వీనికి దాపున వెనుక భాగమున
నతివిశాలంబులై యందంబులొలుకు
వివిధవర్ణాంచితవిభవంబు లైన
ధవళాసనంబులు దనరారు చుండె.
తమతమ కులయోగ్యతల కనువుగను
స్త్రీ లీ ప్రదేశమందే కూరుచుండి
యట ధనుర్యాగంబు నరయు చుండెదరు.
మధుమధురంబులౌ మాటలతోడ
బురిబాలకులు ప్రేమ పొంగ వారలకు
జూపించి రచ్చటి చోద్యంబు లెల్ల.
ఆ సోదరుల మనోహరగాత్రములను
స్పృశియించి ప్రేమచే వివశత గనిరి
తనువులు పులకించె దత్సహోదరుల
సుందరాకారముల్ చూచియు జూచి
యతిహర్షమును పొంది రా బాలురెల్ల.
బాలు రెల్లరు ప్రేమవశ్యులై యుంట
మతి నెఱింగియును రామప్రభువర్యు
డా బాలకులు చూపు నాయా స్థలంబు
లెల్ల వీక్షించె దా నెంతయో ప్రీతి.

ఆత్మాభిరుచులకు ననుగుణ్యరీతి
నా బాలకులు పిల్చు నట్టి తావులకు
ననుగమించిరి వారి నా సహోదరులు
స్నేహానురాగముచేత మునీంద్ర !
మృదుమధురాంచితామృతవాక్కు లలర
నచ్చటి రచనంబు లన్నియు జూపె
దమ్మున కా రామధాత్రీవిభుండు.
ఎవ్వాని యాజ్ఞవహించి యా మాయ
లవనిమేషమున జలంబు దీపింప
బ్రహ్మాండకోటుల బ్రభవింప జేయు
నా దీనవత్సలు డహా ! భక్తివశత
గాత్మకయజ్ఞరంగస్థలి జూచె
నాశ్చర్యచకితుడై యనఘా ! మునీంద్ర !
కౌతుకంబుల నెల్ల గనుగొని పిదప
నా రామలక్ష్మణు లాచార్యుకడకు
బయలుదేరిరి, వారి భావంబునందు
కాలవిలంబము కలచగా సాగె.
భయమును భయపెట్టు పరమేశు డిట్లు
భజనప్రభావంబు ప్రకటించు చుండె !
పల్లని తీయని సల్లాపములను
బుడుతల నెల్లను బుజ్జగించియును
అతికష్టమున నెలవంది వీడ్కొనిరి

యా రామలక్ష్మణు లాచార్యు జేర.
భయభక్తి సమ్రతాభావంబు లొప్ప
వా రిద్దఱును గురుపదముల కెఱగి
యాయన యాజ్ఞయై నంత కూర్చుండ్రి.
అంత సాయంకాల మైన మునీంద్రు
డాజ్ఞ నొసంగ వా రంత నచ్చోట
నాచరింపగను సంధ్యావందనంబు,
ఋషి యా పయిని పురాణేతిహాసముల
గథల వచించెను కమనీయముగను-
అట్టుల గడచెను యామముల్ రెండు
రమణీయమైన ఆ రాత్రికాలమున.
సంయమీంద్రుం డంత శయ్యపై జేరె,
నా పయి మునిచరణాబ్జంబు లొత్త
గడగి రా రామలక్ష్మణు లతిభక్తి.
ఉన్నతబహుజపయోగముల్ సలుపు
వైరాగ్యజలధు లెవ్వరి పాదపద్మ
సందర్శనము సేయ సంతపించెదరొ,
ఆ కవల్ గురుని పాదాంబుజాతముల
భక్తివశాత్ములై పట్టి రోహోహో !
పలుమాఱు జా లని పలుకగా మౌని
యప్పుడు మాత్రమే యా రఘువరుడు
శయ్యపై జేరెను శయనించు కొఱకు.

రామానుజుం డంత రాముపాదముల
హత్తించుకొని హృదయాగ్రభాగమున
భయభక్తు లొప్పగా బరమమోదమున
మెలమెల్లగా నొత్తె మృదులహస్తముల;
"ఇక చాలు, శయనింపుమీ, వత్స!" యనుచు
బలుమాఱు రాముడు పలికిన పిదప
సౌమిత్రి శయనించె స్వాంతంబు నందు
సంధించుకొని రామచరణాంబుజముల.
కుక్కుటధ్వని కర్ణకుహరాల సోక
దెలవాఱుచుండగా దెలిసి లక్ష్మణుడు
నిద్రమేల్కాంచెను నిత్యపద్ధతిని.
అలజగన్నాయకుం డఖిలజ్ఞుడైన
శ్రీరాముడును జాగుసేయక లేచె
గురువరేణ్యుడు మేలుకొనుటకు ముందె.

## జనకోద్యానవనములో సీతారాముల పరస్పర సంవీక్షణము

అంత శౌచక్రియ లన్ని యొనర్చి
స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ దీర్చి
యా రామలక్ష్మణు లరుగుదెంచియును
మ్రొక్కిరి మునిపాదముల కతిభక్తి.
సమయంబు గుఱ్తించి స్వాంతంబులోన

సుర్వాజ్ఞపొంది యూ కూర్మిసోదరులు
పోయిరి పూజకై పూలు దెచ్చుటకు.
వారు రాజోద్యానవనమును గాంచి
రా పుష్పవనశోభ నరసి మోహించి
సర్వదా నిలుచు వసంత మచ్చోట.
బహువర్ణరమణీయభాసురవల్లు
లల్లిబిల్లిగను వ్రేలాడుచున్నట్టి
వివిధమనోహరవిటపరాజముల
వరనవపల్లవఫలసుమశ్రీల
సురలోకవృక్షముల్ చూచి లజ్జించు.
చాతకపికకీరచారుచకోర
విహగకూజితములు వినవచ్చుచుండె.
ఆడుచుండెను నెమళ్లందంబు లొలుక
నా వనమధ్యమునందు శోభిల్లు
మణిమయసోపానమహితవిచిత్ర
మగు నొక్క యతిమనోహరసరోవరము;
అందున వెలుగొందు నమలజలంబు
బహుళసుందరవర్ణపంకజయుతము
జలవిహంగధ్వానసంకులాయతము
శృంగారసంగీతభృంగశోభితము.
ఆ తటాకవరంబు నా పుష్పవనము
గాంచి శ్రీరామలక్ష్మణు లుల్లసిలిరి.

రాముని సైతము రంజింప జేసె
నత్యంతరమ్య మా యారామ మహహ!
ఆ వనమెల్ల దా మరసి సోదరులు
మాలీసమూహసమ్మతిని గైకొనియు
నతిముదంబొంది నిజాంతరంగముల
బుష్పదళంబుల బ్రోగిడుచుండ
నప్పుడే సీతయు నా వనంబునకు
దన తల్లి పంపగా దరలి యేతెంచె
శ్రీగిరిజాపూజ చేయుట కొఱకు.
సౌందర్యవతులు విజ్ఞానసందీప్త
లైన సఖీజను లామెతో వచ్చి
పాటలు పాడిరి వర్షింప మధువు.
ఆ సరోవరమున కతిసమీపమున
గలదు గౌరీదేవి ఘనమందిరంబు.
వర్ణనాతీతశోభారాశియైన
యా పావనాలయ మచటి కేతించి
చూచు వారల మనస్సుల గట్టివేయు.
కొలనిలో సకియల గూడి యా సీత
స్నానంబు గావించి సంతోషపడుచు
గౌరీనికేతనగర్భంబు జొచ్చి
కడు భక్తితోడ దుర్గాపూజ జేసి
తన కనురూపసుందరుడైన వరుని

దయసేయు మనుచు బ్రార్థన మొనరించె.
సీతతో వచ్చిన చెలికత్తె లందు
నొక సఖి విడిచేగె నుద్యాన మరయ.
ఆమెకు కన్నులయందున బడిరి
శ్రీరామలక్ష్మణుల్ శృంగారనిధులు.
ప్రేమభావోద్వేగవివశత్వ మొంది
సీతను జేరె నా చెలివచ్చి మఱల.
తనువెల్ల బులకింప దన్మయత్వమున
నేత్రయుగ్మంబున నిండ బాష్పములు
వచ్చిన యా సఖివైఖరి జూచి
"కారణం బేమి నీ ఘనహర్షమునకు ?"
అని మృదువాణితో నడిగి రందఱును.
అనవిని యా చెలి యనియె నీ రీతి;
"సుకుమారులును సర్వశోభాప్రపూర్ణు
లిరువురు రాసుతు లేతెంచి నారు
చెలులార ! యీ వనసీమ జూచుటకు.
ఒకడు శ్యామాంగు డింకొకడు గౌరుండు-
వారల నెట్లు నే వర్ణింప గలను ?—
కన్నులు లేవయ్యె గన వాక్కులకును.
వర్ణింప గనుల కా వాక్కులులేవు—"
అను మాటలను విని యా జ్ఞానవతులు
జానకీసఖు లెల్ల సంతోష పడిరి.

అంత సీతాహృదయాంతరంగమున
గల మహోత్కంఠత గని వారలోన
నొకతె యిట్లనియె దా నో చెలులార!
నేను విన్నట్టి యా నృపతనూభవులు
వా రిద్దరై యుండ్రు; వారలు నిన్న
మునితోడ నేతెంచి పురములో నున్న
సకలప్రజావళి సమ్మోహపఱచి
తమ దివ్యరూపసౌందర్యంబు చేత
స్వీయవశ్యాత్ముల జేసికొన్నార
లని వింటి నేను ప్రియాత్మీయులార!
అక్కడ నిక్కడ నఖిలత్ర జనులు
వర్ణించుచున్నారు వారి సోయగమె.
దర్శనయోగ్యులై తనరెడి వారి
దప్పక మనమేగి దర్శింత" మనగ
నా సఖివచనంబు లా సీత కమిత
సంతోషమును గూర్చె స్వాంతంబులోన.
ఆ జానకీలోచనాంబుజద్వంద్వ
మా రాసుతుల జూడ నాకులమొందె.
తత్ప్రియసఖిముందు దారి చూపింప
ననుగమించెను సీత యమితప్రహూత;
ఆమె రామప్రణయము పురాతనమె-
అని మెవ్వ రెఱుగ రహో! భరద్వాజ!

జనకనందిని సీత స్వాంతరంగమున
నారదోక్తుల స్మరణం బొనరించి
పావనప్రణయసంభరితాత్మ యగుచు,
జకితలోచనముల సకలదిక్తటుల
నరసెను భీతమృగార్భకం బటుల.
క్షితిసుతాకంకణకింకిణీజాల
నూపురమంజుధ్వనుల, నాలకించి
శ్రీరాము డిటుల వచించె సోదరుని
కనుగొని, "ఓయి లక్ష్మణ! వినుమోయి!
అఖిలజగజ్జయంబంద గాంక్షించి
యిదె రణభేరి మ్రోయించు పుష్పాస్త్రు
డని తోచుచున్నది యనుజా!" యటంచు
నా మంజులధ్వని యుదయించు దిశకు
వీక్షించె ప్రేమతో నింకొక సారి
జనకాత్మజాముఖచంద్రబింబమును
రామలోచనచకోరములు వీక్షించి
యానందపారవశ్యంబును పొందె.
ఆ ప్రభుచారునేత్రాంబుజాతములు
నిశ్చంచలము లయ్యె "నిమి" లజ్జ నొంది
వదలె దృగంచల భాగంబులనగ.
ధరణిజాసౌందర్యదర్శనానంద
నిర్భరత్వంబున నిలిచె రాఘవుడు

వచనంబు లాగ దిగ్భ్రాంతుడై పోయి.
నిజరచనామహానిపుణత్వ మెల్ల
నిటుల రూ పొందించె నిలబ్రహ్మయనుచు
దనలోన రాముడు దా నెంచుకొనియె.
"సౌందర్యమున కీమె సౌందర్యమిచ్చు.
శోభాగృహోజ్వలజ్యోతి యీ సీత.
వరకవు లెల్లరు వాడిన యట్టి
సర్వోపమానముల్ చవిని బాసినవి,
ప్రాతగిల్లినవి; విశ్వంబులో నింక
దేనిలో బోల్తు విదేహపుత్రికను ?"
ఇటుల సీతాశోభ హృది నెంచుకొనుచు
దన పరిస్థితి లోన దలపోసి ప్రభుడు
సమయానుకూలవచస్సులు దనర
ననుజునితోడ నిట్లనె శుద్ధమతిని:
"ఆమెయే జనకధరాధీశు తనయ
ఆమె నిమిత్తమే యీ ధనుర్మఖము.
సలుప గౌరీపూజ సఖులతోగూడి
వచ్చి యీ కన్యక వనసీమ నెల్ల
దన ప్రకాశంబుచే దనర జేసిడిని.
అమె యలౌకిక మగు శోభగాంచి
సహజపునీతమత్స్వాంతంబు నేడు
తమ్ముడా! సంక్షోభితం బాయె నోయి!

ఈ విషయంబుల కెల్ల గారణము
నెఱుగు విధాతయే, యీ తరుణమున
నదరుచున్నవి దక్షిణాంగముల్ నాకు
నిది శుభసూచనయే యెంచి చూడ.
రఘువంశజులు కుమార్గస్థమానసులు
కా రెన్న డిది వారి ఘనసైజగుణము.
స్వప్నమందైనను పరకాంత లందు
నా మతి జొరలే దనం గల నేను-
కలన దా వెనుజూపకయె నిల్చునట్టి
పరకాంతపై మోహపడుట లేనట్టి
యాచకజనముల నలరించు నట్టి
పుణ్యాత్ములరయ నీ పుడమిలో నరుదు.''
ఆ రామభగవాను డనుజుని తోడ
నీ రీతిగా వచియించెడి తఱిని
ధరణిజారూపలుబ్ధుం డైన రాము
మానసమధుప మా మానినీరత్న
భవ్యముఖాబ్జశోభామరందమును
త్రాగుచుసుండె దా దనివి దీరకయె.
నృపతనూభవు డెట కేగిరో యనుచు
జింతించు కొనుచును చిత్తంబులోన
జకితయై వీక్షించె జానకి దిశలు.
ఎందెందు నా బాలమృగనేత్రి చూచె

సితకమలావళీశ్రేణు లందందు
వర్షించి నట్లు ప్రభాసించె; నంత
నామెకు జూపించె నా సఖీజనము
శ్యామలగౌరవర్ణాంగులై వెలుగు
నృపకిశోరుల, లతాగృహపూర్వదిశను.
ఆ దివ్యరూపంబు లరయగా నామె
లోచనమ్ములు నిండె లోభగుణంబు.
ఎన్నడో కోలుపోయిన తన నిధిని
గనుగొన్న రీతి నా కనులు హర్షించె.
శ్రీరామమంగళాకృతిని వీక్షించి
యా కనుల్ నైశ్చల్యమందె నత్తఱిని
కనురెప్పలును వ్రాలకయె నిల్చి పోయె.
ఘనశరత్కాలరాకాచంద్రు గన్న
యల చకోరముచంద మా ధరాజాత
యధికానురాగిణి యై తనుస్మృతిని
బాయగా సాగెను పరవశత్వమున.
శ్రీరాము నామె నక్షిద్వారమునను
గైకొని హృదయపంకజ మందు నిలిపి,
వదలి పోకుండ రెప్పలకవాటముల
మూసి వైచెను జ్ఞానబుద్ధిదీపింప.
ఆ తఱి సీత ప్రేమాధీన యగుట
నెఱిగి సఖీజనబృంద మేదేని

బలుక సంకోచంబుపడియె భావమున.
ఆ సమయంబున నా యన్నదమ్ము
లౌక లతాగృహమునందుండి వెల్వడిరి——
అలమేఘపటలంబు లందు వెల్వడియు
వెలిగెడి విమలేందుబింబయుగ్మముగ.
అమితశోభారాశు లా వీరు లిర్వు
రలరారు చుండిరి యలనీలపీత
జలజాభదేహులై సంయమివర్య!
శిరముల శృంగారశిఖిపింఛములును
ప్రసవగుచ్ఛంబులు భాసిల్లు చుండె.
తిలకరేఖలు మహాదీపించు చుండ,
నందంబు లొలుక శ్రమాంబుబిందువులు
ప్రజ్వరిల్లుచునుండె ఫాలభాగములు.
ఘనతరశ్రీకారకర్ణయుగ్మముల
గమనీయకుండలకాంతులు జెలగ
విల్లుల బోలిన భృకుటులతోడ
గుటిలంబులై యున్న కుంతలంబులును
నవసరోరుహలోచనంబులతోడ
సుందరం బైనట్టి చుబుకంబుతోడ
శృంగార మొలుకు నాసికతోడ, నమిత
లావణ్యయుతకపోలములతో జెలగు
నా రాజపుత్రుల హాసవిలాస

ములు చిత్రములను బ్రముగ్ధ మొనర్చె.
వారల ముఖశోభవర్ణనాతీత
మది కోటిమదనుల నైన జయించు.
వరమణిమాలికావక్షముల్ దనర
గమనీయ మగు కంబుకంఠంబు లొప్ప,
గామేభకరబలఘనభుజద్వయము
లమర నా సోదరు లలరారుచుండ్రి.
ప్రసవపాత్రధరించి వామహస్తమున
వరలు నా శ్యామలవర్ణు డైనట్టి
నృపకిశోరుం డతిశృంగారరాశి!
హరికటిస్థలుని, పీతాంబరధరుని,
వరరూపశీలనివాసు, నా సూర్య
వంశభూషణు, రామభద్రుని జూచి
తమ్ము దా మఱచిరి తత్సఖీజనులు.
స్మృతి నొంది యొక చెలి సీతను తాకె
“తరువాత గౌరిని ధ్యానించు కొనుము
యిపుడేల చూడ వా నృపకుమారులను ?”
అని వచియింపగా నా ధరాతనయ
బిడియంబుతో గనుల్ విప్పివీక్షించె
శ్రీరఘుసింహుల జెలువొప్ప ముందు.
ఆపాదమస్తక మా రామశోభ
వీక్షించి జానకి పితృశపథంబు

స్మరియించి మిక్కిలి సంక్షోభ మొందె.
అనురాగపరవశ యగుట నా సీత
దెలిసి యా సఖులు భీతిల్లి యంతటను
" ఆలస్యమైనది" అని రేకరీతి.
" ఈ వేళకే రేపు నేతెంత" మనుచు
దనలోన నొక చెలి తా నవ్వుకొనియె.
సీత కీ నర్మోక్తి సిగ్గు కల్గించె.
అప్పటికే చాల యాలస్య మగుట
దల్లి భయంబు డెందంబున బొంది
గృహమునకేగగా నెంచి యా సీత
చెదరిన ధైర్యంబు చేరగా దీసి
శ్రీరామచంద్రుని హృది నిల్పుకొనియు
దన జనకాధీనతను స్మరించుచును
మరలెను తా నుండు మందిరంబునకు.
జింకనో పక్షినో చెట్టునో కనెడి
మిషతోడ జానకి మిగుల ప్రేమమున
బలుమాఱు వెనుకకు, బ్రక్కకు దిరిగి
శ్రీరఘువీరుని శృంగారరూప—
మీక్షించె మఱిమఱి తృప్తి దీఱకయె
ఆమె రామప్రేమ, యణుమాత్ర మైన
దరుగక యొక సముద్రంబయి పొంగె.
హరచాపకాఠిన్య మాత్మ దలంచి

సంకుల మొందుచు జానకి తరలె
శ్రీశ్యామలాకృతి హృదిలోన నిలిపి.
ఆ జనకాత్మజ ఆ సుఖస్నేహ
సౌందర్యగుణఖని చనుట వీక్షించి
రాముడు తన యంతరంగపత్రమున
బరమానురాగరూపం బయి వెల్గు
నతిరమ్యసుస్నిగ్ధ మగు సిరాతోడ
సీతాస్వరూపంబు చిత్రించు కొనియె.
అంత గృహంబున కరుగుచు సీత
యరిగి భవానీశుభాలయంబునకు
నామె పాదంబుల కతిభక్తి మ్రొక్కి
యంజలి చేసి యిట్లనుచు బ్రార్థించె:

## సీతాకృత గౌరీ స్తవము

### గేయము

జయజయ గిరివరరాజకిశోరీ!
జయ మహేశముఖచంద్రచకోరీ
జయ గజవదనషడాననమాతా!
జగజ్జనని! విద్యుత్తనూలతా!
జయము ఆదిమధ్యాంతవిహీనా!
నిగమాతీతప్రభావనిధానా!
భవభవవిభవపరాభవకారిణి!

విశ్వవిమోహిని ! స్వేచ్ఛాచారిణి !
పతివ్రతాజనగణశిరోమణీ !
నీ మహామహిమ నెల్ల భవానీ !
సహస్రశారద లాదిశేషులే
వర్ణనసేయ సమర్థు లౌదురే !
సేవాసులభ ! చతుర్విధఫలదా !
శివ ! పురారిసఖి ! శ్రీవరప్రదా !
సురనరమునిజను లెవరే గానీ
నీ పాదపూజ సుఖింత్రు భవానీ !
నిఖిలహృదయమందిరనివాసినీ !
నాదు వాంఛ నీ కెఱుక పావనీ !
నీకడ బైకి వచించుట యేలా ?
నిఖిలజ్ఞవు అంబా ! శివ ! బాలా !"
అని వచించుచు విదేహాత్మజ భక్తి
గౌరీపదంబుల గట్టిగా బట్టె.
ఆమె భక్తికి వినయంబున కంత
గిరిరాజసుతవశీకృతయయ్యె నపుడు
విగ్రహగళమున వ్రేలాడు మాల
జారగా మూర్తి హాసం బొనరించె.
సాదరంబున దత్ప్రసాదితమాల
సీతామహాదేవి శిరమున దాల్చె.
అంతట గౌరి మహాహర్ష మొప్ప

బలికె నీ రీతిగా బరమమునీంద్ర!
అవనిజా! నాదు సత్యాశీస్సు వినుము.
నీ మనోభీష్టంబు నెఱవేఱ గలదు.
సర్వదా నారదస్వామి వాక్యములు
శౌచవంతంబులు సత్యవంతములు.
నీ హృది యెవనిపై నిలిచె నా వరుడు
నీ ప్రాణనాథుడౌ నిజము కుమారి!"
"నీవు ప్రేమించు ఆ నీలాభ్రవర్ణు
డా నైజసుందరుడైన వరుండె
నీ ప్రాణపతియగు నిక్కంబు సీత!
పరమకృపాబ్ధి సర్వజ్ఞుడా ప్రభువు
నీదు శీలంబును నీ ప్రేమ నెఱుగు"
శ్రీగౌరి యిట్లు వచించు నాశీస్సు
లాకర్ణనము జేసి యా సీత, సకియ
లాహ్లాదమొందిరి యాంతరంగముల.
అంతట బలుసాఱు లంబ నర్చించి
మఱలె నింటికి సీత మది సంతసిలుచు.

అనుకూలముగ నుంట నా గౌరికరుణ
వర్ణింప లేనంత పరమహర్షమును
స్వాంతమందున బొందె నా ధరాతనయ.
ఆమె వామాంగంబు లదరగాసాగె
భాసురమంగళఫలసూచకముగ.

ఎంచుచు జానకీశృంగార మాత్మ
నా సహోదరు లిర్వు రాసంబు జనిరి
తమ గురూత్తము సన్నిధానంబునకును.
సరళస్వభావుండు స్వచ్ఛాత్ముడైన
శ్రీరాము డంత గౌశికమునిపతికి
వినిపించె జరిగిన విషయంబు నెల్ల.
అంతట మునివర్యు డా తెచ్చినట్టి
పుష్పముల్ గైకొని పూజ నొనర్చి,
ఆ యన్నదమ్ముల నాశీర్వదించె
"ఫలియించుగాక మీ వాంఛ"—లటంచు.
అనవిని హృదిలోన నానందపడిరి
శ్రీరామలక్ష్మణుల్, ఋషిభరద్వాజ!
భోజనకార్యంబు పూర్తియైనంత
పరమవిజ్ఞాని విశ్వామిత్రమౌని
ప్రవచింప దొడగె బురాణసత్కథల.
ఆ రీతి గతియించె నా దినం బంత,
గురువర్యు నాజ్ఞ గైకొని రఘుకులులు
సంధ్యాక్రియల జేయ జని రింతలోన
జందురుం డు ప్రాచీదిశాసీమ బొడిచె,
భూమిజాముఖపద్మమును తలపింప
జేయుచు, రాముని చిత్త ముప్పొంగ.
అంతట రాఘవు డంతరంగమున

శశబింబ మరసి విచారింపసాగె:
" ఈ హిమకరబింబ మెంచి చూడంగ
జానకీముఖముతో సరిపోలలేదు.
ప్రభవించె సింధుగర్భంబున మఱియు
ననుజన్మ్మడా చూడ—హాలాహలంబు;
దివసకాలంబున దేజంబు బాయు
సకళంక మదిగాక చంద్రబింబంబు;
జానకీముఖముతో సరిపోల గలదె ?
ఇదిగాక శశిగాంచు వృద్ధిక్షయముల
విరహిణీజనులకు వేదన గూర్చు;
పర్వసంధుల జిక్కువడు రాహువునకు;
కూర్చునుశోకంబు కోకంబులకును;
పంకజద్రోహంబు పాయక సేయు.
ఓ శశీ ! నీలోన నున్నవి చూడ
నవగుణములు గణనాతీతముగను.
ఆ విదేహకుమారి యాననంబునకు
నిను బోల్చి చూచుట నిఖిలవిధాల
ననుచితం బైన మహాదోష మగును."
రఘుకులపతియైన రాము డీ రీతి
రాజబింబంబు బురస్కరించుకొని
జానకీముఖశోభ సస్మృతి వేసి
చాల చీకటి పడ్డ సంగతి తెలిసి

గురుసన్నిధికి జేరుకొనియు, మౌనీంద్రు
పాదాంబుజములకు బ్రణతు లర్పించి
యాజ్ఞను గైకొని యరిగె బరుండ.

## శ్రీరామలక్ష్మణుల పరస్పరసంభాషణ

ఆ రాత్రి యరుగ నహర్ముఖ మందు
మేల్కాంచి రఘుపతి మిగుల సంప్రీతి
దమ్మునితో నీ విధంబుగా బలికె :
"అంబుజకోకలోకానంద మొసగు
నరుణోదయం బయ్యె నరయుమా వత్స!"
అనవిని జోడించి హస్తాంబుజముల
లలితలక్షణుడైన లక్ష్మణస్వామి
ప్రభురామచంద్రప్రభావసూచనము
చేసెడి మృదువాణి చెలగ నిట్లనియె :
"అరుణోదయం బయ్యె నా కారణమున
వాడెను కుముదముల్, పాసెను కాంతి
తారకాగణము, నాథా! ఆ విధాన
నీరాక నీక్షించి నిఖిలభూపతులు
వెలవెల బోయిరి వీరవరేణ్య!
నక్షత్రగణము లున్నను కోట్లకొలది
యంధకారము పోవ నటుల నా స్వామి!
యెల్లనృపాలకు లేకమై యున్న

శివధనుర్భంగము చేయగా లేరు.
కమలజగద్భృంగఘనవిహంగములు
హర్షించు నటుల నిశావసానమున
హరధనుర్భంగమై నంత హర్షింత్రు
భవదీయపాదాబ్జభక్తులెల్లరును.
ఓహోహో, అదె సూర్యు డుదయించినాడు
తమము నశించె యత్నంబు లేకుండ
గనపడకుండ నక్షత్రముల్ డాగె,
వెలుగులు గ్రమ్మెను విశ్వరంగమున.
ఆ రవి తన యుదయవ్యాజమునను
ప్రభు ! నీ మహాప్రతాపము బ్రకటించె.
సకలభూపాలకసంఘంబులకును,
భవదీయభుజబలప్రభ బ్రకటింప
నలధనుర్భంగకార్యంబు ఘటించు !"
అనెడి తమ్ముని వాక్కు లాలించి యలరి
చిరునవ్వు నవ్వెను శ్రీరామవిభుడు.
సహజపునీతు డా స్వామి యంతటను,
నిత్యశౌచక్రియల్ నెఱవేర్చుకొనియె.
స్నానసంధ్యాద్యనుష్ఠానముల్ దీర్చి
యిరువురు సోదరు లేగి మునీంద్రు
చరణాంబుజంబుల సన్నిధి, సుభగ
శిరముల వంచియు జేసిరి నతులు.

ఇట్లుండ జనకభూమీంద్రుండు తనదు
ఆచార్యుడైన శతానందముని౯ని
రావించియును సత్వరంబుగా బంపె
గాశికమునివర్యుకడకు; నా పిదప
నా శతానందమహర్షి యేతెంచి
జనకునివినతి విశ్వామిత్రమౌని
కెఱిగింప నాతడు హృదిపొంగి పిలిచె
రామలక్ష్మణులను రాజితగుణుల.
ఆ శతానందపాదారవిందముల
వందనంబు లొనర్చి వచ్చి రాఘవుడు
గురువర్యు సన్నిధి గూర్చుండ జూచి,
"నాయనా! శ్రీరామ! నరపతిజనకు
డాప్యాయముగ మనకై పంపె లెమ్ము."

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### అష్టమవిశ్రామము

శ్రీమాచిరెడ్డివరజా !
మామకధనబంధుమిత్రమాతాజనకా !
రామ ! త్రివిక్రమ ! కేశవ !
వామన ! హరి ! మట్టపల్లివాస ! నృసింహా !

## విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులతో ధనుర్యజ్ఞశాల కేగుట

" భవ్యసీతాస్వయంవర మేగి చూత
మెవని విధాత జయింపగా జేయు
నదిగూడ వీక్షింత"—మన మౌనివరుడు,
సౌమిత్రి యిట్లనె, " స్వామీ ! మునీంద్ర !
త్వత్కృపాపాత్రుడే వహించు జయము."
ఆ వరవాక్కుల నాలించి నంత
నఖిలమునీశ్వరుల్ హర్షితు లైరి.
ఆనందకందళితాత్మలై వార
లా లక్ష్మణునకు శుభాశీస్సు లిడిరి.

సకలమునీశ్వరసంయుతుం డగుచు
గరుణాళు వైన యా కాకుత్సనాథు
డా ధనుర్మఖశాల నరయగా వెడలె.
ఆ సహోదరు లిద్ద ఱా రంగభూమి
జేరినా రను వార్త చెవి బడినంత
స్త్రీలును, పురుషులు, చిన్నలు, పెద్ద
లాబాల గోపాల మందఱుగూడ
గృహకార్యముల వీడి యేగదొడంగి
రా యజ్ఞశాల కయ్యవసరమందు.
బహుజనబృందముల్ వచ్చుట గాంచి
జనకుడు విశ్వాససంయుతు లైన
భటులను రావించి పలికె నీ రీతి:
"సత్వరమే పోయి జనుల కందఱకు
నుచితాసనంబుల నొసగు" డనంగ
మృదువినీతోక్తిసంభృతు లౌచు భృత్యు
లధికులు, మధ్యము, లల్పులుగూడ
సర్వులు మనముల సంతోషపడగ
సముచితాసనము లొసంగి రా తఱిని.
శ్రీరామలక్ష్మణుల్ శృంగారనిధులు
సద్గుణసాగరుల్ సౌశీల్యఘనులు,
వీరవరేణ్యులు విపులసౌందర్య
కలితసుశ్యామలగౌరశరీరు

తేతెంచి రటకు మునీ! భరద్వాజ!
ఆ సహోదరు లిద్ద ఱా రాజసభను
తారకామండలోద్భాసితపూర్ణ
చంద్రబింబద్వయసామ్యులు నగుచు
భాసిల్లు చుండిరి; ప్రతివ్యక్తి తనదు
భావానుసారము బరికించె నప్పు
డా రామవిభువిగ్రహంబు మునీంద్ర!
ధరవీరరస మిట్లు తనువు ధరించె
నని తలంచిరి రాము నరసి డెందముల
ఖండనపాండితీభాసితభుజులు.
కుటిలస్వభావులౌ క్షోణీంద్రు లెల్ల
రతిభయానకమూర్తి యని రాము జూచి
గడగడ వణకిరి కడు భయం బొంది.
మాయచే రాజుల మాడ్కి వేషముల
ధరియించి కూర్చున్న దానవు లనిరి
ప్రత్యక్షకాలుని పగిది రాఘవుని.
అఖిలపురవాసు లా సహోదరుల
నయనసుఖప్రదుల్ నరకులాభరణు
లనుచు వీక్షించిరి యానందపడుచు.
హర్షసంభరితాంతరాత్మలై కాంత
లాత్మాభిరుచులకు ననుగుణ్యముగను
శ్రీరామచంద్రుు వీక్షించి చిత్తముల

"నీ విధానంబుగా శృంగారరసమె
పరమాసమానరూపంబు ధరించె"—
ననుచు దలంచిరో, యనఘా! మునీంద్ర!
వేత్త లా శ్రీరామవిభు గనుగొనిరి
బహుముఖకరనేత్రభాసురం బైన
యా విరాట్పురుషుని యద్భుతాకృతిగ.
జనకబాంధవులకే చందంబు దోచె
నన రామభగవాను డాత్మబాంధవుడు
గా గాన వచ్చెను కనులవిందుగను.
అలరాణియును విదేహావనీధవుడు
కన్నబిడ్డగ రాము గాంచిరి హృదిని
వాగతీతప్రేమభావంబు నిండ.
యోగుల కా రాముడుండె సాక్షాత్తు
శాంతంబు, శుద్ధము, సహజప్రకాశ
మగు పరతత్త్వమే యరుదెంచి నటుల
హరిభక్తు లగు వార లా సహోదరుల
నఖిలసుఖప్రదాయకు లై వెలుంగు
నిష్టదైవములుగా నీక్షించి రపుడు.
ఇక జానకీదేవి యెట్టి స్నేహమున
నెట్టి మోదంబున నీక్షించె రాము
నయ్యది యకథనీయం బయి తనరు;
నామెలో బొందిన యనుభూతి నామె

పలుక లేనంతగా బరవశయయ్యె.
కవి యెట్లు వర్ణింపగలుగు నా స్థితిని ?
ఈ ప్రకారంబుగా నెల్లరుగూడ
నాత్మీయబుద్ధికి ననుకూలరీతి
నవలోకనముజేసి రా కౌసలేయు.
ఆ రీతి నా కోసలాధీశసుతులు
శ్యామలగౌరరమ్యాంగశోభితులు,
నఖిలప్రపంచాక్షు లపహరించుచును
రాజసమాజవిరాజితు లైరి.
ఆ రామలక్ష్మణు లా సహోదరులు
సహజమనోహరచారువిగ్రహులు.
వారితో సరిపోల్చి వర్ణింతమనిన
కోటిపుష్పాస్త్రులుగూడ దక్కువయె.
అలశరశ్చంద్రుని నపహాసపఱచు
వారి సుందరముఖపంకజాతములు
వారల సంఫుల్లపద్మనేత్రములు
నుత్తేజమొనరించు చుండె భావముల.
ఆ రాజసుతుల శోభావలోకనలు
మారుని మదిగూడ బరవశపఱచె;
వారి మనోజ్ఞత వర్ణింపవశమె.
కలకపోలంబులు, కల్లోలమకర
మణికుండలద్వయమహితకర్ణములు,

లావణ్యచుబుకంబు లలితాధరములు,
మృదువాక్యరత్నంబు లెసగెడి వారి
దరహాసరుచులు సుధాకరకిరణ
జాలంబులను గేలి సలుపుచు నుండె.
వికటభ్రుకుటి, సొంపువెలయు నాసికయు,
బహువిశాలంబగు ఫాలభాగమున
దిలకరేఖలు గడు దీపించుచుండ,
నళిబృందముల బరిహాసంబు సేయు
కచములతోడ సంకలితులై వారు
పూవుల మొగ్గల బొమ్మ లందముగ
నటనట గుట్టిన యట్టి సొంపైన
పచ్చని టోపీల భవ్యశీర్షముల
ధరియించి యుండిరి తాపసచంద్రి!
కలకంబుకంఠభాగముల వారలకు
దనరు ద్రిరేఖలు త్రైలోక్యదివ్య
శృంగారగరిమకు నెల్లలనంగ.
మత్తేభమణిగణమాలికామణులు
తులసికాదామసందోహముల్ వారి
యురముల వ్రేలాడుచుండె నందముగ.
ఘనవృషభస్కంధకలితు లుదగ్రి
బలవిరాజితదీర్ఘబాహు లావారు,
సింహంబు లట్లు నిల్చిరి సభాస్థలిని.

కటితటతూణీరకలితులై పరమ
రమణీయపీతాంబరముల ధరించి
దక్షిణకరమున దాల్చిశరంబు,
దారుణమైనకోదండంబు మఱియు
నుజ్జ్వలపీతయజ్ఞోపవీతంబు
వామభుజంబున వహియించి యహహా!
ఆపాదమస్తకాత్యంతసుందరులు
నమితశృంగారరసాకృతు లగుచు
శ్రీరామలక్ష్మణుల్ చెలువొంది రపుడు.
వారిని జూచిన వారెల్ల నపుడు
పరమసంతోషసంభరితాత్ములైరి;
ప్రజలెల్ల గనుఱెప్ప వాల్పకే ప్రీతి
నేకదృష్టిని వారి నీక్షించుచుండి
రా యన్నదమ్ముల నరసియు జనకు
డాత్మయందున గడు హర్షంబు జెంది,
తక్షణమే పోయి తాపసోత్తముని
పాదపద్మంబులబట్టియు మ్రొక్కి
వినిపించి తన కథావృత్త మా పయిని
ఘనధనుర్యజ్ఞరంగస్థలం బెల్ల
గలయ జూపించెను గౌరవం బొప్ప.
ఆ రామలక్ష్మణు లరిగి రెందెందు
నందందు గల జను లందఱుగూడ

నాశ్చర్యచకితులై యరసిరి వారి.
తమతమ ముఖమునే, తదాశ్రితవిభుడు
కాంచుచున్నట్లుగా గని రెల్ల జనులు.
కాని యందుండిన ఘనరహస్యమ్ము
నెఱుగ జాలక పోయి రెవ్వరుగూడ.
అంత విశ్వామిత్రు డరసి రంగంబు
"నెంతయో బాగుండె నేర్పాటులెల్ల"
నని జనకునితోడ ననగ, నా నృపతి
యతిముదితాత్ముడై యానందపడియు;
అటగల సకలోన్నతాసనశ్రేణి
యందు నన్నిటి కన్న నన్నివిధాల
సౌందర్యవిశదవిశాలమౌ నొక్క-
యున్నతపీఠి గూర్చుండగా జేసె
ఋషిసమేతముగ నా నృపసహోదరుల.
పున్నమచంద్రుండు పొడిచినంతటనె
కాంతిని బాయు నక్షత్రంబు లటుల
రఘురామచంద్రుదర్శన మయి నంత
వెలవెల బోయిరి పృథ్వీంద్రు లెల్ల.
"తప్పక రాముడు ధనువును విఱుచు;
కాక-యా ఘనశివకార్ముకం బతడు
విఱువ లేకున్నను పృథ్వీకుమారి
యతనికే కీలించు నా జయమాల"

అని నిశ్చయించి నిజాంతరంగముల
నృపులు పరస్పరం బిటు లనుకొనిరి:
"హేసహోదరులార! ఇది విచారించి
మన యశఃపౌరుషామరబలతేజ
ముల కిదే వచియించి పూర్తిగా స్వస్తి
నింటి దారిని బట్టుటే హితమౌను."
అన నవివేకగర్వాంధు లైనట్టి
నరపతుల్ కొందఱు నవ్వి యిట్లనిరి:
"శివధనుర్భంగము చేసి నప్పటికి
సీతను రాముడు చేపట్ట లేడు.
అట్టిచో విలు వంచు టనునది లేక
సీత నెవ్వడు పెండ్లి చేసికోగలడు?
కాలుడే యెదురౌనుగాక యుద్ధమున
సీతకై వాని నిర్జింపగా గలము."
అని పల్కు గర్వోక్తు లాలకించియును,
ధర్మశీలురు జనార్దనభక్తు లైన
నరపతుల్ కొందఱు నవ్వి యిట్లనిరి:
"గర్వాంధులైన యీ క్ష్మాతలేశ్వరుల
కాశ లన్నియు నడుగంటు దథ్యముగ
సీతను పెండ్లాడు శ్రీరామవిభుడు;
రణధీరులగు దశరథరాజసుతుల
యుద్ధములో నెవ్వ రోడింపగలరు?

“ఇటు వృథాలాపంబు లేల వచించి
ప్రాణంబు లూరక పాయుట మీరు ?
భావితమాధుర్యవస్తుజాలమున
నాకలి దీర దత్యంతపునీత
మైన మా హితవాక్కు నాలించు డిపుడు:
ఆ సీత జగదంబ యని లోన నెఱిగి
యల జగత్పిత రాము డని గ్రహియించి
యాతని శోభ గండ్లారగా గనుడు.
సుందరుల్, సుఖదులు, సుగుణాలవాలు
లైన యీ రాఘవు లనవరతంబు
శివుని డెందమున వసించుచుండెదరు.
అతిసమీపములోని యమృతాబ్ధి విడిచి
యెండ మావులకు బర్వెత్తియు వెఱ్ఱి
నేల మీరలు గతియించుట చెపుడు ?
ఇంక మీ యిష్ట మేదేని గానిండు,
మా జన్మమాత్రము మహి దరియించె-
నని పల్కి విజ్ఞాను లగు ధరావిభులు
వీక్షింప సాగిరి ప్రేమ దీపింప
నా యనుపమసుందరాకార; మప్పు
డాకాశ మందుండి యమరగణంబు
లా దివ్యదృశ్యంబు నరయు చుప్పొంగి

కురియగా జేయుచు గుసుమవర్షములు
పాటలు పాడెను వర్షింపమధువు.

## సీతాదేవి స్వయంవరసభామండపమున బ్రవేశించుట

అయ్యది తగు సమయం బని యెఱిగి
జనకుడు కబురంప జానకికొఱకు
సౌందర్యచాతుర్యసదన లైనట్టి
ప్రియసఖీజను లెల్ల వెంట దోడ్తెచ్చి
రా సీత నుచితమర్యాద దీపింప.
శ్రీజానకీశోభ చెప్పగా వశమె !
అది వర్ణనాతీత మద్భుతాద్భుతము !
జగదంబ సౌందర్యసద్గుణరాశి
తద్ధరాజాత సీతామాత అహహ !
ప్రాకృతనార్యంగబాంధవత్వమున
నఖిలోపమానంబు లల్పంబు లయ్యె.
ఆ యుపమానసహాయంబుతోడ
వసుధాతనూజను వర్ణింపబూని
కుకవి నామంబును క్షోణిలో బొంది
యపయశంబును బొందు నవసరంబేల ?
ఒకవేళ ప్రాకృతయువతులతోడ
జానకీదేవిని సరిపోల్త మనిన

జగతిలో నామెతో సము లెందు గలరు ?
వట్టిమాటలమారి భారతీదేవి,
యా భవానీదేవి యర్ధాంగయుక్త,
యా రతీదేవి యనంగభర్తృకగ-
నతిదుఃఖచిత్తయై యంగలార్చెడిని.
ఇంక వైదేహితో నిందిరాదేవి
సరిపోలునందుమా, సరిపోల దెపుడు;
ప్రియసోదరులు మద్యవిషము లా రమకు.
సౌందర్య మను క్షీరసాగరమందు
రమ్యత యనెడి కూర్మంబును నిలిపి
శోభయే పూన రజ్జుస్వరూపమును,
మహితశృంగారమే మందరంబుగను
పంచాస్త్రుఁడే నిజపాణిపద్మముల
స్వయముగా జిలికిన సమయమ్మునందు
బూర్ణశోభానందమూలమై వెలుగు
నొక లక్ష్మి యందులో నుదయింప గలుగు
నపుడును సీతతో నా రమాసతిని
సరిపోల్చుటకు గవి సంకోచపడును.
చతురసఖీమణుల్ జనకపుత్రికను
పాటలుపాడుచు వర్ణింపమధువు
తెచ్చి రా రంగప్రదేశాని, కామె
యౌవనదేహామం దలరారు చుండె

బహుసుందరంబగు పట్టుపుట్టంబు
నా జగజ్జననిమహాదివ్యశోభ
యతులితమైన దాహా! భరద్వాజ!
సర్వభూషణములు సముచితస్థాన
ముల నలంకృతములై పొలుపొందు చుండె,
కడు శ్రద్ధతోడ శృంగారించి రామె
ప్రత్యంగమును చెలుల్ పరమాద్భుతముగ.
శ్రీజనకాత్మజ, సీత, భూజాత
యా రంగభూమిలో నడుగిడి నంత
నామె రూపము జూచి వ్యామోహమంది
రఖిలనారీనరు లాత్మలలోన.
అమరవరేణ్యులు హర్షితు లగుచు
మోయజేసిరి దుందుభుల నాకసమున
గీతముల్ పాడుచు గిన్నరాంగనలు
కురిపించి రవనిపై గుసుమవర్షముల.
సారసపాణుల జయమాల దాల్చి
త్వరితవీక్షణల సీతాదేవి చూచె
సకలభూపాలకసంఘంబు నపుడు.
చకితాత్మయై రామచంద్రుని కోస
మా సీత చూడగా నఖిలభూపతులు
భ్రాంతిని జెందిరి భావంబు లందు.
అంత సీతాదేవి యరసె మునీంద్రు

పరికగూర్చున్న శ్రీరామలక్ష్మణుల.
ఆమెచూపులు వారి యందున వ్రాలె
లుబ్ధంబులౌచు గోల్పోయిన నిధిని
గాంచిన తెఱగున ఘనమునిరాయ!
గురుజనబహురాజకూటంబు గాంచి
సహజలజ్జాన్వితస్వాంతయై సీత
శ్రీరఘువీరుని హృదిని గ్రహించి
చెలుల వైపునకు దృష్టిని మరలించె.
శ్రీరాము రూపంబు సీత శృంగార
మఖిలనారీనరు లరయు చేకముగ
తెప్పపాటుల విస్మరించియు నెల్ల
రాత్మలో దహతహలాడిరి గాని
వెఱగును జెందియు వెలికి వచింప
విధిని బ్రార్థించి రీ విధి స్వాంతమందు:
" జనకుని జడతను సత్వరం బీవు
పోగొట్టి మాదు సద్బుద్ధి నాతనికి
దయసేయుమా విధాతా! కరుణించి.
అప్పుడు వెనుక ముందాడక నృపతి
తన ప్రతిజ్ఞను పరిత్యాగంబు జేసి
శ్రీరామవిభునకు సీత నొసంగి
భవ్యకల్యాణోత్సవం బొనరించు;
నతని ప్రశంసించు నఖిలలోకంబు

సర్వులీబుద్ధికి సంతసించెదరు.
అటుగాక యాతడు హరమూనునేని
జివరకు దాపంబు జెందుట నిజము.
జానకీదేవి కా శ్యామసుందరుడె
యోగ్యవరుం డని యుద్ధృతభావ
నానిమగ్నులుగ నున్నారు సర్వులును."

## వందిజనులు జనకుని ప్రతిజ్ఞను ప్రకటించుట

పిదప వందిజనంబు బిలిపింప జనకు
డరుదెంచి రట బిరుదావళు లెల్ల
నుచ్చైస్స్వరంబున నుచ్చరించుచును.
అప్పుడు జనకరా జా వందిజనుల,
"పోయి మీరీ రంగభూమి నంతటను
చాటుడు నా ప్రతిజ్ఞావాక్యములను"
అని వచియింపగా నా వందిజనులు
బయలుదేరిరి తమ పని నిర్వహింప;
వారి డెందమున లవంబైన గాని
యుత్సాహ మనునది యుండక పోయె.
అంతట వందిజనావళి యిట్లు
వరవాక్కు లొప్పగా బలికి రా సభను :
"విను డో మహోధారుణీవిభులార! మేము

చేతులు పై కెత్తి చెప్పుచున్నాము,
శ్రీ శ్రీవిదేహధాత్రీవల్లభుండు
సలిపిన శపథంబు, సర్వులు వినుడు !—
రాజేంద్రభుజబలరాహు వీ ధనువు.
దీని కాఠిన్యత దీని భారంబు
నెల్లరెఱింగినదే నృపులార !
రావణబాణాదిరాక్షసభటులు
నైత మీ శంకరచాపంబు జూచి
చల్లగా నిండ్లకు జారుకొన్నారు.
ఈ రాజబృంద మందెవ డీ కఠోర
పురహరకోదండమును భంగపఱచు-
వైదేహి యతనినే వరియింప గలదు
నిర్విచారముగ నా నిముసంబునందు
త్రిభువనజయముతో దీపించు నతడు.''

### రాజుల అపజయము

ఆ ప్రతిజ్ఞను విన నఖిలభూపతుల
కభిలాష జనియించె నాంతరంగముల,
బలగర్వితావనీపతుల చిత్తముల
నతిరోష ముదయించె, నంతట వారు
బిఱ్ఱుగా నడుములు బిగియించుకొనుచు
బౌరుషమూని, చివాలున లేచి

వినమితశిరులౌచు బ్రియదేవతలకు
బోయి యా శంకరు భూరిచాపమును
క్రోధవీక్షణముల గొఱకొఱ జూచి
దానిని ధీరత దాకి పైకెత్త
దమ బలంబెల్లను ధారవోసినను
అది లేవదాయె రవ్వంత మాత్రమును.
వీసమైనను లో వివేక మున్నట్టి
నృపతులు మాత్ర మెట్లేని గానిండు
చాపము చెంతకు జననైన లేదు.
మూర్ఖమానసులైన భూపతులెల్ల
చాపము నెత్తగా సతమతపడియు,
బ్రతివీరభటబాహుబలమును మిగ్రింగి
యంతకంతకును భారాధికం బౌచు
నది పైకి లేవక యచలమై యుంట
నలసి కూర్చుండి రత్యాకులపడుచు.
అంతట బదివేల యవనీశు లొక్క-
సారిగా లేచి రా చాపంబు నెత్త,
సర్వయత్నములు నిష్ఫలమయ్యె గాని
పరమసతీమణిస్వాంత మెప్పుడును
కాముకు వాక్కుల గదలని రీతి
జలియింపదాయె నా శంభుకార్ముకము.
ఆసక్తి విడని సంన్యాసిచందమున

నపహాస మొంది రా యవనీశు లెల్ల.
తమ కీర్తి విజయపరితాపాతిశయము
లన్నియు గోల్పోయి యా వింటిముందు
మరల నా రాజసమాజంబు లెల్ల.
అలసి, హతాశులై యాకులపడుచు
నరిగి యా నరపతు లాత్మీయబృంద
మందున గూర్చుండి రణగియు మణగి.

జనకుని నిరాశాప్రకటన

అంతటా నృపతుల నరసి యా జనకు
డాకుల మొంది యిట్లనియె రోషమున:
"నా ప్రతిజ్ఞను విని నానాప్రదేశ
నరపతుల్ వచ్చి యున్నార లిచ్చటకు
ధృతనరరూపులౌ దేవదానవులు
పృథురణధీరులౌ వీరవరేణ్యు
లెందఱో నేడిట కేతెంచి నారు.

అలమనోహరకన్య, యద్భుతజయము,
రమణీయమగుకీర్తి ప్రాప్తించుచుండె—
గాని యీ కోదండఖండన జేసి
యీ బహూకృతుల గ్రహించు సమర్థు
నిప్పటికిని బ్రహ్మ సృష్టించనట్లు
కనిపించుచున్నది క్ష్మానాథులార!

మరలి యీ రీతి లక్ష్మణుడు వచించె:
"సూర్యకులాంబుజసూర్యుడా ! వినుమ
ఏ డంబమున వచియించుట లేదు
హృత్పూర్వకంబుగానే తెల్పుచుంటి :
నీ యాజ్ఞ యైనచో నేను శ్రీరామ !
బంతిచందమున నీ బ్రహ్మాండ మెత్తి
వ్రక్కలు సేతు మృద్భాండంబు రీతి
భవదీయ మగు ప్రతాపప్రభావమున
భగవానుడా ! మేరుపర్వతం బేను
త్రుంచెద ముల్లంగి దుంపచందమున.
నా కీ పురాణపినాకమా లెక్క ?
ఈ విషయంబు గ్రహించి యో నాథ !
ఆజ్ఞ నొసంగియు, నాపయి నీవు
కౌతుకకార్యంబు గాంచుమా స్వామి !
కమలనాళమువోలె గార్ముకం బెత్తి
యెక్కుడి, దాని వహించి హస్తమున
యోజనశతదూర మురికెద నేను.
భవదీయ మగు ప్రతాపప్రభావమున
ఛత్రాకదండము చందంబు దాని
విఱుతు బుటుక్కున విశ్వాధినాథ !
ఇటు సేయ లేకున్న, నిదియె నీ పాద
సన్నిధిలో బ్రతిజ్ఞను జేయుచుంటి

నిక ధనుర్బాణంబు లెపుడు ధరింప"
నిటుల లక్ష్మణు డాగ్రహించి వచింప
సుంఖని వణకె దిక్కుంభులు సొరిగె
సకలసభాసదుల్ సర్వభూపతులు
ఘనభయభ్రాంతసంకలితాత్ము లైరి.
సీత స్వాంతంబున జెందె హర్షమును
జనకభూవిభుడు లజ్జాయుతుం డయ్యె.
ఆచార్యుడును, రాము, డఖిలర్షివరులు
సమ్మోద మొందిరి స్వాంతరంగముల
బలుసార్లు, తనువులపై బుల్కలొదవ.
సంజ్ఞ గావించి లక్ష్మణుని వారించి
రాము డంతట ప్రేమ రాజిల్లుచుండ
జెంగట గూర్చుండ జేసె నా పిదప
నయ్యది శుభసమయం బని యెఱిగి
అత్యనురాగమయాలాపములను
పలికె నీరీతి విశ్వామిత్రమౌని:
" లెమ్మోయి శ్రీరామ! లేచి నీ విపుడు
భవుని చాపంబును భజియింపు మోయి!
జనకరాజేంద్రు విచారభారమును
పాఱద్రోలుము రామభద్రా! కుమార!"
అను గురువాక్యంబు లాలించి, రాము
డా ముని చరణంబు లందుంచి శిరము,

వందనం బొనరించె భక్తివెలుంగ.
ఆ రాము హృదయపద్మాంతరాళమున
మోదఖేదంబులు పొడసూపలేదు.
సింహశాబకమును సిగ్గొంద జేయు
శౌర్యధైర్యంబులు సందీప్తినొంద
సహజశోభను రామచంద్రుండు నిలిచె.

## శ్రీరాముడు శివధనుర్భంగము చేయుట

ఉన్నతాసనమను నుదయాద్రి నుండి
రఘువీరబాలసూర్యస్వామి పొడిచె
వికసించె సజ్జనబృందపద్మములు
సంతోషమొందె లోచనభృంగసమితి.
అరినృపాశానిశి యంతంబు జెందె
రాజప్రలాపతారల కాంతి తరిగె.
అభిమానయుతనృపాలావళీకుముద
కోటులు ముకుళించుకొని పోయె, సకల
కపటరాజోలూకగణములు నక్కె.
మునిదేవతాకోకములు శోకములను
వదలి వర్షించెను ప్రసవవర్షముల
భక్తిసంభరితసేవాచిహ్నముగను.
అంత రాముడు సహజానురాగమున
గురుదేవుపదములకు నతిజేసి

యఖిలమునీశుల యాజ్ఞగై కొనియె.
అఖిలజగత్స్వామి యా రామవిభుడు
సహజశోభ వెలుంగ సభను గమించె
గురుమత్తమంజులకుంజర మటుల.
ఆ రీతి శ్రీరాము డరుగుచునుండ
సర్వనారీనరుల్ సంతోష మొంది
పులకసమూహప్రపూర్ణాంగులైరి.
తమతమ పితృదేవతల, దేవతలను
తమపూర్వసుకృతాళి దలచుచు జనులు
ప్రార్థించి రీ రీతి భక్తివెలుంగ
"మా పూర్వపుణ్య మే మాత్రముండినను
ఓస్వామి! ఓప్రభూ! ఓగణనాథ!
శ్రీరామచంద్రుడు శివశరాసనము
మృదుమృణాళము ద్రుంచు రీతిగా నేడు
భంజించుగాక! మా ప్రార్థనం బిదియె."
శ్రీరామచంద్రు వీక్షించుచు ప్రీతి
చెలికత్తెలను తనచెంతకు బిలిచి
జానకితల్లి యీ చందంబు పలికె
స్నేహవశ్యంబున జింతతో నిండి:
"ఎల్ల బాంధవులును హితమిత్రజనులు
కౌతుకం బక్కటా! కాంతురే గాని
యొకరైన గురువుతో" నో మునిరాయ!

పసిబాలుడైన యా పార్థివసుతున
కా పని నొసగుట యనుచిత మగును.
రావణబాణాదిరాక్షసుల్ గూడ
నా విల్లు దాకకే యరుగుట నెఱిగి
దంభంబులాడిన ధరణీశులెల్ల
శృంగభంగంబును జెందుటదెలిసి
పాప మీ నరపాలబాలునిచేత
నా ధనుస్సుంచుట నాశ్చర్యకరము.
బాలమరాళంబు వహియింపగలదె
తతమందరాద్రిని దన మూపునందు ?
భూపతిమతి చెడిపోయిన దకట !
ప్రియులార ! యెఱుగము విధివిధానమును !
అని పల్క, విని యిట్టు లనియె నందొక్క
చతురసఖీమణిస్వాదువాక్యముల :
"సుజ్ఞానరాజ్ఞి ! తేజోనిధానులను
లఘువుగా నెంచ జెల్లదు చూచునెడల
కుంభసంభవుడేడ ? కూపార మేడ ?
చోద్య మాతడు వార్ధి శోషిల్ల జేసి
నిజయశంబున నింపె నిఖిలజగంబు.
చూడగా జిన్నది సూర్యమండలము,
నది యుదయించిన యా క్షణంబందె
త్రిభువనతమ మెల్ల ప్రీలి నశించు.

అరయగా, మంత్రమత్యంతసూక్ష్మంబె
యది బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతల
దన వశ్యవర్తుల దా జేసికొనును.
అంకుశం బెంతది - యది వంచగలదు
భువి, మత్తగజరాజమును మహారాణి!
పుష్పాస్త్రములచేత బూను మన్మథుడు
నిజవశంబులజేసె నిఖిలలోకముల.
ఈ విషయముల గ్రహించి యో దేవి!
వదలుమా! సంశయభావజాలముల
దప్పక రాముడు ధనువు భంజించు"
నను సఖీవాక్యంబు లాలించి రాణి
ధైర్యంబు పూనె వ్యథాభరం బుడిగె
నామె రామప్రీతి యధికమై వెలిగె.
ఆ రాము వైదేహి యరసి, స్వాంతమున
భయమొంది నిఖిలదేవతలకు మ్రొక్కి
యాకులమానసయై యాత్మలోన
నిట్లు ప్రార్థించె నుమేశుల భక్తి:
"హే! పార్వతీపరమేశ్వరులార!
సరగ నాయందు బ్రసన్నులు గండు!
నే మిమ్మునమ్మియు నియతి గొల్చితిని.
నా యందు గరుణామనస్కులై మీరు
తగ్గింపరారె కోదండభారమును,

దయ, వినాయక ! వరదాయకా ! దేవ !
ఈ నాటి జయసిద్ధికే విఘ్ననాథ !
నీ పూజ చేసితి నిత్యంబు నేను.
పలుమాఱు నే జేయు ప్రార్థన వినియు
నత్యల్ప మొనరింపుమా చాపభరము."
శ్రీరఘువీరు వీక్షించి వీక్షించి
చిత్తంబులో ధృతి చేకూర్చుకొనియు
జానకి ప్రార్థించె సకలదేవతల.
ఆమె కన్గవను ప్రేమాశ్రువుల్ నిండె
దనువెల్ల బులకీకృతంబయి వెలిగె.
కన్నుల విందుగా క్ష్మాజాతసీత
శ్రీరాముశోభ వీక్షించెను, గాని
తన తండ్రి శపథంబు దలచి నంతటనె
యామె మానస మెల్ల నతిక్షోభనొంద
దనలోన దా నిట్లు తలపోయ దొడగె:
"అక్కటా ! నాతండ్రి యాంతరంగమున
మంచిచెడ్డల చింత మాని వైచియును
దారుణశపథంబు తలచియున్నాడు.
మంత్రులు భయపడి మా తండ్రికిపుడు
హితబోధ సేయ రొక్కించు కేనియును
విబుధసమాజ మీ విధముగా నుంట
గడు శోచనీయముగా గానుపించు.

కులిశాతికఠిన మా కోదండ మేడ?
ఆ కోమలశ్యామ లాంగుడై వెలుగు
నృపకిశోరుం డేడ? యింక నే నెటుల
ధృతి పూనగల పరమేశ్వరా! యిపుడు?
వరశిరీషప్రసవంబు వజ్రమును
భేదింప గలుగునా? వెఱ్ఱివా రైరి
సకలమహాసభాజనము లీ తఱిని.
హే శంభుచాపమా! యిప్పుడు నిన్ను
శరణంబు గోరితి సాదరం బొప్ప
సభ్యుల కొసగి నీ జడత, రాఘవుని
దృష్టిసోకిన యంత దేలిక యగుమ!''
సీత యీ రీతిగా జిత్తంబు లోన
నతిపరితాపంబు నందె నాయమకు
నొక్క క్షణం బొక్క యుగశతం బయ్యె.
ఒకసారి రాము నింకొకసారి నేల
వైపున కా సీత పరికించు చుంట
నామె లోలాక్షులు నలరారుచుండె
మనసిజమీనయుగ్మం బరుదెంచి
చంద్రమండల మను జలడోలలోన
గ్రీడించు చుండిన రీతి మునీంద్ర!
లావణ్యయుత మగు లజ్జానిశీథి
యామె ముఖాంబుజ మందున జిక్కి

వాగ్ఫ్రంగములు బయల్పడజాల వయ్యె.
ఆమె కన్గోనల నశ్రువుల్ నిలిచె
గడు గృపణుని యింట గాంచనం బటుల.
అంతట సీత నిజాకులం బెఱిగి
తన భీరుగుణమును తలచి లజ్జించి,
హృదిలోన ధృతిబూని యిట్లు దలంచె :
"ఏను సత్యవ్రతనేని త్రిశుచిగ
నిర్మలరామాంఘ్రినీరజంబులను
నా చిత్త మెపుడు మగ్నంబగునేని
అఖిలాత్మవాసియౌ నా పరమాత్మ
తద్రామునకు సదా దాసిగా జేసి
నా కొనగూర్చు ధన్యత్వంబు నిజము.
ఎవనిపై సత్ప్రేమ యెపుడు దీపించు
నతనితో సంయోగ మగు నేరికైన
నిందు సందేహ మొక్కింతయు లేదు."
ఆమె రాముని జూచి యాంతరంగమున
రామానురక్తిలో బ్రాణంబులైన
నర్పింపగా నిశ్చయంబును పూనె.
ఈ విషయం బెల్ల నెఱిగి రాముండు
పరమకృపాబ్ధి సర్వజ్ఞుండు, ప్రభువు
సీతను వీక్షించి, శివువిల్లు జూచె
గరుడు డలాహిని గాంచిన పగిది

రఘువంశమణియైన రామచంద్రుండు
శివుని చాపమును వీక్షించుట జూచి
తనువెల్ల బులకీకృతంబయి వెలుగ
బలికె లక్ష్మణు డిట్లు బ్రహ్మాండభాండ
మంధ్రిపంకజమున నదిమి పట్టియును :
"అష్టదిగ్గజకమఠాహివరాహ
వరులార మీర లీ వసుధాస్థలంబు
గట్టిగా బట్టుడీ కదలకుండగను.
శ్రీరామచంద్రుడు శివుని ధనుస్సు
ఖండింప సున్నాడు గావున మీరు
నా యాజ్ఞ వినియు సన్నద్ధులై నిలుడు."
అంతలో రాముడు హరకార్ముకంబు
చెంతకుజేర, వీక్షించు చున్నట్టి
సకలనారీనరుల్ స్మరియించి రాత్మ
నా రామునకు సహాయంబు సేయుటకు
సురలను, తమతమ సుకృతసంఘముల.
సర్వజనాజ్ఞాన సంశయావళులు
మందభూపదురభిమానగుణంబు
భార్గవరాము గర్వప్రకటనము,
నమరమునీంద్ర భయాందోళనములు
సీతామహాదేవి చింతాకులంబు
జనకరాజేందుని పశ్చాత్తాపభరము,

దారుణరాజ్ఞీవ్యథాదావవహ్ని
మొదలైన భారసమూహంబు లెల్ల
హరచాపఘననౌకయందున జేరె.
అవి యెల్ల నెవని సహాయంబుతోడ
రాఘవబాహుపరాక్రమాపార
వారాశి దాటగా వలయు నో యట్టి
చుక్కాని పట్టెడు శూరుండు లేడు.
శ్రీరాము డంత వీక్షించెను మొదట
సభ్యులనందఱ, సర్వజనంబు
లిఖితచిత్రములవలె జ్జూచుచుండి
రంత నా కరుణాబ్ధి యరసి జానకిని
నతిశోకసంకులితాత్మగా నెఱిగె.
క్షణ మొక్క కల్పంబుగా గానుపింప
నుగ్రాకులాత్మయై యున్న వైదేహి
నరసె నా సూర్యకులాభరణుండు;
"తృషితుడై, నీటికై మృతి నొంద నొకడు
తదనంతరంబు సుధాతటాకంబు
లభియించిన న్గాని లాభ మే ముండు ?
సర్వసస్యం బెండి చచ్చిన పిదప
వర్షంబు గురిసిన ఫలమేమి కలుగు ?
సమయంబు తప్ప, బశ్చాత్తాప మేల ?"
అనుచు జింతించి నిజాత్మరాఘవుడు

వీక్షించి జనకుని ప్రియతనూజాత
నామె యనన్యమహాభక్తి నెఱిగి
పులకితాంగుడునయ్యె, మునిలోకనాథ !
అంత నాతడు తన యాంతర్యమందు
గురువందనముచేసికొని భక్తితోడ
హరచాప మెత్తె దా నతిలాఘవమున
నాకాశమున మండలాకృతి దోప.
ఎప్పు డాతడు ధను వెత్తి యా నారి
దగిలించి సారించె దాని నెవ్వార
లెఱుగరు, వంచి యెక్కిడి నట్టివిల్లు
చేదాల్చి యుండిన శ్రీరాము గనిరి.
క్షణములో శ్రీరామచంద్రుండు విఱిచె
హరుని చాపమును మధ్యకు రెండుగాగ.
తద్ఘోరతరమహోద్దండధ్వానంబు
బ్రహ్మాండభాండగర్భము లందు నిండె.
ఆ ఘోరఘోరమహాభీలరావ
మఖిలప్రపంచగహ్వరములదాకె-
మార్తాండహయములు మార్గంబు తప్పె
నష్టదిగ్గజములు నదరి ఘూర్ణిల్లె
సర్వవసుంధరాచక్రంబు వణకె
కుండలీశక్రోడకూర్మముల్ కదలె
నమరదానవమునుల్ హస్తయుగ్మముల

చెవి రంధ్రములపైన జేర్చి యా ధ్వనికి
గారణం బేమని కళవళ పడిరి;
కాని రాముడు కార్ముకము ద్రుంచు టెఱిగి
జయజయధ్వానముల్ సలిపి రెల్లరును.
హరచాప మను నావ యందునజేరి
రఘురామబాహుపరాక్రమాంబుధిని
తతమోహవశముచే దరియింప దలచు
సంఘ మా నావతో సైతంబు మునిగె.
విఱిగిన యా రెండు వింటి తుండెముల
నవనిపై బడ వేయ నా రామవిభుడు,
సర్వులు గనుగొని సంతోషపడిరి.
పావనప్రేమాంబుభరిత మైనట్టి
కౌశికమునిరూపఘనపయోరాశి
రామసుందరరూపరాకేందు జూచి
పులకవీచికల నుప్పొంగె నా తఱిని
దుందుభుల్ నభము నందున బెల్లు మ్రోసె
నాడిరి పాడిరి యమరకన్యకలు.
బ్రహ్మాదిసురసిద్ధవరమునీశ్వరులు
శ్రీరామవిభు బ్రశంసించి, సంప్రీతి
బహుళవర్ణప్రసవంబుల జల్లు
చా శీర్వదించిరి యానందపడుచు.
కిన్నరుల్ తీయని గీతముల్ పాడ

జయజయధ్వనము లజాండంబు నిండె
దద్ధనుర్భంగనాదమును క్రమింగియును.
ఎచ్చోట జూచిన నెల్ల జనంబు
పరమసంతోషసంభరితాత్ములగుచు
శంకరదుర్భరచాపంబు ద్రుంచె
శ్రీరాము డని ప్రశంసించుచే గలిగె.
వందిమాగధసూతభటసమూహములు
వినిపింపసాగిరి బిరుదావళులను.
గజహయమణిధనఘనవస్త్రములను
జనులెల్ల దానముల్ సలిపిరి దేవు
డా బాలవీరుని నాశీర్వదింప.
తాళముల్, రమ్యమృదంగశంఖములు,
సన్నాయి, భేరులు, చక్కని డోళ్ళు,
ఘనదుందుభులు, బహుకమనీయవివిధ
వాద్యముల్ మ్రోసె శుభంబు దీపింప.
ప్రతిచోట యువతులు రమ్యకంఠముల
భద్రగీతంబుల బాడి; రత్యంత
సంతోషమొందెను జనకునిరాణి
తన సఖీగణసహితంబుగా, గనగ
వాన లేకెండెడి వరిచేనుపైన
వర్షంబు గురిసిన పగిది మునీంద్ర!
జనకభూపతి నిర్విచారత బొంది

యంబువులం దీది యలసినవాడు
తీరంబు జేరిన తెఱగు సుఖించె.
నృపతుల ముఖశోభ హీనత జెందె
దివస మందున దీపదీప్తివిధాన.
స్వాతివర్షమునకు జాతకి పొందు
తత్సుఖంబునకె సీతాదేవిముదము
పోల్చగా వచ్చును మునిలోకనాథ !
కుముదాప్తుగాంచు చకోరకిశోర
మటుల లక్ష్మణుడు నిజాలోకనముల
నా రామచంద్రుని యందున నిలిపె.

## సీత, శ్రీరాముని గళమున జయమాల గీలించుట

అంత శతానందు నాజ్ఞానుసరణి
సీత తా నడచెను శ్రీరాము వైపు.
శుభగీతములు పాడుచును వచ్చుచున్న
చతురసుందరులైన సఖులతో గూడి
యమితశృంగారమయాంగంబు లొప్ప
గదలెను జనకభూకాంతు కుమారి
రమణీయబాలమరాళంబురీతి.
అలఘవులందు మహచ్ఛవిరీతి
చెలుల మధ్యమున భాసించె నా సీత

వరవిశ్వవిజయశోభామహాదీప్త
జయమాలకరసీరజముల ధరించి.
తనువున బిడియంబు తనరగా నామె
భావము పరవశభరితమై యుండె.
ఆమె నిగూఢరామానురాగంబు
పరుల కగ్రాహ్యమై భాసిల్లుచుండె.
చేరువకేగియు శ్రీరామచంద్రు
సౌందర్య మరసి యా జానకీదేవి
నిలచె చిత్రమువోలె నిశ్చలయగుచు.
చతురత గలిగిన సకియ యత్తటిని
నామె పరిస్థితి నాత్మ గ్రహించి
"శృంగారమయమైన యీ జయమాల
వరునకు వేయుమా వసుధజా!" యనుచు
ప్రోత్సాహపఱుపగా భూతనూజాత
జయమాల రెండు హస్తముల పైకెత్తె-
గాని దానిని రాముగళమున వేయ
ప్రేమాతిశయతతో వివశత్వ మొందె.
ఆమె పైకెత్తిన హస్తయుగంబు,
నాళసంయుతమైన నలినయుగ్మంబు
జయమాల గొనియును చంద్రబింబమును
భయముతో వీక్షించు పగిదిగా దోచె.
ఆ మనోహరదృశ్య మరసి యా సఖులు

నౌకరి వెంటౌకరుగా నుద్ధతి వీడి
సంగ్రామ మొనరింప సన్నద్ధులగుచు
డంబముల్ పలుక దొడంగి రా తఱిని.
ఆ మందభాగ్యుల యం దొక్క డిటుల
దతమదంబున బ్రల్లదంబులుగూసె:
"చెఱగొనిపోదము సీత నుద్ధతిని
బంధింత మీ రాజబాలు రిద్దరను.
ధనువును విఱచినంతనె ఫలమేమి ?
ఆయువు మా కంత మందుండు దనుక
నీ రాకుమారుని నెవడు పెండ్లాడు ?
జనకుడు వీరికి సాయమౌ నెడల
ముగ్గురగూడను పోర గెల్చెదము."
ఆ మాటలను విని యని రీ విధాన
సాధుభూపాలు రా శఠులను గాంచి:
"మహిని యీ రాజసమాజంబు జేర
లజ్జయే మిక్కిలి లజ్జ వహించు.
త్వద్బలవీర్యప్రతాపయశంబు
లా పినాకముతోడ నన్నియు గలిసి
వికలమైపోయె, నా వీరత్వమేన
భవదీయ మగు ప్రగల్భముల యందలిది ?
క్రొత్తశూరత్వమా కొనితెచ్చుకొనిరి ?
ఈ బుద్ధిచేతనే యీశుండు మీదు

ముఖములపై మసిపూసి యున్నాడు.
ఈర్ష్యామదక్రోధవృత్తుల విడిచి
కన్నుల విందుగా గనుడు శ్రీరాము
ప్రబలాగ్ని లక్ష్మణస్వామిరోషంబు
నందున శలభంబులై కాలవలదు.
గరుడునిబలి గాకి కాంక్షించి నటుల
గుందేలు, హరిభుక్తి గోరిన రీతి
ముక్కోపి తా సౌఖ్యమును గోరినటుల
శంకరవిద్రోహి సర్వసంపదల
బడయ గాంక్షించిన పద్ధతిగాను
కడులోభి, లోలుండు, కలకీర్తి నొంద
నాత్మలోపల దాను నాశించి నటుల
గామి, తా నిష్కళంకత గోరి నటుల
హరిపదవిముఖుండు స్వాంతర్య మందు
బరమగతిజ్ఞెంద వాంఛించి నటుల
మేదినీపతులార! మీ యభిలాష
యంతయు వ్యర్థంబు హాస్యాస్పదంబు!"
ఆ నృపసంరంభ మంతయు వినియు
సీత భయం బంద జెలికత్తె లంత
నామెను గొంపోయి రల రాణి కడకు.
అపుడు రాముడు శాంతి యలర చిత్తమున
జానకీప్రేమ ప్రశంసించు కొనుచు

దేశికోత్తము సన్నిధికి జేరనరిగె.
జనకు నర్ధాంగియు, జానకీదేవి
యాందోళనాభరితాత్మలై, "అకట!
ఏమియొనర్చునో యీశ్వరుం డింక?"
నని తలపోసిరి యనఘా! మునీంద్ర!
ఆ దంభరాజోక్తు లాలించి నంత
నటునిటు జూచియు, నా లక్ష్మణుండు
రాముభయాన మార్పలుక లేడయ్యె.
అరుణరంజితనయనాంబుజాతముల
గుటిలభ్రుకుటితోడ గొఱకొఱ జూచె
రాజసంఘముల నా రామానుజుండు
బహుమత్తగజములపై దూక నెంచు
కొదమసింగమువోలె గ్రోధంబు తోడ.
ఆ గోల వీక్షించి యంగనాజనము
లాకులపడి తిట్టి రా దుష్టనృపుల.

## పరశురామాగమనము - శ్రీరామవిజయము

ఆ సమయంబున నరుదెంచె నటకు
శివధనుర్భంగవిశేషంబు దెలిసి
భృగుకులకమలరవిస్వామి యైన
పరశురాముండు దుర్వారశౌర్యాబ్ధి
యతని జూచిన యంత నఖిలభూపతులు

పెద్దదేగను గన్న పిచ్చుకలట్లు
క్రుంగిపోయిరి భయాకులితాత్ములగుచు.
ఆ భృగురాము గౌరాంగభాగంబు
పావనభస్మవిభ్రాజమై యుండె.
బహువిశాలం బగు ఫాలరంగమున
భవ్యత్రిపుండ్రముల్ భాసిల్లుచుండె.
మస్తకంబున జటామండలి దనర
నాననశశిబింబ మాగ్రహావశత
నరుణరంజిత మయి యలరారుచుండ-
గుటిలభ్రుకుటితోడ గ్రోధాగ్నికీలి
కాజ్వలన్నేత్రయుగ్మంబు వెలుంగ
నా మునీశ్వరుని నైజాలోకనముల
బ్రకటితం బగుచుండె రౌద్రరసంబు.
వృషభరాట్స్కంధముల్ వెడదవక్షంబు
భాసురవరదీర్ఘ బాహుదండములు
విమలమౌ యజ్ఞోపవీతంబు వెలుగ
జపమాలికయు మృగచర్మంబు దాల్చి
కటిమునివసనంబు గట్టి శోభిల్లు
మూపున దూణీరములు రెండు దాల్చి
శరకార్ముకములు హస్తమున ధరించి
గురుభుజంబున గండ్రగొడ్డలి బూని
భార్గవరాముండు భాసించుచుండె.

శాంతమునీశవేషంబుతో నున్న
నతని కాఠిన్యకార్యములెన్నొ కలవు.
అతని యుగ్రచరిత్ర మకథనీయంబు.
సాక్షాత్తువీరరసంబె యా రీతి
మునిరూపమున వచ్చె భూపతులున్న
సభ కనిపించెను సంయమివర్య !
ఆ భృగునాథుని యాకృతి జూచి
భయవికలాత్ములై పార్థివు లెల్ల
దిగ్గున లేచియు దీనతతోడ
దమతండ్రి పేరుతో దమపేరు చెప్పి
దండప్రణామముల్ తా మొనరించి
రా సమయంబున నా భృగురాము
సహజకటాక్షవీక్షణములచేత
జూడగా బడినట్టి క్షోణీశు డైన
భావంబులో దన ప్రాణంబు లైదు
నెగిరి పోయినరీతి నెంచె - నంతటను
వచ్చి యా జనకభూపాలవరుండు
శిరము వంచియు నమస్కృతుల గావించి
సీతను రావించి చేయించె బ్రణతి.
ఆ ముని యామెను నాశీర్వదింప
హర్షించి చెలికత్తె లంత యుక్తిగను
చేర్చి రా సీతను స్త్రీసమాజమున.

అంత విశ్వామిత్రు డరుదెంచి కలసి
యా భృగురాముని యంఘ్రిపద్మముల
రామలక్ష్మణులచే బ్రణతి గావించె
"దశరథభూనాథుతనయులు వీరు,
రామలక్ష్మణనామరాజితు" లనుచు.
కాంచి యా చక్కని కవల, భార్గవుడు
నాశీర్వదించె మహాముసీ! వినుమ!
ఆ మారమదహరణాపారపరమ
పావనరామరూపంబుపై నిలచె
నా భృగురాముని యవలోకనములు.
అంత నా ముని సభ నంత వీక్షించి
యఖిల మెఱింగియు నజ్ఞుని పగిది
"ఎందు కీ జనులెల్ల యేతెంచి రిటకు?"
అని ప్రశ్నగావించె, నంగ మందెల్ల
వ్యాపింప గోపదావానలశిఖలు.
జనకు డంతట సమస్తక్ష్మాధిపతులు
దేనికి వచ్చిరో తెలుపుచు సర్వ
విషయమ్ము వివరింప - విని భార్గవుండు
చుట్టు వీక్షింపగా జూపట్టె నచట
క్ష్మాస్థలి బడియున్న చాపఖండములు.
అప్పు డా భృగురాము డతిరోషమొప్ప
బలికె గఠోరమౌ వాక్యంబు లిటుల:

"ఓ మూర్ఖ! జనక! యీ యుర్వీస్థలాన
నెవ్వ డీ కార్ముక మిట్లు భంజించె ?
వెంటనే వాని జూపింపుము నాకు
జూపింపకున్నచో జూడు మీ దినము
నీదు రాజ్యం బెల్ల నీట గల్పెదను."
అనిపల్కు నాలించి యతిభయవశత
జనకుడు మారాడ జాలక పోయె.
కుటిలరాజులు లోన గులుకుచు నుండ్రి.
మునిసురనాగులు పురజనావళులు
సంకులపూర్ణులై సంత్రాసపడిరి.
జనకునియర్ధాంగి, జానకీమాత
"అక్కటా ! విధి గూర్చె నను కోని చెడును"
అని విచారించె మహాకుల పడుచు.
భార్గవరామస్వభావంబు వినిన
సీతకు దోచెను చింతాభరాన
నొక్కయర్ధక్షణం బొక్క కల్పముగ.
సభయులై యున్నట్టి జనులను గాంచి
జనకకుమారి విచారం బెఱింగి
శ్రీరఘువీరు డీ రీతిగా బలికె :
గాని యా రాము హృత్కంజాంతరమున
మోదఖేదంబులు పొడసూపకుండె.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### నవమవిశ్రామము

---

దరహాసితవదనమండల !
పరిహాసితానంగకోటిభాసురరూపా !
వరనిశితసునఖశిఖరా !
వరదా ! హరి ! మట్టపల్లివాస ! నృసింహా !

"నాథ! శ్రీశివుని పినాకభంజనము
చేసిన వాడు మీ సేవకుం డొక్క-
డేమిటో భవదాజ్ఞ? ఏల నాతోడ
వచియింప రది మహాభాగ" అనంగ
నా క్రోధమౌని యత్యధికరౌద్రమున
శ్రీరాముతోడ వచించె నీ పగిది:
"సేవ చేసిన వాడు సేవకుం డగును
శత్రుకృత్యంబును సలిపిన వాడు
ఖండనం బొనరింప వలయును, రామ!
వినుము, శంకరు విల్లు విఱిచిన వాడు
కార్తవీర్యుని వంటి ఘనశాత్రవుండు.
ఈ రాజమండలి నింక నాతండు

వదలియు వేఁటాట బాగు, కాకున్న
సంహారమగుదురు! సర్వరాజులును.”
అను ముని వాక్యంబు లాలించి నవ్వి
పరశురాముని లక్ష్యపఱుపక పలికె
నీ రీతి లక్ష్మణుం డెదురుగా నిలచి:
“నా చిన్నతనమున, నాథ! యెన్నిటినో
విఱిచితి జినచిన్న విల్లుల, గాని
యపుడు నీవింతగా నాగ్రహపడవ
దేల యీ వింటిపై బ్రీతి నీ కింత ?”
అన భృగుప్రముఖ్యు డిట్లనె నుగ్రుడౌచు:
“ఓరీ ! నృపార్భకా ! యుగ్ర మైనట్టి
మృత్యుకరాళమం దీ వుండికూడ
స్వేచ్ఛను పూని వచింపుచున్నాఁడ
వఖిలప్రపంచవిఖ్యాత మైనట్టి
హరమహాధనువుతోనా యౌర ! నీవు,
సరిపోల్చెదవు క్షుద్రచాపంబు లెల్ల ?”
అన నవ్వి లక్ష్మణుం డనియె నీ రీతి :
“ఆలింపుమా దేవ ! యఖిలచాపమును
సమములే యని నేను స్వాంత మందెంతు
బ్రాత దీ విల్లును భంజన సేయ
నే లాభమొదవు ? మఱేనష్టముండు ?
ఇది క్రొత్త విల్లని యెంచి శ్రీరాము

డించుక తాకగానే ముక్క లయ్యె.
ఇందు రాఘవుని తప్పేమియు లేదె
యీ యకారణకోప మేల ? మునీశ !''
అను వాక్కు లాలించి యా భార్గవుండు
తన భుజమందున ధగధగ మెఱయు
గండ్రగొడ్డలి వైపు గని, యిట్టు లనియె:
''ఓ మూర్ఖడింభకా ! యుర్వి నీవెపుడు
నా స్వభావంబు విన్నావొకో లేదొ ?
పసివాడ వని నిన్ను బరిమార్ప లేదు.
ఏను కేవలము మునీశుండ ననుచు
దలచితివేమొ స్వాంతమున నో జడుడ !
బ్రహ్మచారిని నేను బాల్యమాదిగను
బాలకా ! యమితకోపస్వభావుడను.
క్షత్రియవంశనాశకుడ నే ననెడి
విషయంబు విదితము విశ్వమంతటను.
భుజబలంబున నేను భూమినంతయును
క్షత్రియరహితంబుగా జేసి, దాని
ధారుణీసురులకు దాన మిచ్చితిని
పలుసార్లు; చూడు మీ పరశు వియ్యదియె
ఆ కార్తవీర్య సహస్రబాహువుల
నఱకె ముక్కలుగాగ నరపాలబాల !
నీ తల్లిదండ్రుల నృపబాల యేల

యేడిపించెదవు నా యీ మహోద్దండ
పరశువు తఱిగె గర్భస్థపిండముల.''
అన, లక్ష్మణుడు నవ్వు చనియె మృదూక్తి:
''ఓహో! మునీశుండు యోధవర్యుండ
నే నని తన్ను దా నెంచుచున్నాడు!
ఉఫ్ఫని యూదియు నుర్వీధరంబు
నెగురంగ గొట్టగా నెంచు నట్లితడు
మాటిమాటికి వడిం బరశువు చూపు;
దర్జని జూపినంతనె వాడి పోవ
నిచట గుమ్మడి పిందె లేమియు లేవు.
భవదీయకార్ముకబాణకుఠార
ములు చూచి నంతట మునివరా! నేను
నభిమానసహితవాక్యంబు లాడితిని.
భృగుసుతుండ వటంచు నెఱిగితి నిప్పు
డరసితి నీదగు యజ్ఞోపవీత
మందుచే నా కోప మణచి చిత్తమున
నీవేమి యనిన సహించుచున్నాడ.
గోభూసురామరగోవిందభక్త
జనులపై మా వంశసంభవు లెపుడు
శౌర్యంబు చూపింప సమ్మత పడరు.
ఇందెవ్వరిని వధియించిన గాని,
పాపంబు వచ్చును వారలచేత

నపజయం బొందుట నపకీర్తివచ్చు
నీవు కొట్టిన గాని మేము నీ పాద
పద్మంబు లందున వ్రాలగా వలయు.
కోట్ల పిడుగులకును సమానంబు
నీ వాడు వాక్కు మునీశ్వరా! దాన
బరువుచేటులు ధనుర్బాణకుఠార
ములు; నీ మహాయుధముల గాంచి నేను
ననుచితవాక్యంబు లాడిన యెడల
నో మహామునిధీర! యోర్మి క్షమింపు."
మన విని రోషాత్ముడై వచియించె
భృగువంశమణి తా గభీరకంఠమున:
"కౌశికమౌని! యాకర్ణింపు మితడు
మందుండు కుటిలుడు మౌఢ్యచిత్తుండు,
కాలవశ్యుడు, కులఘాతకుం డితడు
ఘనసూర్యకులశశి గల కళంకంబు.
పెనునిరంకుశు డవివేకి నిర్భయుడు.
ఈ మరుక్షణమందె యీ డింభకుండు
కాలకరాళసంగ్రసితుడై పోవు
నెలుగెత్తి యే వచియింపుచున్నాడ
నావల్ల తప్పు నుంతయులేదు - నీవ
యీతని రక్షింప నెంచిన యెడల
వారింపు మీతని, త్వరగ బోధింపు

మస్మత్ప్రతాపబలాతిరోషముల.''
అనవిని లక్ష్మణుం డనియె నీ రీతి:
''ఓ మునినాథ ! నీవుండ నింకెవరు
భవదీయసత్కీర్తి వర్ణింప గలరు ?
నీ ప్రతాపంబును నీవె నీ నోట
నెన్నో విధాల ననేకపర్యాయ
ములు వచించితివి యో మునిలోకవర్య ?
ఇంకను నీకు సంతృప్తి లేకున్న
నింకను వర్ణింపుమీ, యంతెకాని
భవదీయకోపంబు ప్రతినిరోధించి
వలదు దుస్సహదుఃఖభాండంబు పొంద.
వీరవ్రతుండవై వెలుగొందుచుంద
వతిధీరచిత్తుండ వక్షోభితుడవె
యన్యుల నిందింప ననుచితం బనఘ !
సమరాంగణంబున శౌర్యశక్తులను
శూరవరేణ్యులు చూపింప గలరు.
గాని యాత్మస్తోత్రకథకులు కారు.
యుద్ధరంగమున ముందుండ శాత్రవుడు
స్వప్రతాపప్రగల్భము లాడుకొనుట
పిఱికివారలపని వీరులట్లనరు.
మృత్యువు నీ యాజ్ఞ నిమిడి యున్నట్లు
మాటిమాటికి నన్ను మడియ జేయంగ

నాహ్వాన మొనరింతు వన నా కఠోర
వచనంబు లాలించి పరశురాముండు
ఘోరమౌ తన గండ్రగొడ్డలి తీసి
కరమున దాల్చి యీ కరణి వచించె:
"ఇంక నిందింపరా దెవ్వరు నన్ను.
నీ కటుభాషణు డీ బాలకుండు
వధకు యోగ్యుండేను పసివా డటంచు
నెంతయో వేచితి - నిపుడిదే యితడు
సత్యంబుగా దెగి చావ నున్నాడు."
అనగ గౌశికముని యనియె : "క్షమింపు
మీతని యపరాధ మీవు మునీంద్ర !
బాలుర గుణదోషవర్గంబు లాత్మ
బాటింప రెప్పుడు పరమసాధువులు."
అనవిని భార్గవు డనియె నీ రీతి :
"ఈ నా కుఠారము పృథునిశాతంబు
కరుణ యెఱుంగని కడు క్రోధి నేను.
ఇచ్చట నా ముందటే నిలుచుండె
నస్మద్గురుద్రోహి, యపరాధి; యీత
డౌర ! నా చెంత మాటాడు చుండినను
నిను జూచి కౌశికా ! నిజముగా నోర్మి
నాగి నాడను వీని యాయువుల్ గొనక.
కానిచో వీని నీ గండ్రగొడ్డంట

ఖండఖండంబులుగా జేసి వైచి
శ్రమలేక నా గురుస్వామిఋణంబు
దీర్చెది వాడ, గాధేయమునీంద్ర!''
''ఆకుపచ్చగ ముని కఖిలంబు దోచు:
గాంచి భార్గవు డయః*ఖండంబు, తాను
ఖండంబుగా నెంచె గాని యిప్పటికి
సత్యంబు నేర కజ్ఞానమందుండె-''
నని నవ్వుకొనియె నిజాత్మ గాధిజుడు.
అంతట లక్ష్మణుం డనియె నీ రీతి:
''నఖిలప్రపంచవిఖ్యాతమై నట్టి
భవదీయకీర్తి నెవ్వరు మునినాథ!
తెలియనివారు ధాత్రీరంగమందు?
ఇలను మాతాపితృఋణ మెల్ల నీవు
సంపూర్ణముగ దీర్ప జాలితి వనఘ!
ఇక దీర్ప వలసిన దెల్ల నీవల్ల
గురుఋణం బొక్కటి కుంభినియందు
నదె నీదు మతిని మహాకులపఱచు
నా ఋణం బిపుడు మా యందుననీవు
వైచిన పగిదిగా భావించుచుంటి.
కాలంబు మిక్కిలి గడచుటచేత
నధికవడ్డీ యయ్యె నందుచే నిపుడు

* ఖంథమనగా ఒక అర్థము ఖడ్గము, మఱియొక అర్థము పటికిబెల్లము.

వ్యవహారి రప్పింప వలసిన దిటకప
నా ఋణం బేను స్వయంబుగా దీర్తు."
ఆ కటువచనంబు లాలించి మౌని
తన కుఠారమును హస్తమున ధరించె,
హా! హా! కృతుల జేసి రఖిలజనంబు.
"పలుమాఱు నాకీవు పరశువు జూపి
బెదిరించుచున్నావు భృగువరా! కాని,
యవనీసురుడ వని యాత్మలో దలచి
యో క్షత్రియద్రోహి! యోర్మి బూనితిని.
ఘనతరయోధాగ్రగణ్యుల నీవు
కదనమం దెన్నడు గలియగా లేదు.
నీ చిన్న యింటిలోనే ద్విజదేవ!
వీరునిగా నీవు పెరిగి యున్నావు!"
అని పల్కె లక్ష్మణుం డఖిలజనంబు,
"లనుచితం బిట్లాడు"టని చెప్పుకొనిరి.
అంతట రఘుపతి యనుజు వారించె
సంజ్ఞ గావించియు సంయమివర్య!
అపుడు లక్ష్మణవచనాహుతిజ్వలిత
భృగువరక్రోధాగ్ని వీక్షించి పలికె
నంబునమోక్తుల నా రాఘవుండు:
"నాథ! బాలుని కరుణఁ గనవయ్య!
యేమి యెఱుంగని యీ పసివాని

పైన నీ కోపంబు బఱపగా వలదు.
ఇతడు నీ శక్తి దా నెఱిగిన యెడల
నిటు పల్కలేడు ని న్నెదిరించి స్వామి!
బాలురు పరిహాసవాక్కులు పలుక
గురువును తలి దండ్రి కూర్మి హర్షింత్రు.
కావున వీనిని గరుణింపు మెఱిగి
నేరని శిశువుగా నీ సేవకునిగ-
సముడవు సౌశీల్యసదనుండ వీవు
ధీరమానివి జ్ఞానతేజుండ వీవు ?''
అను రామవచనంబు లాలించి లోన
భృగుపతి శాంతించె నిసుమంత హృదిని,
కాని తా బోక లక్ష్మణమూర్తి నవ్వె
మఱల దా నేదొ నెమ్మదిగ వచించి.
ఆ నవ్వు గాంచియు నా భృగురాము
డాపాదమస్తకవ్యాప్తాగ్రహాగ్ని
చండభయంకరజ్వాలుడై పలికె:
"ఓ రామ! నీ తమ్ము డుగ్రపాపాత్ము
డాతడు గౌరవర్ణాంగుడే యైన
నాత్మ నల్లని దోయి, యరయ నాతనికి
గాలకూటవిషంబె కలదు ముఖాన
దల్లిపా లీతడు త్రాగ లేదెపుడు.
కపటస్వభావుండు గావున నితడు

నిను గూడ లక్షింప నేరక పోగ
మృత్యుతుల్యునిగ గ్రహింపడు నన్ను."
అనవిని లక్ష్మణుం డనియె నవ్వుచును:
"ఓ మునివల్లభా ! యో భృగురామ !
కోపంబు పాపంబు గూర్చ మూలంబు.
ఆ కోపమునకు వశ్యాత్ములై జనము
లనుచితకార్యంబు లాచరించెదరు
ప్రతికూలు రౌచు విశ్వంబున కెల్ల.
వరమునీ ! నేను నీ పాదదాసుడను
వదలి కోపంబు కృప జూడు నన్ను-
భగ్నచాపమ్ము కోపమున సంధిలునె ?
త్వత్పాదములు బాధ పడుచుండు నింక
తాము గూర్చుండ బ్రార్థన సేయువాడ.
ఈ భగ్నచాపమం దెక్కుడు ప్రీతి
కలదేని మీ కిది కలిపియు నతుకు
మార్గంబు జూతు సమర్థు రావించి."
అను లక్ష్మణుని వాక్కు లాలించి జనకు
"డూరకుండుము వత్స ! యుచితమా యిట్టి
యధికప్రసంగము" లనియె భీతిల్లి.
పౌరనారీనరుల్ భయమును బొంది
వణకిరి యశ్వత్థపత్రంబు లటుల.
"నిజముగా రెండవ నృపకుమారుండు

కడు దుడుకని వారు కళవళమొంది
రా లక్ష్మణుని నిర్భయాలాపసమితి
నాలించి నంతట నా భృగునాథు
తనువెల్ల మండె క్రోధజ్వాలచేత
నాతని బలము నీరై పోయె నంత
దయ బూని నట్టి చందంబుగా నిటుల
శ్రీరాముతోడ వచించె నాతండు :
"ఓ రామ ! నీదు సహోదరుం డగుట
వదలితి నీ బాలు బ్రాణాలతోడ,
సుందరదేహంబు జూడగా, లోన
గడు మలినంబును గలిగిన యితడు
భయదవిషద్రవభరితమై నట్టి
కాంచనకుంభంబు కరణి నున్నాడు."
మఱల దీనికిని లక్ష్మణుడు నవ్వంగ
రాము డా యనుజు నాగ్రహదృష్టి జూ
నందుచే నతడు వామాలాపములను
సర్వంబు విడనాడి శాంతిగా బోయి
గురుసమీపంబున గూర్చుండె నంత.
శ్రీరామచంద్రుండు చేతులు మోడ్చి
పృథువినీతాంచితమృదుశీతలోక్తు
లొప్పగా నిట్లనె "నో భృగునాథ !
పరికింపుమా నాదు ప్రార్థనం బనఘ !

సహజసుజ్ఞానధాస్వన్మతి వీవు
బాలుని వాక్యముల్ పాటింప వలదు.
బాలకునకు మధుపంబున కెంచ
నేకస్వభావంబె యిలలోన నుండు
సజ్జనుల్ వారి దోషంబుల గనరు.
అదిగాక యీ బాలు డపరాధి కాడు,
నీ కపరాధంబు నేను చేసినది.
అందుచే నో మహాత్మా! నన్ను నేడు
భవదీయపావనపాదసేవకుని
గృప జూతురో ఆగ్రహింతురో, లేక
వధియింతురో, లేక బంధింపగలరొ,
ఏది యైనను సరియే భవదీయ
చిత్తానుసారంబు సేయుమా స్వామి!
హే మునినాయకా! యే యుపాయమున
భవదాగ్రహము శాంతిపడు, సత్వరముగ
దెలుపుమా యట్లు వర్తించెద నేను.''
అనవిని మునిపతి యనియె నీ తెఱగు :
''ఓ రామ! నీదు సహోదరుం డటుల
గనుచుండ నెగతాళిగా నన్ను—నింక
నీ నా మహాగ్రహ మెట్లు శాంతించు?
నా కుఠారంబునం ధాటిగా వాని
కంఠంబు వ్రేటునఁ ఖండింపకుండు

నందాక, నా యాగ్రహంబు నిష్ఫలము.
అస్మత్కుఠారభయంకరచర్య
లాలించి శత్రురాజాంగనానిచయ
గర్భముల్ జారు, నా ఘనఘోరపరశు
వే చెంతనుండగా నీ రాజసుతుడు
మచ్ఛాత్రవుం డిట్లు మనియుంట నేనె
యరయగా వలసెగదా ! యీ దినాన.
నా గుండె మండుచున్నది క్రోధవశత
గాని నా బాహువు కదలలేకుండె.
నృపఘాతి యైనట్టి యీ కుఠారంబె
యిపుడు కుంఠితమయ్యె. నే మొనరింతు ?
విధి నాకు మాఱెను విపరీతరీతి :
నస్మత్స్వభావంబు నందుచే మాఱె
గానిచో నా మది గలిగెనే కరుణ
యెన్నడైనను గాని యిసుమంత ? నేడు
దారుణవ్యధ నాకు, దయచేత, గలిగె.''
అనవిని సౌమిత్రి హాసంబు వెలుగ
వంచి శిరంబు నీ పగిది వచించె:
'' భవదీయమైన కృపామారుతంబు
త్వద్రూపమునకును దగినట్టు లుండె.
భవదీయవాక్కులు భాసిల్లుచుండె
వృక్షత్యజితపుష్పవిసరంబు లటుల.

దయచేతనే భవత్తను వెల్ల నిట్లు
దందహించుచు నుండ దపసివరేణ్య !
ఇక గ్రోధ మెద నుదయించిన తజీని
నెట్లుండు మిమ్మీశుడే కావవలయు—"
ననవిని భార్గవుం డనియె నీ రీతి :
"అరయము జనక ! యీ యజ్ఞాను డిట్లు
యమపురంబున నుండ హతమున గోరు.
ఏల నా కన్నుల యెదుట నీ మూర్ఖు
నుంతువు తొలిగింపకుండగా నీవు ?
చూడ నీతడు నృపసూనుడే గాని,
పరమదుర్మార్గుడు పార్థివా ! కనుక !"
అనవిని లక్ష్మణుం, "డట్లైన నీవు
కన్నులు మూసిన గనరాక పోవు
నఖిలప్రపంచంబు" నని తనలోన
దా ననుకొనియె మందస్మితుం డగుచు.
అపయి భృగురాము డాగ్రహాదగ్ధ
హృదయుడై శ్రీరాము నీక్షించి పలికె :
"భవుని చాపంబును భగ్నం బొనర్చి
శఠ ! నాకు బోధలు సలుపు చున్నావె ?
నీదు సమ్మతిచేతనే నీదు తమ్ము
డాడు చున్నాడు దురాలాపములను.
కరములు జోడించి కపటనమ్రతను

ప్రకటించుచున్నావు పైకి నీ విటుల.
సంతోషపఱుపుము సంగ్రామ మందు
నటుకాద విడుము రామాభిధేయమును.
త్యజియించి నీ చమత్కారంబు లెల్ల
ధూర్జటిద్రోహి ! నాతో బోరు మిప్పు
డటుగాదొ నిన్ను నీ యనుజునితోడ
నంతకు పురమున కంపగా గలను.''
అన భృగువిభుడు మహోగ్రహావశత
బరశువు పైకెత్తి భయదరీతిగను,
శ్రీరామచంద్రుండు శిరమును వంచి
తన చిత్తమందున దా నవ్వుకొనియె :
''అపరాధి లక్ష్మణుం డైయుండ దపసి
క్రౌర్యము నాపైన గలిగి యున్నాడు.
అరయ నమ్రతయు నా యా సమయముల
గడు దోషమును గూర్చగలుగు, సర్వులును
వందనం బొనరింత్రు వక్రమర్త్యునకు ;
రాహువు వక్రేందు గ్రసియింప లేడు.''
అని తలంచియు రాము డనియె నీ రీతి:
''మునినాయకా ! రోషమును వీడు మనఘ !
కలదు గొడ్డలి నీదు కరభాగ మందె.
నా శీర్ష మున్నది నాథ ! నీ ముందె
యేను నీ భటునిగా నెఱిగి యో స్వామి !

భవదాగ్రహము తీరు పని చేసికొనుము.
ప్రభువును భటుడు పరస్పరం బెటుల
సమరంబు సాగింప జాలెద రయ్య!
విప్రోత్తమా! నాథ! విడుము రోషమును.
వీక్షించి నీ యోధవేషంబు, భ్రమసి
పలికె నీ బాలుడు పరుషవాక్యముల
నది వాని యపరాధ మరయగా గాదు.
పరశుధనుర్బాణపాణివై యుంట
నీ బాలకుడు యోధు డేమో యటంచు
నుద్రేకపడియె దా నో మునిరాయ!
నీ పేరు వినియున్న నిను జూడ కుంట
నాత్మవంశస్వభావానుసారముగ
నొసగెను నీకు బ్రత్యుత్తరంబులను.
తాము మునీశుచందము వచ్చియున్న
స్వామి! నీ పాదరజంబు లీ శిశువు
తప్పక శిరమందు దాల్చెడి వాడె.
నిన్ను నేరని వాని నేరంబు నాథ!
క్షమియింప బ్రార్థన సలుపుచున్నాడ.
విప్రుని హృదిలోన విస్తారకరుణ
వెలయంగ వలయును, భృగుకులనాథ!
నాకును నీకును నాథ! పోలికయ?
చరణంబులకును శీర్షంబునకేమి

సామ్యమో తెలుపుము స్వామీ ! మహాత్మ !
నాకొక్క లఘురామనామమే యుండ
బరశురాము డనంగ బరగెడు పెద్ద
నామధేయము నీది నాథా ! మునీంద్ర !
నా వింటి కేకగుణంబు దీపింప
నీ విల్లు పరమపునీతంబు లైన
తొమ్మిది గుణములతోడ భాసించు :
నన్ని విధంబుల నల్పుడ నేను
నందుచే విప్రోత్తమా ! క్షమియింపు
మస్మదీయంబులౌ యపరాధములను."
ఓ మునినాయకా ! యో విప్రవర్య !
అని మాటిమాటికి నా రామవిభుడు
పేర్కొన్న గాని యా భృగువల్లభుండు
పరుషంబుతోడ నీ పగిది వచించె :
"నీవును గపటివి నీ తమ్మువోలె
నీవు బ్రాహ్మణమాత్రునిగ నన్ను దలతు
వే నెట్టి విప్రుండ నెఱిగింతు వినుము :
చాపమే స్రువము, నా శరము లాహుతులు
నస్మదీయాగ్రహ మతిఘోరవహ్ని,
చతురంగబలములు సమిధల గణము,
బహుళమహీధవుల్ పశుసమూహంబు
లీ కుఠారముతోడనే వాని నెల్ల

ఖండఖండమ్ములుగా నొనరించి
బలి సమర్పించితి వసుధ నే నిటుల
సమరయజ్ఞంబుల సలిపితి గోటి
సంగ్రామగర్జనజపములతోడ-
అస్మత్ప్రభావంబు నాత్మలో నీకు
విదితంబుగాకయే విప్రమాత్రునిగ
దలపోసి నను నిరాదరణవాక్యముల
బలుకుచున్నాడవు భవుని చాపమును
భంజించినది మొదల్ భావంబులోన
గర్వంబు మితిమీఱి కనులకెక్కినది.
ఈ జగం బెల్ల జయించిన రీతి
నీ వహంకృతి పూని నిక్కుచున్నావు.''
అనవిని శ్రీరాము డనియె నీ పగిది :
''పరగ విచారించి పలుకు మునీంద్ర !
నా స్వల్పదోషంబునకు మహారోష
పడుచుంటి వీ పాతపడిన ధనుస్సు
స్పృశియించి నంతనే విఱిగి రెండయ్యె
నే గర్వ మొంద నిం దేమున్న దనఘ ?
వినుము సత్యంబును భృగువంశనాథ ! :
నీ వనురీతిగా నే నిల నిన్ను
విప్రుండ వని గౌరవింపని యెడల,
భయముచే నే దల వంచగా దగిన

య వీరు డెవ్వ డీ యఖిలలోకమున ?
దేవదానవధరాధీశులు వివిధ
భటు లెవ్వ రైనను స్వామి ! నాతోడ
సరిసములౌ బలశాలురే గాని
యధికబలోపేతు లైనను గాని
యెదిరించి నిలుచుచో నేను తప్పకయె
సంగ్రామ మొనరింతు సంతోషముగను.
కాలుడే వచ్చిన గాని భీతిలను.
క్షత్రియ తనువొంది క్ష్మామండలమున
భండనం బొనరింప భయపడు వాడు
వంశకళంకుండు పరమనీచుండు-
నిజమైనవిషయంబు నే జెప్పుచుంటి
వంశప్రశంసకై పలుకుట లేదు :
రఘువంశ సంభవుల్ రణరంగమందు
యమునకు గూడ భయం బొందబోరు.
ఎవ్వడు నీకడ నెద భీతి జెందు
నాతడు నిర్భయుం డటువంటి దనఘ !
బ్రాహ్మణవంశప్రభావ మెంచగను."
ప్రియముగా నిటుబల్కు శ్రీరామచంద్రు
మృదుగూఢవాక్కుల నెల్ల విన్నంత
బరశురాముని మతి ప్రజ్ఞాన మొందె :
"శ్రీరామ ! నీ విదే శ్రీరమానాథు

వింటిని గొని యెక్కు-బెట్టుమా నాదు
సర్వసందేహముల్ సమసిపోగలవు.''
అని పల్కి నంతనే యా భార్గవుండు,
దానియంతట నదే తచ్ఛరాసనము
శ్రీరామచంద్రుని చేతిలో కరిగె
నా చిత్రమును గని యాశ్చర్యపడియె
భావంబు నందున బరశురాముండు.
అంతటా భృగురాము డా రామమహిమ
హృదయంబులోన గ్రహించె బూర్ణముగ
బులకప్రపుల్లితపూర్ణాంగు డగుచు
భక్తిభావోద్వేగపరవశుం డగుచు
నంజలి ఘటియించి యత్యంతభక్తి
శ్రీరాము నిటుల స్తోత్రింపగా దొడగె :

## పరశురామకృతరామస్తవము

### గేయం :

జయ రఘువంశవనజవన భానూ !
దనుజకులగహనదహనకృశానూ !
జయ సురభూసురగోహితకారీ !
జయ మదమోహాగ్రహభవహారీ !

వినయశీల ! కరుణాగుణసాగర !
జయము వచనరచనామితచతురా !

సేవకసుఖద ! సుభగ సర్వాంగా !
జయము తనుచ్ఛవి బహుకామనంగా !
ఒక ముఖమున నెటు సేతును ప్రశంస ?
జయ శివమానసమానసహంసా !

అంటివి తెలియక యత్యనుచితములు
ఉభయులు మన్నింపుడు క్షమాలయులు !
జయజయ జయజయ రఘుకుల కేతూ !
జయజయ జయజయ నిజసుఖహేతూ !"

అని వచియించియు నా భృగుస్వామి
వనమున కేగె దపం బొనరింప.
అంతట గుటిలధరాధీశు లెల్ల
రపభయ మొందిరి; యా భీరు లెల్ల
జల్లగా బాఱిరి సకలదిక్కులకు.
పొంగుచు దుందుభుల్ మ్రోయించుకొనుచు
దేవతల్ శ్రీరామదేవుని పైన
గురియంగ సాగిరి కుసుమవర్షముల.
పురనరనారీసమూహంబు లెల్ల
బరమసంతోషసంభరితంబు లయ్యె
వారల మోహసంభవమైన బాధ
సర్వ మదృశ్యమై చనియె మునీంద్ర !
మ్రోసె మంగళవాద్యములు సర్వజనులు
చారుమంగళవస్తుసంచయంబులను

వెదజల్ల సాగిరి విరివి నెల్లెడల.
సుముఖసుసేతఁగా సుందరీజనము
గుంపులు గుంపులై కోకిలధ్వనుల
బాటలు పాడిరి వర్షింప మధువు.
నిష్ఠదరిద్రుండు నిధి నొంది నట్టు
లా విదేహుండు వర్ణనాతీతమైన
యానందమును బొందె నాంతర్యమందు.
సీతామహాదేవి చింతను విడిచి
కుముదాప్తు గనిన చకోరకుమారి
వలె బరమానందభరితాత్మ యయ్యె.
జనకరా జంత విశ్వామిత్రమునికి
బ్రణతులు గావించి పలికె నీ పగిది:
"నీ ప్రసాదముచేతనే మహారాజ!
ముక్కంటి ధనువు రాముడు త్రుంచినాడు.
ఈ సహోదరు లిద్ద ఱీ నాడు నన్ను
కృతకృత్యునిగ జేసి రింక నే నిపుడు
చేయంగ దగినది చెప్పుమా స్వామి!
అనవిని మునివర్యు డనియె నీ తెఱగు:
"వినుము నరేంద్రా! ప్రవీణా! ధనుస్సు
నందు వివాహంబు నాధారపడియె,
విల్లు భగ్నం బయ్యె పెండ్లియు నయ్యె
నిది సురనరనాగు లెల్లరి కెఱుక.

అరిగి నీ వింక వంశాచారరీతి
గురువరబ్రాహ్మణకులవృద్ధజనుల
సంప్రీతించియు వేదశాస్త్రపద్ధతిని
నొనరింపుమా వివాహోత్సవకృతుల.
అరిగి, దూతల నయోధ్యాపురి కంపి
రాజేంద్రు దశరథు రప్పింపు మిటకు ''

## జనకరాజు దశరథునకు శుభలేఖ నంపుట, మిథిలాపురశృంగారము

అన '' మంచి దస్లే దయాబ్ధి! మునీంద్ర ''
అని పల్కి ముదితుడై యా జనకుండు
రావించి దూతల రయమొప్ప నటుల
తక్షణం బంపెను దశరథుకడకు
నాపయి సకలమహాజనావళిని
బిలిపింప వారెల్ల బ్రీతితో వచ్చి
వినమితశీర్షులై పృథ్వీంద్రు ముందు
బరగిరి భక్తిసంభ్రమము దీపింప
'' రాజవీథులను మార్గంబుల నెల్ల
మందిరంబుల దేవమందిరంబులను
నగరమం దెల్లెడ నాల్గుదిక్కులను
బాగ శృంగారింపవలయు '' నటంచు
రాజాజ్ఞ వచ్చెను. ప్రజలుల్లసిలుచు

దమ గృహంబులకును తరలి రందఱును.
తదనంతరము రాజు తనసేవకులను
పిలిచి యాజ్ఞాపించె, "విరచింపవలయు
దగు శ్రద్ధతో విచిత్రములై వెలుంగు
మండపంబులను సముంచితరీతి."
నృపునాజ్ఞ శిరసావహించి వారంత
నానందసంభరితాత్ములై పోయి
మహితవితాననిర్మాణప్రవీణ
శిల్పిగణంబుల జేర్చి రా పనికి.
ఆ శిల్పు లంత బ్రహ్మకు నతి జేసి
పనిని ప్రారంభించి బహుసుందరముగ
గనకరంభాస్తంభగణము రచింప
వరమరకతమణిపత్రఫలాల,
బద్మరాగప్రసవముల భాసించు
నతివిచిత్రం బగు నా సృష్టినెల్ల
గాంచి విరించి దిగ్భ్రాంతిని బొందె.
వరమరకతమయవంశీగణంబు
సరళమై పర్ణసంచయములతోడ
నిజమైనవిగనె కాన్పింప దొడంగె.
తనరెడి బంగారు తమలపాకులను
తీర్చగాబడినట్టి తీగెలు చూడ
నచ్చ మా యసలైన వనిపించుచుండె

నా పత్రముల తోరణావళి గూర్చి
రందందు రుచిరముత్యాలహారముల
మాణిక్యమరకతమణివజ్రములను
వైడూర్యములతోడ బద్మగుచ్ఛముల
శిల్పులు చేసిరి శృంగార మొప్ప.
పవనసంచలనసంబంధంబుచేత
సమృతనాదముల ఝుమ్మను రొదల్ సేయు
వివిధవర్ణ విహంగభృంగసంఘముల
నిర్మించి రా శిల్పనిపుణు లందందు.
బహుశుభద్రవ్యముల్ పాణుల దాల్చి
నిలుచున్న విధమున నిర్మించి రందు
స్తంభంబులను దేవతావిగ్రహముల.
బహువిధసహజశోభారూపములను
సింధురమణిమయశృంగారయుక్త
రంగవల్లికల నేర్పఱచిరి ధరణి.
ఇంద్రనీలంబుల నింపుగా జెక్కి
లావణ్యచూతపల్లవము సొనర్చి
కాంచనమయపుష్పగణముల జేసి
మరకతమణులతో మంజులరీతి
ఫలగుచ్ఛముల జేసి పట్టుదారముల
వ్రేలాడ జేసిరి వింతరీతిగను.
ఆ శిల్పు లింక నత్యద్భుత రుచిర

వరతోరణముల నేర్పఱచి రెల్లెడల
నవి మనోభవుని పాశావళిరీతి
గాన వచ్చుచు నుండె గడు సోయగముగ.
గణనకు మించు మంగళకలశముల
వరమనోహరఘనధ్వజపతాకముల
బటచామరముల స్థాపన చేసి రచట.
ఆ విచిత్రవితాన మగణితరమ్య
మణిమయదీపికామండితం బగుచు
వర్ణనాతీతమై భాసిల్లుచుండె.
ఆ వధూమణి జగదంబ వైదేహి
వసియింప వలసిన వరమండపమును
వర్ణింప గలిగిన భావనాశక్తి
యే కవికున్నది ? హే మునిరాయ !
సద్గుణసౌశీల్యసౌందర్యమునకు
సాగరుం డగు రామచంద్రుండు తరలి
పెండ్లి కుమారుడై వేంచేయునట్టి
యా వితానము త్రిలోకాతిసుందరము.
ఆ పురిలోగల నఖిలగృహాల
జనకమందిరశోభ సందర్శితంబు
ఆ మిథిలాపుర మపుడు గాన్పించె
బదునాల్గు భువనముల్ పరమాల్పములుగ
నా నగరములోని యమితసామాన్య

గృహములో రాజిల్లు శ్రీని వీక్షించి
యమరేంద్రుడైన మోహాస్వాంతు డగును.
వసుధ మాయాంగనావరవేషమూని
శ్రీమహాలక్ష్మి వసించు చున్నట్టి
యా పురశోభ, దా మభినుతియింప
శారదాశేషులే సంశయపడిరి.

## జనకదూతలు శుభలేఖనిచ్చుట; దశరథుని మహానంద విశేషము

జనకుని దూతలు సత్వర మపుడు
చనిరి పావనరామజన్మస్థలమున
కా రమ్యపురి గాంచి హర్షితులైరి.
అవనీంద్రసౌధసింహద్వారమందు
వర్తమానంబు లోపలి కంప నప్డు
డాలించి దూతల యాగమనంబు
దశరథభూపతి తనదు సన్నిధికి
రావించె వారిని రయముగా నపుడు
ప్రణతు లర్పించియు వారలొసయిన
లేఖ నొసంగగా, లేచెను తానె
స్వయముగా దాని హస్తమున గైకొనగ
సంతోషపడుచును స్వాంతంబు లోన.

ఆ లేఖ పఠియించి నంత రాజునకు
నానందబాష్పంబు లక్షుల నుబికె
దనువెల్ల రోమాంచితం బయిపోయె
నాహ్లాదమున నిండె నాతని యెడద.
శ్రీరామలక్ష్మణుల్ హృది వెలుగొంద
గరమున శుభలేఖ గ్రాలగా నట్టె
స్తబ్ధుడై పోయెను క్ష్మానాయకుండు,
మంచియో, చెడో నోట మాట రాదయ్యె
నంతట ధృతిబూని యవనీశ్వరుండు
పఠియింప లేఖ సభాసదులెల్ల
రా శుభవార్తకు నానందపడిరి.
ఆటస్థలంబున నా వార్త వినియు
భరతుడు నిజహితభ్రాతల గూడి
యరుదెంచి యచటికి, నతివినమ్రతయు
బ్రేమభావంబు దీపింప నిట్లడిగె :
"జనక ! ఆ లేఖ యెచ్చట నుండి వచ్చె ?
ప్రాణప్రియులు నాదు భ్రాత లిద్దఱును
నాయనా ! క్షేమమేనా ? వార లిప్పు
డే దేశమున జరియించుచున్నార ? "
అని పల్కు భరతు గాఢానురాగోక్తు
లాలించి నరపతి యా శుభలేఖ
తిరిగి యింకొకసారి దీసి పఠించె.

ఆ లేఖ వినినంత నా భ్రాత లిర్వు
రానందపులకితు లైరి, వారలకు
దనువెల్ల బరవశత్వమున నుప్పొంగె.
భరతుని పావన ప్రణయంబు గాంచి
యఖిలసభ్యులు విశేషానంద మొంది
రంతట దూతల నవనీశ్వరుండు
చేరువ గూర్చుండ జేసి యిట్లనియె
మధురమనోహరమంజువాక్యముల :
''చెప్పుడు బాగుగా స్నేహితులార !
భద్రమా యచట మా బాలు రిద్దఱును ?
ఆ బాలకులను స్వయంబుగా మీరు
బాగుగా గంటిరా ? వారలలోన
నొకడు శ్యామాంగు డింకొకడు గౌరాంగు
డుగ్రచాపనిషంగు లుభయులుగూడ
నవకిశోరులు, మునినాథు గౌశికుని
వెంటాడియుందు రే వేళ వీడకయె.
ఇట్టి బాలకుల గ్రహించితి రొక్కొ ?
అయినచో వచియింపు డా బాలకుల స్వ
భావంబు గూర్చిన వాని నే నైన''
నని ప్రేమవివశుడై యవనీధవుండు
పలుమాఱు దూతల బ్రశ్నగావించె.
''ముని వారలను గొనిపోయినదాది

యీ రోజె వారి సువృత్తాంతములను
విన గల్గితిని నేను వీనులారంగ
నెటుల విదేహేంద్రు డెఱిగె వారలను
తెలుపుడు మీరలు తేటతెల్లముగ.''
పృథ్వీశు డిట్లను ప్రియవాక్యములకు
ద న్మిథిలేంద్రు దూతలు నవ్వుకొనిరి.
''హే నృపమకుటమణీ ! వినుమయ్య !
విశ్వభూషణు లౌచు వెలుగొందుచున్న
రామలక్ష్మణులను రాజేంద్ర ! నీవు,
తనయులుగా గన్న ధన్యధన్యుడవు
నినుబోలు ధన్యు లెందేని నున్నారె ?
త్వత్పుత్రులను గూర్చి ప్రశ్నింప నేల ?
పురుషసింహులు సర్వభువనదీపకులు,
వారి యశఃప్రతాపంబుల ముందు
శశి మలీనము, రవి చల్లగా దోచు.
వా రెట్లు గ్రహియింపబడి రని నీవె
యట్టి వారలగూర్చి యడిగెద వధిప !
భాస్కరు గాంచ దీపంబు గావలెనె ?
సీతాస్వయంవరశ్రీసమయమున
నట జేరుకొని రనేకావనీనాథు
లొకని కంటె నొకండు యోధానయోధు
డైన నేమాయె వా రందఱిలోన

నొకడైన శివువిల్లు నొక్కింతయేని
గదలించుటకు జేతగాక కూర్చుండ్రి
సకలవీరులు పరాజయ మొందిరి రనఘ!
ముల్లోకములలోన భుజపౌరుషమున
గర్వించుచున్నట్టి ఘనుల బలంబు
లణగ ద్రొక్కఁగబడె నా వింటిచేత.
మేరువు నెత్తెడి మేటిబలుండు
బాణాసురుడు గూడ బగులగా గుండె
శివువిల్లునకు బ్రదక్షిణ మాచరించి
చల్లగా జారెను సభను వీడ్కొనుచు
గౌతుకార్థంబుగా గైలాసగిరిని
పైకెత్తినట్టి రావణుడు సైతంబు
సభలో బరాభవసహితుడై పోయె.
ఆ సమయాన, మహామహీపాల!
రఘువంశమణి యైన రామచంద్రుండు
అణువంతయైన బ్రయాస లేకుండ
గజమెట్లు త్రెంపు పంకజనాళ మట్లు
శివుని చాపమును భంజించె నా సభను.
ఈ వార్త నాలించి భృగుకులాధీశు
డమితరోషంబుతో నట కేగుదెంచి
యతిగ విజృంభించె హద్దులమీఱి.
కాని శ్రీరాముని ఘనబలం బరసి

స్వీయపినాకమర్పించి యాతనికి
గడు వినయంబుతో గానకు స్జనియె.
రామునిపగిది నో రాజ! లక్ష్మణుడు
నతులబలుండయి యలరుట గాక
తేజోనిధాను డా ధీరవరేణ్యు
జూచిన మాత్రాన క్షోణీశు లెల్ల
కొదమసింగముగన్న కుంజరగణము
పగిదిగా గడగడ వణకె నాకులత.
భవదీయనందనద్వయమును మేము
కంటిమి రాజ! మా కన్గవ లిప్పు
డెవ్వని జూడగా నెంచ వించుకయు."
ప్రేమప్రతాపముల్ వీరరసంబు
తొణికిసలాడు నా దూతల యొక్క
వచనరచనకు సభాసదులెల్ల
గడు ప్రియం బొందిరి, క్ష్మానాయకుండ
నఖిలసభాసదు లనురాగవశత
వారిపై గట్నముల్ వర్షించి రపుడు.
కాని దూతలు వాని గైకొనకుండ
గర్ణముల్ మూసుక కరములతోడ
"నిది యవినీతి సుమీ" యని రపుడు
వారల ధర్మస్వభావంబు నెంచి
సర్వులానందరసస్వాంతు లైరి.

అంతట లేచి ధరాధీశ్వరుండు
శ్రీవసిష్ఠమహర్షి చెంతకు బోయి
వచ్చిన శుభలేఖ భక్తి నొసంగి
దూతల దగు ప్రీతితోడ రావించి
వినిపించె గురునకు వృత్తాంత మెల్ల.
ఆ వార్త విని వసిష్ఠాచార్యవర్యు
డతిహర్ష మొందుచు ననియె నీ రీతి :
"పుణ్యపూరుషులకు బుడమియంతయును
సుఖభరితం బగు క్షోణీశ ! కనగ.
కామనలేకున్న గాని సంద్రమున
బరుగిడి నదులన్ని పడిన చందమున
సుఖసంపదలు వచ్చు సుస్థిరధర్మ
శీలునికడ కయాచితరీతి ననియె.
దేశికబ్రాహ్మణధేనుదేవతల
సేవించెదవు నీవు స్థిరతరభక్తి.
నీతో సమానపునీతచారిత్ర
దేవికౌసల్య, ధాత్రీనాథమౌళి !
ఈ జగం బందు నీ కెనయగు నతడు
సుకృతాత్ము డెట మున్ను జూపట్ట లేదు;
ఇప్పుడు లేడు ముం దిక నుండ బోడు.
రామునివంటి పుత్రకుని గన్నట్టి
యధిప ! నీ కన్న బుణ్యాత్ము డెవండు !

నరనాథమౌళి! నీ నలుగురు సుతులు
రణవీరవరులు, నమ్రత్వభూషణులు
ధర్మవ్రతులు, గుణధాములు రాజ!
సర్వకాలంబుల క్ష్మానాథ మౌళి!
నిజముగా గల్యాణనిలయుండ వీవు.
భేరీనినాదసంభృతముగా నింక
జరుపుము కల్యాణసన్నాహములను.
తరలగావలయు సత్వరమే"—అనంగ
గురువాక్యముల విని క్షోణీధవుండు
శిరము వంచియు నమస్కృతిని గావించి,
"చిత్తము. మంచిది శ్రీగురునాథ!"
అని వచియించియు, నానంద మొప్ప
దగు నివాసముల దూతల కియ్య జేసి
యంతట జేరె నిజాంతఃపురంబు.
రాణివాసస్త్రీల రా జంత బిలిచి
చదివి విన్పించెను జనకుపత్రికను.
ఆ శుభసందేశ మందఱు వినియు
బరమసంతోషసంభరితాత్మ లైరి.
ఇంకను తా విన్న యితరవార్తలను
దెలిపె వారలకు ధాత్రీనాయకుండు.
వారిదసంఘరావంబును వినిన
బర్హిగణంబులవలె రాణులెల్ల

ప్రేమప్రఫుల్లితవివశాత్ము లైరి.
సదమలగురువృద్ధజనసతీమణులు
ప్రహ్లాద మొంది దేవతల బ్రార్థించి
రాశీస్సు లిడుటకై యా సమయమున
నలుగురు తల్లు లానందవారాశి
బడి తేలియాడిరి పరవశత్వమున.
అమితప్రియంబగు నా శుభలేఖ
రాణులు గొనియు బరస్పరం బెదల
హత్తించుకొనిరి చల్లార హృత్తపన.
రామలక్ష్మణయశోరమ్యకార్యముల
బలుమాఱు లమ్మహాప్రభువు వర్ణించి,
"ఇదియెల్ల ముని కృపయే" యని పలికి
ద్వారముల్ గడచియు దా నిర్గమించె.
అంత మహారాణు లవనీసురులను
రావించి యానందరాజితు లగుచు
దనియగా గురిసిరి దానవర్షముల.
దీవించు కొనుచు భూదేవతాగణము
లేగెను తమతమ యిండ్ల కా పిదప.
పిలిచి యాచకులను ప్రేమభావమున
బహువిధబహుమానవస్తుసంఘముల
నిచ్చిరి పెల్లుగా నిష్టమై నటుల.
"దశరథరాజేంద్రు తనయులందఱును

మహి, జిరజీవులై మనెదరు గాక!"
అని పల్కుకొనుచు జయధ్వానములను
బహువిధవస్త్రముల్ బాగుగా గొనియు
వెడలిరి యాచకబృందంబు లెల్ల.
సంతోషసంరంభజయజయధ్వనులు
ఘోరకొల్పెడి దుందుభులఘోష లొప్పె.
ఈ వార్త ప్రాకగా నెల్ల ప్రజాళి,
ప్రతియింటిలో నుత్సవంబు దీపించె.
జానకీరఘువీరచారువివాహ
వార్తను విని హర్షభరితంబు లయ్యె
బదునాల్గుభువనముల్ పరమమునీంద్ర!
విని యీ మహాశుభవిషయంబు, జనము
లనురాగవశులయి యఖిలవీథులను
సదనంబులను మఱి సందుగొందులను
గడగి రంతట నలంకారంబుజేయ.
పరమమంగళము పావనమై వెలుంగు
రామచంద్రుని జన్మరంగమై నట్టి
ఆ యయోధ్యాపురి నఖిలకాలముల
రమణీయమైనదై రంజిల్లుచున్న,
ప్రేమస్వరూపుని ప్రేమచే జనులు
లావణ్యమంగళాలంకారమయము
జేసి రా పట్టణశేఖర మెల్ల.

ధ్వజపతాకములతో బటచారుచామ
రములతో బరమచిత్రముగ మార్గములు
కనులపండువుగ శృంగారింపబడియె.
కమనీయకాంచనకలశాలతోడ
మణిజాలతోరణమండలితోడ
వరహరిద్రాదూర్వభవ్యాక్షతలను
మంజులనవపుష్పమాలలతోడ
నిఖిలమంగళకరనిజభవనముల
గడు నేర్పుతోడ సింగారించుకొనిరి
యా యయోధ్యాపురియందలి జనులు.
*రసచతుష్టయమయరమ్యజలంబు
తద్వీథులను సేచితం బయ్యె మిగుల.
సదనముఖద్వారచతురస్రభూము
లందమౌ ముగ్గుల కొలవాలములు.
మెఱపుతీగెలవోలె మెఱయుచు మిగుల
బూర్ణేందుబోలిన ముఖములతోడ
హరిణశాబకనయనాబ్జముల్ గలిగి
రతిగర్వమోచనరమ్యరూపముల
షోడశాలంకారశోభిత లగుచు
వెలుగు భామామణుల్ బృందబృందముగ
నట నిట గూడి మహానందపడుచు

*రసచతుష్టయమయరమ్యజలంబు = మంచిగంధము, కుంకుమపువ్వు (కేసరి) కస్తూరి, కర్పూరము కలసిన పన్నీరు.

సొంపుగా బాడిరి శుభగీతములను
కలకంఠగణము తత్కాలరావములకు
సిగ్గును జెందగా జిత్తంబులోన!
నృపసౌధ మెట్లు వర్ణింపశక్యంబు?
అచటి వితానంబు లఖిలవిశ్వమును
సమ్మోహ మొందింపజాలి వెల్గొందు
బహుళమనోజ్ఞశుభద్రవ్యములును
భాసిల్లె మార్మ్రోసె వాద్యసంఘములు.
వందిగణం బొకవైపు బఠింప
బిరుదావళుల నెల్ల వేఱొకచోట
విప్రులు చేసిరి వేదగానముల.
అంగనాసందోహ మానంద మొంది
సొంపుగా బాడిరి శుభగీతములను
శ్రీరాముపేరును శ్రీసీతపేరు
బలుమాఱు బలుకుచు బరమమోదమున.
ఏ దిక్కు గాంచిన బృహదుత్సవంబె!
దానిని భరియింప దద్భవనంబు
కడు జిన్నదౌటచే గట్టులు మీఱి
యా మహోత్సాహ మ య్యఖిలదిక్కులకు
బొర్లి పాఱిన రీతి బొడసూపుచుండె.
మన దేవతాశిరోమణి రామభూపు
డవతరించిన యట్టి యా దశరథుని

భవనమహాశోభ వర్ణనసేయ
నే కవివశము మునీ! భరద్వాజ?

## దశరథమహారాజు సపరివారముగ మిథిలానగరమునకు దరలుట

పార్థివుం డంతట భరతుని బిలిచి,
"అరిగి నీ విప్పుడు హయగజరథము
లాయత్తపఱుపుమా యతిరయంబుగను
రామకల్యాణకార్యమునకు దరల"
అని వచియింపగా నా సహోదరులు
భరతశత్రుఘ్నులు పరవశులైరి.
సర్వుల రావించి సాహిణీవరుల
భరతు డాజ్ఞాపింప వారు సమ్మోద
పడి లేచి రాజుల ద్వరగ నొనర్ప
లలితపల్యాణంబులను బూన్చినట్టి
రంగురంగుల సత్తురంగరాజములు
భాసిల్లుచుండెను పంక్తులు దీరి.
అవి యన్నియును గడు నందంబు గలవి
యతిచంచలంబుగా నడుగు వేయునవి.
తప్తలోహమున బాదముల రవ్వంత
మోపని రీతిగా భూమిపై నవ్వి
పాదంబు లిడకయే పరుగెత్తుచుండు.

పలుకశక్యముగాని బహుళజాతులకు
జెందిన వా యశ్వశేఖరకోటి
వాయువేగము మించి పరుగిడునెగసి.
మహితులౌ భరతసమానవయస్కు-
లగు వీరనృపసుతు లా యశ్వములను
రుచిరంబుగా నధిరోహించి రప్పు
డా రాజనందను లందఱుగూడ
సౌందర్యయుతులు భూషణకోటిధరులు
కరశరచాపులు, కటితూణధరులు.
ఆ సుందరులు నవయవ్వనోత్సాహు
లారితేరిన శూరు లందఱుగూడ
ప్రతివీరునకు నిరుప్రక్క- లందుండె
నసికళానిపుణపదాతిద్వయంబు.
బిరుదు లూనిన రణవీరు లంపఱును
ముందేగి యాగిరి పురబాహ్యమంటు.
చతురాశ్వికులు తమ జవనాశ్వములను
నానావిధంబుల నడిపించిరెదల
పనియుచు భేరీమృదంగరావముల.
రథసారథులు తమ రథములనెల్ల
ధ్వజపతాకల మణివరభూషణముల
గడు చిత్రరీతి శృంగారించికొనిరి.
రమణీయములు చామరంబులతోడ

స్వనియించు కింకిణీజాలంబుతోడ
రాజిల్లుచున్న తద్రథపంక్తు లెల్ల
సూర్యమహారథశోభన్ హరించె.
శ్యామకర్ణంబుల నలరారుచున్న
యగణితహయముల నా రథంబులకు
గట్టిరి సారథుల్ కడురమ్యముగను
సుందరాలంకారశోభిత మైన
యా యశ్వబృందంబు నరసిన యెడల
మునులు సైతంబును మోహింపగలరు.
నీటిపై సైతము నేలపై బోవు
చంద మా యశ్వముల్ చన సమర్థములు.
వారిలో మునుగవు వాని రింఖాళి
యంత మహావేగ మా యశ్వములది.
అస్త్రశస్త్రంబుల నన్నిటితోడ
నాయత్తపఱచి రథావళి నెల్ల
రథికుల నంత సారథులు రమ్మనిరి.
అందఱు రథములయందెక్కి వచ్చి
చేరిరి పురబాహ్యసీమ నత్తఱిని.
ఏ కార్యనియతిలో నెవ్వ దేగినను
శుభశకునంబులు చూపట్టె నపుడు.
కరివరంబులపైన గట్టగా బడియె
భాసిల్లుచున్న యంబారీలు ; అవ్వి

వర్ణనాతీతశోభాసమేతములు.
రవళితఘంటావిరాజంబు లగుచు
జనుచున్న మత్తగజంబులు దోచె
శ్రావణసుభగగర్జామేఘములుగ.
ఇతరవాహనము లనేకముల్ వెడలె
నలరమ్యశిబికాసుఖాసనాదులును.
బయలుదేరిరి వానిపై విప్రవర్యు
లఖిలవేదోక్తమంత్రాకృతులనగ,
వందిమాగధసూతవైతాళికులును
బయలుదేరిరి తగు వాహనంబులను.
ఖరము లుష్ట్రంబులు ఘనబహుజాతి
వృషభరాజంబులు వెడలె మూపులను
వివిధాగణితవస్తుబృందంబు లొప్ప.
కావళ్ళతో భటగణకోటిసాగె.
వారు మోసెడి బహువస్తుజాలముల
రకముల నెవడు వర్ణనసేయగలడు ?
నిఖిలసేవకకోటి నిజనిజబృంద
సన్నాహములతోడసాగె నయ్యెడను
నిండె సర్వులలోన నిర్భరసుఖము
పులకరించె శరీరములు సర్వులకును
"రామలక్ష్మణుల నా రఘువీరయుగము
నెపుడు గండ్లారగా నీక్షింపగలమొ ? "

అని చెప్పుకొనుచుండి రందఱుగూడ.
గజఘీంకృతులు ఘంటికాఘోరరవళి
రథగతిధ్వనులు తురంగహేషలును
నిఖిలదిక్కులయందు నిండి జృంభించె.
మించె భేరీధ్వనుల్ మేఘగర్జనల.
ఎవని మాటలు వానికే వినబడవె
యితరుల మాట లింకెటు వినవచ్చు ?
అవనీతలేశు సింహద్వారసీమ
నొక్క పాషాణంబు నుంచిన యెడల
బిండి పిండయిపోవు విధముగా నుండె
జనులసమ్మర్దంబు సంరంభలీల.
స్త్రీలు సౌధంబులజేరి చూచుచును
సొంపుగా నొసగిరి శుభహారతులను
మంజులమంగళమధురగీతముల
బాడిరి వర్ణింప వలను గానట్టి
యానందపారవశ్యంబున మునిగి.
అంత సుమంత్రు డర్కాశ్వరాజముల
నైత మోడించు నశ్వంబుల బూన్చి
భాసిల్లు స్యందనద్వయమును దెచ్చి
నృపశిరోమణిముందు నిలుచుండ బెట్టె
వాని మహాశోభ వర్ణనసేయ
శారదాదేవియు జాల, దం దొకటి

రాజోపకరణవిరాజమానంబు ;
అమలతేజఃపుంజ మగుచు రెండవది
యమితవిభ్రాజితమై తనరారె.
రాజితమైన యీ రథమందు రాజు
సంతోషమున వసిష్ఠర్షి నెక్కించి
హరగురుగౌరీగణాధినాయకుల
స్మరియించి రెండవ స్యందనమెక్కె
అలబృహస్పతియుక్తు డగు పురందరుని
యటుల వసిష్ఠమహర్షిసమేతు
డగు మహానాయకు డలరారుచుండె.
నిజకులరీతిని నిగమపద్ధతిని
సకలసత్క్రియలను సలిపిన పిదప,
సర్వులు పయనంబు సలుపగా దగిన
నిఖిలసన్నాహులై నిలుచుట గాంచి
గురుదేవు నాజ్ఞ గైకొని రాము దలచి
బయలుదేరెను మహీపతి శంఖమూది.
ఆ వివాహోత్సవ మరసి దేవతలు
నాకాశమందుండి హర్షాత్ము లగుచు
బరమమంగళవరప్రదము లైనట్టి
కుసుమవర్షంబుల గురిపించుచుండ్రి.
హయగజధ్వనుల భూమ్యాకాశభాగ
భహుశుభవాద్యశబ్దంబుల నచట

ఘూరికోలాహలపూర్ణత జెలగె.
సురనరకాంతలు సొంపొప్పనటుల
మంగళగీతముం బాడుచుండగను
సన్నాయివారలు సరసరాగముల
బాడిరి ; ఘంటికా ధ్వనులు జెలంగె
వర్ణనాతీతమౌ పద్ధతివెలయ.
భటజనుల్ గంతులు వైచి రుత్సుకత
బహువిధసాధనావళి జూపు కొనుచు.
ఘనహాస్యకుశలురు కలగాననిపుణు
లగు విదూషకులెల్ల రానందపడగ
గావించి రెన్నియో కౌతుకక్రియలు.
క్రావ్యమృదంగనిస్సాణశబ్దముల
దరువున కనువుగా దమ తురంగముల
నడిపిరి సుందరనరపాలసుతులు.
తాళంబు రవ్వంత తప్ప కా హయము
లరుగుట గని 'నటు' లాశ్చర్యపడిరి.
ఆ పెండ్లిసంబర మభివర్ణనంబు
సలుప నెవ్వనికి వశంబుగాకుండె.
చూపట్టె సుందరశుభశకునములు
వామపార్శ్వమునందు వారల కప్పు
డగపడె మగపిట్ట యవనీస్థలాన
ధాన్యంబు నేరుచు దన ముక్కుతోడ.

శుభము లెల్లను గల్గు సూచన గదుర.
పొలములో గుడిపార్శ్వమున వారికంత
గాకంబు, నకులంబు కానంగ వచ్చె.
మందశీతలగంధమారుతం బప్పు
డనుకూలముగ వీచె హాయి గొల్పుచును.
సఘటసబాలయౌ సాధ్వీలలామ
కనవచ్చె; నొకజంబుకము ప్రదక్షిణము
సలుపుచు దా బలుసారులు తోచె.
వత్సంబు కనురక్తి బాలిచ్చుకొనెడి
సురభి వారల ముందు జూపట్టె; మఱియు
ఘనశుభగణములే కనవచ్చినట్లు
మృగమాల కుడిదెస కేతెంచె జుట్టి.
గరుడపక్షియు జూపె ఘనమంగళముల
నెడమదిక్కున మంచి వృక్షంబు పైన
శ్యామపక్షియు దృష్టియందున దోచె.
దధిమీనముల గొని తరలి యొకండు,
కరమున నొకపుస్తకము దాల్చుకొనియు
బండితు లైనట్టి బ్రాహ్మణు లిద్ద
ఱేతెంచి రచ్చోటి కెదురుగా నడచి.
మంగళకల్యాణమయము లైనట్టి
యభిమతార్థప్రదాయకము లైనట్టి
యఖలశుభసూచన లన్నియు నొక్క

పర్యాయముగ గానవచ్చె నా వేళ
నాత్మీయసార్థకతార్థమై యనగ.
ఆ సగుణబ్రహ్మ మాత్మపుత్రునిగ
గన్న ధన్యునకు మంగళశకునములు
కనిపించె సుగమంబుగా, వింతలేదు.
ఆ వివాహోత్సవమందలి వరుడు
శ్రీరామచంద్రుడు సీతయే వధువు
దశరథజనకులు తతపుణ్యధనులు
తద్వరూవధువుల తండ్రు, లీ పెండ్లి
సద్వార్త విని శుభశకునంబు లెల్ల
దాండవమాడె, "విధాత యీ నాడు
సార్థకపఱచె మా జన్మంబటంచు."
ఈ రీతి బెండ్లివా రేగ దొడంగి
రశ్వేభభేరీరవావళిమధ్య.
ఆ భానుకులకేతు వరుదెంచు పెఱిగి
కట్టించె జనకుండు ఘనసేతువులను
వాహినీచయములపై; మధ్యమధ్య
నమరావతీసమానాతివైభవము
లైన నివాసగృహంబు లేర్పఱచె.
సరసదివ్యాశనశయనసద్వసన
వసతు లన్నియును నేర్పాటుగా బడియె
నెవ్వరెవ్వరికెట్లు హితమౌనా యట్టుల.

ఆ నిత్యనూత్నసుఖావళి తమకు
ననుకూలమై యుంట నరసి సర్వులును
మరచిపోయిరి నిజమందిరంబులను.

## జనకాదులు దశరథాదులకు స్వాగత మొసగుట

పెండ్లికుమారుని బృందంబు పురికి
వచ్చుచుండె నటన్న వార్త నెఱింగి
భేరీనినాదముల్ వినపడి నంత
వరహయగజరథభటసమేతముగ
నెదురుకోలు జనంబు లేగెను కలియ.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### దశమవిశ్రామము

శ్రీదేవీ హృదయేశ్వర !
వేదాచలశిఖరనిలయ ! విశ్వాధారా !
శ్రీదాయక ! భక్తప్ర
హ్లాదావన ! మట్టపల్లి హరి ! నరసింహా !

స్వాదుశీతలశుభ్రజలపరిపూర్ణ
కాంచనకలశసంఘంబుల, మఱియు
వర్ణనసేయగా వలను గానన్ని
యమృతోపమానపక్వాన్నజాలములు
బహుఫలంబులు రమ్యవస్తుజాలములు
బాగుగా నిండిన పల్లెరంబులను,
జనకభూనాథుడు సంతోషపడుచు
బంపె గట్నంబుగా వారల కపుడు.
మఱియు రాజంపెను మణులనేకముల
భూషణవసనసమూహకోటులను
ఖగమృగహయగజఘనతరవివిధ
వాహనచయముల బహువిధరమ్య

తమసుమంగళసుగంధద్రవ్యములను.
దధి, చిపిటంబుల దగు నుపహార
ముల మోసికొనుచును భుజములపైన
గావళ్ళతో, భటగణ మేగుచుండె.
ఎదురుకో లివ్వగా నేతెంచినట్టి
వారలు మగ పెండ్లివారిని జూచి
యానందమొంది హృదంతరంగముల
బులకీకృతాంగులై పోయి రెల్లరును.
అఖిలసన్నాహసమంచితు లగుచు
వచ్చిన యాహ్వానపక్షంబు వారి
నరసి యా వరుపక్షమందలివారు
ముదితులై భేరుల మ్రోయించి రపుడు.
ఒండొరుల్ కలియగా నుభయపక్షములు
గబగబ నడచిరి గంతులేయుచును.
ఉప్పొంగి తీరంబు లుద్ధతి దాటి
కలసిన యానందకంధిద్వయంబు
కరణి వా రుభయు లేకం బయిరంత.
సురసుందరీమణుల్ సుమవర్షములను
గురియుచుం బాడిరి కోయిలలటుల,
ముదితామరులు దుందుభుల మ్రోయజేయ.
అంతట జనకుని యనుచరగణము
దశరథనృపుని ముందట బెట్టి సర్వ

వస్తుజాలంబుల, బ్రార్థన జేసె
నమితానురాగసమంచితోక్తులను.
అప్పు డా నృపుడు ప్రేమాన్వితుం డగుచు
నెల్లవస్తువుల గ్రహించి, యా పిదప
వానిని తనదగు పరిజనంబులకు
బహుమానముగ నిచ్చివైచెను, కొన్ని
సలిపె దానంబు యాచకతండములకు.
సముచితగౌరవ సత్కారములను
సలిపిన పిదప నా జనకుని జనము
పెండ్లికుమారుని బృందంబులకును
వేంచేయ జూపెను విడిదిగృహాల.
వరచిత్రవసనముల్ పఱచిరి క్రింద
రాజబంధువులు మార్గమ్మున నడువ.
అవ్వాని వైభవం బరసిన యంత
ధనదుని ధనమదధ్వాంతం బడంగె.
ప్రతివ్యక్తికిని సర్వవసతులు గల్గు
నతిసుందరములగు నావాసపంక్తి
పెండ్లివారికి సమర్పింపగా బడియె.
పెండ్లికుమారుని బృందంబు, నగరి
కరుదెంచె నను వార్త నాలించి, సీత
ప్రకటించె స్వీయప్రభావం బొకింత
తనదు సంకల్పమాత్రంబున నామె

వివిధసిద్ధులను రావించియు బంపె
దశరథరాజబృందంబులో జనుల
నందఱ సేవింపు డని యాజ్ఞ నొసగి.
ఆ జానకీదేవి యాజ్ఞ నాలించి
సర్వసిద్ధులు పెండ్లిజనుల వాసముల
నిఖిలసంపత్సుఖానీకసాకల్య
భూరిభోగవిలాసములతోడ జొచ్చె.
తాము వసించెడి ధామంబులందు
సులభంబుగా, సర్వసురపురసుఖము
లంది యానందించి రాపెండ్లివారు.
ఆ యనిర్వచనీయ మగు వైభవమున
కేది కారణ మది యెఱుగ రించుకయు,
జనకునే కీర్తింప సాగి రెల్లరును.
శ్రీరాము డొక్కడే సీతామహత్త్వ
మాత్మలో నెఱిగి మహోహర్ష మొందె
నామె ప్రేమాతిశయంబు గ్రహించి.

## రామలక్ష్మణులు తండ్రిని గలియుట

ఆత్మీయపితృదేవు నాగమనంబు
నా రామలక్ష్మణు లాలించినంత
నాపజాలక పోయి రానంద మెదను.
జనకదర్శనలాలసస్వాంతు లయ్యు

గురువుతో దెలుప సంకోచంబు పడిరి.
ఆ మహావినయంబు నరసి డెందమున
నమితసంతోషంబు నందె కౌశికుడు.
పరమహర్షమున విశ్వామిత్రు డంత
దత్సహోదరుల నిద్దఱి నొక్కసారి
హత్తించుకొనె హృదయంబున దనువు
పులకింపగా, నేత్రముల జలం బొలుక.
అంతట వారు ధరాధీశ్వరుండు
దశరథుం డున్నట్టి స్థలికిని జనిరి
దాహతప్తుని సన్నిధానంబు జేర
నరిగిన కాసార మటుల మునీంద్ర!
తనయులతో వచ్చు తపసిని గాంచి
హర్షంబుతో లేచి యవ్వారి గలియ
ముందుకు నడచెను, మోదాబ్ధి యందు
నడుగిడుచుండిన యటుల భూవిభుడు.
క్ష్మానాయకుడు మునీశ్వరు పాదములకు
దండప్రణామముల్ తా నొనరించి
తత్పాదరజమును తన శిరమందు
బలుమాఱు ధరియించె భక్తిభావమున.
కౌశికుండు నృపాలు గౌగిట జేర్చి
యాశీర్వదించియు నడిగె క్షేమంబు.
అంతట రాజు నిజాంఘ్రుల కెఱగు

నా యన్నదమ్ముల నరసినయంత
పొందె నిర్భరహర్షమును స్వాంతమందు.
ఆ బాలకుల, హృదయాగ్రమం దాత
డమితగాఢంబుగా హత్తించుకొనియు
దుస్సహవిరహాతిదుఃఖంబు బాసె
మృతమానవుడు పునర్జీవించినట్లు
పరమసంతోషసంభరితాత్ము డయ్యె.
రామలక్ష్మణు లంత రాజితభక్తి
శ్రీవసిష్ఠాంఘ్రిరాజీవంబు లందు
విలసితమతులైరి, ప్రేమసమ్మదిత
భావుడై యా మునివరు డంత వారి
గౌగిట జేర్చెను కరముల నెత్తి.
తదుపరి యా సహోదరు లిర్వు, రెల్ల
విప్రబృందములకు వినతి గావించి
పొంది రాశీర్వాదముల భరద్వాజ!
భరతశత్రుఘ్నులు ప్రణతు లర్పింప
రామచంద్రుం డనురాగవేగమున
గౌగిట జేర్చెను గాఢంబుగాను.
సోదరద్వయమును జూచి లక్ష్మణుడు
హర్షించె, గుండెకు హత్తించు కొనియె
ననురాగపరిపూరితాంగుడై, పొంగి.
పరిజనపురజనబాంధవజనుల

యాచకమంత్రిమిత్రాదుల నెల్ల
ప్రేమతోడను, యథావిధి నాదరించె.
వరవినీతుండును, పరమకృపాళు
వైన శ్రీరాఘవు డాజగత్ప్రభువు.
శ్రీరామచంద్రు దర్శించి వారెల్ల
సంప్రీతి పొందిరి స్వాంతంబులందు.
ప్రేమరీతుల దెల్ప వీలుగా దెపుడు;
దశరథనృపసన్నిధానంబునందు
వెలసిరి నలుగురు ప్రియతనూభవులు
నలచతుర్విధపురుషార్థంబు లవని
నాకృతుల్ దాల్చిన యటుల దోపంగ.
కూర్మినందనులతోగూడి యున్నట్టి
దశరథధారుణీధవుని వీక్షించి
సర్వపౌరులు విశేషప్రీతి గనిరి.
కుసుమవర్షంబులు గురియుచు సురలు
మ్రోయజేసిరి దుందుభుల నభస్థలిని
నాకనటీమణుల్ నర్తనతోడ
గానంబు సేసిరి కడు శ్రావ్యముగను.
అంత శతానందు డవనీసురులును
సచివమాగధసూతజనవందిబృంద
భటవిదూషకముఖ్యవర్గ మంతయును
పరివారయుతముగా బార్థివమణిని

సన్మాన మొనరించి చనిరి వీడ్కొనియు.
ఘనలగ్నదినమునకంటె ముందుగనె
వరుని సమాజంబు వచ్చి యుండుటను
పురములో నధికప్రమోదంబు నిండె
నఖిలజనంబు బ్రహ్మానందపడుచు
రాత్రింబవళ్ళు దీర్ఘం బొనరింప
బ్రార్థింపసాగిరి పరమేష్ఠి నాత్మ.
"అహహా! సీతారాము లఖిలలోకముల
బూర్ణశోభాస్వరూపులు నిక్కముగను
దశరథ జనకు లిద్దఱును వీక్షింప
పూర్ణపుణ్యస్వరూపులు సుమా" అనియె
యొండొరుల్ మాట్లాడుచుండి రెల్లెడల
బురిలో వసించు స్త్రీపురుషు లెల్లరును.
"జనకుని సుకృతమే జానకి యయ్యె
దశరథు సుకృతమే ధర రాముడయ్యె
నీ రాజయుగమున కెనగా నెవండు
శ్రీశివారాధన చేయగా లేదు.
అహా! వీర లొందినయట్టి ఫలంబు
లెవ్వరు బొందలే దీ లోకమందు
నీ దృశులగు వార లెందైన నుండ
రింకొకచో నుండ రిక నుండబోరు.
నిఖిలపుణ్యవిశేషనిధులము మనము,

కావుననే యీ జగత్తున బుట్టి
జనకపట్టణనివాసంబు నొందితిమి.
జానకీరాముల సౌందర్య మరయ
గలిగిన మనవంటి కడు ధన్యులెవరు ?
అహా ! రఘువీరకల్యాణంబు గాంచి
యమితలోచనలాభ మందగా గలము.''
ఉవిద లీ రీతిగా నొకరితో నొకరు
కలకంఠకమనీయగళములతోడ
గుసగుసవోయిరి కూర్మివశాన.
''ఓ సులోచనలార ! యుర్విలో మనమె
యెంతయో లాభింతు మీ వివాహమున.
మన యదృష్టంబునఁ బ్రహ్మదేవుండు
సర్వంబు మంచిగా సమకూర్చియుంచె
నీ యన్నదమ్ము లీ యిరువురు తరచు
నహా ! మన కన్నుల కతిథు లయ్యెదరు.
అప్పుడప్పుడు జనకావనీవిభుడు
స్నేహవశంబుచే సీతను దెచ్చు
నామెను గొనిపోవ నరుగుదెంచెదరు
కామకోటిసమానకమనీయరూపు
లీ సహోదరు లిద్ద ఱీ పురంబునకు.
ఎన్నియో పండుగ లేతెంచుచుండు
మన జనకుని బోలు మామగా రింట

నెవరు వసింపగా హృది గోరుకొనరు?
ఆ సమయంబుల నఖిలజనంబు
రామలక్ష్మణుల దర్శన మొనరించి
యానందపడగల రత్యంతముగను.
ఇంకను రాసుతు లిద్దఱు గలరు
దశరథనృపుతోడ: దద్రాజసుతులు
సాక్షాత్తు రామలక్ష్మణు లటు లుండి
రందొక్క బాలుడు శ్యామలాంగుండు
మఱియొకడుండె భర్మచ్ఛాయతోడ
నిద్దఱు సర్వాంగశృంగారరాశు
లని చూచి వచ్చువా రంద ఱుగూడ
నో సఖీ! వచియించుచున్నార'' లనిన
నింకొక పద్మాక్షి యీ రీతి బలికె:
"ఏ వారి గాంచితి నీ నాడు సఖియ:
తానే స్వయంబుగా దద్బాలకులను
తీర్చి దిద్దె విరించి ధీరత్వ మొప్ప
ననిపించె నరయగా నాత్మలో నాకు.
భరతుడు రాముని ప్రతిబింబ మేను
తొలిసారి చూచిన తోడనే యెవరు
వారిభేదము గుర్తుపట్టగా లేరు.
శత్రుఘ్నలక్ష్మణస్వాము లా యిర్వు
రేకస్వరూపులే, యెన్నగా వార

లాపాదమస్తకాఽనన్యోపమాన
సుందరాంగులు, వారి జూచినజాలు
భావంబు పరవశత్వంబును బొందు
గాని యా నలుగుర గాంచి వాక్కులను
వర్ణనసేయగా వశముగా దెపుడు.
వారికి సరియగువా రెందులేరు.
చెప్పుచుండెను తులసీదాసు వినుడు :
"అనుపమానులు వార లఖిలలోకముల
నని, కవి కోవిదు లనుచున్నవారు.
వినయవిద్యాశీలవిక్రమబాహు
బలమహాసౌందర్యవార్ధులై వెలుగు
వారికి సరిపోలు వారలు వారె."
"నలుగురు భ్రాత లీ నగరంబునందె
పెండ్లాడుదురుగాక ప్రీతితో మేము
గానం బొనర్ప మంగళగీతములను"
అని ప్రార్థనము జేసి రంగనల్ విధిని
చీర చెఱంగుల జేతులబట్టి.
"ఆ త్రిపురారిదివ్యానుగ్రహమున
సర్వంబు నెఱవేఱు సఖులార! యట్టి
పుణ్యపయోనిధుల్ భూపు లిద్దఱును."
అని చెప్పుకొనిరి యా యంగనామణులు
కాయముల్ పులకింప గనుల నీరొలుక.

వారు ప్రార్థించి రీ పగిదిగాఢముగ
వారిలో నానందవార్ధు లుప్పొంగె.
వసుధాత్మజాస్వయంవరమహోత్సవము
నకు వచ్చి నట్టి భూనాథు లా నల్గు
రన్నదమ్ముల గాంచి యానందమొంది
యరిగిరి తమతమ యావాసములకు
రఘురామవిశదవిరాజవిశాల
సద్యశఃకథనప్రసంగితు లగుచు.
ఇట్లు కొన్నిదినంబు లేగె బౌరులును
పెండ్లికుమారుని బృందంబు మిగుల
సంతోష మొందగా స్వాంతంబులందు.

## సీతారామకల్యాణమహోత్సవము

దివ్యమౌ శుభలగ్నదిన మంత వచ్చె
శ్రీమంత మది మార్గశీర్షమాసమున
నెంతయు నింపగు హేమంతఋతువు.
గ్రహతిథివారనక్షత్రయోగముల
శుభలగ్నకాలంబు శోధించిచూచి
లగ్నపత్రిక వ్రాసి లావణ్య మొప్ప
బ్రహ్మ నారదుచేత బంపించె; నిచట
జనకుని జ్యోతిషశాస్త్రపండితులు
నైత మా లగ్నమే సరిగ గణించి
తాము తెలిపిరి తత్కాలమందె.

ఈ విషయము విని యెల్లజనంబు
"జనకరాజేంద్రు నాస్థానదైవజ్ఞు-
లందఱు బ్రహ్మలే యనిపించుచుండె"-
నని చెప్పుకొనిరి మహాశ్చర్యపడుచు.

విమలసన్మంగళవిసరమూలంబు
విలసిల్లు గోధూళివేళను గాంచి
యనుకూలశకునంబు లరసి బ్రాహ్మణులు
తెలియజేసిరి శ్రీవిదేహభూపతికి.

నృపతి యంతట బురోహితు గాంచి, "అనఘ !
యింక విలంబన మేల ?" యనంగ
శ్రీశతానందఋషిశ్రేష్ఠు డంత
సచివుల బిలిపింప, సత్వరం బఖిల
మంగళవస్తుసమంచితు లగుచు
వారెల్ల వచ్చిరి పరమమోదమున.
వరశంఖనిస్సాణపణవాదిబహుళ
వాద్యవిశేషరావంబులు చెలగె.
మంగళకలశముల్ మంగళవస్తు
జాలంబు లన్నియు సమకూర్పబడియె.
సుభగసువాసినీస్తోమంబు లంత
సొంపుగా పాడెను శుభగీతములను,
బ్రాహ్మణావళి వేదపఠనం బొనర్ప.
ఈ రీతి వా రంద ఱేగి రా పెండ్లి

వారల సాదరపద్ధతి గదుర
గొని తెచ్చుటకు వారి కూటంబులకును.
వారలా కోసలపతివై భవంబు
గాంచగా దోచెను, కడు స్వల్పరీతి
నా మహేంద్రుండు మహర్షివరేణ్య!
"విభు! సుమూర్తము సమీపించె మీరింక
బయలుదేరు డటంచు" బలికిరి వారు.
అనినంత భేరీమహాధ్వనుల్ జెలగె
బృథుమేఘగణము ఘూర్ణిల్లిన రీతి.
అంతట దశరథుం డాచార్యుతోడ
సంప్రతించియు గులాచారముల్ సలిపి
వెడలెను మునిసాధుబృందయుక్తముగ.
ఆ యయోధ్యేంద్రు భాగ్యము, విభవంబు
లరసియు గనుల బ్రహ్మాదిదేవతలు
తమజన్మలెల్ల వృథా యని తలచి
యాతని గీర్తించి రల వేయినోళ్ల.
అదె సుమంగళసమయం బని యెఱిగి
కుసుమవర్షంబుల గురియుచు సురలు
మ్రోయజేసిరి దుందుభుల రభసముగ
విధిశివముఖ్యులౌ విబుధవరూథ
ములు విమానముల సమూహంబులందు
దనువులు పులకింప దన్మయత్వమున

నానంద ముప్పొంగ నాంతరంగముల
రామవివాహదర్శన మొనరింప
బయలుదేరిరి నభఃపథమునం దపుడు.
కని దేవతలు జనకప్రభుపురము
తమలోకములు లఘుతమముగా దోప
ననురాగవశులై రి యా పురంబందు.
ఆశ్చర్యపడుచు వా రరసి రచ్చోట
దతమహాచిత్రవితానరాజమును
బహువిధాలౌకికవరశిల్పకృతుల.
ఆ పురి స్త్రీపురుషాదు లెల్లరును
సౌందర్యనిధులును సద్ధర్మశీల
సుజ్ఞాననిలయులు, చూడగా వారి
సన్నిధానంబున సకలదేవతలు
దేవతాస్త్రీలు నిస్తేజులై తోచి—
రలచంద్రికను తారకావళిరీతి.
తన సృష్టికార్య మా తావునం దెచట
గనరాక పోవుట గాంచి విధాత
స్వాంతమందున విశేషాశ్చర్యమొందె.
శివు డంత దేవతాశ్రేణుల జూచి
యీ రీతి బోధించె నింపు దలిర్ప :
"ఆశ్చర్యపడకుడీ యాత్మలో మీరు
శాంతిని బూని విచారంబు సలిపి,

పృథ్వీసుతారఘువీరవివాహ
మిది యని లోన గ్రహింపు డీ తటిని.
ఎవరి నామము స్మరియించి నంతటనె
కడకంటగా, సమంగళకోటి కూలు
నలచతుర్విధపురుషార్థంబు లెల్ల
గరతలగతమౌనొ, కాంచగా వార
లీ జానకీరాము లెవ్వరో కాదు!''
అని వచియించె గామారి శంకరుడు.
శంభు డీ విధి బోధసలిపి వారలకు,
వృషభరాజము నెక్కి వేంచేయసాగె.
పరమసంతోషసంభరితాత్ము డగుచు,
బులకితదేహుడై పోవుచున్నట్టి
దశరథు గాంచె బృందారకగణము.
ఆ నృపాలునిగూడి యరుదెంచుచున్న
సాధుమహీదేవసంఘంబు లరయ
గాయముల్ దాల్చి, సుఖప్రతానంబు
లతని సేవించుచున్నట్టుల దోచె.
ఆ నృపు చెంగట నలరారుచున్న
నలుగురు సుందరనందనుల్ దోచి
*రపవర్గములు నాల్గు నాకృతుల్ దాల్చి

---

*అపవర్గములు నాలుగు : సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యా మోక్షములు.

నరపతి వెనువెంట నడిచిన విధము.
మరకతకనకాభమహితాంగు లైన
రామలక్ష్మణుల దర్శన మొసరించి
ప్రేమభావోద్వేగవివశాత్మ లైరి
శ్రీరాము గాంచి విశేషంబు సురలు
హర్షంబు నొందిరి యాంతరంగమున
క్ష్మానాథుదశరథు సన్నుతించుచును
కురిసి రాతనిపైన గుసుమవర్షములు.
శ్రీరాము సుందరాకృతి జూచి చూచి
యాపాదమస్తక మా యుమాశివులు
పులకసంకలితసంపూర్ణాంగు లైరి,
జలకణభరితలోచనపద్మలైరి.
నెమలికంఠమువోలె నీలిమంబైన
రామచంద్రుని మహారమ్యదేహమున
పీతాంబరము వెల్గు మెఱపును మించి.
సర్వమంగళసర్వసౌందర్యనిలయ
బహువిధకల్యాణవరభూషణముల
శ్రీరామవిభుడలంకృతుడై రహించె.
విమలశరశ్చంద్రవిభవాననంబు,
నిందీవరముల కెంతే సిగ్గుగూర్చు—
చారువిశాలలోచనయుగళంబు
వెలుగొందు నా రఘువీరురూపంబు

సకల మలౌకికసౌందర్యయుతము.
అద్దాని దర్శించినంత మనస్సు
పారవశ్యత నొందు, వర్ణింపలేదు.
ఆతని ప్రక్కనే యనుసరించుచును,
ముద్దులతమ్ములు మువ్గురుగూడ
రమణీయచపలతురంగంబు లెక్కి
కదము ద్రొక్కించుచు గమియించుచుండ్రి.
తదితరరాజనందనులు సైతంబు
తమహయగమనవిధానంబు లెల్ల
జూపించుచుండిరి చోద్యంబుగదుర
వంశప్రశంసకబహుబిరుదముల
బఠియించుచుండిరి వందిమాగధులు.
రామవిరాజతురంగవేగంబు
గాంచి పతంగపుంగవుడు లజ్జించు
నద్దాని సౌందర్య మన్నివిధాల
వర్ణనాతీతమై భాసిల్లుచుండె
మదను డా యశ్వమై మహి బుట్టెననగ
గనుపించె నా తురంగము తీరు జూడ.
శ్రీరాముకౌఅకు నా చిత్తసంభూతు
డలశొభతోడ నా యశ్వరూపమున
వచ్చియు దనవయోబలరూపసుగుణ
గతులతో సర్వజగంబు విమోహ

పఱచిన విధి గానవచ్చె, మునీంద్ర !
మౌక్తికబహుమణిమాణిక్యఖచిత
పల్యాణమొగి మూపుపైనను మెఱసె.
చిన్నమువ్వలతోడ జెలగు పట్టెడయు
నందమౌ కళ్లెంబు నరయగా సర్వ
నరసురమునుల మనస్సు భ్రమించె.
ప్రభుచిత్తసమ్మగ్నభావంబుతోడ
నరుగుచున్నట్టి యా యశ్వరాజంబు
కడు మనోహరముగా గానంగవచ్చె
తారాతటిల్లతోద్భాసితాంబుదము
శిఖినెక్కి యాడింప జేసిన రీతి.
శ్రీరామవిభుడు స్వారీ చేయునట్టి
యా వరవాజిని యభివర్ణనంబు
సలుపజాలదు వాణి సైత మో యనఘ !
రామస్వరూపానురాగియై శివుడు
పంచదశాక్షుల భాగ్యంబు గలిగి
యున్నందులకును మహోత్సాహ మొందె.
శ్రీరామదేవు వీక్షించి సంప్రీతి,
హరియును, రమయు, మోహాస్వాంతులైరి.
రాముశోభను జూచి బ్రహ్మదేవుడును
హర్షంబు పొందె నిజాంతరంగమున
గాని తా నెనిమిది కన్నులే గలిగి

యుండుట, ఖిన్నతనొందె జిత్తమున.
నలువకన్నను నింక నాలుగుకన్ను
లధికంబుగా నుంట నలరె షణ్ముఖుడు.

సుజ్ఞాని, సురపతి, చూచి శ్రీరాము
గౌతమశాపంబు ఘనవరంబయ్యె
నని సంతసించె నిజాంతరంగమున.

సురలెల్ల నింద్రుని జూచి, యిట్లెంచి
"రీ పురందరునితో నెవ్వ రీ నాడు
సరిపోలగలరు ముజ్జగములలోన"
అఖిలదేవతలు రామాలోకనమున
సమ్మోదమొందిరి స్వాంతంబులందు.
దశరథజనకబృందద్వయ మందు
జెలగె నపారవిశేషహర్షంబు.
ఇరువురు రాజుల బృందంబులందు
బృథుహర్ష ముప్పొంగె నిరుపక్షములను
ఘనదుందుభిధ్వానగణము జృంభించె.
కురిసిరి దేవతల్ కుసుమవర్షముల
"జయజయజయజయ, జయరఘునాథ!"
అని వచించుచు బరమానందవశత.

ఈ రీతి బెండ్లివా రేతెంచుచున్న
విషయంబు దెలిసిన వెంటనే నగరి-
నఖిలవాద్యములు మ్రోయంగదొడంగె

నంత రాజ్ఞీమణి యా సునయనయు
బొలుపుగా ముత్తైదువులను రావించి
యానందమంగళహారతు లొసగ
దగిన శుభద్రవ్యతతి సమకూర్చె.
వివిధహారతులను వెలిగించుకొనియు
సకలమంగళవస్తుజాలముల్ గొనియు
గజగామినీవరకాంతాగణంబు
బయలుదేరెను హర్షభావంబు లెసగ
నా వరునకు శుభహారతు లొసగ.
పూర్ణేందుబోలిన ముఖములతోడ
నవరమ్యమృగలోచనంబులతోడ
దమ రూపశోభచే ద్రతీదేవి
మదవిమోచనజేసి భాసిల్లుచుండి
రా సుందరీమణు లందఱుగూడ
చిత్రంబులగు పట్టుచీరలు గట్టి
యన్నిసొమ్ముల దనువెల్ల ధరించి
మంగళద్రవ్యసమంచితాంగముల
బాటలు పాడిరి వర్ణింపమధువు
కడు సిగ్గు నొందగా గలకంఠకులము.
అల్లేగుచున్నట్టి యా సతీమణుల
కంకణకింకిణీగణనూపురమ్ము
లతిమంజులముగ మ్రోయంగ దొడంగె.

వారి యొయ్యారంబు బరికించినంత
గామదేవుని భద్రగజము సిగ్గొందె.
బహువిధవాద్యరావములు చెలంగె
నభముననగరినానందంబు నిండె.
సహజపావిత్ర్యంబు చతురతగల్గు
శ్రీశచీశారదా శ్రీభవానులును
తదితరదేవకాంతాగణంబులును
మాయాంగనామణీమహితాకృతులను
వచ్చిచేరిరి రాణివాసంబులోన
సొంపుగా బాడిరి శుభగీతములను
వారి సంతోషాన వారలు మునిగి
యెవ్వ రా స్త్రీల గ్రహింపలేరైరి.
ఎవ్వరి నెవరు గ్రహింపగా గలరు !-
తత్పరబ్రహ్మావతారు డైనట్టి
యా వరునకు శుభహారతు లివ్వ
బ్రతికొంత యానందపారవశ్యమున
నరుగుచున్నట్టి మహాసమయమున !
క్రమభేరీధ్వనుల్ కలగానరవళి
పుష్పవర్షంబులు పొసగె, సర్వంబు
శోభాయమానమై చూపట్టె మిగుల
నానందకందమౌ యా రామచంద్రు
దర్శించి సర్వకాంతలు స్వాంతమందు

హర్షంబు జెందిరి, యా సతీమణుల
యంబకాంభోజద్వయంబున నిండె
బ్రేమాంబుకణములు; శృంగారవిలసి
తాంగంబులను పులకావళి పొడమె.
పెండ్లికుమారుని వేషమందున్న
యా రామచంద్రుని నరసి స్వాంతమున
నా సీతమాతయా యా మహారాణి
పొందిన యానందమును తుదముట్ట
వేయిశేషులు మఱి వేయిశారదలు
నూరుకల్పములైన, నుడువగా లేరు.
అది శుభసమయం బటంచు దలంచి
నేత్రపద్మంబుల నీరాపుకొనియు,
నా రాణి ముదమున హారతు లొసగి
వేదకులాచారవిధులెల్ల దీర్చె.
*పంచశబ్దధ్వనుల్ వరభద్రగాన
ములు చేయగాబడె ముదము దీపింప.
బహువిధపటములు పఱచగా బడియె
మార్గంబునందున మంజులరీతి;
హారతులిచ్చిన యా యనంతరము

---

* పంచశబ్దములు: 1. వీణానిక్వణము, 2. కరతాళరవళి, 3. తాళరవము, 4. భేరీస్వనము, 5. బాకాశబ్దము.

* పంచధ్వనులు: 1. వేదధ్వని, 2. వందిధ్వని, 3. జయధ్వని, 4. శంఖధ్వని, 5. దుందుభిధ్వనులు.

పాద్య మర్పింపగాబడియె రామునకు.
అంత రాఘవుడు కల్యాణమండపము
జేర బయల్దేరె శృంగార మొలుక.
బహుసమాజముతోడ భ్రాజితుండైన
దశరథధారుణీధవు వైభవంబు
గాంచి లోకేశులు గడుసిగ్గుపడిరి.
అప్పుడప్పుడు దేవతావళియెల్ల
గురిపించుచుండిరి కుసుమవర్షముల.
అవనీసురులు సమయానుకూలముగ
చదువుచుండిరి శ్రావ్యశాంతిపాఠముల.
నభమున నగరమున న్విజృంభించె
నమితకోలాహల, మా రొదలోన
నెవరిమాటలు వారికే వినరాక
పోయెను, పరవాక్యములగూర్చి యేల ?
అటుల ప్రవేశించె నా రామవిభుడు
మండితకల్యాణమండపస్థలిని.
ప్రక్షాళనముజేసి పాదపద్మముల
శ్రీరాము నుపవిష్టుజేసి రందున్న
దేదీప్యమానమౌ దివ్యాసనమున.
శ్రీరాము నాసనాసీను గావించి
హారతు లిచ్చె న య్యఖిలజనంబు
పెండ్లికుమారుని వీక్షించి మిగుల

నానందమందుచు స్వాంతరంగముల
మణివస్త్రభూషణమండలంబులను
పైనజల్లిరి వర్షపాతంబు వోలె.
సుందరుల్ పాడిరి శుభగీతికలను
బ్రహ్మాదిసురవరుల్ బ్రాహ్మణాకృతుల
వచ్చి కౌతుకమున పరికించుకొనుచు,
రఘుకులకమలసూర్యస్వామి యైన
శ్రీరామచంద్రుని శృంగార మరసి
తమ జీవితంబు సార్థకమయ్యె ననుచు
దలచి రాహా! భరద్వాజ మునీంద్రా!

ఆటగల భటనటు లంబష్ఠకులును
కరదీపికావహాగణము లచ్చోట
నా రాముపై జల్లి నట్టి వస్తువుల
స్వీకరించియు, మ్రొక్కి శిరముల వంచి,
పరమసంతోషసంభరితాత్ము లగుచు
నాశీర్వదించిరి యా మహాభాగు.
వైదికలౌకికపద్ధతులెల్ల
నాచరించిన యంత నతిప్రీతితోడ
జనకభూపాలదశరథరాజేంద్రు
లుభయు లాలింగన మొనరించుకొనిరి.
ఆ యేకమైన మహారాజమణుల
యుజ్వలదృశ్యంబు నుపమించుకొఱకు

గవిజనుల్ సలిపియు ఘనయత్నకోటి
యపజయం బొంది లజ్జాన్వితులైరి.
ఏ యుపాయము లభియింపక వారు
భంగంబు జెందియు, 'వారికి వారె
యా నృపాలురు సము'లని యెంచుకొనిరి.
వారిర్వురకు మధ్య భాసించుచున్న
బాంధవప్రేమానుబంధంబు జూచి
ముగ్ధమై దేవసమూహంబు లెల్ల
గురియంగజేయుచు గుసుమవర్షముల
బాడసాగెను హరి భవ్యయశంబు.
"ఏ నాడు బ్రహ్మ సృజించె నీ జగతి
నానాటి నుండియు, నఖిలస్థలాల
బహువివాహంబుల బరికించినాము
విన్నాము, గాని యీ విధమైన పెండ్లి
సర్వవిధంబుల సరిసమమైన
యుభయపక్షముల వెల్గొందు వైభవము
లతికిన యిట్టి వియ్యంకుల జోడు
నీ నాడె గన్నార మీ ప్రపంచమున."
అని సురలాడు మహారమ్యసత్య
వచనముల్ విని, యిరుపక్షబృందములు
పరమానురాగసంభరితంబులయ్యె.
పలుపించి రత్నకంబళుల మార్గమున

నర్ఘ్యపాద్యముల సమర్పణ జేసి
జనకమహారాజు స్వయముగా దానె
దశరథధారుణీధవు గొనితెచ్చె
మహితాదరమ్మున మండపస్థలికి.
ఆ మండపములోని నత్యంతచిత్ర
రచనావిశేషముల్ రామణీయకత,
మునిమనంబులగూడ మోహింప జేసె.
జ్ఞాననిధానుడౌ జనకభూవిభుడు
చేజేత స్వయముగా సింహాసనముల
గొనితెచ్చి పూజ్యుల గూర్చుండజేసె.
తన యిలవేల్పు చందమున వసిష్ఠు
బ్రభుభక్తి బూజించి వినతి గావించి
యా మహాపురుషుని నాశీస్సులొందె.
మఱియు నా గౌశికు మానవాధీశు
డర్చించె నెంతటి యధికసద్భక్తి
యది వర్ణనము సేయ నలవిగా దహాహా!
సమ్మోదభావుడై జనకభూమీశు
డల *వామదేవముఖ్యర్షుల గొలిచి
యందఱకిచ్చి దివ్యాసనప్రతతి
నా మునులందఱి యాశీస్సు లొందె.
తదుపరి జనకుడు దశరథభూపు

---

* వామదేవుడు = దశరథుని వేరొక పురోహితుడు.

నీశ్వరసము డని యెంచి చిత్తమున
బూజ గావించి సంపూర్ణసద్భక్తి
గరములు జోడించి కడువినయమున
దశరథరాజబాంధవ్యంబుచేత
దనకుగల్గిన మహోత్తమభాగ్యవిభవ
ముల బ్రసంగించె సమ్మోదంబు దనర.

పెండ్లికుమారుని బృందంబునెల్ల
దశరథసమముగా దలచి పూజించి
సాదరంబొప్ప నా జనకు డందఱిని
నుపవిష్టులను జేసె నుచితాసనముల.
తన్మహీపతిసమాదరభావ మెల్ల
నే నేకముఖముతో నెట్లు వర్ణింతు ?
దాన, మాన, వినమ్రతావరోక్తులను
వరుని వైపున గల వారినందఱను
జనకమహీపతి సన్మానపఱచె.
శ్రీరామమహిమ నెఱింగిన యట్టి
బ్రహ్మవిష్ణుమహేశభానుదిక్పతులు
కపటవిప్రోత్తమాకారంబు లూని
యా కౌతుకము గాంచి రతిహర్షమునను.
దేవత లని వారు తెలియకుండినను
జనకమహీపతిసదమలభక్తి
సురసమదృష్టితో జూచియు వారి

నర్పించి యొసగె దివ్యాసనంబులను.
ఎవరి సంగతి వారలే విస్మరింప
నెవ్వరు గుర్తింతు రెఱుగు రెవ్వరిని?
ఆనందకందమౌ యా పెండ్లికొమరు
గాంచియు నుభయపక్షంబుల వార
లానందమయులైరి; యఖిలజ్ఞుడైన
యా రామచంద్రుడ య్యమరులనెల్ల
గ్రహియించి మానసికముగ బూజించి
యర్పించె దా నుచితాసనంబులను
చూచి రాముని శీల సుస్వభావముల
విబుధులు ప్రముదసంభృతచిత్తులైరి.
శ్రీరామచంద్రుని శ్రీముఖచంద్ర
సౌందర్యమును సులోచనచకోరములు
పానంబుసలిపెను పరమాదరమున
ననురాగపారవశ్యంబులతోడ.
సుముహూర్త మరుదేర జూచి వసిష్ఠ
ముని, శ్రీశతానందముని కాదరమున
గబురంప నాతడు గడుప్రీతి వచ్చె.
“వేగ మీ రేగియు బెండ్లికుమారి
నిటకు దేవలయు నిదే”యన వినియు
జనియె నాతడు ప్రహర్షస్వాంతు డగుచు.
ఆ పురోహితువాణి నాలించి రాణి

పరిజనయుతముగా బరగ హర్షించి
విప్రవధూకులవృద్ధుల బిలువ
వారు కులాచారపద్ధతుల్ సలిపి
మంగళగీతముం బాడి రింపుగను.
వరనరస్త్రీలరూపంబుల బూని
వచ్చియుండిన సురవరభామలెల్ల
సహజమై వెల్గు సౌందర్యంబుతోడ
నవయవ్వనముతో గనంబడుచుండ్రి.
జనకుని రాణివాసస్త్రీజనంబు
వారల గాంచి సంబర మొంది రెదల.
ఎవ్వ రా కాంతల నెఱుగకుండినను
ప్రాణాధికంబుగా వారల గనిరి.
ఆ నూతనస్త్రీల నా మహారాణి
యెంచి, యుమారమాశ్రీశారదలుగ
మఱల దా మఱల సన్మానం బొనర్చె.
జ్మాసుత నంత సింగారించి వార
లామె చుట్టును మండలాకృతి నిలచి
చేర్చిరి మండపసీమలో ననఘ!
మంగళవస్తుసమంచితు లగుచు
జెలులును తక్కిన స్త్రీసమూహంబు
లాదరంబున మండపాంతరంబునకు
జ్మాసుత నైచ్చిరి సాదరంబునను.

ఆ సీత వెనువెంట నరుదెంచి నట్టి
సర్వాంగనలు మహాసౌందర్యమణులు
షోడశాలంకారశోభితల్, మత్త
గజగామినులు వారి కలగానములను
విని మునిజనములు విడిరి ధ్యానముల
కాముని కోకిల కడులజ్జ నొందె.
మంజీరనూపురమణికంకణముల
మంజులక్వణములుం బాటలతోడ
దాళముల్ వైచు విధానంబు జెలగె.
సహజశోభావతి, జనకజ, సీత
యా వనితాబృందమందు వెల్గొందె
ఛవిగణంబుల మధ్య సంభాసురిల్లు
క్రమసౌందర్యతాకారంబువోలె.
సీతామహాదేవి శృంగారమెన్న
వర్ణనాతీతమై భాసిల్లుచుండె.
అస్మన్మనశ్శక్తి యత్యల్ప మెన్న
నా సీతసౌందర్య మతిగభీరంబు.
సౌందర్యరాశియు, సర్వప్రపూత
యగు సీత వచ్చుట నరసి యా వరుని
పక్షమందలి పెండ్లివారెల్ల హృదిని
ప్రణతు లర్పించి రా భూసురాకృతికి.
శ్రీరామచంద్రు డా సీతను గాంచి

పూర్ణకాముడునయ్యెః మోదంబు గనిరి
దశరథభూపతి తక్కినసుతులు.
అకథనీయము వారి యాత్మహర్షంబు
పుష్పముల్ గురిసిరి మ్రొక్కి దేవతలు,
మంగళాశీస్సుల మౌనులు పలుక,
గురుగాననిస్సాణకోలాహలంబు
భూనభోంతరముల బూరితంబయ్యె.
అఖిలనారీనరు లా సమయమున
ప్రేమప్రమోదసంభృతచిత్తులైరి.
సీత యీ విధి బ్రవేశించె నా తఱిని
మంజులకల్యాణమండపమందు
బ్రముదితమునివరుల్ పఠియించుచుండ
శాంతిపాఠంబుల శ్రావ్యంబుగాను
కులగురు లుభయులు గూడి యంతటను
నిర్వహించిరి సర్వనిగమోక్తవిధుల
నవసరక్రియల గులాచారవిధుల.
ఆచరించియును వంశాచారవిధుల
సలుప గౌరీగణేశ్వరపూజనముల
భూసురావళి ముదంబున నియోగించి
రా వసిష్ఠుండు శతానందఋషియు.
ప్రత్యక్షముగ బూజ బడసి దేవతలు
నతిహర్షమొప్పగా నాశీస్సులిడిరి.

అలమధుపర్కంబు లాదిగా గలుగు
మంగళద్రవ్యసమాజంబు లెల్ల
నే సమయంబున కేది గావలెనొ
మును లెంచి నంతనే మునుముందుగానె
యాయా పదార్థంబు లన్నియుగలుగు
గనకపళ్లెరములు కలశముల్ పూని
పరిచారకులు సిద్ధపడుచుండి రచట.
సూర్యుడు స్వయముగా సుప్రీతితోడ
నిజకులాచారపు నియతులు తెలుప
నవియన్ని నడిపిరి యాదరమొప్ప.
సీతచే సురపూజ చేయించి యితుల
నామెను సుభగసింహాసనంబందు
గూర్చుండ జేసిరి గురుమునీశ్వరులు.
తపసివతంస! సీతారామవిభుల
యన్యోన్యవీక్షణలందున వెలుగు
నా పరస్పరమగు నద్భుతప్రేమ
నెవ్వరైనగాని గ్రహింపగా లేరు.
పరమనోబుద్ధులు వాక్కులు దాని
నందుకోజాలవే, యట్టిచో నెటుల
గవి దాని బ్రకటింపగలుగు మునీంద్ర?
హోమవేళను వీతిహోత్రుండు దానె
ప్రత్యక్షముగ నిల్చి పరమహర్షమున

నాహుతుల్ గ్రహియించె; నఖిలవేదములు
బ్రాహ్మణాకృతుల వివాహసద్విధుల
నన్నిటినడిపె మహర్షివరేణ్య!
భాసురజనకభూవరుపట్టమహిషి
తజ్జగజ్జనని సీతాదేవిమాత
వర్ణింపగలిగిన! వాక్కు లేముండు?
సుయశ, స్సుకృత, సుఖ, సుందరత్వముల
నన్నిటి వెచ్చించి యైక్యం బొనర్చి
విరచించెను విరించి వెలయ నా సతిని.
సమయం బెఱింగియు సంయమీశ్వరులు
నామెను కొనివచ్చు టవసరం బనగ
ముత్తైదువలు విని పోయి యా సతిని
గై కొని వచ్చిరి కడు గారవమున.
జనకుని వామపార్శ్వంబున నపుడు
'సునయన' మిక్కిలి శోభిల్లుచుండె
నగపతిచెంత మేనక చందముగను.
క్ష్మాపతి రాజ్ఞియు సంతోషపడుచు
సుచిరసువాసనాశుభజలపూర్ణ
కాంచనకలశముల్, ఘనమణిఖచిత
పాత్రంబులను స్వీయపాణుల దెచ్చి,
యుంచి రా రాము రఘూత్తము ముందు.
హర్షకంఠముల మహామునిజనులు

పఠియించుచుండిరి భవ్యవేదముల.
ఆకసమందుండి యా సమయమున
గుసుమవర్షంబులు గురియంగసాగె.
అంత వరుని గన్యాదాత లరసి
యనురాగపూర్ణులై యాంతరంగముల
నాతని భవ్యపాదాంబుజద్వయిని
గడుగసాగిరి తమకరములతోడ.
వార లా శ్రీరామపాదపద్మముల
గడుగసాగిరి మెల్లగా స్వహస్తముల
బులకింపగా దనువులు ప్రేమవశత.
నభమార్గమందున నగరిలో జెలగు
కలగాననిస్సాణఘనజయధ్వనము
లఖిలదిగ్గర్భంబులందున నిండె.
పావనంబైన ఏ పాదయుగ్మంబు
కామారిహృద్యనకాసారమందు
వెలుగొందుచుండునో విడువక యెప్పు
డొకసారియైన దా ముల్లంబులోన
వేని నెంచగ జిత్తవిమలతగలిగి
కలికలుషములెల్ల గాలి నశించు.
వేని సంస్పర్శచే బెనుపాపకలిత
మునిపత్ని పొందెనో మోక్షపదంబు.
వేని యందున బ్రభవించిన మధువు

శిరమున ధరియించు శివుడు; దేవతలు
పరమపావని యంచు బలుకుచుండెదరొ,
వేనిపై దమ మనోభృంగముల్ నిలిపి
మునివరయోగిసమూహంబు లెల్ల
నభిమతగతిసిద్ధి నందుచు నుండు
నా రామచంద్రుని యడుగు కెందమ్మి
లతిభాగ్యభాజనుం డగు జనకుండు
ప్రక్షాళనముజేసె బరమానురక్తి
సకలదిశోద్భూతజయజయధ్వనుల.
అలవధూవరుల కరాబ్జముల్ కలిపి
కులగురు లిద్దఱు గూడియు, నుభయ
వంశక్రమంబుల వచియించి రంత.
పాణిగ్రహణమును బాగుగా జూచి
విధిసురనరమునిబృందంబులెల్ల
నానందభరితాత్ములైరి మునీంద్ర!
ఆనందమూలమౌ యా వరు గాంచి
యా దంపతులు పులకాంగు, లత్యంత
సంతోషపారవశ్యస్వాంతులైరి.
వైదికలౌకికపథవిధుల్ తీర్చి
నృపభూషణుం డగు శ్రీజనకుండు
సలిపె గన్యాదాన సత్కార్య మెన్న.
హిమవంతుడా గౌరి నీశున కటుల

నల సముద్రుడు శ్రీని హరికిచ్చి నటుల
సీతాకుమారిని శ్రీరామునకిడి
యతులితాపూర్వదిగంతవిశ్రాంత
కలయశంబును జనకప్రభు వొందె.
ఆ విదేహుడు విన్నపావళుల్ సేయ
జాలకపోయె, నా శ్యామలమూర్తి
తన విదేహాఖ్యాసార్థక మొనరింప.
హోమముల్ చేయ విధ్యుక్తవిధాన
నా వధూవరుల వస్త్రాంచలంబులకు
బ్రహ్మముడుల్ వేయబడియె, నా పిదప
నగ్నిప్రదక్షిణం బాచరింపంగ
సాగి రా దంపతుల్ సంయమివర్య!
వరజయధ్వనముల, వందికీర్తనల
వేదస్వనంబుల భేరికారవళి
భూరిమంగళగానములను విన్నంత,
సంతోష ముప్పొంగ జతురులౌ సురలు
సురతరువులనుండి సుమవర్షములను
వర్షింపసాగిరి వసుధాస్థలమున.
అందంబు లొలికెడి యడుగులతోడ
నా వధూవరు లిద్ద అగ్నిహోత్రునకు
జేయుచుండగ బ్రదక్షిణమును సభ్యు
లా దివ్యదృశ్యంబు నాదరం బొప్ప

గాంచిరి కనులకు గడు విందుగొల్ప.
అతిమనోహర మగు నా మిథునంబు
వర్ణనాతీతమై భాసిల్లుచుండె.
ఏ యుపమానము నెంచి చూచినను
సముచితరీతిగా సరిపోవదేది.
పృథుమణి స్తంభబింబితములై నట్టి
జానకీరాముల చారురూపంబు
లిల రతీమదను లనేకరూపముల
ననుపమరామకల్యాణోత్సవంబు
గాంచుచున్న తెఱంగు గానగా వచ్చె.
వారల లాలసత్వంబు, లజ్జయును
రెండును ఘనమైనరీతి నున్నట్టు
లొకసారి గనిపింతు రొకసారి కాను
పింపక మఱల గన్పించుచుండెదరు.
ఆనందమగ్నులై యది చూచినట్టి
సర్వసదస్యులు జనకునివోలె
దము దాము మఱచిరి తాపసవర్య !
ముదితాత్ములగుచును ముని లా విధాన
నా దంపతులచేత నగ్నిహోత్రునకు
చేయించియును ప్రదక్షిణము లా పయిన
పెండ్లికట్నములతో విధుల నన్నిటిని
సలిపిరి, శ్రీరామచంద్రు డంతటను

సీతాముఖంబున సింధూరమలదె.
అకథనీయంబహో! ఆ దృశ్యశోభ
సింధూర మలదెడి శ్రీరాముహస్త
మరుణరజోభరితాంబుజం బటుల
జంద్రసుధాలుబ్ధసర్పంబువోలె
రాజిల్లె నో భరద్వాజమునీంద్ర!
అంత వసిష్ఠుని యనుశాసనమున
నింపుగా గూర్చుండి రేకాసనమున
నా జానకీరాము లా వధూవరులు.
ఉజ్వలాసనమున నుపవిష్టులైన
జానకీశ్రీరామచంద్రుల గాంచి
దశరథనృపతి సంతసమొందె హృదిని.
పలుమాఱు దనువెల్ల బులకరింపంగ
దన పుణ్యదేవతాతరువు ఫలించి
నట్టుల, గనుగొనె నా వధూవరుల.
సర్వలోకంబుల సంతోషమెసగె
నాయెను రామకల్యాణ మటంచు
సర్వులు పలికిరి సంతోషపడుచు.

## లక్ష్మణభరతశత్రుఘ్నుల వివాహములు

ఆ యపారంబగు నానందమహహా!
తుదిముట్ట నొక జిహ్వతోడ నే రీతి

నెవ్వడైనను వచియింపగా గలడె ?
అంతట శ్రీవసిష్ఠాజ్ఞ గైకొనియు
జనకమహారాజు సౌధంబులోన
పెండ్లికూతుళ్ల గావింపగాబడిన
మాండవి, శృతకీర్తి, మఱియు నూర్మిళను,
తనపుత్రికలను సాదరత రావించె.

తన తమ్ముడగు కుశధ్వజమహారాజు
ప్రథమకుమారియై భాసిల్లుచున్న
సద్గుణసౌశీల్యసంతోషరూప
మహితశోభామయి మాండవిన్ భరతు
నకిడి కల్యాణ మొనర్చి హర్షించె.
సర్వవిద్యుక్తముల్ సలిపి సంప్రీతి
సీతామహాదేవి చెల్లెలైనట్టి
యూర్మిళాదేవి సముజ్జ్వలసర్వ
సుందరీమణి యౌచు శోభిల్లుచుంట
లక్ష్మణునకిడి కల్యాణం బొనర్చె
సకలమహోన్నతసన్మానవిధుల.
అఖిలగుణాలయ, యబ్జాక్షి, సుముఖి,
సౌందర్యసౌశీల్యసంపన్నయైన
శృతకీర్తి నంతట నృపశేఖరుండు
శత్రుఘ్ననకు పెండ్లి సలిపె మోదమున.
అనురూపసంబంధ మందుట గాంచి

యా వధూవరులు లజ్జాన్వితులై రి.
యాంతర్యములను బ్రహర్షంబుమీఱ
నా దంపతులశోభ నరసి సర్వులును
సమ్మోదమొందిరి స్వాంతంబులందు
గుసుమవర్షంబుల గురిసిరి సురలు.
వరవరోపేత లా వరవధూముఖులు
నట నేకమండపమందు రాజిలిరి
జీవహృత్స్థలిని రాజిలు నిజనాథ
♦సంయుక్తచతురవస్థల చందముగను.
నలుగురు కోడండ్ర నలుగురు సుతుల
నా యయోధ్యాపతి యరసి హర్షించె
సముచిత†సాధనాసంయుతంబుగను
*పురుషార్థములు నాల్గు పొందినరీతి
నా రాజమణి నిర్భరానంద మొందె.
అలరామకల్యాణ మటులనే జరిగె
మిగిలిన యట్టి సుమిత్రాకుమార
భరతశత్రుఘ్నవివాహోత్సవములు.
అపు డివ్వబడినట్టి యా కట్నకోటి

♦ చతురవస్థలు = జాగ్రత్స్వప్న సుషుప్తితురీయావస్థలు
వాని అధిపతులు = విశ్వతైజస ప్రాజ్ఞ అంతర్యాములు.
† సాధనలు = యజ్ఞ దాన తపోయోగములు.
* చతుర్విధపురుషార్థములు = ధర్మార్థకామ మోక్షములు.

వర్ణనాతీతమై పఱగుచు నుండె.
మణిరుక్మమయమయ్యె మండపంబెల్ల
గంబళంబులు, మహాఘనతరామూల్య
చిత్రచిత్రాద్భుతచీనాంబరములు
గజరథతురగసంఘంబుల మఱియు
దాసదాసీజనతతుల ననేక
ఘనతరాలంకృతకామధేనూప
మానగోగణముల, మఱియు నగణ్య
వర్ణనాతీతసద్వస్తుజాలముల
నెన్నియో మైథిలు డిచ్చె గట్నముగ.
కండ్లతో వానిని గాంచిన గాని
యెవరైన గొంచె మూహింపగా నగును.
లోకపాలకు లవలోకించి వాని
జెంది రసూయను చిత్తంబు లందు.
ఆ యయోధ్యాపతి యా కట్నకోటి
నంతయు గైకొని యానందముగను
యాచకావళికి సమర్పణజేసె
గోరిన వారికి గోరిన వెల్ల.
అట్లు దానము చేయ నావల మిగిలి
నట్టి వస్తువులెల్ల నట బెండ్లివారి
వాసంబులకు జేర్పబడియె; నంతటను
పెండ్లికుమారుల బృందంబునెల్ల

గరముల జోడించి గౌరవించియును
మృదువచస్సుల జనకేంద్రుండు బలికె.
ఆదరణమున దానావళిచేత
వినయంబుచేతను వినుతులచేత
పెండ్లివారలనెల్ల బ్రీతివెలుంగ
మైథిలుం డపుడు సన్మానం బొనర్చి
యానందమొప్ప మహామునితతిని
భక్తియు శ్రద్ధయు వరల బూజించి
ప్రణతు లర్పించి; దేవతలను గాంచి
మ్రొక్కియు గరముల ముకుళించి పలికె;
"సురసాధువులు కాంత్రు శుద్ధభావమునె
దోసెడు నీటికే తోషించు జలధి?"
అని పల్కి జనకేంద్రు డతని సోదరుడు
భక్తికరాంజలిబద్ధులై నిలిచి
పలికిరి కోసలపతితోడ నిటుల
సుస్నేహ, సౌశీల్య, శుద్ధస్వభావ
మయమనోహరవచోమాధుర్యమెసగ :
"భవదీయదివ్యసంబంధంబుచేత
మే మన్నివిధముల మేదినీనాథ!
ఉన్నతస్థానంబు నొందినా మిపుడు
రాజ్యంబు మాది సర్వస్వంబు నీదె
మము మీ భటుల మని మతి నెంచుకొనుమ

యీ దార్వికలను గ్రహించియు నీదు
పరిచారికలుగను పాలింపు మనఘ!
భవదీయశాశ్వతవాత్సల్యమునను.
నా యపరాధంబు నాథ! మన్నింపు
మిటకు రప్పించి మిమ్మేము మహాత్మ!
సాహసకార్యంబు సలిపినవాడ."
అన విని భానుకులాభరణుండు
జనకభూపాలుని సకలసన్మాన
ముల నాదరించెను ముదము దీపింప.
ఆ దశరథజనకావనీపతుల
యా పరస్పరవినయాతిశయంబు
వర్ణనాతీతము. వారు భాసిలిరి
ప్రేమప్రపూరితహృదయాబ్జు లగుచు
గుసుమవర్షంబులు గురిసిరి సురలు
దశరథనృపు డంత దరలెను, తాను
పరిజనులుండిన వాసంబు జేర
వరభేరికాజయధ్వానసమ్మిళిత
మహితవేదనినాదమధ్యమునందు.
నభమున జనకుని నగరంబులోన
నుద్భటానందమహోత్సవంబెసగె.
అంత మునీశ్వరుం డైన వసిష్ఠు
నాజ్ఞను గైకొని యచ్చటినుండి

చారుసఖీజనసంఘంబులెల్ల
ద ద్వధూవరుల నందఱి దీసికొనియు
బోయిరి కులవేల్పుపూజలు చేయు
భవనంబునకు, భరద్వాజమునీంద్ర !

మాటిమాటికిని రామప్రభువైపు
సీత క్రీగంట వీక్షించుచు, మఱల
బిడియంబుచే, జూడ వెనుకాడుచుండె
హృదిలోని ప్రణయేచ్ఛ యెంత వద్దనిన.
ప్రేమపిపాసచే బీడింపబడెడి
యామె చక్కని కన్ను లలరారుచుండె
మీనుసోయగమును మించి, జయించి.

# శ్రీరామచరితమానసము

## బాలకాండము

### ఏకాదశవిశ్రామము

జయజయ ! రిపుగజసింహా !
జయజయ వాత్సల్యవాక్యసంయుతజిహ్వా !
జయభక్తావనరంహా !
జయజయ శ్రీ మట్టపల్లి చందనృసింహా !

ఆ రామచంద్రుని శ్యామలాంగంబు
సహజసంభాసురసౌందర్యనిలయ
మా శోభ కోటియనంగుల గెలుచు.
మునిమనోమధుపసమ్మోహనంబైన
పారాణి బూసిన పదపద్మయుగ్మ
మమితమనోజ్ఞమై యలరారుచుండె.
పృథుపునీతం బగు పీతాంబరంబు
తతబాలభానుసౌదామినీద్యుతుల
మించియు మేనిపై మెఱయుచునుండె.
కలకింకిణీయుతకటిసూత్ర మరయ
నమితమనోహరంబై వెలుగొందె;
వరవిభూషణదీర్ఘబాహుదండా వాని

చేతివ్రేలికి విరాజిల్లు నుంగరము
పీతసువర్ణోపవీతంబు; వాని
సుందరాకృతి కతిశోభ నొసంగె.
ఎల్లరమతి హరియింపగా గలుగు
నలవివాహపుభూషణావళితోడ
గాకుత్స్థవిభుడు శృంగారింపబడియె
నొగి నురస్థలిని వెల్గొంద ననేక
మహితభూషణములు మంజులరీతి,
మణులును మౌక్తికమాల లంచులను
వ్రేలాడు పీతోత్తరీయంబు, పైన
వల్లెవాటుగ నుంచబడి మెఱయంగ
విచ్చిన తమ్మిలై వెలుగు నేత్రములు
కలకుండలంబులు కదలు కర్ణంబు
లఖిలశోభకు నిలయం బైన ముఖము
చక్కని కనుబొమల్, సంపంగిమొగ్గ
యనగ దోచెడి మనోహరనాసికయును
చక్కదనమునకు సదనమై వెలుగు
తిలకంబు దాల్చిన దివ్యఫాలంబు
మంగళమౌక్తికామణిమయస్థగిత
కమనీయకల్యాణఘనకిరీటంబు
గల శీర్షమొప్ప రాఘవుడు భాసించె.
కళమణుల్ పొదిగిన ఘనకిరీటంబు

నఖిలాంగములు మనోహరములై వెలిగె.
నాకనారీమణుల్ నగరాంగనలును
పెండ్లికుమారుని వీక్షించి తృణము
త్రెంపివైచిరి పోవ దృష్టిదోషంబు.
మణివస్త్రభూషణమండలిం జుట్టు
ద్రిప్పియు వెదజల్లి, దివ్యహారతుల
సొంపుగా బాడిరి శుభగీతములను
కుసుమవర్షంబుల గురిసిరి సురలు,
వందిమాగధసూతభటులు గీర్తింప.
ముత్తైదువలు హృదిముదము వెలుంగ
బెండ్లికుమారుల బెండ్లికూతుండ్ర
నిలవేల్పులను గొల్చు గృహమున జేర్చి
భద్రగీతంబులం బాడుచు మిగుల
ప్రీతితో లౌకిక విధు లొనరింప
సాగిరి, హరిభక్తసంఘవరేణ్య!
సీతకు బువ్వను చెలిమితో బెట్టు
రీతి బోధించెను శ్రీరాఘవునకు
గౌరీకుమారి—యా కరణినే మఱల
శ్రీరామునకు ముద్ద సీత యొసంగ
గోరెను శారద కూర్మిదీపింప.
హాసవిలాసరసానందమగ్న
మయ్యెను రాణివాసాంగనాగణము.

తమ జన్మసాఫల్యతను గాంచి రెల్ల
వనితామణులు భరద్వాజమునీంద్ర !
తన పాణిమణిని సీతాదేవి చూచి
సౌందర్యనిధిరామచంద్రు బింబమును,
విరహాభయోద్వేగవివశాత్మ యగుచు
నిజభుజవల్లిని నేత్రపద్మముల
గదలింప వెఱగంది కదలాడుటాపె.
ఆ విలాసవినోదహర్షానురక్తు
లభివర్ణనముసేయ నలవియా యవ్వి
జానకీప్రియసఖీజనులకే యెఱుక.
అంత నా ప్రియసఖులా కమనీయ
దంపతులను గొని తరలిరి వారి
బృందంబు లుండిన విడిదింటి, కపుడు
నినదించె దీవెనల్ నిఖిలదిక్కులను.
నభమునబురి మహానందంబు జెలగె
"నీ దంపతులు నల్గు రీ ధరాస్థలిని
చిరజీవు లౌచు భాసింతురుగాక !"
అని వచించిరి సర్వు లాహ్లాదపడుచు.
ఇక రాము గాంచి యోగీంద్రమునీంద్ర
సిద్ధబృందారకశ్రేణు లందఱును
మ్రోయజేసిరి దుందుభుల నభమందు
ప్రసవవర్షముల హర్షమున వర్షించి

జయజయజయజయస్వనములతోడ
నిర్గమించిరి నిజనిజలోకములకు.
నిజవధూటీసమన్వితు లౌచు రాజ
తనయులు జేరిరి తండ్రిసన్నిధికి.
శోభాశుభానందసుభరితం బగుచు
నలరారుచుండె నా యావాసమెల్ల
అంతట జనకమహారాజమౌళి
పెద్ద విం దొకటి గావింగా జేసి
పెండ్లివారలనెల్ల పిలిచె భుజింప.
సుతసమేతంబుగా క్షోణీవిభుండు
దశరథు డేగు పథంబునందెల్ల
పఱచగాబడె ననుపమకంబళముల.
సర్వుల పదములు సాదరంబుగను
ప్రక్షాళనము చేయ బడిన యా పిదప
నందఱు పీఠములందు గూర్చుండ్రి
తమ యోగ్యతలకును దగిన విధాన.
జనకు డయోధ్యేంద్రు చరణపద్మముల
గడిగె నాతని శీలగరిమ, స్నేహంబు,
వర్ణనాతీతము పరమమునీంద్ర !
ఆపయి, శివుని హృదబ్జమధ్యమున
భాసించు నా రామపాదపద్మముల
గడిగె నా నరపతి కడుప్రీతితోడ

నంత నదేరీతి నా జనకుండు
తక్కిన ముగ్గురు తమ్ములయడుగు
దమ్ముల గడిగెను తా స్వయంబుగను
శ్రీరామసము లని చిత్తమం దెఱిగి
యుచితాసనంబుల నొసగి యందఱకు
రావించె వంటవారల నెల్ల నృపతి
మణిపర్ణములజేసి మంజులంబుగను
బంగారు పుల్లలు పైన గూర్చుచును
కుట్టినవిస్తళ్ల గొమరొప్పునటుల,
పఱచిరి పంక్తుల బరమాదరమున.
చతురవినీతవిశారదు లైన
పాకకారులు వచ్చి బహుసత్వరముగ
సుందరస్వాదువిశుద్ధసూపాన్న
గోదధుల్ వడ్డింప గూర్మి వెలుంగ,
బంచాహుతుల గొని ప్రప్రథమమున
గడగిరి భోజనకార్యం బొనర్ప
శ్రవణం బొనర్చుచు 'సరస' గానముల
బరమానురాగసంభరితాత్ము లగుచు.
అలవచోతీతంబు లమృతతుల్యంబు
లగు బహురూపపక్వాన్నంబు లెల్ల
వడ్డింపబడియెను వారు భుజింప.
చతురపాకజ్ఞులు చక్కగా నంత

వడ్డించి రెన్నెన్నొ వ్యంజనావళిని
వాని బేర్కొనుటకే వశముగాకుండె.
అలభక్ష్యభోజ్యలేహ్యముల చోష్యముల
వడ్డించి రొక్కొక్క వస్తువునందు
బహురకంబు లెసంగె బలుకలేనన్ని.
రమణీయబహుళషడ్రసము లొక్కొకటి
నగణితవివిధరూపావళి గలవి
వడ్డింపగాబడె బరమాదరముగ.
భోజనం బగుచుంట బూబోణు లరసి
వావియు వరుసల భావించుకొనియు
స్త్రీపురుషులపేళ్ల చేర్చి పాటలను
పాడగాసాగిరి వర్ణింపమధువు.
సమయానుకూలహాస్యము సముచితమె !
ఆ పరిహాసంబు లాలకించియును
దశరథరాజును తత్సమాజంబు
ప్రముదంబు చెందియు ప్రహసించి రిట్లు
తృప్తిగల్గగ భుజియించి రెల్లరును.
అంత నాచమనార్థ మాదర మొప్ప
వడ్డన జేసిరి పాత్రల జ్జలము.
అంత దాంబూలంబు లర్పించి ప్రీతి
దశరథపతిని యాతని సమాజమును
పూజించె జనకుడు; ముదితుడై సకల

మానవేశ్వరశిరోమకుటాయమాను
డా దశరథు డేగె నావాసమునకు.
ప్రతిరోజు నూత్నోత్సవంబులు జెలగె
జనకుని నగరరాజంబున గడచె
నిమిషంబు లటు దివానిశలు మునీంద్ర !
ధరణీశమణి యగు దశరథరాజు
పెందలకడ నిద్ర వీడియు లేచె,
నతని సద్గుణముల యాచకజనులు
సన్నుతిసేయగా సాగి; రాతండు
వరవధూయుతతనూభవులను గాంచి
వర్ణింపరాని సంబరమందె హృదిని.
ప్రాతఃక్రియల్ దీర్చి పరమప్రమోద
సత్ప్రేమపూరితస్వాంతంబు తోడ
గురువును రప్పించుకొని ప్రణమిల్లి
పూజించి యంజలిపూని యిట్లనియె
నమృతోపమానవాక్యంబులతోడ :
"విను మునిరాజ ! నా విన్నపం బొకటి,
త్వత్కృపామహిమచేతనె నేను నేడు
పూర్ణకాముడనైతి భూసురవరుల
నందఱ బిలిచి మహాభాగ ! యిప్పు
డర్పింపవయ్య సర్వాలంకృతంబు
లగు గోగణంబుల" నన విని గురువు

తన్మహీపాలుని దా బ్రశంసించి
ముదమున బిలిపించె మునిబృందములను.
వామదేవుండు, దేవర్షినారదుడు,
వాల్మీకిమునియు జాబాలిమహర్షి
కౌశికముఖ్యులౌ ఘనతపశ్శాలు
రగు మహామునివరు లరుదెంచి రంత.
అమ్మహామునివర్యు లందఱ మ్రోల
నరపతి దండప్రణామముల్ సలిపి
సత్ప్రేమమున బూజ సలిపి యందఱకు
నున్నతాసనముల నొసగిన పిదప
సురభినిపోలిన సొంపైన మంచి
నాల్గు లక్షల గోగణముల దెప్పించి
యన్నివిధంబుల నన్నిటిగూడ
గడు సొంపుగా నలంకారంబు సలిపి
దానం బొసంగె ముదంబు దీపింప
సర్వమహీదేవసంఘంబులకును.
పిదప నాతడు బహువిధమార్గములను
ప్రార్థన గావించి పలికె "నీ నాడె
నా జన్మ ఫలియించినది, యహో!" యనుచు.
ఆ సూర్యవంశమహానందమూర్తి
యానంద మొంది విప్రాశీస్సు లొంది,
పిదప యాచకులను పిలువగాజేసి

కాంచనమణివస్త్రగజహయరథము
లడిగిన వారికి నడిగిన రీతి
దానంబుసలిపె నౌదార్యంబు వెలయ.
అంత నా యర్థిజనావళియెల్ల
నాతని సుగుణకథాళి బాడుచును,
"జయజయసూర్యవంశప్రభూ" అనుచు
జయరావములతోడ జనిరి యథేచ్ఛ.
ఈ ప్రకారంబుగా నినకులు రాము
ఘనవివాహోత్సవకార్యంబు జరిగె
నా సహస్రముఖాంచితాదిశేషుండె
వర్ణింపజాలని పగిది మునీంద్ర!
పలుమాఱు దశరథవసుధేశ్వరుండు
కౌశికమునిపాదకంజంబు లందు
వినమితశీర్షుడై పృథుభక్తితోడ
"నీ సుఖమెల్ల మునీంద్ర! త్వదీయ
సత్కరుణాకటాక్షప్రసాదితమె"
యని వచియించె మహాముని! వర్య!
జనకుని శీలంబు, సదమలప్రేమ,
సంపదన్ క్రియల బ్రశంసించె సర్వ
విధముల దశరథపృథ్వీశ్వరుండు.
అనుదినం బుదయమే, యా యయోధ్యేంద్రు
డడుగును సెలవు ప్రయాణంబు సేయ;

ప్రతిసారి జనకుడు ప్రార్థించి యాపు
ననురాగభావసమంచితుం డగుచు.
ప్రతిదినం బొక క్రొత్తపద్ధతితోడ
నాదరించె విదేహు డధికాధికముగ.

## దశరథాదులు సపరివారముగ తిరిగి అయోధ్యకు దరలుట

ఒక రోజుకన్న నింకొక్క దినంబు
వేయిమడుంగుల విభవంబు తనరె.
ప్రతిదినం బొక క్రొత్త పర్వంబు వెలయ
నానందపడుచుండె నఖిలపురంబు.
దశరథధారుణీధవు డింటికేగు
టెవరికైనను సరే యిష్టంబులేదు.
ఆ పెండ్లివారెల్ల రనురాగపాశ
బద్ధత నొందిరి బహుదినా లరిగె.
అంత గాధేయశతానందమౌను
లిట్లు చెప్పిరి విదేహేంద్రు రావించి :-
"ఇక, దశరథు నేగనిమ్ము, స్నేహమున
నీ యెడబాటు నీ కెంతయో లోన
సహియించుకొనగ నశక్యమే యైన."
అనవిని "యోనాథ ! యటులనే, శుభము"
అని పల్కి జనకధరాధీశ్వరుండు

రావించె మంత్రుల; రయమున వారు
వచ్చియు, "జయసార్వభౌమ ! జయంబు !
చిరజీవివై ప్రకాశింతువుగాక "-
అని వినమితశీర్షులై వచియింప,
"ఆ యయోధ్యానాథు డరుగదలంచె
నిది యంతిపురిలోన నెఱిగింపు డనెడి
యవనీంద్రు వాక్యంబు లాలించి మంత్రి
విప్రసభాసదబృందంబు లెల్ల
ప్రేమభావోద్వేగవివశాత్ములైరి.
ఆ మాట లాడిన యా జనకుడును
ప్రేమభావోద్వేగవివశాత్ము డయ్యె.
పౌరజనంబు లీ వార్త నాలించి
వికలితచిత్తులై విశ్వసింపకయ,
"ఇది నిజమేన, వా రేగుచున్నార ?"
అని పరస్పరము వా రడుగుకొనంగ
బయనంబు నిజ మన్న వార్తయే తేలె.
అర్కాస్తమయసమయమున బద్మములు
సంకోచమొందెడి సరణి వారెల్ల
గడు ఖిన్నులైరి ముఖంబులు వాడ.
పెండ్లివా రెందెందు విడసిరో, దారి
యక్కడక్కడికెల్ల నంపగాబడియె
బహువిధవస్తుసంభారంబు లెల్ల.

పలురకముల యెండుపండ్లను, మఱియు
నఖిలవిధానపక్వాన్నజాలముల
సంఖ్యకు మించు భోజనపదార్థముల
నెన్నెన్నియో పెద్ద యెద్దులపైన
బంపెను జనకుండు. పథగృహంబులకు
నగణితభటులతో నంపగాబడియె
బహురమణీయతల్పమ్ము లెన్నెన్నొ.
మఱియును నొక లక్షమహితాశ్వములను
సర్వాంగభూషణచయములతోడ
వెలయు నిర్వదియైదు వేల రథాల,
నష్టదిగ్గజముల నపహాసపఱచు
పదివేల మత్తేభవరముల మఱియు
బండ్లకొలందిగా భర్మవస్త్రముల
మణులను, గేదెల మంచిగోవులను
బహువిధవస్తువుల్ పంపె నతండు.
ఇటుల విదేహభూమీంద్రు డర్పించె
నరణ మింకొకసారి యగణనీయముగ
వచియించుటకు వీలుపడని రీతిగను.
ఆ సంపదను గాంచ నఖిలలోకాధి
పతుల సంపదలు స్వల్పంబులై తోచు.
సర్వ మీ రీతిగా సన్నాహపఱచి
యా వస్తువుల నయోధ్యాపురికంపె

జనకమహారాజు సంయమివర్య !
పెండ్లికుమారుని బృందంబు లెల్ల
పయనంబు గాసున్న వార్త విన్నంత
రాణులందఱు స్వాంతరంగంబునందు
స్వల్పాంబువుల మీనసంఘంబు లటుల
వికలతనొందిరి పెనుచింతతోడ.

మాటిమాటికి వారు మహితాదరమున
సీతను నొడిలోన జేర్చి దీవించి
యీ తెఱంగున వచియించి "రో తల్లి !
విభునకు సర్వదాప్రియవౌచు మనుము.
నీ పతి గూడియు, నీ విలలోన
చిరజీవి వగుమమ్మ ! సీత ! మా యమ్మ !
యిదియె మా దీవెన, ప్రీతితో నీవు
నీ యత్తమామల నిఖిల వృద్ధులను
సేవింపుమా తల్లి ! సీతమ్మ ! నీదు
పతి కనుకూలవై వర్తింపు మెపుడు."
స్నేహాతిశయతచే చెలులు నైతంబు
దెలిపి రామెకు సతీదివ్యధర్మముల
మృదుమధురోక్తుల నింపు దీపింప.

త న్మహారాణులు, దక్కినసుతల
నైతంబుబోధించి సాదరఫణితి
బలుమాఱు సప్రేమపారవశ్యమున

గౌగిట జేర్చిరి గాఢంబు గాను.
తల్లు లా రీతిగా దమ కుమా_ర్తెలను
పలుమాఱు తమ బాహువల్లుల నిల్పి,
"స్త్రీని విరించి రచించె నెందులకు ?"
అని వచించిరి వియోగాతురవశత.

ఆ సమయంబున నా రామచంద్రు
డా సూర్యకులకేతు డనుజులతోడ
ననుమతి గౌనుటకై యాహ్లాద మొప్ప
జనకభూపాలుని సౌధంబు జేర
బయలుదేరెను భరద్వాజమునీంద్ర !
సహజసౌందర్యభాస్వన్మూర్తు లైన
యా సహోదరుల దా మరయుట కొఱకు
పౌరనారీనరుల్ పరుగిడిచనిరి.
ఒకరిట్లు పలికిరి, "యో మిత్రులార !
వా రీ దినంబున బయనింపగలరు.
ఇక విదేహుండు వారి నిపుడు వీడ్కొలుప
సర్వసన్నాహముల్ సలిపియున్నాడు.
కండ్లార వారల కలరూపు గనుడు.
నరనాథతనయు లీ నలుగురు మనకు
నతిప్రీతి గొల్పెడు నతిథులైనారు.
మన పురాకృతభాగ్యమహిమ మెట్టిదియొ.
యా విధి, మనకిట్టి యతిథుల నంపె

గనులార గాంచగా గనుసులభముగ.
మరణింప నున్నట్టి మానవుం డెట్లొ
యమృతంబు పొందిన యట్టుల, మఱియు
నా జన్మ మాకట నల్లాడు వాడు
కల్పవృక్షంబును గాంచిన రీతి,
నల నరకంబున కరిగెడి వాడు
హరిపదంబును గాంచి నట్టుల మనము
పొందినారము వీరి పుణ్యదర్శనము.
శ్రీరాముశోభ వీక్షించి యద్దాని
జేర్పుడీ హృదిలోన జెరుగకుండగను.
ఫణిమణిదాల్చిన పగిది జిత్తమున
శ్రీరామమూర్తి ధరించుడీ ప్రీతి.''
ఆ విధి సర్వుల నక్షియుగ్మముల
నానందపఱచుచు నా సహోదరులు
నలుగురు చేరిరి నరనాథు నగరి.
ఆ రూపసింధువు లగు బంధువులను
పరికించియును రాణివాసభామినులు
హర్షంబుతో లేచి రందఱుగూడ.
అత్త లంతటను మహానందవశత
వివిధదానంబుల, వెదజల్లి, వారి
కొసగిరి హారతు లో మునిరాయ !
రాము లావణ్యదర్శన మొనరించి

యత్యనురాగిణు లౌచు వారెల్ల
బలుమాఱు వాని శ్రీపాదపద్మముల
వ్రాలిరి సుప్రేమపారవశ్యమున.
ప్రేమభావోద్వేగహృదయులౌ వారి
లజ్జయు విడచి పలాయనంబయ్యె.
వారి జామాతల పైన వెలుంగు
సహజానురాగ మే చందంబుగాను
వర్ణింపవశమౌను ? వార లాపైన
ననుజయుక్తంబుగా నా రామచంద్రు
తనువును పరిమళద్రవ్యాలతోడ
నలుగిడి యభ్యంగనస్నానములను
గావింపగాజేసి కడు ప్రేమతోడ
షడ్రసోపేతభోజనముల నిడిరి.
అదె మంచిసమయం బటంచు దలంచి
శ్రీరాము డిట్లు వచించె సౌశీల్య
సదమలప్రేమలజ్జామయోక్తులను :
"జనకపాదులు నేడు సాకేతపురికి
బయనంబుసేయ సంభావించి యిప్పు
డనుమతినొంద మమ్మంపినా రిటకు.
తల్లులారా ! ప్రముదంబున మాకు
నాజ్ఞ నొసంగుడీ; యనవరతంబు
మీ బిడ్డలుగను ప్రేమింపుడీ మమ్ము."

ఈ మాటలను విని యెల్ల భామినులు
నతివిచారగ్రస్తలైరి చిత్తముల
నత్తలు ప్రేమవశాత్మలై తిరిగి
పలుకంగలేక దిగ్భ్రాంతిని పడిరి.
అంత వారెల్ల రా యాత్మపుత్రికల
బిగికౌగిలించియు బ్రేమదీపింప
విభుల కర్పించిరి వినతులు జేసి.
'సునయన' వినయభాసుర విన్నపముల
శ్రీరామునకు సమర్పించి జానకిని
యంజలి ఘటియించి ప్రార్థించె నిటుల
మఱియును మఱియు, బ్రేమంబు దీపింప :
''నాయనా ! రామ ! ఘనజ్ఞానధామ !
ప్రీతి నీ సీత నర్పించితి నీకు.
ఎల్లరి భావంబు లెఱుగుదు వీవు
పరివారమునకును పౌరులకెల్ల
బ్రాణతుల్యంబయి పరగు నీ సీత
నాకును నరనాథునకు జెప్పనేల ?
ఈమె శీలప్రేమ లెఱిగి శ్రీరామ !
భవదీయదాసిగా బాలించుకొనుమ
యో తులసీప్రభూ ! యో రామచంద్ర !
పూర్ణకాముడవు ప్రభూ ! రామ ! నీవు
ఘనతరజ్ఞానశిఖామణి వరయ

ప్రేమభావంబునే ప్రేమింతువీవు
భక్తులలో మంచిభాగమే చూచి
వారల దోషముల్ పాఱద్రోలెదవు.
కారుణ్యధామ ! మేఘశ్యామ ! రామ !
అని వచియించుచు నా మహారాణి
యా రాము పాదంబులందున వ్రాలె.
తతరాగసైకతస్థలి నింకె నామె
వాగ్జలంబులు భరద్వాజమునీంద్ర !
ఆమె వచించిన యనురాగమహిత
భాషణంబుల రామభద్రుండు వినియు
సన్మాన మొనరించె సకలవిధాల,
అంజలి ఘటియించి యాజ్ఞ నర్థించి
పలుసారు లామెకు ప్రణతులర్పించె.
ఆమె దీవెన లొంది యా రఘువిభుడు
మఱల, నామెకు ప్రణామంబుల జేసి
యనుజసమేతుడై యరిగె వీడ్కొని యు.
మంజులమధురరామస్వరూపమును
హృది నిల్పుకొని రాణులెల్లరు గూడ
గుప్పగూలిరి కడు కూర్మి వశాన.
కొంతసేపటి కెద గూర్చియు స్మృతిని
తమ తనూజుల బిల్చి తా బలుసార్లు
గుండెకు హత్తించుకొనిరి వారెల్ల.

ఆపయి నా తల్లులందఱు కొంత
దూరము తనయలతోఁగూడ వచ్చి
యిక సాగనంపుచు నింకొక్కసారి
కౌగిలించిరి వారి గాఢానురక్తి.
వారి పరస్పరప్రణయాతిశయత
యుప్పొంగి పొఱలె మహోద్ధృతం బిట్లు
వదలి పోఁజాలక పలుమాఱు ప్రేమ
నాత్మపుత్రికల దా మాలింగనంబు
సలిపెడు మాతలు సకియలచేత
విడదీయబడిరి, యా వేళనే కన్న
పసిగందుదూడను వదలి పోవలయు
నావు చందమున మహర్షివరేణ్య!
సకలపౌరావళి, సకియలు, రాణు
లనురాగవివశులై రందఱుగూడ
కరుణయు విరహంబు, గాపురంబుండె
నా విదేహుని పట్టణంబునం దనగ.
ప్రేమతో జానకి పెంచుకొన్నట్టి
కనకపంజరమున గాపురం బుండు
శుకశారికలు మహాశోకంబు జెందె
"నెటు బోయె వైదేహి? యెటు బోయె?"ననుచు
వాని దుఃఖంబును పరికించి యెవడు
ధైర్యంబు నెదలోన దాల్పగా గలడు?

కనగ నీ రీతిగా ఖగమృగగణమె
వికలతఁబొంద నే విధముగా నింక
మనుజుల దశఁగూర్చి పలుకఁగా నగును ?
జనకుఁడు సోదరసంయుతుం డగుచు
వచ్చె నాతని నేత్రపద్మంబులందు
బ్రేమాతిశయబాష్పబిందువుల్ నిండె.
తద్విదేహావనీధవశేఖరుండు
పరమవిరాగియై పరగిన గాని
సీతను కనుల వీక్షించి నంతటనె
యతని ధీరత పలాయనమాయె నపుడు.

జనకమహారాజు జానకి నంత
గుండెకు హత్తించుకొనియె—నావేళ
నాతని జ్ఞానమర్యాదాతిశయత
సడలింపఁబడియు జర్జరితమైపోయె !
మహితధీమంతులౌ మంత్రిశేఖరులు
నృపతి నోదార్చిరి మృదుభాషణముల.
అది విచారమునకు నదును గాదనుచు
దెలిసియు జనకుఁడు ధీరతఁబూని,
పలుసార్లు కూఁతుళ్ల బరమానురక్తి
గుండెకు హత్తించుకొనియు నా పిదప
బాగుగా నమరింపఁబడిన సొంపైన
పాలకీలను నాల్గు ద్వరగ దెప్పింప

నాజ్ఞాపనముచేసె, నచటిమంత్రులకు.
ఆతని పరివార మంతయు మిగుల
ప్రేమభావోద్వేగవివశత్వమొందె;
నయినను శుభలగ్న మాగమించుటను
జనకమహారాజు స్వాంతంబు నందు
సిద్ధిగణేశుని చిత్తమం దెంచి
పాలకీ లెక్కించె వరపుత్రికలను.
బహువిధానముల నా పార్థివోత్తముడు
బుజ్జగించియు దన పుత్రికామణుల
నంగనాధర్మకులాచారములను
గూర్చి బోధించెను కూర్మి వెలుంగ.
విశ్వాసపాత్రులు ప్రియులైన యట్టి
దాసదాసీజనతతుల నొసంగె
జానకీదేవికి జనకభూవిభుడు.
సీతప్రయాణము చేసినంతటనె
వ్యాకుల మొందిరి పౌరులందఱును.
మంగళరాశులై మహితంబులైన
శుభశకునంబులు చూపట్టె నపుడు.
క్ష్మాసురవరమంత్రిసంయుతుం డగుచు
దన పుత్రికల వెంట దరలె మైథిలుడు
సాగనంపుటకునై సాదరంబుగను.
ఆ సమయంబున నఖిలవాద్యములు

ప్రోయగాసాగె బ్రమోదంబు గదుర
పెండ్లికుమారుని బృందంబులెల్ల
రథగజహయముల రాజితరీతి
నాయత్త మొనరించి రరుగుటకొఱకు.
దశరథుం డంతట ధారుణీసురల
నందఱ రావించి యాదరంబొప్ప
దానమానములచే దనియంగ జేసి
వారల పావనపాదరజంబు
దన శీర్షమందున దాల్చి సద్భక్తి,
వారి దీవెన లొంది పరమహర్షమున
శ్రీగణేశుని సంస్మరించియు దరలె
శుభశకునంబులు చూపట్టుచుండ.
కుసుమవర్షంబులు గురియగా సురలు
నచ్చరల్ పాడగా నానందముగను,
సాకేతపతి సంతసంబున వెడలె
దుందుభిధ్వానసందోహమధ్యమున.
దశరథభూపతి తతవినయమున
పౌరుల నిలువగా బ్రార్థన జేసి
యఖిలయాచకుల సమాదరంబొప్ప
బిలిచి వారికి సమర్పించి యనేక
ఘనవిభూషణవస్త్రగజతురంగముల,
సత్ప్రేమరసముతో సంతృప్తిపఱచి

తీర్చె నందఱి పరాధీనదైన్యమును.
అంతట వారెల్ల రానందపడుచు
నృపువిరుదంబుల నెంచుచు జనిరి
శ్రీరామచంద్రు హృత్సీమ ధరించి.
పలుసార్లు కోసలపతి యాగు మన్న
జనకుడు మరలక చనుచుండె వెంట.
మఱల శ్రీదశరథమనుజేంద్రు డనియె
స్వాదుభాషణముల జనకునితోడ :
"మఱలు మింకను ప్రేమమహిత! యో జనక !
యిప్పటికే దూర మేతెంచినావు !"
చివరకు దశరథోర్వీశశేఖరుడు
రథమును డిగ్గి ధరాస్థలి నిలిచె
ప్రేమప్రవాహముల్ విరియ నేత్రముల.
అంత విదేహధరాధీశమౌళి
యంజలి ఘటియించి యనియె నీ రీతి
స్నేహసుధామయశ్రీవచనముల :
"ఏ విధానంబుగా నెట్టి వాక్యముల
నిన్ను ప్రార్థింపగా నేర్తును నేను ?
అంతటి దగు గౌరవాతిశయంబు
నా కొసంగితివి, భూనాథవరేణ్య ! "
తనదు వియ్యంకుని దన బంధువరుని
జనకుని దశరథక్ష్మానాయకుండు

నానావిధాల సన్మానంబు జేసె
పరమవినమ్రతాభావంబుతోడ
నొండొరుల్ గలసి రా యుర్వీంద్రమణులు.
పట్టలేనంతటి పరమానురక్తి
వారి డెందంబుల భాసించుచుండె.
జనకు డంతట మునిచయమునకెల్ల
శిరమును వంచి యాశీస్సుల బొంది,
యా యనంతరము మహారూపశీల
సద్గుణనిధు లగు సర్వసోదరుల
తనదు నల్లుండ్ర సాదరభావ మొప్ప
గౌగిట జేర్చెను గాఢంబుగాను.
తన కలపాణిపద్మముల జోడించి
యాపయి నాత డిట్లనియె, మహాను
రాగరసప్లుతరమ్యవాక్యముల :

## జనకరాజర్షికృత శ్రీరామ స్తవము

### గేయము

రామ ! యెటుల నిన్నే సేద ప్రశంస !
మునిశివమానసమానసహంసా !
నీకయి చేతురు యోగము యోగులు
కోపమోహామదమమతాత్యాగులు.

వ్యాపక ! బ్రహ్మ ! అలఘు ! అవినాశీ !
చిదానంద ! నిర్గుణ ! గుణరాశీ !

మనోవాగతీతా ! తర్కంబులు
నిన్ను జేరగా నసమర్థంబులు.

కాని కార్యకారణముల చేత
నూహింపగ బడు చుందువు నేతా !
'నేఽతి నేఽతి' యని నీ మహిమంబున్
నిగమంబులు సలుపును గానంబున్.

సర్వకాలసర్వావస్థలలో
నేకరసంబున వెలిగెద వోహో !
అఖిలసుఖంబుల కాదిమూలమా !
నా కనులకు దోచితివా, రామా !
ఈ పని కృప యనుకూలం బగుచో
నన్ని సులభ్యము లీ లోకములో.

అన్నివిధంబుల నాదరించితివి
నీ భటునిగ నను స్వీకరించితివి
దశసహస్రశారదలు శేషులున్
నా భాగ్యంబును నీ గుణంబులున్
కోటికల్పములకైనను నాథా !
పలుకగ జాలరుగా రఘునాథా !
గట్టిగ నాదొక విశ్వాసంబున్
పలుకగ జాలెద నేను సతంబున్.

అనుమాత్రంబగు భక్తిచేతనే
ప్రసన్నతను గనుచుందు వో హరీ !
అంజలి పూనియు మాటిమాటికిన్
నిను ప్రార్థించెద నొక్కదానికిన్ :

నీ చరణంబుల నిరతము రామా !
నా మతి నిల్పు మిదే సుఖధామా !

అలపూర్ణకాముడౌ యా రామచంద్రు
డా ప్రేమమహితవాక్యంబు లాలించి
పరితోషితుం డయి బహువినయమున
మామను మిగుల సన్మానంబు జేసె.
శ్రీపితృపాదకౌశికవసిష్ఠులకు
సమునిగా దలచియు స్వాంతంబులోన.

అంతట జనకధరాధీశ్వరుండు
భరతుని వినయభావంబున జేరి
కడు ప్రేమతో దన కౌగిట జేర్చి
యాశీర్వదించె మహర్షివరేణ్య!
లక్ష్మణశత్రుఘ్నులనుగూడ భూపు
డాలింగనముచేసి యాశీర్వదించె.
ఒకరిని నొకరు దా మొక్కరీతిగను
బిగికౌగిలించిరి ప్రేమ బల్సార్లు.
పలుసార్లు జనకభూపతికి రాఘవుడు
గౌరవవినతుల గావించి, తరలె
దమ్ములతో నయోధ్యాపురంబునకు.
జనకు డంతటను విశ్వామిత్రు జేరి
పాదముల్ పట్టి తత్పదపరాగమును
తన తలదాల్చి నేత్రంబుల కద్ది
పలికె నీ రీతిగా భక్తి దీపింప:
"ఓ మహామునిరాయ! ఓ గాధితనయ!

భవదీయదర్శనభాగ్యశాలురకు
నెది యలభ్యంబగు నీ త్రిలోకముల ?
నాలోని దృఢమైన నమ్మకం బిద్ది.
ఎల్ల లోకేశ్వరు లే మహానంద
సద్యశంబుల నొంద స్వాంతమం దెంచి
పొందగా సంశయమును పొందుచుందు
రా మహానందంబు నా సద్యశంబు
నే బొందినాడ స్వామీ ! సులభముగ.
త్వద్దర్శనంబున దాపసవర్య !
సర్వసిద్ధులుగూడ సంప్రాప్తమగును."
నరపతి యిట్లు విన్నప మొనరించి
పలుసారు లమ్మునీశ్వరపాదములకు
శిరము వంచియు నమస్కృతుల గావించి
యాశీస్సు లంది తా నంతట మఱలె
నిజపురంబునకు మునీ ! భరద్వాజ !
భేరులు మ్రోయగా బెండ్లివా రంత
దరలసాగిరి నయోధ్యాపురంబునకు.
ఆ బాలవృద్ధులు హర్షంబు గనిరి.
గ్రామీణు లెల్లరు గాంచి శ్రీరాము
దమ లోచనములు సార్థకతను గాంచ
బరమసంతోషసంభరితాత్ము లైరి.

# రామాదుల అయోధ్యాపురప్రవేశ మహోత్సవము

మార్గమధ్యంబునం బ్రతిమజిలీల
యం దాగి విశ్రాంతి నందుచు దరలి
ప్రక్కనగల జనపదనివాసులను
సంతోషపఱచుచు సాకేతపురిని
పెండ్లివారలు సమీపించి నా రొక్క
పుణ్యదినంబున మునిలోకనాథ !
నిస్సాణపణవముల్ నినదింపసాగె
శంఖభేరీధ్వానసంయుతంబుగను.
హయగజరావంబు లలమె దిక్కులను
తాళడిండిమఘనధ్వనులు జెలంగె
సన్నాయి వారల సరసరాగముల.
పెండ్లివారలు వచ్చు విషయంబు వినియు
బురజను లానందపూరితు లైరి
తనువులు పులకీకృతంబులుగాగ.
నిజనిజసుందర నిలయబృందముల
నంగళ్ళ వీథుల నలచదుకముల
బట్టణద్వారపూర్వప్రదేశముల
గడు మనోజ్ఞముగ శృంగారించుకొనిరి.
పన్నీరు జల్లగా బడియె వీథులను.

అట నట మిగుల శోభాయతలీల
వెండిలి ముగ్గులు విరచింపబడియె.
తోరణకేతుసందోహపతాక
తతవితానముల బథంబు లన్నియును
వర్ణనాతీతమై భాసిల్లుచుండె.
సఫలపూగరసాలజాలతమాల
వకుళకదంబరంభాకదంబముల
నాటిరి మార్గంబునన్ మనోజ్ఞముగ.
ఆ రమ్యవృక్షంబు లన్నియుగూడ
ఫలభారవశమున వంగె నేలకును.
ఆ వృక్షమూలంబు లందున మణుల
యాలవాలంబు లత్యంతరమ్యముగ,
రచితంబు లయ్యె భరద్వాజమౌని!
వివిధవిధంబుల వెలుగొందుచున్న
మంగళకలశముల్ మంజులరీతి
రచియించి రెల్లెడ బ్రతిగృహమందు
బ్రహ్మాదిదేవతల్ రఘువరుపురము
వీక్షింప మనసులో వేగిరపడిరి.
ఆ సమయంబునం దా రాజగేహ
మమితశోభాకరంబై వెలుగొందె.
అద్దాని రచనంబు నరసి మన్మథుడు
సైతంబు, మోహావశ్యస్వాంతు డయ్యె.

శుభశకునంబులు, సుందరత్వంబు,
వృద్ధిసిద్ధులు, సుఖవికచసంపదలు,
సర్వవిధోత్సాహసంతతు లెల్ల
సహజసౌందర్యభాస్వద్రూప మూని
దశరథధారుణీధవు సౌధ మందు
గాపురం బున్నట్లు గాన్పించుచుండె.
జానకీరామదర్శనలాలసత్వ
మెవరి కుండదొ వచియింపు మునీంద్ర!

గుంపులు గుంపులు గూడి ముత్తైదు
వలు బయల్ దేరిరి ప్రసవాస్త్రసఖిని
మించు లావణ్యత మెఱయు చుండగను.
సర్వమంగళవస్తుజాలహారతుల
గైకొని తమతమ కరపల్లవముల
భారతీదేవియే బహురూపములను
భాసించుచుండిన పగిదిగా వారు
పాడుచు నడిచిరి పథమునందెల్ల.
దశరథరాజసౌధప్రదేశంబు
భూరికోలాహల పూరితం బయ్యె.
అమ్మహోత్సవ మెన్న నకథనీయంబు
ప్రాజ్ఞ! కౌసల్యాదిరామమాతలకు
ప్రేమభావోద్వేగవివశత్వ మొదవె
దనువుల మఱచిరి తన్మాతలెల్ల.

వార లంతట గణేశ్వరమహేశ్వరుల
భక్తితో బూజించి బ్రాహ్మణావళికి
సలిపిరి దానముల్ సంతృప్తిగలుగ.
అల చతుర్విధపురుషార్థముల్ గన్న
పరమదరిద్రునివలె బ్రముదంబు
జెందిరి మునిరాజ ! శ్రీ భరద్వాజ !

ముప్వురు తల్లులు మోదప్రమోద
వివశులై నడుగులు వేయలేరైరి.
సర్వాంగములును సంశ్లథితంబు లయ్యె
రామదర్శనమహారాగిణు లగుచు
సమకూర్పసాగిరి సర్వవస్తువుల.
వివిధమంగళవాద్యబృందంబు లెల్ల
మ్రోయగా సాగెను మోదంబు గదుర.
మిగుల హర్షమున సుమిత్ర యంతటను
తతహరిద్రాదూర్వదధిపత్రపుష్ప
వరనాగవల్లికాపల్లవపూగ
ఫలశుభమూలశుభంకరాక్షతలు,
నవయవాంకురరోచనములు లాజలును
మంజులతులసికామంజరు లాది
సర్వమంగళవస్తుజాలముల్ కూర్చె.
సహజసౌందర్యభాస్వచ్చిత్రచిత్ర
హాటకఘటములు లనంగపతంగ

నిర్మితగృహముల నియతి వెలింగె.
శుభసుగంధద్రవ్యశోభల గూర్చె
పలుక నశక్యమౌ పగిది నా రాణు
లందఱు సమకూర్చి రఖిలమై నట్టి
మంగళద్రవ్యముల్ మహితరీతిగను.
బహువిధానముల నేర్పఱచి హారతుల
సంసిద్ధపఱచియు, సంతోషపడుచు
సొంపుగా బాడిరి శుభగీతములను.
బహుమంగళద్రవ్యభరితంబులైన
కనకపళ్ళెరముల గరకమలముల
వహియించి సుతులకు స్వాగతం బొసగ
దరలి రా రాజమాతలు ప్రమోదమున
దనువులు పులకీకృతంబులై వెలుగ.
సద్ధూపధూమమేచకనభస్థలము,
శ్రావణఘనఘనశ్యామమై తోచె.
సురవృక్షములనుండి సురలు వర్షించు
సుమవర్షకణములు సొగసుగా దోచె
వర 'బలాకా' వళీపంక్తుల వోలె.
మంజులమణిగణమయతోరణంబు
లింద్ర ధనుస్సు ల ట్లింపుగా దోచె.
త్వరత్వర నోప్పుచు ద్వరత్వర న్వచ్చు
భవనాగ్రసంచారభామినీజనులు

సంతోషమిడుచు రాజద్వారసీమ
కడకు జేరిరి వారు కడువైభవమున.
మతిహర్ష ముప్పొంగ మాత లా పిదప
నా వధూవరులకు హారతు లిడిరి.
మఱియును మఱియు నా మాతలందఱును
హారతు లిచ్చిరి; యా మహారాణు
లా తఱి గన్న ప్రేమానందములను
వర్ణింప నెవ్వరి వశముగా దనఘ !
బహువిధభూషణవస్త్రముల్ మణులు,
నగణితవస్తువు లద్భుతంబుగను
వెదజల్లివైచిరి ప్రీతి వెలుంగ,
వరవధూయుక్తులై భాసిల్లుచున్న
ప్రియకుమారకులను వీక్షించి పేర్మి,
పరమసంతోషసంభరితాత్మలైరి
యా మాత లెల్ల—మహామునీ ! వినుమ !
మాటికి మాటి కా మాతాత్రయంబు
జానకీరాముల సౌందర్య మరసి
తమ జన్మ సార్థకత్వము గాంచె ననుచు
బ్రముదంబు జెందిరి భావంబు లందు.
మాటిమాటికి సఖీమండలి యెల్ల
సీతాముఖంబు వీక్షించి హర్షించి
పాటలు పాడిరి పరవశత్వమున

దమ పూర్వసుకృతంబు దా మెంచుకొనుచు.
అట, క్షణక్షణమున కమరబృందములు
కురియగా జేసిరి కుసుమవర్షముల
నాడిరి పాడిరి యర్చించి రపుడు.
వరమనోహరవధూవరుల నల్గురను
గాంచి యా శారద కడు శ్రమజెందె
నఖిలోపమానంబు లతిగ గాలించి——
కాని యే పోలిక గానరాదయ్యె
నన్నియు నత్యల్ప మైనవై తోచె.
అందుచే శారద యా స్వరూపముల
ననురాగ మొప్పగా నరయుచు నిలచె
గనుఱెప్ప వాల్పక, కదలకుండగను.
ఆగమాచారకులాచారసరణి
నిఖిలకృత్యంబులు నెఱవేఱునంత
నా మహారాణులు హర్షభారమున
నా వధూవరులకు హారతు లొసగి
భవనంబునకు గొని వచ్చిరి ముందు
వారిని బోసియు, బటముల బఱచి.
పరమసౌందర్యనివాసంబు లైన
నాలుగు సింహాసనము లుంచి రచట.
అవి మన్మథుండు స్వయంబుగా జేసి
యుంచిన రీతిగా నొప్పుచు నుండె.

వానిపై నా వధూవరులను రాణు
లధివసింపగజేసి రాదర మొప్ప.
వారల పావనపాదపద్మముల
గడిగియు నా శుభఖనుల బూజించి
రాగమోక్తవిధాన మనుసరించుచును
పృథుధూపదీపనైవేద్యకృత్యముల.
మంగళహారతుల్ మఱిమఱి యొసగి
మంజులవ్యజనచామరములతోడ
విసరిరి వారల విమలశీర్షముల.
బహువిధవస్తువుల్ వారలకొఱకు
వెదజల్లిరైచిరి వివిధదిక్కులను
పరతత్త్వమును గన్న వరయోగివోలె.
నమృతరసప్రాప్తి నందిన యట్టి
సంతతరోగిష్టిజనునివిధాన.
స్పర్శవేదిని గనజాలిన యట్టి
జన్మదరిద్రుని చందంబు దలప
నక్షులు వచ్చిన యంధుని రీతి.
విజయంబు నొందిన వీరుని తెఱగు.
శారదాదేవీప్రసన్నత గనిన
మూకవిధాన ప్రమోదంబు జెంది
రా మాత లందఱు స్వాంతరంగమున.
ఈ సుఖంబున కన్న నింకను వారు

శతకోటిగుణితమౌ సౌఖ్యంబు గనిరి
రఘుకులరత్నమౌ రామచంద్రుండు
తమ్ములతోగూడి తా బెండ్లియాడి
పిమ్మట స్వగృహప్రవేశం బొనర్ప.
ఆ మాత లంత లోకాచారఫణితి
జేసిన విధుల వీక్షించి లజ్జించి
రా వధూవరుల మహర్షివరేణ్య!
తత్ప్రమోదము, వినోదంబును జూచి
తనలోన రాముడు దా నవ్వుకొనియె.
ఆ మాత లంత తదాచారసరణి
దేవతాగణపితృదేవతాపూజ
సలిపిరి స్వీయవాంఛాసిద్ధికొఱకు.
భ్రాతృత్రయోపేతరామకల్యాణ
వరదాన మొనరింప బ్రార్థించుకొనిరి
వందనంబులజేసి భక్తి దీపింప.
దేవత లంత నదృశ్యరూపముల
నిచ్చిన యాశీస్సు లెల్లరు గూడ
స్వీకరించిరి పైట చెఱగుల బట్టి.
పెండ్లికై వచ్చిన విహితుల నెల్ల
పిలిచి మహారాజు ప్రీతి నొసంగ
నలమణివసనవాహనభూషణముల
నాపయి సెలవొంది యా హితులెల్ల

రాము నిల్పియు స్వాంతరంగమునందు,
దమ నివాసములకు దరలి రంతటను.
పురనరనారీసమూహంబు లెల్ల
మణివస్త్రములను సన్మానింప బడియె.
గృహగృహంబున జయగీతముల్ చెలగె.
ప్రముదితుం డగు దశరథమహారాజు
యాచకజను లేది యడిగిన గాని
యవి యెల్ల నిచ్చె నే యరమరలేక.
సకలసేవకులును, సంగీతపరులు
మదితృప్తులైరి సన్మానదానముల.
అంతట సర్వు లా యవనీంద్రమణికి
నాశీస్సు లిడియు జోహారు గావించి
సన్నుతించిరి వాని సద్గుణకథల.
పిదప భూపతి గురువిప్రయుక్తముగ
నంతఃపురంబున కరిగె మునీంద్ర !
శ్రీవసిష్ఠమహర్షి చెప్పిన రీతి
నాతడు వేదలోకాచారవిధుల
నన్నిటి నొనరించె సాదరంబుగను.
అవనీసురావళి యరుదెంచు టరసి
పరమభాగ్యంబుగా భావించి దాని
రయమున నిలిచిరి రాణులందఱును;
వారల పావనపాదపద్మముల

క్షాళనముజేసి భక్తి దీపింప
స్నానాదు లొనరింప సాయంబు పడిరి.
అంతట భూపతి యా విప్రవరుల
విధ్యుక్తపద్ధతి వెలయ బూజించి
షడ్రసోపేత భోజనములతోడ
సంతృప్తిపఱచెను సాదరఫణితి.
ఆదర, దానమహానురాగముల
బరితోషమొంది యా బ్రాహ్మణులెల్ల
రాశీస్సు లిడి యేగి రాహ్లాదపడుచు.
భూనాయకుడు గాధిపుత్రుని జేరి
పరిపరివిధముల భక్తి బూజించి
"అధిప ! నన్బోలు ధన్యాత్ములు లేరు"
అని వచియించె. మహారాజు పిదప
బలురీతు లా మునిన్ బ్రస్తుతుల్ జేసి
యాతని దివ్యపాదాబ్జరజంబు
స్వీకరించెను స్వరాజ్ఞీసమేతముగ.
తన సౌధ మందె యా తాపసపతికి
నొక రమ్యమందిర మొసగె వసింప.
రాజేంద్రు డాతని రాణివాసస్థు
లంద ఱా మునిని మహాశ్రద్ధతోడ
నాయన యిది యని యడుగక యున్న
నే సమయంబున కేది గావలెనొ

కనిపెట్టి యొసగుచు గడు భక్తితోడ
సేవింపుచుండిరి శ్రీభరద్వాజ !
గురుపాదపద్మముల్ క్షోణీధవుండు
పూజించి ప్రార్థించె బూర్ణమౌభక్తి
తగ వధూయుతులైన తనయులతోడ
రాణులతో దశరథమహానాథు
డా వసిష్ఠగురూత్తమాంఘ్రిపద్మముల
బ్రణతు లర్పించెను పలుసారు, లంత
నమ్మునిశేఖరు డాశీస్సు లిడియె
వా రందఱకు బ్రేమభావంబుతోడ.
సంతోష ముప్పొంగ స్వాంతంబు నందు
వినతుల గావించి పృథ్వీశ్వరుండు
తన తనూభవులను, తన సంపదలను
సర్వ మర్పించె నాచార్యదేవునకు.
ఆ మునినాయకుం డటుల గైకొనగ,
తన స్వధర్మమునకు దగినంత గొనియు
భూరియాశీర్వాదముల వారి కొసగి
జానకీరాముల సదమలాకృతుల
సంధించుకొని నిజస్వాంతంబునందు
హర్షంబుతో స్వగృహంబున కేగె.
అంతటా నరపతి యాదరబుద్ధి
విప్రవధూజనబృందంబునెల్ల

రావించి వారికి రమణీయచేల
ఘనభూషణముల సత్కారం బొనర్చె,
పురమునం దున్నట్టి ముత్తైదువులను
సర్వుల రావించి సన్మాన మొసగె
వారి యభీప్సితవస్త్రంబు లొసగి.
సన్మానయోగ్యులౌ జనులెల్ల వచ్చి
బహుమతు లొంది రా ప్రభుమణిచేత
నాత్మాభిమతముల కనుగుణ్యముగను.
కడుప్రియుల్ పూజ్యులుగా నెఱింగియును
సకలబంధువులకు సన్మాన మిచ్చె
సముచితవిధముగా సాదరం బొప్ప.
ఆ రఘువీరు కల్యాణంబు గనిన
సురలెల్ల గురిసియు సుమవర్షనిచయ
మతిగా బ్రశంసించి రమ్మహోత్సవము.
మ్రోయ జేయుచు దుందుభుల, పరస్పరము
రామయశంబు కీర్తన జేసికొనుచు
ప్రేమరసోద్వేగవివశాత్ము లగుచు
దరలి రా దేవతల్ తమ ధామములకు.
సర్వుల కుచితమౌ సన్మాన మొసగి
దశరథుం డానందతన్మయుం డగుచు
నంతఃపురంబున కరిగి వీక్షించె

గొడుకుల మఱి తన కోడండ్రనెల్ల
గాంచి యా కొమరుల గౌగిట జేర్చి
యకథనీయం బగు నానంద మొందె.
అట్టులే కోడండ్ర నందఱఁగూడ
గూర్మితో నొడిలోన గూర్చుండజేసి
పలుమాఱు లాలించె బరమహర్షమున.
అదిగాంచి రాణివాసాంగన లెల్ల
సంతోష మందిరి స్వాంతంబులందు.
అందఱి హృదయంబు లానందమునకు
వాసస్థలంబుగా భాసించె నపుడు.
వినిపింపగా బెండ్లి వృత్తంబు నృపతి
యందఱు వినియు మహానందపడిరి.
జనకరాజేంద్రుని సద్గుణశీల
మానమర్యాదల, మహితానురాగ
ఘనసంపదలను భూకాంతుండు ప్రీతి
భట్టుచందంబుగా బలురకంబులను
వర్ణింప రాణులు ప్రముదంబు గనిరి
యా నృపాలుని చర్య లాలకించియును.
దశరథుం డంతట దనయుల గూడి
స్నానంబు గావించి క్ష్మాదేవతలను,
తన కులాచార్యు బాంధవుల రావించి
విందు గావించియు వివిధభోజ్యముల,

దానును భుజియించె—దత్కార్యమందు
గడుపగాబడె నైదు గడియలరాత్రి.
మంగళగీతముల్ మానినుల్ పాడి
రానందమూలమై యలరారుచుండె
రమణీయ మైన యా రాత్రికాలంబు.
భోజనకార్యంబు పూర్తి యైనంత
దశరథేంద్రుండును తత్సమాజంబు
పొందియు దివ్యతాంబూలముల్, నవ్య
పుష్పదామసుగంధభూషితు లౌచు
మంజులశోభాసమంచితు లైరి.
అంతట వారెల్ల రా రామభద్రు
నీక్షించి కండ్లార నింకొక్కసారి
నాతని యనుమతి నంది సంప్రీతి
వినమితశీర్షులై వెడలి రిండ్లకును.
అట ప్రదర్శితములైనట్టి యనుపమ
పూర్ణానురాగప్రమోదవినోద
మానమర్యాదసంపద్వైభవమ్ము
లలశతశారద లాదిశేషాహు
లా శ్రుతుల్ బ్రహ్మలు, హరగణేశ్వరులు
వర్ణింప జాలరు, వర్ణింప లేరు;
అట్టిచో నేనెటు లభివచించెదను ?

వానపా మీ భూమి వహియింప గలదె ?
నృపు డంత రాణుల నెల్లర బిలిచి
సర్వవిధంబుల సన్మాన మొసగి
మృదువచనంబుల నిట్లు వచించె :
"వధువులు పసివారు—వారు వచ్చినది
క్రొత్తయింటికి, మీరు గూర్మివారలను
కంటికి ఱెప్పగా గాపాడికొనుడు.
బాలకు లలసిరి బడలియున్నారు,
శయనింప జేయుడు సత్వరం"—బనుచు
నరిగెను రాజు శయ్యాగృహంబునకు
శ్రీరామచరణాబ్జచింతనతోడ.
రాజేంద్రు మధురానురాగవాక్యముల
విని మహారాణులు ప్రీతి వెలుంగ,
బహుమణికాంచనపర్యంకములను
సురభిపయఃఫేనశోభాయమాన
ధావళ్యమృదులవస్త్రములను పఱచి,
వర్ణనాతీతోపబర్హంబు లిడిరి.
ఆ మణిఖచితశయ్యామందిరంబు
ఘనపుష్పహారసుగంధబంధురము
బహురత్నదీపికాభాసమానంబు
వర్ణనాతీతదివ్యద్వితానంబు.

దానిని జూచిన ధన్యమానవుడె
యెది యెట్టులున్నదో యెఱుగగా గల్గు.
అట్లమర్చియు రమ్యమైన పానుపుల
నందొక్క పర్యంక మందు శ్రీరాము
శయనింపజేసి రా జననీత్రయంబు.
సెలవివ్వ బలుసార్లు శ్రీరామచంద్రు
డాతని సోదరు లందఱుగూడ
నిజనిజశయ్యల నిద్రింప జనిరి.
ఆ జననీత్రయ మా రామచంద్రు
నతిరమ్యకోమలశ్యామలాంగంబు
గని యిట్లు పలికిరి కడు ప్రేమతోడ :
"నాయనా ! రామ ! కాననమార్గమందు,
ఘోరతాటక నెట్లు గూల్చితి వోయి ?
సమరాంగణంబున జండప్రచండు
లెంతటి వారి లెక్కింపరే వారు—
కడు క్రూరరాక్షసుల్ ఖలమతులైన
భయదమారీచసుబాహుల నెట్లు
సైన్యయుక్తంబుగా సంహరించితివి ?
మేము కుమార ! నీ మేలును గోరి
భగవంతునకు సమర్పణము కాగలము.
తన్మునీంద్రుని ప్రసాదంబుచే నిన్ను
బహుకష్టములను గాపాడె నీశ్వరుడు.

నీవును శ్రీరామ! నీసహోదరుడు
యజ్ఞరక్షణ సేయు నవసర మందె
సర్వవిద్యారహస్యంబు లొందితిరి.
త్వత్పాదధూళిని దాకి నంతటనె
మునిపత్ని పొందెను మోక్షపదంబు
నీ కీర్తి నిండెను నిఖిలవిశ్వమున.
రాజసమాజాంతరాళంబు నందు
గమఠపీఠస్థలఘనవజ్రకూట,
పటుకఠోరం బగు భవుని కార్ముకము
ఫెళ్లున నడిమికి విఱచి వైచితివి
విశ్వజయంబును విఖ్యాతి బొంది
సీతను బెండ్లాడి చిన్నితమ్ములకు
గల్యాణములజేసి, ఘనత మీఱంగ
స్వగృహంబునకు నీవు వచ్చితివోయి!
కేవలకౌశికకృపచేత దనయ!
ఈ యమానుషకృతులెల్ల జేసితివి.
త్వన్ముఖచంద్రుని వత్స! దర్శించి
సాఫల్య మొందె మా జన్మంబు నేడు
కాంచక నిను, మున్ను గడపిన యట్టి
యా దినంబుల బ్రహ్మ యసలు గణింప
కుంటకై కోరెద మొక్కుటే మేము
భగవంతు హృదిలోన బ్రార్థనజేసి.

కమనీయవినయవాక్యముల రాఘవుడు
జననీత్రయంబును సంతోషపఱచి,
హరగురుపృథ్వీసురాంఘ్రిపద్మముల
జింతించుచును నిద్రజెందె మునీంద్ర!
సాయంసమయమున సంకోచ మొందు
నెఱ్ఱదామర వోలె నెసగుచు నుండె
నిద్రించు రాముని నిర్మలముఖము.
ప్రతిగృహంబందున భామినీమణులు
జాగరణంబును జరుపు చొండొరులు
సొంపుగా బాడిరి శుభగీతములను
"ఎంత ప్రకాశించు నీ పురవరము!
ఎంత శోభిలుచున్న దీ నిశీథంబు!"
అని రాణు లొండొరు లనుకొని రపుడు.
ఫణి, శిరోమణిని దా వదలకుండగను
గుండెకు హత్తించుకొని పండురీతి
నా యత్తలెల్ల మహాశోభ గలుగు
కోడండ్ర హత్తించుకొని వక్షములకు
నిద్రించిరంత మునీ! భరద్వాజ!
ప్రాతఃపునీతశుభంకరవేళ
మేల్కాంచె శ్రీరామ మేదినీవిభుడు
కుక్కుట రాజముల్ కూసె నంతటను
వందిమాగధగుణప్రస్తుతుల్ చెలగ

గోటవాకిటికడ గూడిరి ప్రజలు
జోహారు లర్పింప, సురుచిరభక్తి.
ఆ నలుగురు భ్రాత లంతట వచ్చి
తల్లిదండ్రులకును, తమ గురువులకు
విప్రులకును దేవబృందంబులకును
ప్రణతు లర్పించియు భక్తియుక్తముగ
వారి దీవన లొంది ప్రముదంబు గనిరి.
ధరణీంద్రుతో గూడి ద్వారంబు కడకు
బోయెడి తనయుల ముఖపద్మములను
గాంచి రా రాణులు కడు నాదరమున.
శౌచస్వరూపులై జగతి వెల్గొందు
నా సహోదరు లెల్ల రఖిలశౌచముల
సలిపియు బావనసరయూజలాల
స్నానంబు గావించి సంధ్యాదివిధుల
నన్నిటి నెఱవేర్చి యరిగి రింటికిని.

## విశ్వామిత్రమహర్షి వీడ్కోలు

వచ్చిన వారిని పార్థివోత్తముడు
బిగికౌగిలించెను ప్రేమ ముప్పొంగ.
తండ్రి యాజ్ఞను బొంది తద్భ్రాతలెల్ల
రుల్లాస మొందుచు నుపవిష్టులైరి.
సర్వసభ్యులు రామచంద్రుని గాంచి

హర్ష మొందిరి తమ యక్షియుగ్మములు
పరమధన్యత గన్న పగిదిగా నెంచి.
శ్రీవసిష్ఠర్షి కౌశికు లరుదేర
సుభగాసనముల గూర్చుండగా జేసి,
తండ్రికుమారులు, తన్మునీశ్వరుల
భక్తి బూజించియు బట్టి రంఘ్రులను.
ఆ మహాచార్యద్వయంబు శ్రీరాము
బరికించి యనురాగపరవశ మయ్యె.
ధర్మేతిహాసముల్ తద్వసిష్ఠర్షి
ప్రవచింప రాజును రాణులు వినిరి.
తత్ప్రసంగమున నా తాపసోత్తముడు
కన మునులకును నగమ్యమై యుండు
గాధికుమారుని ఘనకథావళిని
వినిపించె ముదమున విపులపద్ధతిని,
ఆ వామదేవమహర్షి యా మీద
నిది యెల్ల సత్యమే—యీ గాధిసుతుని
కలకీర్తి నిఖిలలోకవ్యాపకంబ
యని పల్కె. సర్వులు హర్షాత్ము లైరి.
శ్రీరామలక్ష్మణుల్ చిత్తంబులందు
నధికసంతోషంబు నంది రా తఱిని.
నిత్యమంగళ మోదనిరుపమోత్సాహ

ములతోడ దినములు పోయెను దొరలి.
అంతకంతకు నయోధ్యాపురవరము
దినదినాధికముగ దీపితం బగుచు
నానందజలధి నోలాడగా సాగె.
చూచి యొకానొక శుభదిన మందు
ఘనసుమంగళమోద, కలవినోదముల
బెండ్లికంకణములు విప్పగా బడియె.
అ మ్మహోనిత్యోత్సవావళి జూడ
నమరులు కౌతూహలాయత్తు లగుచు,
నా యయోధ్యాపురియందు జన్మింప
జేయగా బ్రార్థన జేసిరి విధిని.
ప్రతిదివసమున విశ్వామిత్రమౌని
పయనంబు సేయ సంభావించుగాని,
రామచంద్రుని వినమ్రప్రార్థనమున
నే రోజు కారోజు నేగక నిలచె.
అనుదివసంబు శతాధికం బగుచు
వర్ధిల్లు నృపు భక్తిభావంబు గాంచి
య మ్మహాముని ముగ్ధుడై ప్రశంసించె.
చివర కొక్క దినంబు శ్రీగాధిపుత్రు
డాశ్రమంబున కేగ ననుమతి గోర.
దశరథుం డనురాగతన్మయత్వమున
దనయులతో నిల్చి తాపసి ముందు,

బలికె నీ రీతిగా భక్తి దీపింప :
"నాదు సర్వస్వము నాథ ! నీ యదియె !
నేను, సతీసుతుల్, నీ సేవకులమె
యీ బాలకులపైన గృప యుంచి స్వామి !
తరచు దర్శన మిచ్చి ధన్యత నిండు !"
అని వచియించి మహారాజమౌళి
సుతసతీయుతముగా సురుచిరరీతి
సాష్టాంగపడె మునిచరణాబ్జములను
ఆతని గళమున నాగె వాక్కులును.
ఆ విప్రవర్యుడా యవనీశ్వరునకు
బహువిధాశీస్సుల బహుగా నొసంగి
వర్ణనాతీతదివ్యప్రీతిరీతి
నిష్క్రమించె మహాముని ! భరద్వాజ !
భ్రాతృసమేతుడై రామచంద్రుండు
ప్రీతితో మునివెంట వీడ్కొన నేగి
యాతడు సెలవీయ నరుదెంచె దిరిగి.
ఆ గాధివంశమహాబ్ధిచంద్రుండు
రామరూపంబును, రాజేంద్రు భక్తి,
కలజానకీరామకల్యాణగాథ,
న మ్మహోత్సాహదివ్యానందములను
బ్రస్తుతించుచు బోయె బరమహర్షమున.

వామదేవుడు రఘువంశగురుండు
జ్ఞానియైన వసిష్ఠసంయమీంద్రుండు
మఱల వచించిరి మహితరీతిగను
తద్గాధితనయగాథావిశేషముల.
అమ్మునీశ్వరుని ప్రావ్యద్యశోమహిమ,
ధారుణీపతి విని, తనమహాపుణ్య
గరిమ నెన్నుచు లోన గడు మోద మొందె.
రాజానుమతిని సర్వప్రజల్ జనిరి.
పదపడి నా ధరాపతి దశరథుడు
పుత్రులతో నంతిపురమున కరిగె.
ఆ రామచంద్రుకల్యాణలీలలనె
పాడుచుండిరి జనుల్ ప్రతిచోటగూడ.
ఆ రామచంద్రమహాభవ్యయశము
పాండురాఖిలజగద్భాండమై వెలిగె.
కల్యాణమహితరాఘవు డరుదెంచి
స్వపురగృహప్రవేశం బొనరించి
నప్పటినుండి సర్వానందములకు
ధామమై శ్రీయయోధ్యాపురి వెలిగె.
ఆ రామవిభుని కల్యాణోత్సవముల
భారతీశేషులే వర్ణింపలేరు.
తన్మహాదివ్యసీతారామయశము
కవికులజీవనఘనపావనంబు

నఖిలమంగళఖని యని యెఱుంగుటను
నిజవచస్సులను పునీతంబు సేయ
నేర్చిన కొలది వర్ణించుకొన్నాడ.

## రామాయణశ్రవణపఠనామాహాత్మ్యము

తనవాణి పావనత్వమును వహింప
శ్రీరామయశము గీర్తించె నీ తులసి.
రామాయణం బపారం బగు జలధి
యే కవి దాని దరింపగా లేడు.
మంగళశ్రీరామమహితోపవీత
వైవాహికోత్సవవరచరిత్రంబు
నెవరు కీర్తింతురో యెవ్వరు విందు
రా పుణ్యమానవు లందఱుగూడ
జానకీరామప్రసాదంబుచేత
సర్వదాసుఖ మొంది శాంతి గాంచెదరు.

## గేయము

సీతారామవివాహచరిత్రన్
సాదరమతితో బాడిన విన్నన్
సదానంద ముదయించును హృదిలో
శుభనిలయము రామాయణం బహో!

## తోదక వృత్తము

హృదయమె పళ్లెర మీ మతి స్వామీ !
సదమలమౌ ఘనసారము కాగా,
ఇది శుభ హారతి నిచ్చెద తండ్రీ !
మృదుమతి ! మట్టపలీశ ! నృసింహా !

ఓం తత్సత్ - శ్రీ మట్టపల్లిలక్ష్మీనృసింహ
పరబ్రహ్మార్పణమస్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః !

ఇది సకలకలికలుషవిధ్వంసకమైన శ్రీ గోస్వామి
తులసీకృత – శ్రీరామచరితమానసములోని బాల
కాండమునకు శ్రీరామతీర్థభగవత్పాద–ప్రియ
శిష్య నిరంతర శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహ
పరబ్రహ్మోపాసహృత్పద్మతీర్థ
శ్రీ కేశవతీర్థస్వామికృతమైన
ఆంధ్రానువాదము సర్వము
సంపూర్ణము.

ఓం తత్సత్.

# స వ ర ణ లు

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 (వినతి) | 15 | అందాభిప్రాయముల | అంధాభిప్రాయముల |
| 8 ,, | 9 | స్యతంత్రంగా | స్వతంత్రంగా |
| 11 ,, | 10 | చేసినవారు | చేయవలసినవారు |
| 3 పద్య. | 4 | బ్రదుకను దివ్యమైన | బ్రదుకగుమన్ వెలుంగు |
| 3 ,, | 6 | మూనిన, | మూనిన |
| 14 ,, | 32-3 | తీర్ధ | తీర్థ |
| 22 ,, | 73-3 | జాంబవద్దనుమ | జాంబవద్ధనుమ |
| 23 ,, | 78-1 | శస్త్రముల్ | వస్త్రముల్ |
| 31 ,, | 121-4 | మహోహో ! | మహాహో ! |
| 45 ,, | 197-1 | లాప్త | తెన్న |
| 50 ,, | 225-4 | మహోహో ! | మహాహో ! |

## క థా భా గ ము

| | | | |
|---|---|---|---|
| 8 | 6 | డగ్ స్పర్శి | డగ్ స్వర్శి. |
| 11 | 2 | హారుడు, | హారుడు |
| 19 | 1 | దేవతలు. | దేవతలు |
| 19 | 21 | సంబ, | సంబ. |
| 20 | 2 | గూర్మి వెలుంగ | గూర్మితో శివుడు |
| 21 | 7 | యగును.” | యగును. |

# సవరణలు

| పుట. | | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 7 | (వినతి) | 15 | అందాఫిప్రాయముల | అంధాభిప్రాయముల |
| 8 | ,, | 9 | స్యతంత్రంగా | స్వతంత్రంగా |
| 11 | ,, | 10 | చేసినవారు | చేయవలసినవారు |
| 3 | పద్య. | 4 | బ్రమకను దివ్యమైన | బ్రదుకగుచున్ వెలుంగ |
| 3 | ,, | 6 | మూనిన, | మూనిన |
| 14 | ,, | 32-3 | తీర్ఫ | తీర్థ |
| 22 | ,, | 73-3 | జాంబవద్దనుమ | జాంబవద్ధనుమ |
| 23 | ,, | 78-1 | శస్త్రముల్ | వస్త్రముల్ |
| 31 | ,, | 121-4 | మహోహో ! | మహాహో ! |
| 45 | ,, | 197-1 | లాత్త | తెన్న |
| 50 | ,, | 225-4 | మహోహో ! | మహాహో ! |

## కథాభాగము

| | | | |
|---|---|---|---|
| 8 | 6 | డగ స్తర్షి | డగ స్త్వ్షి. |
| 11 | 2 | హరుడు, | హరుడు |
| 19 | 1 | దేవతలు, | దేవతలు |
| 19 | 21 | నంబి, | నంబి. |
| 20 | 2 | గూర్మి వెలుంగ | గూర్మితో శివుడు |
| 21 | 7 | యగును," | యగును. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 21 | 9 | ఘటిల్లు | ఘటిల్లుం.” |
| 23 | 2 | సహజంబుగా | స్వాభావికముగ |
| | | స్త్రీ స్వభావంబు జడము, | స్త్రీ ప్రకృతి జడంబు, |
| 26 | 11 | శరణ్య ! | శరణ్య !” |
| 30 | 8 | కాదు. | కాదు.” |
| 33 | 4 | వేడ | లేక |
| 33 | 14 | ! | !” |
| 40 | 10 | జెప్పలంటజాలవు | దోష మంటజాలదు |
| 45 | 19 | యగుచు | యగుచు. |
| 82 | 21 | గచ్చచెట్టున గాంచగా నయ్యె | బర్బూరమున గాంచ బడియెను |
| 85 | 20 | ప్రేమవిలాస శరీర ధారిణియు, | స్వేచ్ఛావిలాస సంసృజితాంగయుక్త |
| 88 | 1 | హిమవంతుదత్యాదరమున దిలకించె | హిమవంతు డరసెదా నెంతయో ప్రీతి. |
| 112 | 4 | లోకముల | లోకంబు |
| 112 | 5 | నెవ్వడీ | లెవ్వడీ |
| 112 | 22 | ఏవి | ఏను |
| 113 | 8-9 | పంక్తులకు బదులుగా చదువదగినవి — | |
| | | ఎవ్వని నిగమంబు లెపుడు నుతించు | |
| | | నెవ్వని మౌనీంద్రు లెపుడు ధ్యానింతు | |
| | | రా రాము డింకొకడని నీవు మదిని | |
| 115 | 6 | వెద | వేద |

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 18 | నిశావేశమును, | నిశాలేశమును, |
| 19 | స్వరూపుంకు | స్వరూపు డహా ! |
| 3 | స్త్రీని, యజ్ఞాను | నింతి, నజ్ఞాను |
| 5 | చరాచరారాధితుం డగును.” | సర్వ చరాచరా రాధ్యుడగును.” |
| 20 | గెలువ. | గెలువ, |
| 4 | ప్రసవాటికలను | ప్రసవవాటికలను |
| 15 | దద్విజనృపతి | తద్ధీర నృపతి |
| 22 | నతడు, | నటుల, |
| 16 | నీరాద్రి | నీలాద్రి |
| 19 | కపటర్షి | కుయోగి |
| 18 | ఆ పదమాకించనులను | ఆ పరమాకించనులను |
| 22 | వెతలందు | వెలుగొందు |
| 11 | బ్రాహ్మణుల | భూసురుల |
| 10 | నాఖండలుండంత | నాఖిలుం డంతట |
| 9 | నా ప్రసన్నత గాంచు | న ప్రసన్నత జూపు |
| 17 | మందుటల్ | మందుటన్ |
| 7 | మండోదరి | మందోదరి |
| 17 | వీరుడై | వీరుడా |
| 7 | మేఘ నాథుండను | మేఘ నాదుండను |
| 1 | మేఘ నాథుండు. | మేఘ నాదుండు. |
| 19 | ఋషీ ప్రచయములున్ | ఋషీశ్వరులున్ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 225 | 13 | మౌనివరుండు | వరమౌని శృంగి |
| 225 | 14 | నాహుతు | ఆహుతు |
| 229 | 1 | డా జగద్వ్యాసుడు | డా జగత్త్రయ వాసు |
| | | ఆ జగత్ప్రభువు | డా జగత్ప్రభుడు |
| 232 | 13 | జగన్నాథుండు నా | జగన్నాథుడే యా |
| 238 | 7 | మౌనివర్యుండు : | వరముని యంత : |
| 240 | 5 | మౌనివరేణ్య ! | పరమ మునీంద్ర ! |
| 240 | 13 | దీర్చు ; | దీర్చు |
| 240 | 19 | నిర్గుణుండు | నిర్గుణుడు |
| 241 | 20 | ఘనతరోదము | ఘనతరోరము |
| 242 | 20 | స్వాతంబు | స్వాంతంబు |
| 242 | 22 | నాశ్రితులైన, సర్వాధీశుడైన | నా శ్రుతులైన, సర్వాధీశుడైన |
| 216 | 2 | బరమాత్మ | మధువైరి |
| 246 | 8 | కాలకర్మల | వనకాలకర్మల |
| 249 | 16 | శాస్త్రములు పల్కునట్లు | శాస్త్రములాడునట్లు |
| 250 | 16 | నిజసోదర సుసఖా | నిజసహోదర సఖా |
| 250 | 22 | చూపు ; | చూపు |
| 251 | 1 | దనుదినం | దనుదినం ; |
| 255 | 17 | మీరెంచ కేమేమొ | మీరలెంచ కేమేమొ |
| 263 | 15 | శ్రీహరీ ! | శ్రీహరీ ! ” |
| 266 | 22 | వచియించె | రచియించె |

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 11 | విశామిత్ర | విశ్వామిత్ర |
| 1 | జేసి | చేసి |
| 22 | లెడు. | లేడు. |
| 20 | పొందెడిని | మొందెడిని |
| 10 | దేనిలో | దేనితో |
| 9 | నీపాద | నీ పద |
| 2 | కాకుత్స | కాకుత్స్థ |
| 4 | మరల | మఱల |
| 7 | నిరాశా | నైరాశ్య |
| 10 | మహా | మహీ |
| 10 | విలసితమతు | వినమిత శిరు |
| 10 | మునీంద్రా ! | మునీంద్ర ! |
| 6 | కాకుత్స | కాకుత్స్థ |
| 22 | హాతించు | హాత్తించు |
| 21 | అను | అణు |
| 15 | గైకొనగ | గైకొనక, |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 225 | 13 | మానివరుండు | వరమౌని శృంగి |
| 225 | 14 | నాహుతు | ఆహుతు |
| 229 | 1 | డా జగద్వ్యాసుడు | డా జగత్త్రయ వాసు |
| | | ఆ జగత్ప్రభువు | డా జగత్ప్రభుడు |
| 232 | 13 | జగన్నాథుండు నా | జగన్నాథుడే యా |
| 238 | 7 | మానివర్యుండు : | వరముని యంత : |
| 240 | 5 | మానివరేణ్య ! | పరమ మునీంద్ర ! |
| 240 | 13 | దీర్చు ; | దీర్చు |
| 240 | 19 | నిర్గుణుండు | నిర్గుణుడు |
| 241 | 20 | ఘనతరోదము | ఘనతరోరము |
| 242 | 20 | స్వాతంబు | స్వాంతంబు |
| 242 | 22 | నాశ్రితులైన, సర్వాధీశుడైన | నా శ్రుతులైన, సర్వాధీశుడైన |
| 246 | 2 | బరమాత్మ | మధువైరి |
| 246 | 8 | కాలకర్మల | వనకాలకర్మల |
| 249 | 16 | శాస్త్రములు పల్కునట్టు | శాస్త్రములాడునట్టు |
| 250 | 16 | నిజసోదర సుసఖా | నిజసహోదర సఖా |
| 250 | 22 | చూపు ; | చూపు |
| 251 | 1 | దనుదినం | దనుదినం ; |
| 255 | 17 | మీరెంచ కేమేమొ | మీరలెంచ కేమేమొ |
| 263 | 15 | శ్రీహరీ ! | శ్రీహరీ ! ” |
| 266 | 22 | వచ్చియించె | రచియించె |

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 11 | విశామిత్ర | విశ్వామిత్ర |
| 1 | జేసి | చేసి |
| 22 | లెడు. | లేడు. |
| 20 | పొందిడిని | పొందెడిని |
| 10 | దేనిలో | దేనితో |
| 9 | నీపాద | నీ పద |
| 2 | కాకుత్స | కాకుత్స్థ |
| 4 | మరల | మఱల |
| 7 | నిరాశా | నైరాశ్య |
| 10 | మహో | మహీ |
| 10 | విలసితమతు | వినమిత శిరు |
| 10 | మునీంద్రా ! | మునీంద్ర ! |
| 6 | కాకుత్స | కాకుత్స్థ |
| 22 | హాతించు | హాత్తించు |
| 21 | అను | అణు |
| 15 | గైకొనగ | గైకొనక, |

